# శ్రీమద్రామాయణము

## వచనము

## అయోధ్యా కాండము.

రెండవ భాగము.

దేవరాజసుధీప్రణీతము

CHECKED-75



మ. ౹ దా స.

ఆనందముద్రణాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ • అండ్ కంపెనీవారిచే ప్రకటితము

1944

# విషయసూచిక

మిక్కిలి సీతకును లక్ష్మణునకును * మేలు గలుగుటకై జటలు దాల్చి వనమునకుఁ బోయెదను. నీవు మఱ్ఱిపాలు తెమ్ము' అనెను. గుహుఁడును ఆరాజకుమారునకు ఆపాలను శీఘ్రముగా తెచ్చియిచ్చెను. రాముఁడు మొదట లక్ష్మణుని ఆపాలతో జటలం దాల్చునట్లుచేసి తానును జటలనుధరించె. ఇట్లు మహాబాహుఁ డగునాపురుషసింహుఁడును జటలం దాల్చినవాఁడయ్యె. అట్లతఁడు వల్కలములు గట్టుకొని జటాసమూహమును దాల్చి గుహునిం జూచి 'గుహుఁడా! రాజ్యమును రక్షించుట మిక్కిలియుఁ గష్టముసుమా! కావున నీవు చతురంగబలమునందును బొక్కసమందును దుర్గములందును దేశమందును కొంచెమైనను పరాకులేక యుండవలయు' ననెను. పిదప నిక్ష్వాకువంశ్యులకు సొంపు గూర్చురాముఁడు, ఆగుహుని వీడ్కొని, భార్యను లక్ష్మణునింగూడి, యాకులపాటులేక, శీఘ్రముగాఁ బోయెను. అతం డట్లుపోయి గంగానదిగట్టున నోడంజూచి, యానది వడిగాఁబాఱునదిగావున, ఓడ నెక్కి దాఁటంగోరినవాఁడై లక్ష్మణునిఁజూచి 'పురుషసింహా! ఈ యోడ కదలక వచ్చి నిలిచియున్నది. నీవు దీని నెక్కి పిదప భయశీల యగుసీతను జేయిపట్టి మెల్లగా నెక్కింపుము!' అనెను. లక్ష్మణుఁడును అన్నయాజ్ఞనువిని బుద్ధిమంతుఁడుగావున 'ముందు సీత నెక్కించి, యాపిమ్మటఁ దా నెక్కుటయే రామునియిష్టం' బని రాముని యభిప్రాయమునకు విరోధము గలుగునట్లు ముందు సీత నోడపై నెక్కించి పిదపఁ దా నెక్కెను. మహాతేజస్వి యగులక్ష్మణాగ్రజుఁడు రాముఁడును పిదపఁ దా నోడనెక్కెను. అంత నిషాద ప్రభుం డగు గుహుఁడు తనబంధువులఁ జూచి 'ఓడను మీర లావలిగట్టునకుఁ జేర్పుఁడు' అని యాజ్ఞాపించెను. మహాతేజుండగు రాముండును, ఓడనెక్కి యంత బ్రాహ్మణక్షత్రియు లగు నుభయజాతులకును అర్హమైనదై సాధారణముగా జపింపఁదగిన 'దైవీం నావమ్' అను నారోహమంత్రమును తనకు హితము కలుగుకొఱకు జపించెను. రాముఁడు సీతతోఁగూడ నాచమనముచేసి పరమసంతోషమున మేనంతయు గగుర్పాటునొంద శాస్త్రము చొప్పున నాగంగానదికి నమస్కరించెను. మితిలేని కాంతి దళుకొత్తుచున్న లక్ష్మణుఁడును అట్లే నమస్కారము చేసెను, రాముఁడు సుమంత్రుని, బలసహితముగా గుహునిని, వీడుకొలిపి ఓడ నెక్కి నావికులకు ఓడ నడప నానతిచ్చెను. అంత నా నావికులు ఎచ్చరికగలిగి మంచి తెడ్లంగొని వేగమున నాయోడను ద్రోయఁగా అది శీఘ్రముగా నదీజలములను దాఁటి దరి చేరినది. అనిందిత యగుసీత గంగానది నడిమికిరాఁగానే చేతులు మొగుడ్చుకొని యానదిని జూచి 'గంగా! ధీమంతుఁడైన దశరథభూకాంతుని పుత్త్రుఁ డగునితఁడు, నీ రక్షణముక్రింద, పదునాలుగేండ్లు

* రాముఁడు జటలు దాల్చుట సీతకును లక్ష్మణునకును ప్రియము కాకున్నను హితమగును. రాముఁడుజటలు దాల్పఁగా సహధర్మచారిణిగావున సీతకునుఆధర్మముసిద్ధము. లక్ష్మణుఁడును అన్నచొప్పున జటలుదాల్చుటచె ఆతనికిని ఆ ధర్మము సిద్ధించుచున్నది. కనుకనిద్దఱికి నది హితమేయని తెలియునది,

పూర్ణముగా వనమునుండి తండ్రియాజ్ఞను నిర్విఘ్నముగాఁ దీర్చి తమ్ముని నన్నునుం గూడి మరల నిచ్చటికి వచ్చినపుడు, క్షేమముతో మరల వచ్చినందులకై మిక్కిలి ముదమునొంది సర్వకామితములను పెంపుసొంపార మిక్కిలి యింపు మీఱ, సుభగురాలవగు నిన్నుఁ బూజించెదను. దేవీ! నీవు ముల్లోకములందును సంచరించుదానవు, కనుక బ్రహ్మలోకమును నీవుచూచినదియే. మఱియు నీలోకమందును సముద్రున కిల్లాలవై చూపట్టుచున్నావు. కనుక నిందును జాలఁ బ్రసిద్ధురాలవు. కల్యాణీ! నమస్కారముచేసెదను. మఱి ప్రస్తుతించెదను. ఆపురుషసింహుఁడు క్షేమమున మరల నిచటికివచ్చి రాజ్యమును బొందఁగా నేను నీకు ప్రియంబు సేయఁ గోరి లక్షగోవులును వస్త్రములును మనోహరమగు నన్నమును బ్రాహ్మణులకు నొసంగెదను. దేవీ! నేను పట్టణమునకు మరల వచ్చినదాననై, పరిశుద్ధమగు చిత్తంబున నీకు వేయికుండలమద్యమును అన్నముకొఱకు మాంసమును సమర్పించి పూజించెదను. నీతీరమునం దేయే దేవతలుందురో వారలనెల్లఁ బూజించెదను. మఱియు నీతీరంబునం గల మణికర్ణికా ప్రయాగాది తీర్థములును కాశి మొదలగు దేవాలయములును అన్నిటినిని బూజచేసెదను. పాపరహితురాలా! పాపదూరుఁడైన యీమహాభుజుఁడు వనవాసము సలిపి దానిని విడిచి నన్నును తమ్ముని గూడి మరల క్షేమమున అయోధ్యను నీయనుగ్రహమునఁ బ్రవేశించునుగాక' యని ప్రార్థించెను. ఏనిందయును బొందనిదై, చేయఁదగుకార్యములయందు నిపుణయగునాసీత, యిట్లు గంగానదినిం గూర్చి పలుకుచునే శీఘ్రముగా దక్షిణతీరమును జేరెను. పగవారి నడంచునాపురుషసింహుఁడు, తీరమును జేరఁగానే యోడను విడిచి దిగి తమ్ముని సీతనుం గూడి యవ్వల పయనమైపోయెను. అంత నా మహాభుజుఁడు, సుమిత్రమదికి సొంపు గూర్చులక్ష్మణునిం జూచి 'ఇంక నీవు జనులుండుచోటగాని లేనిచోటఁగాని, యంతటను కాపుదలయం దెచ్చరిక గలిగి యుండుము. మనమిదివఱకుఁ జూచి యెఱుఁగని నిర్మానుష్యమైన వనమునకుబోవుచున్నాము గనుక అవశ్యము మనకుఁ గాపుదల చేసికొనక తీఱదు. లక్ష్మణా! నీవు ముందు పొమ్ము; సీత నీవెనుక వచ్చుఁగాక. నిన్నును సీతను గాచుచు నేను మీ యిరువురికి వెనుక వచ్చెదను. పురుషతిలకా! ఇట్టిచోట మనము ఒకరి నొకరు రక్షించుకొనుచుండవలయును. ఏకార్యముగాని దానికి తగుసమయము గడచిపోయినయెడల మరల దానిని ఒనఁగూర్చుట సులువుగాదు, కనుక తగినకాలమున నెచ్చరికతోనుండవలయును. సీత, యిపుడు జనసమ్మర్దము లేక, పంటభూములు గాని తోఁటలుగాని గానరాక, యొడుదొడుకై మిట్టపల్లమై పెనులోఁతు గలిగియుండు వనప్రదేశములను బ్రవేశించుచున్నది. కావున నిపుడు వనవాసమునఁ గలుగు దుఃఖమిట్టిదియని తెలియఁగలదు' అనెను. లక్ష్మణుఁడు రాముఁడు చెప్పినది విని ముందుగాఁబోయెను. సీతయు వెనుకఁజనియె. సీతకుఁ బిఱుఁద నారఘునందనుఁడు,

రాముఁ డరిగెను. రామునింబాసి, చూచువారికి జాలిపుట్టించు దశయం దున్న సుమంత్రుఁడు, రాముఁడు గంగానదియవ్వలిదరిని జేరువఱకు నతనిని కనుఱెప్ప వేయక చూచుచునే యుండి యంత నతఁడు దూరము పోవుటవలనఁ గనఁ బడకపోఁగా, చూడ్కులను ద్రిప్పుకొని మనసు తల్లడిల్ల కన్నీళ్లు విడిచినవాఁడయ్యె. ప్రభావమున లోకపాలురకు సాటియైన మేటియై, కోరినవరము లొసంగుమహాత్ముఁ డారాముఁడు, ఆ మహానదిని దాఁటి పయనమైపోయి, మంచి సస్యసమూహములు గలిగి పెంపుసొంపారుచున్నదియు, కావుననే జనులు ముదంబునఁ బొదలు చున్నదియు నగువత్సదేశమును క్రమంబునఁ జేరెను. వారచ్చట నాఁకలిగొన్న వారై సీత నొకచోట విడిచి యిరువురుగా వేఁటకుం బోయి పందిని, మనుఁ బోతును, దుప్పిని, నల్లచాఱలదుప్పిని, ఈనాలుగుగొప్పమృగములను జంపి పరి శుద్ధంబగు వాని మాంసంబుఁగొని సీతంగూడి సాయంకాలమగుటయు, ఆఁకలి వేఁచుటవలనను, త్వరపడి నివాసార్థము ఒకవృక్షముక్రిందం జేరిరి. ఇది యేఁబది రెండవసర్గము.



(రాముఁడు దుఃఖంబున లక్ష్మణు నయోధ్యకుఁ బొమ్మనుట. లక్ష్మణుఁడు రాము నూఱడించుట. ముువ్వురును బర్ణశయ్యపైఁ బవ్వళించుట.)

మదికింపుఁ గూర్చుటయందు సాటి లేనివిన్నాణి యగునారాముఁడు, ఆ చెట్టుకడకుఁ బోయి మలుసంజనుపాసించి లక్ష్మణునితో 'మనము జనపదమును గడచి సుమంత్రుని విడిచి యొంటరిగా జరుపురాత్రులలో మొదటిది యిదె వచ్చి నది. ఇందులకు దుఃఖమున తహతహపడవలదు. మనయోగక్షేమములు మన యంతటనే చూచుకొన నేర్తుము, కాని సీత తనయోగక్షేమములట్లు తనంతటఁ జూచుకొననేరదు. దానియోగక్షేమములును మనము చూచుకొనుటయందే యున్నది. కనుక నేఁడుమొదలుగా రాత్రులందు మనము ఏమఱుపాటుమాలి మేలుకొనియుండ వలయును. లక్ష్మణా! ఇది యొంటిగా జరుపుమొదటిరాత్రి గనుక మిక్కిలి కష్టముగా నుండును. అయినను ఎట్లోయొకవిధమున దీనిని గడపు దము. మఱియు నిది యిప్పుడే వచ్చియైనది గనుక గుడిసెవేసికొని చక్కఁగా శయ్యబఱచుకొనుటకు నవుతిలేదు. మనమే కొంచెము గడ్డియు పండుటాకులను ఏఱితెచ్చి పఱచుకొనిపరుండి దీనిం గడపుద' మనెను. మేలయిన పాన్పునం బరుండఁ దగినయారాముఁడు, నేలం బరుండి లక్ష్మణునిఁ జూచి మంచి వార్తలతో, 'లక్ష్మణా! ఇప్పుడు మహారాజు దుఃఖమున నిదురించుచుండును గాన యతనికి నిదుర చక్కఁగా బట్టకుండును. ఇది నిశ్చయము. కైకేయి మాత్రము తన కోర్కి యీడేర్చుకొన్నది గావున సుఖ్ఖగలిగియుండవచ్చును. ఆదేవి, భరతుఁడు రాఁగాఁజూచి వానిని రాజ్యమునఁ బట్టము గట్టుటకొఱకు, మఱివానికి రాజ్యము

స్థిరముగా నుండఁ గోరియు, మహారాజు ప్రాణములు తీయకుండు నేకదా! *దశరథుఁడు అనాథుఁడు, మతివృద్ధుఁడు. నేనును అతని విడిచివచ్చితిని. కామార్తుఁడు గావున కైకకుం జిక్కియున్నాఁడు. ఇంకేమి సేయఁగలఁడు? మనకిప్పుడువచ్చిన యీకష్టమును, రాజు బుద్ధికిఁ గలిగినతిరుగఁబాటును, జూడఁగా అర్థధర్మములకన్న కామమే యధికమని నాకుఁ దోఁచుచున్నది. లక్ష్మణా! ఎవఁడుగాని అపండితుఁడైనను, తన యిచ్చచొప్పున నడచుకొనుచుండు కొడుకును, నాతండ్రి నన్ను విడిచినట్లు ఆఁడుదానికొఱకు విడుచునా? విడువఁడు. కైకకొడుకు భరతుఁడు తానొక్కఁడే మహారాజై కోసలదేశము నంతయు సొంపు నొందఁ బాలింపఁగలఁడే. అయ్యో! వాఁడే సుమీ! భార్యతోడ సుఖముండువాఁడు. తండ్రివయసుగడచి కాలము నొందఁగా, నేను నడవిపాలుఁ గాఁగా, వాఁడొక్కఁడే సమస్తరాజ్యమునకు ఒక్కమొగంబై యుండును గదా ఎవ్వఁడు దశరథునివలె అర్థధర్మములను బరిత్యజించి కామమును మాత్రము అనుసరించునో వానికి నిపుడు రాజునకు వచ్చినట్లు శీఘ్రముగానే యిట్టియాపద వచ్చును. సౌమ్యా! దశరథుఁడు ముగియుటకును, నేనడవిపాలగుటకును, భరతునకు రాజ్యము వచ్చుటకునే, కైక మనయింట దాపురమైనదని నాకుఁ దోఁచుచున్నది. కైక యిప్పుడు తనకుఁ గలిగిన సౌభాగ్యముచే మత్తిల్లి మయి మఱచి, నన్నుఁ జేరినవారగుటంబట్టి కౌసల్యను సుమిత్రను పీడింపకుండునా? పీడించునే! లక్ష్మణా! నన్నుగుఱించి సుమిత్రాదేవి దుఃఖముపాలు పడకుండుగాక. మన మింక దూరముపోయితిమేని కష్టము. ఇదియే యయోధ్యకు దాపు కనుక నిచటనుండియే నీవు పెందలకడ లేచి యయోధ్యకుఁబొమ్ము. నేనొక్కఁడనే సీతంగూడి దండకారణ్యమునకుఁ బోయెదను. కౌసల్య యచట దిక్కులేకున్నది. నీ వాబిడకు కాపుదలగా నుండువు. కైక యల్పకార్యములకును వెనుదీయనిది. కనుక నొకవేళ తన ద్వేషమునకుఁ దగునట్లు కౌసల్య కేదైన యవమానము చేయవచ్చును. †భరతుఁడు ధర్మజ్ఞుఁడు గావున నీవు పోయి నా తల్లిని రక్షించునట్లు చెప్పి వాని కప్పగింపుము. లక్ష్మణా! నా తల్లి పూర్వజన్మ

---

*సర్వపురుషార్థములందును స్పృహ లేనట్టి రాముఁడు కైకను, తనరాజ్యము లభింపలేదను నెపమును మనసున నుంచుకొని యిట్లు నిందించుట తగునా? యన్నయెడల, లక్ష్మణుని తెల్లవాఱఁగానే యయోధ్యకుఁబొమ్మని చెప్పఁబోవుచున్నాఁడు గావునను ఆలక్ష్మణుఁడును కైకను ద్వేషించువాఁడు గావునను అతనిని సమాధానపఱచి యట్లు పంపుటకై అతనిమనసు ననుసరించి యిట్లు నిందించినాఁడు గాని వేఱుగాదని తెలియునది.

† ఇందులకు 'పరిదద్యాహి ధర్మజ్ఞే భరతే మమ మాతరమ్' అని గోవిందరాజాదులపాఠము. తిలకకారులు 'పరిదద్యాద్ధి ధర్మజ్ఞ గరం తే మాతరం మమ' అని పాఠము గ్రహించి (తే మమచ మాతరం) నీతల్లికిని నాతల్లికిని, (గరం) విషమును, (పరిదద్యాత్ హి) ఇచ్చునుగదా, అనియర్థము చేసి యున్నారు.

ములందెప్పుడో యెవరినో స్త్రీలను వారికొడుకులకుం బాపియుండును. ఇది నిజము. కాఁబట్టియె యిట్లు సంభవించినది. కౌసల్య నన్ను బహుకాలముగాఁ బోషించి కష్టపడి పెంచినది. ఇఁక నావలన శుశ్రూష మొదలగు ఫలము నొందవలసిన సమయమున నే యామెను బాసి వచ్చితిని. ఇసీ నాబ్రతుకు! లక్ష్మణా! నేను గన్నతల్లికి తుదిలేనిదుఃఖమును గలిగించుచున్నానే! నాయట్టికొడుకు ఏకాంతకును బుట్టకుండుఁగాక. లక్ష్మణా! నాతల్లి కౌసల్యపెంచిన గోరువంక దాపున నున్న చిలుకను జూచి 'చిలుకా! శత్రు వగుపిల్లికాలు కొఱుకుము' అని చెప్పినమాట యామె విని సంతసిల్లినది. తిర్యగ్జాతి యగునా పిట్ట తన్నుఁబెంచిన కౌసల్యకుఁ జేసినంత ప్రియమునుగూడ, ఆబిడ కడుపునఁ బుట్టియు మనుష్యుఁడనయ్యు నేను జేయనైతినే! కాన యాగోరువంక పిట్టయే, కౌసల్యకు ప్రీతిగూర్చుట యందు నాకంటె అతిశయించిన దని తలంచెదను. పరంతపా! అల్పభాగ్యురాలై, కొడుకును గనియు ప్రయోజనము లేనిదై, వగలం బొగులుచున్న నాతల్లికిఁ, గొంచె మేనియు నుపకరింపని నవంబోటి కొడుకువలనఁ బ్రయోజనమేమి? ప్రయోజనము లేకున్న మానెఁగాక. నాతల్లి యల్పభాగ్యురాలు గావున నన్నుఁ బాసి మిగుల దుఃఖమునఁ బొక్కుచు శోక సముద్రమునం బడి పరుండియున్నది. లక్ష్మణా! నేను గోపించితినా, ఒక్కఁడనే, అయోధ్యను మాత్రమే కాదు, ఈ భూమి నంతయు బాణంబుల నాక్రమింపఁ జాలుదును. అయినను గారణములేక వీర్యమును జూపరాదు. ధర్మహాని యగుకార్యమునందు వీర్యమును సాధనముగాఁ గొనరాదుగదా. అయినను అధర్మములవలనఁ గలుగు లోకాపవాదమునకును, పరలోకప్రాప్తి చెడుననియు, భయపడితిని. అనఘా! లక్ష్మణా! ఆకారణమున నేను అభిషేకము సేసికొనకున్నాను' అనెను. రాముఁడు విజనమగు వనమున, మొగంబునఁ గన్నీళ్లుగ్రమ్మ, నిప్పుడు చెప్పిన మాటలును మఱియు చెప్పనలవిగాని యితర విషయములను, జాలిపుట్టునట్లు చెప్పి, యారాత్రి విలపించుచు నంత మాటలాడ నేరక యూరకుండెను. ఇట్లూఱడింపరానట్లు విలపించి తానై యుడిగి మంట లేని యగ్నివలెను, ఉరవడి లేని సముద్రము వలెను, ఊరకున్న రామునిం జూచి, లక్ష్మణుఁ డూఱడించుచు, 'రామా! నీవాయుధ ధారులలో నగ్రగణ్యుఁడవు, మఱి రాజవు నీవు వెడలిరాఁగానే యిప్పు డయోధ్యాపురము, చంద్రుఁడులేని రాత్రివలెఁ, గాంతిహీనమై యుండుట నిజము. రామా! పురుష సింహుఁడవగు నినుబోఁటికిట్లు పరితపించుట యుక్తముగాదు. ఇందువలన నాకును సీతకునుగూడ దుఃఖమును గలిగించుచున్నావు. తెల్లవాఱఁగానే అయోధ్యకు నన్నుఁ బొమ్మంటివి. రామా! సీత నిన్నుఁ బాసియుండదు. సీతవలెనే నేనును నిన్ను విడిచి యుండఁజాలను. జలమునుండి బయట వైవంబడిన చేఁపలవలె, నిన్ను విడిచి మేమిరువురము ముహూర్తమైనను బ్రతికియుండఁజాలము. ఇచ్చట

నుండుటకు తహతహపడవలదంటివి. పరంతపా! ఇప్పుడు నిన్ను విడిచి నేను తండ్రినిగాని శత్రుఘ్నునిగాని సుమిత్రనుగాని స్వర్గమునైననుగాని చూడనొల్ల' ననియె. అంత నానిర్జనస్థానముననే ధార్మికులా సీతారాములు సుఖముగాఁ గూర్చుండి యుండి దాపున మఱ్ఱిచెట్టుక్రింద లక్ష్మణుఁడు చక్కఁగా పఱ్ఱిన పడకం జూచి యందుఁ బవ్వళించిరి. *పరంతపుఁడగునారాముఁడు తనకు లక్ష్మణుఁడు చెప్పవలసిన దంతయు, పూర్ణముగా తేటపడునట్లుగా, నెయ్యమువలన మిక్కిలి మేలయిన వచనములతోఁ చెప్పఁగా, నాదరమున, చిరకాలము భూమిపైని బరుండుట మొదలగు వానప్రస్థధర్మము సేయంగైకొని, లక్ష్మణునితోఁ గూడ పదునాలుగేండ్లు వనవాసము సేయ నిచ్ఛగించెను. అంత నపుడు రఘువంశవర్ధనులగు నారామలక్ష్మణులు నిర్మానుష్యమైన యరణ్యమునను మహాబలవంతులు గావున, పర్వతసానువులం దిరుగు సింహములవలె, భయముగాని తొట్రుపాటుగాని పొందినవారు గారైరి. ఇది యేఁబదిమూఁడవ సర్గము



(భరద్వాజాశ్రమమునకుఁ బోవుట. భరద్వాజదర్శనము. భరద్వాజుఁడు చిత్రకూట పర్వతమును వర్ణించుట.)

ఆముగ్గురును శుభం బగునారాత్రి యంతయు, ఆ పెనువృక్షము క్రిందనుండి సూర్యుఁడు చక్కఁగా నుదయింపగానే యచటనుండి పయనమైరి. చాలఁ బాగ డ్తగన్న యా రామాదులు మిక్కిలి గొప్పదియగు నరణ్యమును బ్రవేశించి యచ్చటచ్చట, నింతవఱకు నెన్నఁడును జూడని నానావిధములయిన వనప్రదేశములను జూచుచు, యమున భాగీరథి యగుగంగతో సంగమించు స్థలమును గూర్చి పోయిరి. ఆ రాముఁడు కష్టము కలుగకుండునట్లు మంచిదారిం బట్టి నానావిధములగు వృక్షములను జూచుచుఁబోయి ప్రొద్దు తిరుగఁగానే లక్ష్మణునిం జూచి 'లక్ష్మణా! ప్రయాగ క్షేత్రమునకుఁ జుట్టును భగవంతుఁ డగునగ్నిహోత్రుని ధ్వజమగుధూమము పొడవుగా లేచియున్నది చూడుము. కావున, భరద్వాజముని దాపుననే యున్నాఁడని తోఁచుచున్నది. మనము నిశ్చయముగా నిపుడు గంగా యమునా సంగమస్థలమునకు వచ్చితిమి, జలములు ఒండొంటితో మోఁదుట వలనఁ గలుగుచప్పుడును వినఁబడుచున్నది వినుము. వన్యము లగుఫలమూలములు కాష్ఠములు మొదలయిన వానిచే జీవించు చుండువారు నఱికివైచిన కొయ్యలు

* ఇందులకు 'సలక్ష్మణ స్యోత్తమ పుష్కలం వచో నిశమ్య చైవం వనవాస మాదరాత్ । సమాస్సమస్తా విదధే పరంతపః ప్రపద్య ధర్మం సుచిరాయ రాఘవః' అని మూలము. దీనికి 'పరంతపుఁ డగురాముఁడు తనకు లక్ష్మణుఁడు వనవాసమును గుఱించి యాదరముతోఁ జెప్పుచున్న మిక్కిలి మేలయిన మాటను విని తాను చాలసేపటికి ధర్మమును నూని లక్ష్మణునికి అన్ని సంవత్సరములును తనతో వనవాసము సేయుటకు ననుమతి యొసంగెను' అని మహేశ్వరతీర్థుల యర్థము.

అంతటను జూపట్టుచున్నవి. ఇదిగో భరద్వాజాశ్రమము నందలి నానావిధ వృక్షములును కనఁబడుచున్నవి' అనెను. ఆ విలుకాండ్రు తా మిరువురును సుఖముగా దారినడచి సూర్యుఁడు వ్రాలునంతకు గంగాయమునా సంగమమందున్న భరద్వాజాశ్రమమునకు సమీపమగువనప్రదేశమును జేరిరి. రాముఁడును ఆశ్రమముఁ బ్రవేశించి తన యపూర్వాకారమునకు మృగపక్షులు బెదరిచెదర గడియసేపు నడచి భరద్వాజుని సమీపంబునకుఁ బోయెను. అంత నావీరులిరువురు, సీత వెంటనంటిరాఁగా, ఆశ్రమము చేరి భరద్వాజముని దర్శనంబును గోరుచు, సాయంకాల మగుటచే, ఋషి యగ్నిహోత్రకార్యము తీరుట నెదురుచూచుచు, దూరముననే యుండిరి. అమ్మహాముని తీవ్రనియమము గలవాఁడు, ధ్యానపరాయణుండు, తపోబలంబున జ్ఞానచక్షువుం బడసినవాఁడు. అమ్మహాత్ముఁడు హోమమునుదీర్చి శిష్యగణ పరివృతుండై యుండఁగా రాముఁడు సందర్శించి యంజలిగీలించి, తానును సీతయులక్ష్మణుఁడును నమస్కరించిరి. రాముఁడమ్మునితో 'మహాత్మా! మేము దశరథుని పుత్త్రులము. రామలక్ష్మణులనఁబడువారము. కల్యాణి యగునీపడఁతి నాభార్య. సీతయనిదీని పేరు, విదేహుఁడను జనకరాజకూఁతురు ఇది యనిందితశీల గావున విజనంబైన వనమునకుఁగూడ నన్ను వెంబడించి వచ్చినది. దృఢవ్రతుఁ డగు నా గారాముతమ్ముఁడు ఈలక్ష్మణుఁడు. నేను తండ్రిపంపున వనమునకుఁ బోవఁగా, ఆవనమునకే నన్ను వెంబడించి వచ్చినాఁడు. మహాత్మా! మేము తండ్రి యాజ్ఞ చొప్పున, తపోవనమునకుఁ బోవుదుము. ఆతపోవనమున ఫలమూలములఁ దినుచు పితృవచనము పాలించుచు ధర్మమునే యాచరించుచుండెద, మని తమవృత్తాంతము నెఱింగించెను. ధార్మికుండగునమ్ముని, బుద్ధిమంతుఁడగు నారాజకుమారుఁడు చెప్పినమాటవిని, యంత మధుపర్కమునకై *యెద్దును, బూజావిధికై అర్ఘ్యజలమును, దెచ్చెను. మఱియు నతఁడును వన్యములగు ఫలమూలములచేఁ గావింపఁబడినవై నానావిధములయి రసవంతములగు నన్నవిశేషములనొసంగి వారలకుఁ బరుండుటకై వాసస్థానము నేర్పరించెను. † అమ్మునియుఁ దనచుట్టు పక్షులును మృగములును బలసియుండఁగా, మునులనుగూడి రాముఁడు వచ్చుటయు నతనిని పూజించి, స్వాగతంబడిగెను. రాముండును, ఆపూజను పరిగ్రహించి గూర్చుండి యుండఁగా నప్పుడు భరద్వాజుఁడు ధర్మయుక్తముగా 'రామా! చిరకాలమునకు

* 'గోమధుపర్కార్హో వేదాధ్యాయీ ఆచార్యఋత్విక్ స్నాతకో రాజా వా ధర్మయుక్తః' అని యెద్దు మధుపర్కమునకు అంగముగా స్మృతి.

† ఇందులకు 'మృగపక్షిభి రాసీనో మునిభిశ్చ సమన్తతః' అని మూలము. మునియొక్క వైభవమును బట్టి తిర్యగ్జాతులుకూడ ఋషులతో పాటిగా ఆమునియందు విశ్వాసము గలిగి సేవించుచుండెను; అని గోవిందరాజులు. మునిప్రభావమువలన తిర్యగ్జంతువులైనను రాముని ఈశ్వరుని గాఁ దలఁచి మునులతో పాటిగా నతని సేవించెను; అని మహేశ్వరతీర్థులు.

నీవిచ్చటికి రాగా నిన్నుఁజూడఁ గలిగితిని. నిన్ను నిష్కారణముగా నడవికిఁ బంపుట యును విన్నాను. మహానదులయిన యీగంగాయమునలు సంగమించుప్రదేశము ఏకాంత మయినది, మఱి పుణ్యమును రమణీయమునై నది. కావున నీవిచట సుఖముగా నుండుము' అనెను. సర్వభూతహితరతుఁడగు భరద్వాజుండు చెప్పినమాటవిని శుభవచనంబుల రాముఁడమ్మునితో '*మహాత్మా! ఈస్థలముపురజనులకును పల్లెపట్టుల జనులకును సమీపముగా నున్నది. కనుక సీతను నన్నుఁజూడఁగోరుజను లిచ్చట నన్ను సుఖముగాఁ జూడవచ్చునని యెఱింగి మమ్ముఁ జూచుటకై యీయాశ్రమమునకు వచ్చుచుందురని తలఁచెద. ఈ కారణమునుబట్టి నాకిందుండుట కిష్టము లేదు. కనుక జనుల కెవ్వరికిని దెలియరానట్టి యేకాంతస్థలమునం దెచ్చటనైనను, జనకరాజసుతయగుసీత సుఖముసే యనుభవింపఁదగినదిగాన, యది సుఖముగా క్రీడించుటకుఁ దగినట్టి యుత్తమమైన యాశ్రమప్రదేశము నొకటి నాలోచించి చెప్పుము' అనెను. భరద్వాజముని రాముని శుభవచనంబుల విని యంత నతనితో మిక్కిలి యర్థవంతంబుగా నాయనా! ఇచ్చటికిఁ బదిక్రోసులదూరమున మహర్షి సేవితమును బవిత్రమునగు చిత్రకూటమను పర్వత మొకటిగలదు. అది నలుగడల చూడ్కు-

---

* ఇందులకు 'భగవన్నిత ఆసన్నః పౌరజానపదో జనః। సుదర్శమిహమాం ప్రేక్ష్యమన్యేఽహమిమమాశ్రమమ్। ఆగమిష్యతి వైదేహీం మాంచాపి ప్రేక్షకోజనః । అనేన కారణేనాహమిహ వాసం నరోచయే।ఏకాన్తేపశ్యభగవ న్నాశ్రమస్థాన ముత్తమమ్। రమేతయత్రవై దేహీ సుఖార్హా జనకాత్మజా॥' అని మూలము. ఇందులకు రహస్యార్థము (భగవన్) సర్వజ్ఞుఁడైనభరద్వాజా! రావణవధముకొఱకు గూఢముగా నవతరించిననన్ను ఇట్లు ప్రకటించితి వేని యప్పుడు, (పౌరజానపదో జనః) సర్వజనులను, (మాం) నన్ను (సుదర్శం) 'విష్ణుంచ దృశ్యతేత్వగ్రయా' అనుశ్రుతిచే చక్కఁగాఁజూడఁదగినవిష్ణునిగాను, (వైదేహీం) సీతను, (మాంచ) లక్ష్మిగాను, తెలిసి (ప్రేక్షకః) చూడఁగోరినవారై, (ఇహ ఆగమిష్యతి) ఇచ్చటికి వత్తురు, (అనేనకారణేన) ఈకారణముచేత, (వాసం) ఇచట ప్రకటముగానుండుట, (నరోచయే) ఒల్లను, కాఁబట్టి (యత్ర) ఎందు-పరమానందైకతానుఁడైన యేనాయందు అనుట, (వైదేహీ) సీత, (రమతే) 'యామృగ్యతే హస్తగృహీతపద్మయా శ్రియేతరైరంగ విమృగ్యమాణయా' 'ఓయీ! ఇతరులచే వెదకంబడుచున్నదియు హస్తమునంగుపద్మము దాల్చినదియు నగు శ్రీదేవిచేత ఎవఁడు వెదకంబడుచున్నాఁడో' అని సర్వజనుల కాశ్రయణీయరాయియున్న లక్ష్మి గూడ నన్ను అనవరతము అనుభవించుచున్నను అప్పుడే అనుభవింప నారంభించినదానివలె ఎడతెగని యనురాగము గలిగియుండును గనుక అట్టివాఁడును, (ఆశ్రమస్థానం) 'ఆశ్రీయతే ఇత్యాశ్రమం' అను వ్యుత్పత్తినిబట్టి ఆశ్రమమనఁగా జగత్తు, జగత్తునకు (స్థానం) ఆధారభూతుఁడును, (ఉత్తమమ్) స్వరూపగుణ విభవములందు బ్రహ్మరుద్రాదులకంటెను శ్రేష్ఠతముఁడును, అగునన్ను, అతిప్రియతముఁడ వగు నీవొక్కఁడవే, (ఏకాన్తేపశ్య) రహస్యముగా తెలిసికొనుము 'గుహ్యాద్గుహ్యతమమ్' అన్నట్లుమిక్కిలి రహస్యమైన నాస్వరూపమును ప్రకటింపకుము; అని రహస్యోపదేశము - మహేశ్వరతీర్థులు,

లకు వేడ్కలు సేయుచుండును. *అందుఁ గొండముచ్చులును గోఁతులును ఎలుఁగులును గలవు. గంధమాధనమునకు సాటియగు. అందు నీవు వసింపవచ్చును. మనుష్యుఁడెప్పుడు చిత్రకూటపర్వతశిఖరములను జూచునో యప్పుడే వానికి పాపంబున మనంబుపోదు, మంగళకృత్యములయందే బుద్ధిగలుగును. ఆచిత్రకూటమందు ఋషులు పెక్కండ్రు వందలకొలఁది వత్సరములు, క్రీడసల్పునట్లు సుఖముగా తపము సలిపి, యాతపమువలనను కపాలాసనము వేయుటవలనను తలలోని వెండ్రుకలును తోలును వీడి కపాలముమాత్రము మిగులఁగా శరీరముతో స్వర్గమునకుఁ బోయిరి. రామా! అది మిక్కిలి విజనమైనది. నీ వచ్చట సుఖముగా వాసము సేయవచ్చునని తోఁచుచున్నది. ఇట్లు గాదేని యిచ్చటనైనను నాతోఁగూడ నివసించి నీవనవాసనియమును తీర్చుకొనుము' అనెను. ఆభరద్వాజుఁడు ధర్మజ్ఞుఁడు గావున రామునకును సీతకును లక్ష్మణునకును అతిథికి చేయవలయు సత్కారములం గావించి వశ్యులం జేసికొనెను. ప్రయాగయందు ఆ రాముఁడు ఆ మహర్షి సమీపమునఁ గూర్చుండి వింతలగు కతలు చెప్పుచుండఁగా పవిత్రంబగు రాత్రి వచ్చినది. సుఖార్హు లగునారాముఁడును సీతయు లక్ష్మణుండును బడలినవారై రమణీయం బైన యాభరద్వాజాశ్రమమున నారాత్రియెల్ల సుఖముగా వసించి యుండిరి. తెల్లవాఱఁగానే పురుష లలాముండగు రాముఁడు తేజంబున వెలుంగుచున్న భరద్వాజునికడకు వచ్చి యమ్మునితో 'సత్యశీలా! మహాత్మా! మే మీరాత్రియంతయు మీయాశ్రమమున వసించి యుంటిమిగదా. ఇఁక నీవానతిచ్చిన వసతికిఁ బోయెదము; అనుజ్ఞ నొసంగుము.' అనెను. ఆరాత్రి కడచనఁగానే భరద్వాజుండు రాముం జూచి 'మధువును ఫలమూలములును చిత్రకూటంబున మెండుగాఁ గలవు. కాన నీవచటికిఁ బొమ్ము. మహాబలా! అది నీకు యుక్తమైన వాసస్థలమని తలఁచెద. అందు నానావిధము లైన వృక్షములు గలవు. కిన్నరులును ఉరగులును నచ్చటికి వచ్చుచుందురు. నెమిళ్ల కేకలు నందు నలుగడల వినఁబడుచుండును. మేటియేనుంగు మిన్నలు అందు వన్నె చూపుచుండును. అట్లు పవిత్రమై మిగుల రమణీయమై ఫలమూలము లవ్వారిగాఁ గలిగి పొగడ్త చెలంగుచున్న యాచిత్రకూట పర్వతమునకుఁ బొమ్ము. రామా! అచట రమణీయం బైనయావనమధ్యమున గజసమూహములును మృగసంచయములును తిరుగుచుండును. నీవు వానిని జూడఁగలవు. అచట ఏఱ్లును, సెలయేఱ్లును, సానువులును, బండలు గూడుకొనుపట్లును, గుహలును, బండల పఱియలును, జల

---

* ఇందులకు 'గోలాఙ్గూలానుచరితో వానరర్క్ష నిషేవితః । చిత్రకూట ఇతిఖ్యాతః' అని మూలము. భూతభవిష్యద్వర్తమానజ్ఞుం డగుమహర్షి 'గోలాఙ్గూలానుచరితః' 'వానరర్క్షనిషేవితః' అని కొండముచ్చులును కోఁతులును ఎలుఁగులును మూఁడుతెగలను చెప్పుటచే అట్టితెగలవారే రామునకు మీఁద సహాయులగుదురని సూచించెనని తెలియునది.

ప్రవాహములును, సీతతోఁగూడఁ దిరుగుచు చూచునపుడు, నీమనసునకు మిక్కిలి యింపు గలుగును. అందుఁ గొక్కెరలును కోయిలలును కేరి కొలకొలఁ గూయుచుండును. మృగములును గజములును బెక్కు మత్తిల్లి తిరుగుచు మురువు గూర్చుచుండును. శుభకరం బగునాచిత్రకూట పర్వతము సేరి యం దాశ్రమము గావించుకొని యుండుము.' అనెను. ఇది యేఁబదినాలుగవ సర్గము.



**చిత్రకూటమునకుఁ బయనమగుట. తెప్పచే యమునానదిని దాఁటి నాఁటిసాయంకాలము యమునావనమున వసించుట.**

పగవారి నడంచు నారాజకుమారులు రాత్రి యమ్ముని యాశ్రమమందుండి తెల్లవాఱఁగా నామహర్షికి నమస్కరించి చిత్రకూటమును గూర్చి పోయిరి. ఆమహర్షి వారలకు మంగళాశీర్వచనములు గావించెను. వారలు పయన మగుటఁ జూచి, తండ్రి కొడుకులను వెంబడించు నట్లు, తానును వారల వెంటఁ బోయెను. పిమ్మట మహాతేజుఁడగు నామునివరుఁడు బీఱువోని పరాక్రమము గల రామలక్ష్మణులఁ జూచి 'పురుషశ్రేష్ఠులారా! మీరు మొదట గంగాయమునా సంగమ స్థలమునకుఁ బొండు. అచట, యమున, గంగాజలముల యొరవడిచేతఁ దిరుగంబడి కొంచెము పడమరతట్టుగాఁ బాఱుచుండును. దాని ననుసరించి పొండు రఘువంశ్యులారా! యమునానది వేగముగా పాఱుచుండు స్థలమునకుఁ బోయి యందు పురాతనముగా జను లెప్పుడును దాఁటుచుండు రేవుఁ జేరి యచ్చటఁ దెప్పఁ గట్టుకొని యానదిని దాఁటుఁడు. అంత నచ్చట శ్యామమను పేరుగల యొక పెద్ద మఱ్ఱిచెట్టు గలదు. అది పచ్చనియాకులు మెచ్చులు గులుకుచు, చుట్టును బెక్కువృక్షములు బలసియుండ, సిద్ధసేవితమై యుండును. సీత దానికి చేమోడ్చి తనకోర్కెలీడేరునట్లుగా ప్రార్థించుకొన వలయును. ఆచెట్టును జేరి, సీత యలసి యుండునేని యచ్చటనే కొంతసేపు విశ్రమింపవచ్చును, లేనిచో పోవచ్చును. అచటనుండి యొకకోసుదూరము పోయితిరేని యచట నల్లగాఁ గనఁబడుచుండు నొక యడవిచూపట్టును. అందు పలాశవృక్షములును రేఁగుచెట్లును యమునగట్టునఁబుట్టిన వెదుళ్లును మిక్కిలి రమణీయముగా నుండును. అది చిత్రకూటమునకుఁ బోవు మార్గము. నేను పలుమాఱు ఆమార్గమున చిత్రకూటమునకుఁ బోయియున్నాను. అది రమణీయమైన దారి. నడుచుటకు మెత్తగా నుండును. అందు కార్చిచ్చులుగలుగవు' అనెను. మహర్షి యిట్లు రామునికి చిత్రకూటమునకుఁ బోవుదారి దెలిపి యంత తన యాశ్రమమునకు మరలెను. రాముఁడును ఆమహర్షికి మ్రొక్కి 'అట్లే పొం'డని వీడుకొలిపెను. కాని పోయిన పిదప రాముఁడు లక్ష్మణునింజూచి 'లక్ష్మణా! ముని మనయందు దయ గలిగి యున్నాఁడు. కావున మనము పుణ్యాత్ము లని తోఁచుచున్నది.' అని చెప్పెను. ఇట్లు ధీరులైన

యాపురుష ధౌరేయులు ఆలోచించుకొని సీతనే ముందిడుకొని యమునానదికిఁ బోయిరి. అంత యమునానది యొద్దకుం బోఁగానే యది వేగముగా ప్రవహించుచుండునది గావున 'దీని నెట్లు దాఁటంగల' మని వారందఱికిని చింత కలిగెను. పిదప రామలక్ష్మణు లిరువురును కొయ్యలు పెక్కులను గొనివచ్చి వానితోఁగూడ నెండిన వెదుళ్లను పఱపుగా జతపఱిచి దారమునకు బదులుగా వట్టివేళ్లతోఁ గట్టి పెద్ద తెప్పను గావించిరి. అంత వీర్యవంతుఁ డగులక్ష్మణుఁడు ప్రబ్బలితీఁగెలను నేరేడురెమ్మలను నఱికి వానిని తెప్పపైఁ బఱచి సీతకు సుఖముగాఁ గూర్చుండుటకు ఆసన మొకటి కల్పించెను. దశరథకుమారుఁడు రాముఁ, డచట లక్ష్మీదేవివలె నింతింతని తలంపరాని సౌందర్యమున వెలుఁగుచున్నదై తనచేయూఁతకుఁ గొంత నునుసిగ్గుపడుచున్న ప్రియురాలిని సీతను తెప్పపై నెక్కించెను. రాముఁడా తెప్పమీఁద సీతప్రక్కను ఆబిడవస్త్రములను భూషణములను గుద్దలిని మేఁకతోలు గప్పినపుటికను తమ యాయుధములను నుంచెను. పిదప వీరులగు నా దశరథుని కుమారులు మొదట తెప్పను బట్టుకొని సీత నెక్కించి పిదప తాము నెక్కి ప్రయత్నమున దాని నడపి యానదిని దాఁటిరి. సీత యానది నడిమికి రాఁగానే దానిని జూచి 'యమునాదేవీ! నేను నిన్ను, నిపుడు దాఁటుచున్నాను. నాపతి వనవాస వ్రతమును తీర్చుకొనునేని, శుభముగా నిక్ష్వాకు వంశ్యులగు రాజులు పాలించిన యయోధ్యాపురమునకు కుశలముగా మరలి రాఁగానే, నీకు వేయి యావులు దానము చేసి నూఱుకుండలు మద్యము నివేదించి పూజించెదను' అని వేఁడి వందనము సేసెను. ఆవరవర్ణిని యట్లు చేమోడ్చు గీలించి యమునానదినిఁ బ్రార్థించుచు దక్షిణపుగట్టుఁ జేరినదయ్యె. యమున, వేగముగా ప్రవహించుచున్నదై యలలు వరుసలు గొని వెలయుచుండఁగా, తీరంబులందు పెక్కుతరువులు మురువుసూపు చుండును. వారాసూర్యకుమారిని యమునానదిని, తెప్పచే దాఁటిరి. వారు నదిని దాఁటి తెప్పను విడిచి యమునాతీర మందలివనమునుండి పయనమయి పోయి చల్లనై, పచ్చనియాకుల నుల్లసిల్లుచున్న శ్యామం బను మఱ్ఱికడకు బోయిరి. సీత యా మఱ్ఱిచెట్టుపొంతకుఁ బోయి 'మహావృక్షమా! నీకు నమస్కారము. నాపతి వనవాసవ్రతమును సమాప్తి నొందించుఁ గాక. నేను మరల కౌసల్యను, మిక్కిలిపొగడ్తగన్న సుమిత్రాదేవిని జూతును గాక' అని ప్రార్థించి చేతులుమోడ్చుకొని యావృక్షమునకుఁ బ్రదక్షిణము చేసెను. అంత అనిందితయై తనకు లోనై నడచుకొనుచు తనమనస్సునకు మిక్కిలి గూర్చుచున్నట్టిసీత, యటు తన మనోరథము ప్రార్థించుకొను చుండఁగా రాముఁడు చూచి యాబిడ యలసినదో లేదో యని పరిశీలించి లక్ష్మణునిం గాంచి 'పురుషతిలకా! సీతను వెంటఁబెట్టుకొని నీవు ముందుపొమ్ము. నే నాయుధధరుండనయి మీయిరువుర వెనుక వచ్చెదను. సీత, పండునుగాని పువ్వునుగాని ఏయే

దానిని గోరునో, ఏదెందు దానిమనస్సునకు నింపుగలుగునో, వానినెల్ల తీసికొని వచ్చి దానికిమ్ము' అనెను. రామలక్ష్మణు లిరువురును బోవుచుండఁగా వారినడుమ సీత మగయేనుంగులనడుమ నున్నచక్కని యాఁడుగజమువలె నుండెను. సీత మున్నెప్పుడును చూడనివృక్షమునుగాని చిన్నచెట్లనుగాని లెస్సగాఁ బూచియున్న తీఁగలనుగాని జూచునపుడు, అది యేమి యని రాముని నడుగుచుండెను. సీత యడిగినంతనే లక్ష్మణుఁడును త్వరితుఁడై పూవులు మిక్కుటముగాఁ బూచి సొగసు గులుకుచున్న పలుదెఱంగు లగుకొమ్మలను విఱిచి సీతకుఁ దెచ్చి యిచ్చు చుండెను. వారు చాలదూరము యమునానదితీరముననే పోవుచుండిరి గావున సీత యానదియందలి మేలయినయిసుకను సొగసుగులుకు మంచిజలములను హంసలయు సారసపక్షులయు గోలకోలమను కూఁతలను జూచి సంతసిలుచుం డెను. అంత నాయన్నదమ్ములు రామలక్ష్మణులు యమునాతీరమునందలి వనమున నొక క్రోసువఱకుఁ బోయి భక్ష్యంబులగు మృగములఁ బెక్కంటిని జంపి భక్షించిరి. వా రట్టికష్టము పాలయ్యును, విన్ననై కనఁబడక, మొగంబుల పెంపుసొంపారఁ జూపట్టుచు, నెమిళ్ల గుంపులకూఁతలచే చప్పుడుగలిగి కోఁతులును ఏనుఁగులును మిక్కిలి తిరుగుచున్న మేలియడవియందు విహరించి, మిట్టపల్లములు లేక సమముగా నున్నట్టిగట్టుం జేరి సీతకు సమ్మతమైనచోట వాసస్థానము గావించుకొనిరి.
ఇది యేఁబదియైదవసర్గము.



(చిత్రకూటప్రాంతమున నున్న వాల్మీక్యాశ్రమమునకుఁ బోవుట. వాల్మీకి దర్శనము. పర్ణశాలను గట్టుకొని చిరకాలము వసించియుండుట.)

అంత రాత్రి కడచనఁగానే రాముఁడు తాను నిదురించి లేచినపిదపఁ గొంత నిదురించిన లక్ష్మణుని మెల్లగా మేలుకొలిపి 'లక్ష్మణా! పరంతపా! అడవి యందలి చిలుకలు కోయిలలు గోరువంకలు మొదలగునవి చెవుల కింపుగాఁ గూయుచున్నవి వినుము. పయనమునకుఁ గాలమైనది. మనము బయలుదేఱుద' మనియె. నిదురపోవుచుండిన లక్ష్మణుఁడు, తనయన్న తగినపొద్దున మేలుకొలుపఁగా, అదిమొదలుకొని నిదురను ప్రాలుమాలికను మార్గాయాసమును బరిత్యజించెను. పిదప వారందఱును లేచి శుభంబగు నానదీజలముల ప్రాతఃకాలకరణీయము లగుస్నానాదులను నిర్వర్తించుకొని చిత్రకూటమునకు భరద్వాజముని చెప్పిన మార్గముం బట్టి పోయిరి. అంత రాముఁడు తగిన కాలమునఁ బయనమైపోవుచు, లక్ష్మణుని, తామరరేకులఁబోని కన్నులు గలసీతను, జూచి 'సీతా! వసంతర్తువు నందు మోదుగుచెట్లు నలుగడలఁ గమియ నెఱ్ఱఁగాఁ బూచినవై నిప్పుదగిలి మాఁడుచున్నట్లును, తమపువ్వులచే పూలమాలికలు వైచుకొని యున్నట్లును నున్నవి, చూడుము. జీడిచెట్లు చక్కఁగాఁ బూచియున్నవి చూడు. ఇవి దుర్గమ

ములగుటచే మనుష్యులకు బొందశక్యములుగావు, మఱి పండ్లయు పత్రములయు బరువున వంగియున్నవి. ఇవన్నియు నుండుటవలన నాకు సుఖముగా నిచట జీవనము జరుగఁగలదు, ఇందులకు సందియములేదు. లక్ష్మణా! ఇదిగో తేనెటీఁగలు పన్నినతేనె తెట్టెలు, నలుతూములకొలఁది గలిగి, యొక్కొక చెట్టునందును వ్రేలాడుచున్నవి చూడు. పువ్వులురాలి దట్టముగా పరపులవలె నలమికొని యున్న వనప్రదేశమునందు, ఇదిగో! యీవానకోయిల కూయుచున్నది. దానికి నెమిలి మాఱు కూయుచున్నది చూడుము. ఇదిగో! చిత్రకూటము. ఇందు ఏనుఁగులగుంపులు నలుగడల తిరుగాడు చున్నవి. పక్షిసమూహములు గోలగోల చప్పుడు గొలుపుచున్నవి వినుము. దీని శిఖరములు మిక్కిలి యున్నతములు. నాయనా! చిత్రకూటపువనమున భూమి మిట్టపల్లములు లేక సమమయినది గాపున నది రమణీయముగా నుండును. మఱియు నందు బహువృక్షములు గ్రిక్కిఱిసియుండును అది పవిత్రము నగును గనుక మనమందు క్రీడించుచుండుదము' అనియె అంత నా రామలక్ష్మణులు సీతతోఁగూడ కాలినడంబోవుచు రమణీయమును మనోహరము నగుచిత్రకూటమును జేరిరి. ఆ పర్వతము నానావిధము లగు పక్షిగణములు గలిగి మిక్కిలియు ఫలమూలములతో నొప్పుచు, రమణీయమై సకలవస్తుసమృద్ధమైయుండును. అందు మంచిజలములును వెలయుచుండును. రామలక్ష్మణులును సీతయు నాపర్వతముం జేరి 'సౌమ్యా! ఈపర్వతము మనోహరముగా నున్నది. ఇందు పలువిధములయిన వృక్షములును లతలును గలవు. ఫలమూలములును మిక్కిలి యున్నవి. ఇట్లు రమణీయముగా నుండుటచే నిందే సుఖముగా జీవింపవచ్చునని నాకుఁ దోఁచుచున్నది. మఱియు నిందు, ఈ పర్వతమున మహాత్ములగు మునులును వాసము చేసెదరు. కాఁబట్టి మనకును నిది వసతికావచ్చును. సౌమ్యా! ఇందు క్రీడించుచుందము' అని యొండొరులకుం జెప్పుకొని నిశ్చయించి ముప్వురును * వాల్మీకిముని యాశ్రమమునకుఁబోయి చేతులుమోడ్చి యమ్మునికి మ్రొక్కిరి. ధర్మజ్ఞుం డగుమహర్షియు వారలరాకకు మిక్కిలియు సంతుష్టుఁడై, వారలం బూజించి, స్వాగతం బడిగి, కూర్చుండుఁ డని చెప్పెను. అంత మహాబాహుఁడును సమర్థుఁడునగు రాముఁడు తన వృత్తాంతమునంతయు క్రమము చొప్పున నమ్మునికిఁజెప్పి లక్ష్మణుంజూచి 'లక్ష్మణా! సౌమ్యా! గట్టి మ్రాఁకులం దెమ్ము. అవి యుత్తమములైనవిగా నుండవలయును. వాసగృహము మీఁద నా మనస్సున్నది. కాన వానిఁదెచ్చి యిల్లుగట్టు' మనియె. పగవారి నడఁచునాలక్ష్మణుఁడు రాముఁడు చెప్పినది విని పలువిధములయిన మ్రాఁకులం

*రాముఁడు చిత్రకూటమునకుఁ బోవుకాలమున వాల్మీకిమహర్షి చిత్రకూటమునందు వసించియుండెను. భరతుఁ డాచిత్రకూటమునకు వచ్చినపిదప ఋషి దానిని వెడలిపోయెననుటచే అది మొదలుగా తమసానదితీరమున వసించియుండెనని తెలియునది.

గొట్టితెచ్చి పర్ణశాలను రచించెను. అది, గాలివాన మొదలగువానికిం గూడ గదల్పఁగూడనంత దృఢముగా నెలకొల్పఁబడినదై, యావరణముగలిగి, చూచుటకు రమ్యముగా నగపడుచుండెను. రాముఁడు పర్ణశాలంజూచి, తనకుఁ బరిచర్యచేయుచు మఱియు నేమియానతిచ్చునోయని యెచ్చరికతో నున్నలక్ష్మణునితో 'లక్ష్మణా! నల్ల యిఱ్ఱిమాంసమునుదెచ్చి, యీశాలలో ఆయాదిక్కుల నధిష్ఠించియుండు దేవతలను బూజింతము. అట్లు పూజించుటకు మునుపు చిరంజీవులుగా నుండఁగోరువారు గృహప్రవేశమునకై చేయు వాస్తుశాంతిని గావింపవలయును. శుభేక్షణా! లక్ష్మణా! నీవు శీఘ్రముగా నల్లయిఱ్ఱిని జంపితెమ్ము. భుజించుటకు పశువధముసేయుట దోషమని శంకింపకు. శాస్త్రమునందు విధింపఁబడిన కార్యము చేసి తీఱవలయును. అది ధర్మమనియె తలంపుము. ఆవిధి కనుకూల మగుధర్మశాస్త్రమును గమనింపుము' అనియెను. వైరులగువారిని రూపుమాపునట్టి యాలక్ష్మణుఁడు, అన్న చెప్పినదివిని యాచొప్పుననే నల్లయిఱ్ఱిని జంపితెచ్చెను. రాముఁడు మరల నతనింజూచి 'ఈనల్లయిఱ్ఱిమాంసమును పచనముచేయుము. దీనిచే గృహాధిష్ఠాత లగుదేవతలను మనము భజింతము. ఇది స్థిరమైన శుభముహూర్తము. ఈదినమును సుస్థిరమైనది' అనిచెప్పెను. ప్రతాపవంతుఁ డగు నా సుమిత్రాపుత్త్రుఁడు భక్ష్యమృగవర్గములోఁ జేరిన నల్లయిఱ్ఱినిజంపి దానిమాంసమును మండుచున్న యగ్నిహోత్రమునవైచి పచనముచేసెను. లక్ష్మణుఁ డామాంసము చక్కఁగా కాల్పఁబడి నెత్తురంతయు సురిఁగి పక్వముగా నుండుట నెఱిఁగి పురుషలలాముని రామునిఁజూచి 'దేవసన్నిభా! ఈనల్లయిఱ్ఱిని పూర్ణావయవములతోను బచనము చేసితిని. అన్నియవయవములతోనుగూడి పాకముచే నల్లఁబడుటచే నిది నల్లనిమృగమువలెనేకనఁబడుచున్నది. నీవింకవాస్తుదేవతలనుభజింపుము. దానికినీవే సమర్థుఁడవు' అనెను. గుణవంతుఁ డగురాముఁడు జపింపవలసినమంత్రము లన్నిటను పండితుఁడు గనుక, నతఁడు స్నానముచేసి నియతుఁడై వాస్తుశాంతికైనకర్మము సమాప్తమగుటకు వలయు నన్నిమంత్రములనెల్ల సంక్షేపముగా జపించుచు, వాస్తుకర్మములఁ గావించెను. అట్లు రాముఁడు వాస్తుదేవతాసమూహములనెల్ల యజించి పరిశుద్ధుఁడై గృహమును బ్రవేశించెను. మితిలేని తేజమున రాజిలు రామునికి దానివలన మనంబున మిక్కిలి యానందము గలిగెను. రాముఁడు వైశ్వదేవబలిని రుద్రబలిని విష్ణుబలిని గావించి వాస్తుశాంతికొఱకు గృహారిష్టముల నుపశమింపంజేయునవై మంగళకరములగు పుణ్యాహవాచనశాంతిజపాదులనుజేసి, క్రమముగా నయ్యెమంత్రములను జపించి, యథావిధిగా నదిలో మరలస్నానము చేసి, సమస్తపాపశాంత్యర్థముగాను సర్వభూతవిషయముగాను మరల నుత్తమంబగుబలినిగావించెను. అంతరాముఁడు బలిహరణాదులైనవేదులను, దేవతాస్థానములను, అగ్నిహోత్రగృహములనును, ఆశ్రమమునకుఁ దగినట్లు చిన్నవిగా నిర్మించుకొ

నెను. శుభలక్షణులగునారామలక్ష్మణులు వన్యములైన పుష్పమాలికలచేతను, పక్వములగు మాంసములచేతను, జలతర్పణములను, వేదోక్తమంత్రజపములచేతను, దర్భలను సమిధలను యథావిధిగా భూతములకు తర్పణముసేసి సీతతోఁగూడ సుందరమగునాపర్ణశాలం బ్రవేశించిరి. అది చెట్లయాకులచేఁ గప్పఁ గలిగినదై, మనోహరమగుచు, శాస్త్రమునం జెప్పఁబడిన యయ్యయెడల వంటయిల్లు మొదలగునవి చక్కఁగా నేర్పఱుపఁబడినదై, మిక్కిలి గాలి యురవడికిని పాత్రము గాకుండెను. ఆపర్ణశాలను రాముఁడు మొదలుగా మువ్వురును, దేవతలు సుధర్మయను సభను బ్రవేశించునట్లు తాము వసించుటకై ప్రవేశించిరి. అప్పుడు జితేంద్రియులగు నామువ్వురును పలువిధములయిన పెక్కుమృగపక్షులు నెరసి, వింతవింతలగు పూవుంగుత్తులు దళుకొత్తుచున్న చెట్లతోడంగూడి, యేనుంగుల ఘీంకారములను నితరమృగములకూఁతలను చప్పుడు గొని యున్న యాయుత్తమవనమున సుఖముగా విహరించు చుండిరి. రాముఁడు మిగుల రమణీయ మగుచిత్రకూటపర్వతమును మంచి రేవు గలమాల్యవతీనదినిం జేరినంతనే మేనంతయు గరుపాఱ, నెంతయు సంతసిల్లి పట్టణమును విడిచినందులకుం గలిగినకొందలము డిందినవాఁ డయ్యె. ఇది యేఁబదియాఱవసర్గము.



**సుమంత్రుఁడు రాముని విడిచి అయోధ్యకుఁ బోవుట. పురజనుల దుఃఖము. దశరథుని శోకము.**

గుహుఁడు, రాముఁడు గంగదక్షిణపుగట్టు చేరఁగానే మిక్కిలిదుఃఖార్తుఁడై రాముఁడు చూపుమేర గడచునంతవఱకు నచటనేయుండి సుమంత్రునితోఁ గూడ చాలసేపు రామునిగుణములు ముచ్చటించుచుండి వానిందోడ్కొని తనయింటికిఁ బోయెను. ఆశృంగిబేరపురమున నుండుచారులు రామాదులు భరద్వాజమునియొద్దకుఁబోవుట, ప్రయాగయందు నామునితోఁగూడనుండట, మొదలుగా చిత్రకూటపర్వతమునకుఁ బోవువఱకును జరిగినవృత్తము లన్నియు సుమంత్రునకుఁ దెలిపిరి. అంత సుమంత్రుఁడు గుహునియొద్ద సెలవుపుచ్చుకొని, మేటిగుఱ్ఱములను తేరికిం బూన్చి యుల్లము మిక్కిలితల్లడిల్ల నయోధ్యానగరమునకే పోయెను. వాఁడు మార్గమున పూవులతావులు బుగులుకొనుచుండు వనములను, నదులను, సరస్సులను, గ్రామములను, పట్టణములనుఁ జూచుచుఁ గడచిపోయెను. *అంత సుమంత్రుఁడు శృంగిబేరపురమునుండి బయలుదేఱిన మూఁడవనాటి సాయంకాలమున నయోధ్యంజేరి, అది యానందముడక్కి కుందుచుండుటంజూచెను. సుమంత్రుఁడు

* మొదటినాఁడు గంగనుదాఁటి యొకవృక్షముక్రింద వసించుట. రెండవనాఁడు భరద్వాజాశ్రమమునందు వాసము, మూఁడవనాఁడు యమునాతీరమునందుండుట, నాలుగవదినము చిత్రకూటగమనము, ఐదవదినము చారులు మరలివచ్చి వృత్తాంతము తెలుపుట, అని తెలియునది.

రామునిఁబాసినందులకు మొదలే మనస్సున మిక్కిలి కంది కుందుచుండెను. మఱి పాడుపడినట్లు నిశ్శబ్దముగానున్న యాపురమును జూడఁగానే శోకము ఉరవడిగా పైకొనఁగా, తనలోఁదాను 'ఈపట్టణమున ఇందలియేనుంగులును గుఱ్ఱములును జనులును జనపతియునుగూడ, రామునికి సంతాపము గలిగినదుఃఖమునం బీడితులై యాశోకాగ్నియందు దగ్ధముకాకున్నారా యేమి!' అని చింతించెను. సుమంత్రుఁ డిట్లుచింతించుచు 'పట్టణము నిశ్శబ్దముగానున్నది. రాజుగతి యేమయ్యెనో' యని వేగమున గుఱ్ఱములఁ దోలి పట్టణద్వారముచేరి యందు త్వరితముగాఁ బ్రవేశించెను. సుమంత్రుఁడు వచ్చుచుండఁగా జూచి జనులు వందలకొలఁదిని వేలకొలఁదిని గుంపులుగొని 'ఎక్కడరాముఁడు' అని యడుగుచు వాని నెదుర్కొని పాఱుతెంచిరి. సుమంత్రుఁడు వారితో 'నేను గంగానదియొద్ద మహాత్ముఁడగురాముని వీడ్కొని యాధార్మికునిపంపున మరలివచ్చితిని' అనెను. జనులు రామాదులు గంగను దాఁటిపోయిరని తెలిసి మొగంబు నిండఁ గన్నీళ్లు గ్రమ్ముకొన 'అయ్యో! ఇసీ!' యని వెచ్చనూర్చి, 'హా రామా!' యని రామునిం బేర్కొనుచు రోదనముచేసిరి. ఆజనులు మూఁకలుగట్టి నిలుచుండి 'ఈరథమున రామునిఁ జూడమైతిమిగా, వానిని జూడనోఁచక చెడితిమే * మనము దానముసేయునపుడును, యాగములందును, వివాహములందును, గొప్పగా సభలుగూడినపుడును, ఆయాకార్యములఁ జక్కఁగా నడపుటకై మననడుమ వచ్చియుండు ధార్మికుని రాముని నిఁక మనమొకప్పుడు అట్లువచ్చియుండఁగాఁ జూడలేమా యేమి? రాముఁడు 'జనులకేది మంచిది? ఏది ప్రియము? సుఖమేది కలిగించును?' అని చక్కఁగా విమర్శించి తండ్రి కొడుకులను గాచునట్లు పురమును గాపాడుచుండెనే' అని యొండొరులతో చెప్పుకొనుచుండగా సుమంత్రుఁడు వినెను. సుమంత్రుఁడంగడివీధిని బోవుచు దాని యిరుప్రక్కల స్త్రీలు రామదుఃఖమునం బరితపించుచుఁ గిటికీలనుండి తన్నుఁజూచి సేయువిలాపమును వినెను. వాఁడు పరమదుఃఖార్తులైన జనులను జూడంజాలక మొగము మాటుసేసికొని రాజమార్గము నడుమఁ బోయి, దశరథమహారాజు వసించుగృహమునకుఁ జనెను. వాఁడు శీఘ్రముగా రథము దిగి రాజగృహమును బ్రవేశించి, రాజు వెడలివచ్చుట లేమింబట్టి బహుజనులు మూఁగియున్న కక్ష్యలనేడింటిని గడచిపోయెను. అంత నందలిస్త్రీలు మేడలనుండియు, ఏనునిలువుల మేడలనుండియు, ఉప్పరిగలనుండియు, సుమంత్రుఁడువచ్చుటం జూచి, రామునిఁ గానకుండుటచే దుఃఖమున స్రుక్కిసొక్కుచు

*ఒకరు దానముసేయునపుడు దేశకాలములు తెలిసి పాత్రమున కిప్పించుటకును, యజ్ఞములు సేయునపుడు న్యాయార్జితమైన ధనముతో దానిని జేయించి కర్మముల సందేహమును దీర్చి మఱచిన వానిని తలఁపించుటకును, వివాహమున ఉభయవర్గములవారిని ఒకటిగాఁగూర్చి సమ్మతింపనివారికి కోరినద్రవ్యమిచ్చి కర్మమును తప్పకుండ నడపించుటకును రాముఁడు సన్నిహితుండగునని భావము,

హాహాకారములు సేసిరి. ఆస్త్రీలు మఱిమఱి దుఃఖమునఁగుందుచు, విశాలములయిన తెలిగన్నులకన్నీళ్లయురవడిచేఁగలఁగంబాఱియుండుటచే, నొకరికొకరుస్పష్టముగాఁ జూడనేరకయే చూచుచుండిరి. అంత నయ్యెయుప్పరిగలనుండి దశరథునిస్త్రీలు రామునిదుగఖమునకుఁ బరితపించుచు, మెల్లగాఁ దమలో 'సుమంత్రుఁడు ఇచ్చట నుండి రామునితోఁగూడఁ బోయినాఁడు. ఇచటికి రాముఁడులేక వచ్చినాఁడే! దుగఖించుచున్న కౌసల్యకుఁ దానేమని చెప్పఁగలఁడు? * రాముఁడు లేక నాకు బ్రదుకుటయే కష్టముగా నున్నది. అట్లే కొడుకుతరలిపోఁగా కౌసల్య బలవంత ముగా ప్రాణములు పెట్టుకొనియుండుటయు నిజముగా శక్యముగా దని తలఁచెదను.' అని మెల్లఁగాఁ జెప్పుకొనిరి. వాఁ డాస్త్రీలు చెప్పుకొను సత్యమయినమాటను వినుచునే, వారలశోకాగ్నిచే మండుచున్నట్లు వేండ్రముగానున్న రాజగృహమును వేగముగాఁ బ్రవేశించెను. వాఁడు ఎనిమిదవకక్ష్యం బ్రవేశించి యచట తెల్లనై చూపట్టుమందిరమున పుత్రదుగఖమున కంది దీనుఁడై యాఱటపడుచున్నరాజుం జూచెను. సుమంత్రుఁ డయ్యెడఁ గూర్చుండి యున్నరాజుకడకుఁబోయి నమస్క రించి రాముఁడుచెప్పినది, కొంచెమైనను తప్పక సరిగాఁ జెప్పెను. రాజును, మనసు కలఁగఁబాఱియుండుటవలన నాపలుకును మిన్నకవిని బదులేమియుఁ జెప్పఁజాలక రాముని దుగఖమునకుఁ గాఱియపడుచు మూర్ఛిల్లి నేలఁ బడెను. రాజు మూర్ఛిల్లినంతనే యంతఃపురకాంతలు శోకంబునఁ గుందుచు నతండు నేలం బడఁగానే చేతులెత్తి హాయని రోదనముసేసిరి. అప్పుడు కౌసల్య, సుమిత్ర తోడ్ప డఁగానే నేలంబడినపెనిమిటిని, లేవనెత్తి,'మహాభాగా! ఎవ్వరికినిజేయఁదరముకాని కార్యమునుజేసినదిట్టయగు నీకొడుకు రాముఁడుపంపగా,నతఁడువసించువనమునుండి వచ్చియున్న యీదూతతో సుమంత్రునితో నేలమాటలాడవు? రఘువంశ్యా! రాము నడవికిఁబంపి నీతి దప్పితివి, ఇప్పుడు దానికి లజ్జించుచున్నావు. అదితగదు. లెమ్ము. నీకు ఆడితప్పని పుణ్యము కలిగెడుఁగాత. శోకించుటవలన ప్రయోజనము లేదు. దేవా ఎవ్వరికి భయపడి సూతుని రామవృత్తాంత మడుగకున్నావో, యాకైక యిచ్చట లేదు. కనుక నెమ్మదికలిగి జంకులేక మాటలాడుము' అనెను. ఆకౌశల్య శోకంబు నం జపలయై కన్నీళ్లు గ్రమ్మి యెలుంగు డగ్గుత్తిక వడఁగా నిట్లు, మహారాజుతోఁ జెప్పి తోడనే నేలంబడెను. ఇట్లు విలపించుచు నేలంబడిన కౌసల్యను, మూర్ఛిల్లి నేలంబడియున్న పెనిమిటిని జూచి రాజకాంత లందఱును, బేరెలుంగున రోదనము సేసిరి. అంత నాయంతఃపురమున రోదనధ్వని లేచుటవిని పురమందలి ముసలి వారందఱును వయసు గలవారగు పురుషులును స్త్రీలును అందఱును, నలుగడల

*ఇందులకు 'కొడుకుతరలిపోఁగా కౌసల్యబలవంతముగా బ్రతికియుండుట యనునది మిక్కిలి కష్టమైనది. ఇట్టిదుఃఖంపుబ్రదుకు బ్రతుకుట మఱొకరికి తరముగా దని నిజముగా నాకుఁ దోఁచు చున్నది' అని మహేశ్వరతీర్థుల యర్థము.

రోదనముచేసిరి. అట్లు ఆపట్టణమంతయు రాముఁడు వనమునకుఁ బోవునప్పటి వలె మరల కలఁగుడు నొందినదయ్యె. ఇది యేఁబదియేడవ సర్గము.

---

## సుమంత్రుఁడు దశరథునితో రాముని సందేశమును జెప్పుట, సీతాదుఃఖమును దెలుపుట.

దశరథుఁడు ఉపచారమువలన మూర్ఛదేఱఁగానే నంత సుమంత్రుని దిక్కు మొగం బై రాముని వృత్తాంతము నడుగుకొఱకు వానిం బిలిచెను. ఆ రాజు రామునే తలఁచికొని వగచుచు మిక్కిలి దుఃఖము ముంచుకొనఁగా క్రొత్తగా పట్టు వడిన యేనుఁగువలె పరితపించుచు, నిట్టూర్పులు పుచ్చుచును, ధ్యానించు నట్లు ఏమియుం దోఁచక మిన్నకుండి, వ్యాధిగ్రస్తమైన గజమువలె ఆఱటపడు చుండెను. అట్లున్న వృద్ధుఁడగు మహారాజునొద్దకుసూతుఁడువచ్చి చేతులుమొగిడ్చికొని నిలుచుం డెను. రాజును దనయొద్ద, ధూళి గ్రుంగిన యవయవములతో, మొగమునిండఁ గన్నీళ్లుగాఱ, దీనుండై నిలుచుకొనియున్న సుమంత్రునిఁజూచి, మిక్కిలియుం బొక్కుచు 'సూతా! మిక్కిలియు సుఖమును అనుభవించిన యాధర్మాత్ముఁడు రాముఁడు ఏచెట్లక్రింద వసించి యున్నాఁడు? ఏమి దినుచున్నాఁడు? సుమంత్రా! వాఁడు దుఃఖ మనుభవించుటకే తగఁడే! మేలిశయ్యల పరుండఁదగిన వాఁడే! అట్టి రాజకుమారుఁడు కష్టముతో నేలపై అనాథునివలె నెట్లు పరుండు చున్నాఁడు? ఎవ్వఁడు పోవుచుండఁగా పదాతులును రథములును గజములును వెనుకొని పోవుచుండునో అట్టిరాముఁ డిప్పుడు నిర్జనంబగు నరణ్యమున నెట్లు న్నాఁడు? క్రూరములగు సింహాదిమృగములును, కొండచిలువలును, కృష్ణసర్ప ములును మెండుగా తిరుగాడుచుండు వనమునకు నాకుమారులు రామలక్ష్మణులును సీతయు నెట్లు పోయియున్నారు? సుమంత్రా! సీత మిగుల సుకుమారురాలు, దానిగతికి నెవ్వరికిని జాలి గలుగును. అట్టి సీతను దోడ్కొని యారాజ కుమారు లిరువురును రథముదిగి కాలినడను బోయిరెట్లు? సూతా! అశ్విదేవతలు మందర పర్వతమును బ్రవేశించునట్లు, వనాంతరమును బ్రవేశించుచున్న నాకొడుకులను గన్నారం జూడఁ గలిగితివి గావున నీవు కృతార్థుండవు. అడవిని జేరిన పిదప రాముఁడేమి చెప్పెను? లక్ష్మణుఁ డేమనెను? సీతయు నేమిచెప్పినది? రాముఁ డెందెందుఁ గూర్చుండెనో, ఎచ్చటెచ్చటఁ బరుండెనో, యేమేమి భుజించెనో, యివి యన్నియు నాకు వివరముగా వర్ణించి చెప్పుము. యయాతి స్వర్గమునుండి పడునప్పుడు, ఇంద్రుని తనకు సజ్జనసహవాసము నియ్యవేఁడి దానివలన స్వర్గ భ్రంశదుఃఖమును విడిచియుండెను. అట్లే నేను రాముని ఎడఁబాయు మహాదుఃఖ మును బొందినను, వానిచరిత్రము వినుట నైనను బడసి యాదుఃఖమును దీర్చు కొని యది వినుచు బ్రతికియుండెదను' అనెను. రాజిట్లు అడుగగా సుమంత్రుఁడు కన్నీళ్లు

గ్రమ్మి గొంతడగ్గుత్తిక పడుటం జేసి మాటలు తొట్రిలఁగా నతనింజూచి "మహారాజా! రాముఁడు ధర్మమునే పరిపాలింపఁ బూని నిన్నుఁ దలఁచి చేతులు మోడ్చి శిరముసోఁక నమస్కరించి నాతో నిట్లనియె "సూతా! నాతండ్రి యాత్మవిదుఁడు, కనుక శిరసు సోఁక మ్రొక్కందగినవాఁడు. కాఁబట్టి నేను మ్రొక్కితినని చెప్పి నాకు మాఱుగా నామహాత్ముని యడుగులకు రెంటికిని శిరము సోఁక నీవు నమస్కరింపవలయును. సూతా! అంతఃపురమునందు పీరు వారనక అందఱికిని నేను చెప్పితినని నాయారోగ్యమును జెప్పి వారివారి పరువునకుం దగినట్లుగా నానమస్కారమును దెలుపవలయును. నాతల్లికి కౌసల్యకును నీవు ప్రాలుమాలక నాక్షేమమును నమస్కారమును జెప్పవలయును. ఆ యమకు ధర్మమునఁ గాని భర్తయెడలఁగాని యేమఱకుండునట్లును చెప్పవలయును. మఱియు నీమాటను గూడఁ జెప్పుము. దేవీ! నీవెప్పుడును ధర్మమును విడువక, అగ్న్యో కాలములను దప్పక యగ్నిహోత్ర గృహములకు నుపచరించుచుండుము. రాజు పాదములకు దైవంబునకుంబోలెఁ బరిచర్య సేయుచుండుము. నీకు సవతులైన నాతల్లు లందఱియెడలను నీవు ఎక్కువదాన నని గర్వముగాని, జ్యేష్ఠపత్నినని యొకరికి క్రిందు పడరాదని మనంబున నిక్కుగాని, పరిత్యజించి వర్తించుచుండుము. అమ్మా! రాజును, అతనివలెనే పూజ్యురాలగు కైకేయిని, అనువర్తింపుము. రాజునకు వెనుక కైకేయినే పూజ్యురాలినిగాఁ గావింపుము. భరతుఁడు కుమారుఁడని యుండక రాజువలె నతనియెడల నడచుకొనవలయును. రాజులు ధనముచేఁ బెద్దలుగాని వయస్సునుబట్టి కాదు. ధనమున బెద్దలయినవారే రాజులగుదురు. కనుక పిన్నయైనను భరతుఁడు నీకుఁ బెద్దయగును. రాజధర్మమును తలంపునకుఁ దెచ్చుకొనుము. ఇది నీకుం దెలియును" అని, యంత భరతునింగూర్చి నేను నీతో చెప్పితినని భరతునకు నాకుశలమును జెప్పవలయును. మఱితల్లులందఱియందును భేదములేక న్యాయముచొప్పున నడచుకొనుమని నామాటగా వానికిఁ జెప్పుము. ఇక్ష్వాకుకులము నుల్లసిల్లంజేయు మహాభుజుండగు నాభరతునితో మఱియు 'నీవు యువరాజవైయుండి, రాజ్యమునందు ప్రధానముగా తండ్రి నేయుంచి యతనియాజ్ఞను బరిపాలింపవలయునే కాని యతని నతిక్రమింపరాదు. ఏలన రాజు మిక్కిలి వయస్సు చెల్లినవాఁడు, కాన నతని మాటకు నడ్డు సేయకుము. యావరాజ్యమును వహించి యతని యాజ్ఞను జరిపించుచు నిష్టభోగముల ననుభవించుచు జీవింపుము' అనియును జెప్పుము" అనెను. రాముఁడు మరల నన్నుఁ జూచి కన్నీరు మిక్కిలియుఁ గ్రమ్మఁగా భరతునుద్దేశించి, "భరతా! నాతల్లి కొడుకునందు మిక్కిలియాశ గలది. అందులకుఁ దగినట్లు నేనామెకడ లేకపోయినను నీవు నాకు మాఱుగా నీతల్లివలెనే నాతల్లిని జూచుకొనవలయును" అని మహారాజా! ఆ మహాకీర్తిమంతుఁడు వగపుచే కన్ను లెఱ్ఱ దామరవలె వెలయ

నాతో నిట్లు చెప్పుచునే కన్నీళ్లు మిక్కిలియు విడిచెను. లక్ష్మణుఁడు మాత్రము మిక్కిలియు క్రుద్ధుఁడై నిట్టూర్పులు పుచ్చుచు ''ఈ రాజకుమారుఁడు రాముఁడు ఏయపరాధము చేసినాఁడని యూరినుండి వెడలఁగొట్టఁబడినాఁడు? రాము నడవికిఁ బంపినందులకు మేమందఱును మిక్కిలి బాధపడుచున్నారము. అయినను రా జిట్లు చేసినది మిక్కిలి యకార్యమే. అతఁడో తుచ్ఛమగు కైకయాజ్ఞకు లోనై యిట్టి యకార్యమును కార్యమనియే చేసినాఁడు సుమీ? 'రాజు, చేసిన ప్రతిజ్ఞను చెల్లింపఁగా నది యకార్య మెట్లగు నందువా? కైక రాజ్యలోభమున రాజుతో రాము నడవికిఁ బంపుమని చెప్పి చేయించినదే యగును. కాన దోషమగుట చెప్పనక్కఱ లేదు. మఱి కైకకు వరముల నిచ్చుటంబట్టి యట్లు చేసినను సర్వవిధముల దుష్కార్యమే చేసినట్టయినది, కాని యొప్పిదము కాదు. ఆవరములను రాముని వెడలఁగొట్టి భరతుని రాజ్యముగట్టుటకే యుపయోగపఱుపవలసినది లేదుగదా. కాన నిది యెట్లును దుష్కార్యమే యగును. రాముని విడుచుటకుఁ గారణమేదియుఁ గానరాకున్నది. కావున రాజు తాను ప్రభువని స్వతంత్రించి యథేచ్ఛముగాఁ జేసిన కార్యమే యగును. ఇట్లు 'మమ్ము పీడించుట దైవప్రేరణమువలన యథేచ్ఛముగా రాజు చేసినాఁ' డన్నను, దైవము ప్రేరేపించినను ఏదైనను దోషమును మున్నిడుకొనియే పరిత్యజింపవలయును. రాముని పరిత్యజించుట కట్టికారణమేదియుఁ గానరాకున్నది. రాము నడవికిఁ బంపుటయే విరుద్ధమైనది. అయినను రాజుబుద్ధి తక్కువయగుటచే నాలోచింపక చేసినాఁడు. కావున నది యిప్పు డతనికే యనుతాపముఁ బుట్టించుచున్నది. 'తండ్రిని నిందింపరా'దందువా? నా కింక మహారాజునందు తండ్రియనుబుద్ధి గానఁబడదు. నాకుఁ దోఁబుట్టువునుఁ, స్వామియు, బంధువును, తండ్రియును రాముఁడే. 'సకలలోకప్రియుఁడును, సర్వలోక హితుఁడు నగురాముని దిగవిడిచితివి. ఇట్టి క్రూరకర్మముచేసి సర్వలోకమున కప్రియుండును సర్వలోకహితమునం దాసక్తిలేనివాఁడు నైననీయందు భరతునివంటివానికిఁ దప్ప తక్కినలోకు లెవ్వరికిఁగాని యనురాగ మెట్లు గలుగును? సకలప్రజలమనంబులకును ఇంపు గూర్చుధర్మాత్ముని రాముని నడవికిఁ బంపి యీలోకులందఱితో విరోధించి నీవెట్లు రాజుగా నుండఁ గలవు?' అని రాజుతోఁ జెప్పుము'' అనెను. మహారాజా! సీత యన్ననో లక్ష్మణునివలె నేమియుఁ బలుకదు గాని మనస్సునందలి శోకాతిశయమువలన నిట్టూర్పులు పుచ్చుచు, గంభీరమైన మనస్సు గలది గావున, లోపల భూత మావేశించియున్నదానివలె కదలక మెదలకుండి, వింతపాటునం బోలె కనుఁదమ్ములు మిక్కిలివిలసిల్లఁగా, నన్నియు మఱచి చిరునవ్వు మురుపు చెడి యూరకుండినది. ఆయమ రాజకుమారి గనుక నదివఱ కెన్నఁడును వ్యసనమును ఎఱుఁగినది గాదు, అట్టిసమయమునను గైకను ఒక్కపలుకైనను నిందింపని యాబిడ ఎంతయుఁ బొగడ్తకుఁ దగినది. ఆసీత భర్తృదుఃఖమును జూచి తనకును

దుఃఖముకలుగఁగా నేడ్చుచుండినది, కాని నాతో నేమియుఁ జెప్పినదిగాదు. ఆయమ పెనిమిటిని ఊరక చూచుచుండి, మొగము సంతాపమున నెండఁగా నేను పయన మైపోవుచుండుట చూడఁగానే 'రథమును బోయినది, రాముఁ డెట్లు నడవఁగలఁడు' అని దుఃఖము పట్టలేక కన్నీళ్లు కార్చినది. అట్లురాముఁడు లక్ష్మణుఁడు శుశ్రూష లుసేయుచుఁ గాచుచుండఁగా, మొగంబునఁ గన్నీళ్లుగ్రమ్ముకొన చేతులు మోడ్చి కొని యుండెను. అట్లే సీతయు మిక్కిలిజాలి పుట్టించుచు నేడ్చుచు రథమును రథ మువలెనే నన్నునుం, జూచుచుండెను. ఇది యేఁబదియెనిమిదవసర్గము.



( సుమంత్రుఁడు దశరథునితో రామవియోగమున నయోధ్యయందలి చరాచరజంతువు లెల్లను గంది కుందుటను జెప్పుట. దశరథుఁడది విని పశ్చాత్తాపమున మూర్ఛిల్లుట. )

* ఇట్లు మంత్రివరుఁడును సారథియునగు సుమంత్రుఁడు జెప్పుచుండఁగా రాజు విని తక్కినవృత్తాంతముఁ జెప్పు మనియె. సుమంత్రుఁడును రాజుమాట విని కన్నీళ్లచేఁ గళవళించుచు మఱియు రాముని వృత్తాంతమును సవిస్తరముగా నిట్లు చెప్పిన వాఁడయ్యె: 'మహారాజా! ఆవీరు లిరువురు జడలం దాల్చి నార చీరలంగట్టి గంగానదిని దాఁటి ప్రయాగక్షేత్రమునుగూర్చి పోయిరి. లక్ష్మణుఁడు రామునకుఁ గాపై, యందఱికిని ముందుపోయెను. అట్లు వారు పోవుచుం డఁగా నపుడు చూచి పరాధీనుఁడను గావున వెంటఁబోలేక మరలివచ్చినవాఁడ నైతిని. రాముఁడు వనమునకుఁ బయనమై పోఁగానే నేను మరలితిని. మరలినను నాగుఱ్ఱములు రామదుఃఖమున వేఁడి కన్నీళ్లు విడుచుచు నామార్గమున సరిగా నడచినవిగావు. అంత నేను రాజకుమారుల కిద్దఱికిని నంజలిగావించి, రథము నెక్కి, యాపట్టరాని దుఃఖమంతయు దిగఁద్రావుచుఁ బయనమైతిని. నే నాశృంగి బేరపురమునందే మరల రాముఁడు నన్ను చారులమూలమునఁ బిలిపించునో యనునాశచేత గుహునితోఁగూడఁ † బెక్కు దినములుంటిని. మహారాజా!

* ఇది మొదలుగా నాలుగువాక్యములకుఁ బ్రతియగు నాలుగుశ్లోకములు గోవిందరాజాది వ్యాఖ్యానములందుఁ గానిపింపదు.

† ఇచట 'పెక్కుదినము'లనుచో పెక్కులనఁగా మూఁడుదినములని కొందఱిమతము. నిజము నకు చెట్టుక్రింద నొకదినము. భరద్వాజాశ్రమమున రెండవదినము. యమునాతీరమున మూఁడవదినము. నాలుగవనాఁడు చిత్రకూటప్రవేశము. ఐదవనాఁడు గుహుని చారులు వృత్తాంతము దెలుపుట. ఆఱవ నాఁడు సూతుఁడయోధ్యకు బయలుదేఱుట కనుక ఆఱుదినములయ్యెను. లేక, రెండవనాఁడు భరద్వా జాశ్రమమునరాముఁడు చిత్రకూటమునకుఁబోవనిశ్చయించుటవలననది తెలిసి, చారులుమూఁడవనాటికి వచ్చి సుమంత్రునికిఁ దెలుపఁగా నాలుగవనాఁడు సుమంత్రుఁడు పురమునకు బయలుదేఱినాఁడని తలఁచినయెడల గంగాతీరమున మూఁడుదినములున్నట్లు తేలుచున్నది. కనుక పెక్కులనఁగా మూఁడు

*నీదేశమునందు వృక్షములుసైతము రామవ్యసనమునఁ బూవులతోను మొలకలతోను మొగ్గలతోనుగూడ నెండియున్నవి. ఇంక మనుష్యులను చెప్పనేల? †నదులయందును పడియలందును కొలఁకులందును నీళ్లుగ్రాఁగియున్నవి. ఉద్యానవనములందును ఆకులెండిపోయినవి. అడవియందు జంతువులు మెదలుటలేదు, క్రూరమృగములును ఎరకైనను తిరుగాడుటలేదు. రామదుఃఖమున అడవియంతయు నిశ్శబ్దముగా నున్నది. రాజా! తామరాకులు నీట మునుఁగఁగా, నీళ్లును చెడి తామరలును వాడువాఱి, చేఁపలును జలపక్షులును నుడిగి మడిఁగి, తామరకొలంకులు కలంకఁజెందియున్నవి. జలమందుఁ బుట్టుపువ్వులును బుడమియందుఁ గలుగు పువ్వులును మఱి పండ్లును

---

దినములని గ్రాహ్యము. రామవియోగమువలన, ఒక్కొక్కదినము కల్పమువలెఁ దోఁచుటచే ఆ మూఁటిని పెక్కులుగాఁజెప్పినాఁడు. అని గోవిందరాజులు.

సీతారామలక్ష్మణులు గంగనుజేరి గుహునితోనున్న దిన మొకటి. గంగనుదాఁటి వటమూలమున నున్నదిన మొకటి. రాముఁడు భరద్వాజాశ్రమము చేరిన నాఁడు అచటనుండి చారులువచ్చినదిన మొకటి. మొత్తమునకు దినములుమూఁడగును. ఇవియె పెక్కులనఁబడినవి. రాముఁడు భరద్వాజాశ్రమము చేరిన రెండవనాఁడు చారు లచటనుండివచ్చి సుమంత్రునికి వృత్తాంతముఁ దెలుపఁగా వాఁడును ఆనాఁడే బయలుదేఱి మూఁడవదినము సాయంకాలము-అనఁగా బయలుదేఱినదినముతోఁగూడ మూఁడవదియగు దినము సాయంకాలము, అయోధ్యచేరినాఁడు. కావున 'తతః సాయాహ్నసమయే తృతీయేహని సారథిః। అయోధ్యాం సమనుప్రాప్య నిరానన్దాం దదర్శ సః' అని వాఁడు మూఁడవదినము అయోధ్యనుజేరెనని చెప్పఁబడియున్నది. కనుక (తృతీయేహని) అనుటకు శృంగిబేరపురమునుండి వెడలిననాఁటితోఁ గూడిన మూఁడవనాఁడు అయోధ్యను జేరినాఁడని తెలియునది. అని మహేశ్వరతీర్థులు.

* ఇందులకు 'విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః। అపి వృక్షాః పరిమ్లానాస్సపుష్పాఙ్కురకోరకాః' అని మూలము. మహారాజా! (విషయే తే), నీదేశమందు, (రామవ్యసనకర్శితాః) రామదుఃఖమున కృశించినవై, (వృక్షా+అపి) వృక్షములుకూడ అపిశబ్దముచె తీఁగెలు మొదలైనవానిని గూడ గ్రహించుకొనవలయును. (సపుష్పాఙ్కురకోరకాః) పుష్పములతోను మొలకలతోను మొగ్గలతోను, దీనిచే వ్యాధి మొదలయినవానివలన వృక్షములం దేదోయొకభాగమే చెడినదనుట వ్యావర్తింపఁబడినది. సంపూర్ణముగా చెడినవనుట. దీనిచే వృక్షావయవములలో గడుసైనది మెత్తనైనది అను భేదములేక అన్నియవయవములును చెఱుపునొందినవని భావము.

† ఇందులకు 'ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసిచ। పరిశుష్కపలాశాని వనాన్యుపవనానిచ' అని మూలము. (నద్యః) నదులు (ఉపతప్త+ఉదకాః) క్రాఁగినయుదకములుగలవి. నదులు క్రాఁగినవి యనక అందలి యుదకములు క్రాఁగినవనుటచే ఉదకమునం దొకానొకభాగము గాక యంతయును గ్రాఁగినవని యర్థము. దీనినిబట్టి యెండచేఁ గ్రాఁగినవి కావని యేర్పడుచున్నది. (పల్వలాని సరాంసిచ) పడియలును కొలఁకులును—దీనిచే అల్పమనియు గొప్పదనియు విభాగము లేక యన్నియు పరితప్తములైనవని భావము, (వనాని) ఎడతెగక నీళ్లుగట్టుటలేక పెరిఁగినవై కఠినాకారములుగా నుండునవి, (ఉపవనాని) నీళ్లుగట్టుటచే పెరిఁగినవై కోమలములుగా నుండునవి. ఈరెండును (పరిశుష్కపలాశాని) ఏకరూపముగా ఆకులెండిపోయినవి.

మునుపటివలెఁ గాక వాసనలు కొంచమై ప్రకాశింపకున్నవి. ఈ పట్టణమున నుద్యానవనము లన్నియు నింపారుపిట్టలగతులును కూఁతలును మాలి పాడుపడియున్నవి. పురుషవృషభా! ఉద్యానములేవియు నాకు సొంపుగా చూపట్టవు. నే నయోధ్యను బ్రవేశింపఁగా, అందొక్కఁడైనను సంతోషముతో నున్నవాఁడు గాఁడయ్యె. జనులందఱును నాతోఁగూడ రాముని చూడకుండుటచే దుఃఖమున మాటిమాటికి నిట్టూర్పులు పుచ్చుచున్నారు. దేవా! రాముఁడులేక యిచటికివచ్చిన రాజరథమునుజూచి,*రాజమార్గమున నున్నజనులందఱకిని దుఃఖముచే మొగమునఁగన్నీళ్లుగ్రమ్మినవయ్యె. స్త్రీలుమేడలనుఏడునిలువులమేడలను ఉప్పరిగలనునెక్కి రాముఁడులేక రథముమాత్రము వచ్చుటఁజూచి రామునిదర్శనము లేమికి స్రుక్కుచు హాహాకారములుసేసిరి. స్త్రీలు మిక్కిలియుం గుందుచుఁ, గన్నీళ్లువేగముగాఁ గ్రమ్ముకొనుటచే మఱింతవిరివియై కాటుకయంతయు కరఁగి నిర్మలములైయున్నకన్నులతో, ఒండొరులను స్పష్టముగాఁ జూడనేరకయే యూరక చూచుకొనుచుండిరి. రామునింగూర్చి యాఱటపడువిషయమున శత్రువులైనవారియందుఁ గాని మిత్రులైనవారియందుఁగాని, యుదాసీనులందుఁగాని భేదమేమియు నగపడలేదు, అందఱు నొక్కతీరుననే కుందుచుండిరి. మహారాజా! ఈయయోధ్యయందు జనులు సొంపు దక్కి దూలుచున్నవారు. గజములు అశ్వములు దుఃఖపడుచున్నవి. మఱియెచ్చటను రోదనధ్వనిచే పెంపు దక్కియున్నది. బిట్టునిట్టూర్పులచప్పుడువలె హాహాకారములెసంగుచున్నవి. ఎందుఁజూచినను ఆనందము గలుగదు. రాము నడవికిబంపినందులకెటచూచి నను తహతహపాటే. కనుక నయోధ్య, పుత్రునిఁ బాసినకౌసల్యపగిది, నాకుఁగనఁబడుచున్నది' అనెను. సూతుండు చెప్పినమాట విని రాజు గన్నీళ్లు గమ్ముటచే తొట్రుపడుచు మిక్కిలి దీనంబైనపలుకు పలుకుచు నాసూతుంజూచి ‡ 'కైకతలంపెల్లపాపమునకుఁ బుట్టుచోటు. అది మఱి పాపంపుకులమునఁబుట్టినందులకుఁ దగినస్వభావము గలది. అట్టికైక రాము నడవికిఁ బంపుమని నియోగింపఁగా నేను కార్యాలోచనమందు కుశలులైనపెద్దలతోఁగూడి దానిని విచారింపనైతిని. నేను స్నేహితులతోఁగాని మంత్రులతోఁగాని పురజనులతోఁ గాని యీరాముని పంపుకార్య మాలోచించి చేయనైతిని. మఱి యాఁడుదానివలనిమోహమువలన ముందు వెనుకఁజూడక తటాలున నీకార్యముఁ జేసితిని. సూతా! అటుకాదేని, యిట్లు జరగవలసియుండుటచే నేఁజేసికొన్నపాపమున, ఈవ్యసనము మఱియేహేతువు లేక, తనంటనే యీకులము

* ఇంతవఱకు రామునిసర్వాత్మకత్వము ఋషి యనుసంధించినాఁడని ప్రబంధగతవస్తుధ్వని తెలియునది. మఱియు సుమంత్రుఁడు దశరథుఁ డడిగినదానికి ఉత్తరముచెప్పి యంతటితో నిలువక రాజ్యమును అందలి మనుష్యాదులును క్షోభమును బొందుటను చెప్పుచుండఁగా, రాజు తాను చేసినది అకృత్యమని తెలుపుటకై సుమంత్రుఁ డట్లు చెప్పుచున్నాఁడని తెలిసి తన యకృత్యమును అంగీకరించుచు నుత్తరమును జెప్పుచున్నాఁడు.

నాశము నొందుటకై మాకుఁ బ్రాప్తించియుండును. సూతా! నీకెప్పుడైన నేనేదేని యుపకారము చేసియుందునేని దానినిబట్టి నీవు శీఘ్రముగా నన్ను రామునొద్దకుం గొనిపోయి చేర్పుము. నాప్రాణములు పోవునట్లున్నవి గావున అవియే నన్నుఁ ద్వర పెట్టుచున్నవి. ఇప్పటికి నాయాజ్ఞ చెల్లునేని, రాముని మరల్చి తీసికొనిరమ్ము. రామునిఁ బాసి నేను గడియసేపైనను జీవించియుండఁజాలను, లేక యొకవేళ, ఆ మహాబాహుఁడు బహుదూరము పోయియుండవచ్చును, కావున వానిఁ బిలుచుకొని వచ్చుటకంటె నన్నే రథమునం దెక్కించుకొని తోడ్కొనిపోయి శీఘ్రముగా రామునికిం జూపుము. మల్లెమొగ్గలవలె గుండ్రనైన పలువరుసగల పెనువిలుకాఁడగు రాముఁడు లక్ష్మణుని యన్న యెచ్చట నున్నాఁడు? వాఁడెక్కడ! చావనున్న నేనెక్కడ! వానిని సీతను జూడంగలిగితినేని జీవింపఁగలను; లేకున్న నాప్రాణములు నిలువవు. ఎఱ్ఱనికనుఁగొలుకులుగలిగి, నిడుదబుజములు దాల్చి, రత్నకుండలములు వైచుకొని విలసిల్లురామునిఁ జూడనైతినేని యమలోకమునకుఁ బోవుదును. ఇట్టి నేను, ఇంతదుఃఖస్థితి నొందినపుడును, ఇక్ష్వాకునందనుండగు రామునిఁ గన్నారఁ జూడకున్నానే! నాకింతకన్నదుఃఖ మేమున్నది! అయ్యో! రామా! అయ్యో! లక్ష్మణా! హాతపస్వినీ! సీతా! నేనియ్యెడ అనాథువలె దుఃఖమున జచ్చుచున్నానే! ఇదిమీకుఁ దెలియదు' అని విలపించెను. రాజు ఆదుఃఖమున మనస్సు నెలకొల్పి దరిలేని శోక సముద్రముఁ జొచ్చి కౌసల్యంజూచి 'దేవీ! నాకు శోకము ఇంతింతనరాదు, అది సముద్రమువలె నున్నది. ఆసముద్రమునకు రామదుఃఖమే నిండుపఱపు, సీతను బాయుటయే దానికి పారము. నిట్టూర్పులే యందలియలలును, సుళ్లునగును, కన్నీళ్లే నురుఁగు నీళ్లు, చేతులు విదుర్చుటయే చేఁపలతండములు, రోదనధ్వనియే దాని పెనుచప్పుడు, విరియఁబోసికొన్న తలవెండ్రుకలె యందలి పాఁచితీఁగలు, కైకయే బడబాగ్ని, కుబ్జవాక్యములే యందలిపెద్దగ్రాహములు, నాకన్నీళ్లజడియురవడి కదియె మూలము, ఆక్రూరురాలివరమే జలవృద్ధి, రాముని వెడలఁ బంపుటయే దానినిడివి, ఇట్టి శోకసముద్రమునందు అయ్యో! కౌసల్యా! మునింగితినే! రాముఁడు లేక నేను దీనిని గడవఁజాలనే! నేనిపు డియ్యెడ, రాముని లక్ష్మణునిఁజూడ నువ్విళ్లూరుచున్నను జూడం బడయకున్నానే! ఇంతకన్న నమంగళము మఱియే మున్నది' అనెను. ఇట్లా మహాకీర్తిశాలియగు భూపాలుండు విలపించుచు మూర్ఛితుండై పాన్పునం బడెను. ఇట్లు రామునిందలఁచుకొని రాజు మిక్కిలి జాలి పుట్టునట్లు ఇనుమడిగా విలపించుచు మూర్ఛనొందఁగా నతనియిల్లాలగు రామునితల్లి కౌసల్య యతనిమాటలు విని ముందు రామున కేమిగలుగునోయని భయమునొంది యుండియు, నిపుడు భర్తకే మగునో యని మరల భయము నొందినదయ్యె. ఇది యేఁబదితొమ్మిదవ సర్గము.



— { సుమంత్రునివలన రామునివృత్తాంతమును విని కౌసల్య మిక్కిలి శోకించుట. సుమంత్రుఁ డూఱడించుట. } —

అంతఁ గౌసల్య మిక్కిలి దుఃఖమున భూతముపట్టినదానివలె మాటిమాటికి భూమిపయిం బడి పొరలుచుఁ బ్రాణములు లేనట్లు మూర్ఛిల్లి తెప్పిఱి సుమంత్రుం జూచి, 'రాముఁడును సీతయు లక్ష్మణుఁడు నెచ్చట నున్నారో అచ్చటికి నన్నుఁ గొని పొమ్ము. నేను వారిని బాసి క్షణకాలమైనను ఇచట బ్రతికియుండఁజాలను. శీఘ్రముగా రథమును మరల్చి నన్ను దండకారణ్యమునకుఁ దోడ్కొనిపొమ్ము. అట్లు నీవు నన్ను వారలయొద్దకుఁ దీసికొనిపోవవేని, నేను వారలవెంటఁ బోనైతినేని, యమలోకముపాలగుదును' అనెను. ఆసుమంత్రుఁడు చేమోడ్పు గీలించి కన్నీళ్లయురవడిచే మాటలు తొట్రుపడ అతికష్టమునఁ గౌసల్య నూఱడించుచు, 'నీకు దుఃఖమువలన శోకమును, రామునకే మగునోయను మోహమును, కలవరపాటును, కలిగియున్నవి. వానిని విడువుము. మఱి సంతాపమును మానుము. ఏలన, రాముఁడు కొంచెమైనను సంతాపములేక వనమున సుఖముగా నున్నాఁడు. లక్ష్మణుఁడును ధర్మము నెఱింగినవాఁడు గావున నింద్రియసుఖంబులం దగులక, వనమున రాముని పాదములకుఁ బరిచర్యలు సేయుచుఁ, బరలోకమును సాధనము సేయుచున్నాఁడు. సీతయు విజనంబగు వనమునం దయినను, ఇండ్లయందుంబోలె భయము లేక మిక్కిలి ప్రణయము గలిగి రామునియందే మనస్సు నెలకొల్పి సంతోషము నొందియున్నది. వనవాసదుఃఖ మేదిగాని యిసుమంతయైనను సీతకుఁ గలుగదు. కావున సీతయు వనవాసములకుఁ దగిన దనియే నాకుఁ దోఁచుచున్నది. సీత మున్నిచ్చట, నగరంపునుద్యానవనంబులలో క్రీడించుచుండునట్లే యిపుడు జనసంచారములేని యడవులయందును గ్రీడించుచున్నది. పూర్ణచంద్రునికి సాటి యగునెమ్మొగంబు గలిగిన యా పతివ్రత యాసుందరాంగి యాసీత రామునందు మనసు పొందుపడఁగా విజనంబగు వనమునందుఁ బసిబిడ్డవలె నాటలమరిగి దుఃఖమును బాటింపక యాడుకొనుచున్నది. మఱి రాముండే దానికి ఎలదోఁట. వనమందుండినను రామునియందు వర్తించుటచే దుఃఖము తెలియకున్నది. సీతహృదయమును ప్రాణములును రాముని యధీనములు. కావున రాముఁడు లేనిచో ఈ యయోధ్య యాబిడకు వనప్రాయమేయగు. మార్గమునఁ బోవునపుడు సీత అయోధ్యకుఁ గోసుదూరమున విహరించుచుండునట్లు, సంతోషంబున గ్రామములను పట్టణములను నానావిధములగు వృక్షములను జూచి రామునినో లేక లక్ష్మణునినో యడుగును, అడిగి వానిపేళ్లను దెలిసికొనును. * ఈ చెప్పినంత మాత్రమే నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆయమ కైకేయిని

*ఇందులకు 'ఇదమేవస్మరామ్యస్యాః సహసైవోపజల్పితమ్। కైకేయీసంశ్రితంవాక్యం నేదానీం ప్రతిభాతిమా॥ ధ్వంసయిత్వాతు తద్వాక్యం ప్రమాదాత్పర్యుపస్థితమ్ । హ్లాదనం వచనం సూతో దేవ్యా మధుర మబ్రవీత్॥' అని మూలము, అయోధ్యను వెడలివచ్చునపుడు కైకనుగుఱించి సీత పరుష

గుఱించి తటాలున నొకమాట చెప్పినది. అది నాకిప్పుడు జ్ఞప్తికి రాకున్నది' అని సుమంత్రుఁడు ప్రమాదమున కుత్తుక దాఁటి వెడవికి వచ్చిన యా సీత వాక్యము

ముగా చెప్పినయొకమాటనుసూతుఁడు కౌసల్యకుప్రియముగానుండునని చెప్పఁబూని తిరుగ దానినివిని రేని యావృద్ధులు ప్రాణములం దాశవదలుదురు. గాన దానిని చెప్పఁదగదని తలఁచి దానిని మఱచినట్లు నెపము పన్ని చెప్పక విడుచుచున్నాఁడు (ఇదమేవ స్మరామి)దీనినిమాత్రమేస్మరించుచున్నాను. సీత చెప్పినమాట లింతవఱకే నాకు జ్ఞప్తికివచ్చుచున్నవి. కాని, (కైకేయీసంశ్రితం) కైకనుద్దేశించి, (సహసా ఏవ ఉపజల్పితం) తటాలున సీత చెప్పినదైన, వాక్యం)వాక్యము-(మా ప్రతి)నాకు, (నఇదానీం భాతి)ఇపుడుతోఁచకున్నది. అని చెప్పి,(ప్రమాదాత్ పర్యుపస్థితమ్)పరాకున పెదవికివచ్చిన(తద్వాక్యం)ఆసీతవాక్యమును, (ధ్వంసయిత్వా) జాఱవిడిచి,(దేవ్యాః) కౌసల్యకు, (హ్లాదనం)సంతోషకరమైనదియు,(మధురం) తీయనిదియునగు, (వచనం) వచనమును, (అబ్రవీత్) చెప్పెను. ఇందు సీతమాటను సూతుఁడు(కైకేయీసంశ్రితం)కైకేయినిగూర్చి. అని చెప్ప మొదలుపెట్టినాఁడు.(సహసైవోపజల్పితమ్) తటాలునక్రమముదప్పి ఆబిడచెప్పుటయే అదితనస్మరణమునకు రాకుండుటకు హేతువని తెలిపినాఁడు. మరల స్మరించుకొనిచెప్పుమందురేమోయనితలంచి,(ఇదమేవస్మరామి)ఇంతవఱకుచెప్పినదిమాత్రమే నాకు జ్ఞప్తికివచ్చుచున్నది కాని తక్కినదిరాలేదు అని వారడుగుట కవకాశము లేకుండఁ జేసినాఁడు. (ఇదానీం)మీరిట్టిదుఃఖముపడుచుండుసమయమున నాకదిబుద్ధికిరాకున్నదన్నాఁడు. అది(ప్రమాదాత్ పర్యుపస్థితం) పరాకుచే ముందఱికివచ్చినదిగావున నే,(ధ్వంసయిత్వా) దానిని జాఱవిడిచినాఁడు. ఉపస్థితమైనయామాట తాపహేతువైనది గావున నే దానిని విడిచి,(హ్లాదనం) మనస్సున కింపు గూర్చునట్టి మాటను జెప్పఁబూనినాఁడని భావము. ఇచట నొకసంశయము కలుగుచున్నది. సీత తటాలున చెప్పిన మాట, కైకనుగూర్చిన నిందగానుండినను కౌసల్యకు తాపకరమగునేని అవశ్యము మఱుఁగుపఱుపందగినదే. కాని యామాట యెట్టిది ? అది ఫలానిదని చెప్పుటకు ప్రమాణమేమి కలదు? యని యడుగ వచ్చును. ఇట్టివాక్యమును కార్యవశమున మఱుఁగు చేయఁబడినను నది మఱియేదే నొకచోట వివరింపనియెడల సర్వజ్ఞుఁడైయుండియు కవి దానిని ఇది యని యెట్లు అనుసంధించును ? అనుసంధింపకయే యుండునుగదా. మఱియొకచోట చెప్పియుండుటనుబట్టియే యిచట సూక్ష్మముగా సూచించి విడిచినాఁడు. ఎట్లన—సూతుఁడు పరాకునఁ జెప్పవచ్చి, కౌసల్యాదశరథులకు సంతాపము కలిగించునని జాఱవిడిచిన కైకేయీవిషయక సీతావాక్యమును కవి మీఁద వెలిపుచ్చుచున్నాఁడు. యుద్ధకాండమున సీతనుగూర్చి 'విజగర్హేత్ర కైకేయీం క్రోశన్తీ కురరీయథా' 'కురరివలె నేడ్చుచు ఈ విషయమున కైకను నిందించినది' అనిచెప్పి యాకైకనుగూర్చి సీతచెప్పినమాట నే 'సకామాభవ కైకేయి హతోఽయంకులనన్దనః' 'కులమునకానందకు గూర్చునితఁడు హతుఁడైనాఁడు. కైకా! నీ కోర్కి యీడేఱినదానవగుము' అన్నదని చెప్పినాఁడు ఆకైకకోర్కియెద్దీ? కైకకు రాజ్యము లభించుటచేత నే కోరికి సిద్ధించినదయ్యెను. కాన రాముని నడవికిఁ బంపనక్కఱలేదు. అయినను రాముని వెడల నంపినదిగాన యందులకు నామె యభిప్రాయ మేమనఁగా, రాముని ఊరు వెడలఁ బంపిన యెడల నతనిని క్షణకాలమైనను ఎడబాయనేరనిది గావున సీతగూడ నతనిని వెంబడించి పోవును. ఆబిడ లోకోత్తరసుందరి గావున నడవిలో ఎవఁడైనను హరించి కొనిపోవును. ఆబిడ యట్లు అపహృత కాఁగా రాముఁడు తనంతట నశించును. అప్పుడు రాజ్యము నాకు మిక్కిలి స్థిరముగ కుదిరినట్టి దగును. అట్లు రాముఁడు నశింపకున్నయెడల జను లందఱును రామగుణపరవశులు గావున అతనికి

జాఱవిడిచి, కౌసల్యాదేవికి మునుపు చెప్పినవానివలె మనస్సున కింపు గూర్చుచు మధురంబుగా నుండునట్లు 'మిక్కిలి దారినడచినను, గాలి యురవడిగా వీచినను, పులులు మొదలగువానిని జూచి కలఁతనొందినను ఎండసోఁకినను చంద్రకిరణములవలె దులకించు సీతమేనికాంతి మాఱుపడకున్నది. తామరపూవునకు సాటియై నిండుచందురునివంటికాంతి దళుక్కొత్తుచున్న యీమంజులవాణి మొగము దారి నడచుట మొదలగువానివలనఁ దనవన్నె తఱుఁగకున్నది. ఆబిడయడుగులు లత్తుక రసమువలె నెఱ్ఱనికాంతి దొలఁకుచుండును. అవి యిప్పుడు లత్తుక పూఁత మాలి యున్నను, అడవిలో తిరుగుచున్నపుడును, దామరమొగ్గలవలె నిగ్గునూపుచుండును.

---

విధేయు లగుదురు. అప్పుడు రాజ్యము లభించినదయ్యును ప్రయోజనము గలుగదు. కావున రాముఁడు నశించుటకై ఊరు వెడలనంపవలయునని కైకకోర్కిగా సీత యభిప్రాయపడినది. కావుననే 'సకామాభవ కైకేయి హతోఽయంకులనన్దనః' అన్నది. సీతచెప్పినయీయభిప్రాయము నేరాముఁడును అరణ్యకాండమున 'కచ్చిత్సకామా కైకేయీ సుఖితా సా భవిష్యతి । యా నతుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ' 'తనకొడుకు విషయమై దూరదృష్టిగలిగినది కావున రాజ్యము లభించుటతో తృప్తినొందని కైకేయి యిప్పుడు కోర్కి యీడేఱి సుఖించినదగునేకదా'? అని రాజ్యముతో తృప్తి నొందక తనవినాశమునుగూడ కోరినదని సూచించినాఁడు. మఱియొకచోట 'యదభిప్రేత మస్మాసు ప్రియం వరవృతం చ యత్ । కైకేయ్యాస్తత్సుసంవృత్తం క్షిప్రమద్యైవ లక్ష్మణ' 'కైక మనవిషయమునం దభిప్రాయపడినదియు ఆయమకు ప్రియమైనదియు ఆమె వరముగా వేఁడినదియు ఏదియోయది యామెకు నిప్పుడు శీఘ్రముగానే మిక్కిలి యొడఁగూడినది' అని తమ వినాశమును అభిప్రాయమందుంచుకొనియె తమ్మును అడవికిఁ బంపునట్లు వరము వేఁడినదని సూచించినాఁడు. ఈ యభిప్రాయమునే సీతకును గలిగియున్నదని సుమంత్రుఁడు పూర్వసర్గముకడపట సూచించియున్నాఁడు. ఎట్లన 'జానకీతు మహారాజ నిశ్శ్వసన్తీ తపస్వినీ । భూతోపహతచిత్తేవ విష్ఠితా విస్మితా స్థితా। అదృష్టపూర్వవ్యసనా రాజపుత్రీ యశస్వినీ । తేన దుఃఖేన రుదతీ నైవ మాం కించిదబ్రవీత్ । ఉద్వీక్షమాణా భర్తారం ముఖేన పరిశుష్యతా । ముమోచ సహసా బాష్పం మాం ప్రయాన్తముదీక్ష్యసా' 'మహారాజా! తపస్వినియగుసీత నిట్టూర్పులు పుచ్చుచు భూతము పట్టినదానివలె నుండి నివ్వెఱపడియుండెను. యశస్వినియగు నా రాజపుత్రి యిదివఱకెన్నఁడును దుఃఖమెఱుఁగనిది; ఆదుఃఖముచేత నేడ్చుచు నన్నుఁజూచి యేదిగాని చెప్పినదికాదు. మొగము శోషిల్లఁగా భర్త మొగమును జూచుచు పయనమగుచున్న నన్నును జూచి యాబిడ తటాలున కన్నీళ్లు విడిచినది.' ఇందు రోదనము, మాటాడకుండుట, శోషిల్లుచున్న మొగముతో భర్తనుజూచుట, మరల సుమంత్రునిఁ జూచుట, బాష్పముల విడుచుట, అనెడివానిని సీతచేయుటకు కారణము పూర్వోక్తమైనయభిప్రాయ మామెతలంపునకు వచ్చుటయే. కావుననే యామె (విష్ఠితా) స్తంభించినదయ్యెను. అనఁగా భర్త మొగమును చూచుటచే 'ఇది చెప్పను నోరాడదే' యని భావమును; బాష్పములను విడుచుటచేతను సూతుని చూచుటచేతను 'అత్తగారికిది చెప్పి పుచ్చరానిది' యను భావమును వ్యంజితములగుచున్నవి. ఆసర్గమునందు సీత పరాకునఁ జెప్పినదని దానిని మఱుఁగుపఱచినాఁడు. ఈసర్గమునందు తానె పరాకుపడి చెప్పవచ్చి యొక నెపమున చెప్పక యుడిగినాఁడని తెలియునని.'

* అడవిలో నడుచునప్పుడును, ఆరమణి, భూషణములందలి యాశచే నందియలు మొదలగునవి దాల్చి యాయందెలఘలంఘలధ్వనులకులుకు ననుకరించు దానివలె సొగసుగా నడచిపోవుచున్నది. సీత రామునిబుజములమాటు నండగొన్నది గావున, చూచినంతనే దిగులుగొలుపు పెనురూపముగల యేనుఁగునో సింగమునో యంత కన్న క్రూరమగు పులినో చూచిననుగాని, ఆసింహాదులు లే కుండినప్పటికిని దిగులు బుట్టించునట్టి వనమునం దుండిననుగాని, భయమును దెచ్చుకొనదు. పితృవచనపరిపాలనరూపమైన యీచరితము లోకమునందు శాశ్వతముగా విలసిల్లుచుండగలదు. కావున ఆ సీతారామలక్ష్మణులను గూర్చి కాని, మనలం గూర్చి కాని, మహారాజుం గూర్చి కాని, దుఃఖింపఁదగదు. వారు శోకములు దిగఁద్రావి మనంబుల ముదంబు పొదల, మహర్షులు ప్రవర్తించుమార్గమును దృఢముగాఁ గయికొని, వన్యంబులగు ఫలములను దినుచు, వనంబునం దిరుగుచు, తండ్రి గావించిన శుభప్రతిజ్ఞను బరిపాలించుచున్నారు' అనెను. కౌసల్యాదేవి పుత్రశోకమున పురపురఁ బొక్కుచుండుటచే, సుమంత్రుఁ డట్లు మిక్కిలియుక్తములగు వచనముల నెంత యూఱడించినను 'నాగారామా! నా పట్టీ! రామా!' యని విడువక యఱచుచునే యుండెను. ఇది యఱువదియవ సర్గము.



దశరథునిఁజూచి కౌసల్య రాము నడవికిఁ బంపుటఁజెప్పి విలపించుట, రా జది విని మూర్ఛిలుట.

ధార్మికుండును పరులను రంజించువారలయందు మేలుబంతియు నైన రాముఁడు వనమునకుఁ బోవఁగా, కౌసల్య మిక్కిలియుఁ బొక్కుచు రోదనము సేయుచు పెనిమిటిం జూచి 'రఘువంశ్యుఁడగుదశరథుడు దయాళుఁడు, మహాదాత, ప్రియవాది'యను నీ పెనుకీర్తి, ముల్లోకంబులను బ్రసిద్ధిగాంచియున్నను నేమి? అంతకన్నను అపకీర్తికరమగు గార్యమును జేసితివే. రాజోత్తమా! నీకు మహాకీర్తిముల్లోకములందును నెగడుచున్నను, పిన్ననాఁటనుండి సుఖముగా బెరిఁగిన యాకొడుకులును సీతయు నిప్పుడు దుఃఖముపాలై వనమునందలికడగండ్ల నెట్లు సహింపఁగలరు? ఇంచుమించుగా యౌవనమునడిమిదశను బ్రకాశించుచున్న యీ సుకుమారి, యీ సుఖోచిత, యీసీత అడవియందలియుష్ణమును శీతమును ఎట్లు దాళఁగలదు? విశాలనేత్ర యగు సీత యిచట నింతవఱకు మంచి నంజుకొనుపదార్థములతోఁ గూడిన మేలయిన యాహారము భుజించుచుండి, యిఁక నడవిలోని నివ్వరియన్నము నెట్టు భుజింపఁగలదు? అనిందితయగు నాబిడ, మంగళకరంబగు గీతవాద్యధ్వనిని విను

* సీత రామునితోఁ గూడఁ బోవుటయందలి యాసక్తిచేత దారినడచుటకు తొందరగానుండు భూషణములను దీసివైచిన యిప్పుడును అందెలు ఘలఘలమని మ్రోగుచుఁబోవునప్పటి విలాసమే గలదై తులతులనడలం బోవుచుండును' అని యర్థాంతరము.

చుండి యిఁక నడవులందుఁ గ్రూరములగు సింహాదిమృగములభయంకరధ్వని నెట్లు వినఁగలదు. ఇంద్రధ్వజమువలె పరమాభ్యుదయముగాఁ బొడసూపుమహాభుజుఁడును మహాబలుఁడును నగు రాముఁడు, ఇనుపగుదియవంటి తనబుజమునే తలగడఁగా జేసికొని యడవిలో నెక్కడఁ బరున్నాఁడో! తామరరేకులవంటివన్నె గలిగి, మొఱపుగులుకు నెఱికురులతోఁ గూడి, కమ్మని తమ్మివాసనలు బుగులుకొన, తామరలవంటి కన్నులచెన్నుఁజూపు రాముని మేలయిన నెమ్మొగమును ఎప్పుడు చూడఁగలను? రామునిఁ గన్నారఁ జూడకున్నను నామనసు వేయిపఱియలుగాఁ బగులకున్నదే! కావున నిది వజ్రమందలి సారము నెత్తి చేయఁబడిన దనుటకు సందేహము లేదు. సుఖార్హులగు నా చుట్టములు, ఆసీతా రామలక్ష్మణులు, నీవు తిరస్కరింపఁగా, పురమును దిగవిడిచి దీనులై యడవిని ద్రిమ్మరుచున్నారే! ఇది మిక్కిలి దయమాలిన కార్యము. *రాముఁడు పదునైదవయేఁట మరలి యిచ్చటికి వచ్చినను భరతుఁడు తనచేతనున్న రాజ్యమును బొక్కసమును వదలుననుట నాకుఁ దోఁపకున్నది. బ్రాహ్మణులు కొందఱు శ్రాద్ధకర్మము సేయునపుడు, మిక్కిలి యుత్తములైన బ్రాహ్మణులున్నను, తామిచ్చు దక్షిణాదులు తమవారికే చేరవలయునని, యపుడు ఆ యుత్తములను విడిచి తమకు బంధువులగువారినే భుజింపఁజేసెదరుగదా. అట్లు శ్రాద్ధకర్మము ముగించినపిదప ఆ బ్రాహ్మణోత్తములను నిష్టపంక్తిలో భోజనంబిడఁ గోరెదరు. వారిలో గుణవంతులును విద్వాంసులును దేవతాసములునగు బ్రాహ్మణోత్తము లయినవారు, అట్లు తమ్ము విడిచి గుణహీనులకు శ్రాద్ధభోజనము పెట్టి, యిష్టపంక్తిలో తమకు అమృతమిడినను, దానికెంతమాత్రము సమ్మతింపరు. మొదట భుజించినవారు బ్రాహ్మణులేయైనను పిదపటి బ్రాహ్మణోత్తములు, ఆఁబోతులు తమకొమ్ములను నఱుకుటసహింపఁజాలనియట్లు, వారు భుజించినపిదప తాముభోజనముసేయసమ్మతింపఁజాలరు. రాజా! ఇట్లు పిన్నయగు తమ్మునిచే ననుభవింపఁబడినరాజ్యము పెద్దవాఁడును గుణములందు శ్రేష్ఠుఁడునగు రాముఁ డేల నిరాకరింపఁడు? పెద్దపులి మఱియొకమృగము దిని మిగిలినభక్ష్యమును దినదు. వాఁడును పురుషులలో పెద్దపులివంటివాఁడు గనుక పరుఁ డాస్వాదించినదానిని గొప్పగా నెన్నఁడు. హవిస్సు, ఘృతము, పురోడాశములు, కుశలును చంద్ర మొదలగువానితోఁ జేయఁబడిన యూపస్తంభములును, ఒకయాగమున వినియోగింపఁబడెనేని మరలవానినే యింకొకయాగంబున వినియోగింపరు. అట్లే రాముఁడు మరల నీరాజ్యము తనకు వచ్చినను, సారము గ్రహింపఁబడిన మద్యమువలె, మఱియొకరిచే త్రాఁగఁబడినసోమపానముగలయాగమువలె, దాని నెంతమాత్రము నిచ్చగింపఁజాలఁడు. రాముఁడు మిక్కిలి కోపించియుండునేని యట్టితిరస్కారము వాఁడుపొందియే యుండఁడు. వాఁడుకోపించినయెడల

* 'రాముఁడొకవేళ పదునైదవయేఁట మరలి యిక్కడికి వచ్చినను, ఈరాజ్యమును కోశమును భరతునిచే అనుభవింపఁబడినదిగావున, అట్టివానిని దానువదలునేకాని కయికొనఁడు' అని యర్థాంతరము

తీక్ష్ణములగు వానిబాణములు మందరపర్వతమును బ్రద్దలు వాపునే. తానిట్టిమహాత్ముఁడయ్యును వాఁడు నిన్నుమాత్రము తండ్రి యనుగౌరవమునుబట్టి చంపఁబూనఁడు. రాముఁడు కోపమునొందెనా చంద్రసూర్యులతోను గ్రహనక్షత్రములతోను గూడినయాకాశమునుగాని స్వర్గమునుగాని గూలఁద్రోయఁజాలును. వందలకొలఁది పర్వతములతోఁ గూడినభూమండలము నంతయు కలఁచిపుచ్చి యరికట్టనేర్చును. అట్టి సమర్థుఁడు నిన్నుమాత్ర మతిక్రమింపకున్నాఁడు బలవంతమగు పెద్దపులి తనతోఁకను తాఁకుటయు సహింపనట్లు, బలవంతుఁడగు రాముఁ డిట్టియవమానమును గొంచెమైనను సహింపఁడు. లోకము లన్నియు మహాయుద్ధంబున నొక్కటిగాఁ గూడివచ్చి తాఁకినను రామునకు భయము కలిగింపఁజాలవు. కాన, వాఁడు పౌరుషము మాలిపోయినవాఁడు గాఁడు. మఱి ధర్మాత్ముఁడు గావున అధర్మమార్గమున వర్తించు లోకమును ధర్మంబునఁ బ్రవర్తింపఁజేయుచున్నవాఁడు. కావుననే ధర్మము తప్పరాదని పోయినాఁడు. ఓయీ! మహావీర్యవంతుఁడగు నామహాబాహుఁడు, యుగాంతకాలుఁడు పంచమహాభూతములను దహించునట్లు, బంగారు మయములగు బాణముల వలన సముద్రమునైనను దహించునుజుమా! అట్టి యవాఙ్మనసగోచరమగు పరాక్రమము గలిగి సింహమువలె బలవంతుఁడై వృషభమువంటి విఱివి కన్నులతో నొప్పునాపురుషలలాముని, చేప తనపిల్లం జంపునట్లు తండ్రియే తనంతఁజంపినాఁడు. ధర్మపరాయణుఁడగు నీపుత్త్రుని అడవికి వెడలంబంపితివే? ఇట్టినీకు ద్విజు లాచరించునదియు శాస్త్రవిహితము నైనదియునగు సనాతనధర్మము గలదా? నినుబోటి కది యెట్లు గలుగును? రాజా! స్త్రీకిముఖ్యమైన మొదటిదిక్కు పెనిమిటి, రెండవదికొడుకు, మూఁడవది జ్ఞాతులు, ఇఁక నాలవగతియగుస్వాతంత్ర్యము ఈలోకముననేలేదు. ఆ మూఁడుగతులందును, మొదటిదగు నీవు నాసతికి లోనైనవాఁడవు గావున నాకు లేనట్టే. రెండవ గతియగు రాముఁడన్ననో యడవిపాలయినాఁడు. భర్తగలదానను గాన నిన్నువిడిచి రామునితో నడవికిఁబోవఁ దలంపరాదు. మఱినాకు జ్ఞాతులుదవ్వుల నుండుటచే, వారును లేనట్టే. అన్నివిధముల నీవు నన్ను నశింపఁజేసితివి. నన్నే కాదు. ఈ దేశమును ఇతరరాష్ట్రముల నంతయు నశింపఁజేసితివి. నీమంత్రులను నశింపఁ జేసితివి. నిన్నును నాశముచేసికొంటివి. నాకొడుకును నన్నును నాశముచేసితివి. పురజనులను నాశముచేసితివి. ఎవరెట్లయిన నేమి? నీగారాబుకొడుకుభరతుఁడును నీ గొనబుభార్య కైకయు, మిక్కిలిసొంపుగానున్నారు?" అనెను. ఇట్లుబెట్టిదముగా వినఁబడుచున్నయామాటను విని రాజు దుఃఖితుఁడై సొమ్మసిల్లెను. అంతఁ గొంతవడికిఁదెప్పిఱి ఆదుఃఖమునకుఁ గారణమైన యతని పూర్వపాపకృత్యమును దలఁచుకొని మరల శోకము నొందినవాఁడయ్యె. ఇది యఱువదియొకండవ సర్గము.



—{మూర్ఛదేఱినరాజును కౌసల్యయూరడించుట, కౌసల్య తాను బరుషవాక్యములాడినందులకు రాజును మన్నన వేఁడుట. శోకమున రాజు నిదురించుట.}—

ఇట్లు కౌసల్య మిక్కిలి దుఃఖితయై కోపంబునొంది పలికినపరుషవాక్యములు చెవులఁ గ్రుచ్చఁగా, రాజు దుఃఖితుఁడై యూరక చింతించెను. ఆపరంతపుఁడు అట్లు చింతించి యింద్రియములు గలఁగఁ బాఱ మూర్ఛిలి, యంత పెద్దయుంబ్రొద్దునకు మూర్ఛదేఱెను. అతఁడు తెలివినొందఁగానే వేఁడినిట్టూర్పులు విడుచుచు తనప్రక్క నున్న కౌసల్యనుజూచి మరల 'ఇట్టిదుఃఖమును బడుటకు నేను మున్నేమిపాపముచేసితినో'యని చింతింపసాఁగెను. అట్లతఁడు చింతించుచుండఁగా తాను లక్ష్యము తెలియకున్నను దానిశబ్దమును బట్టి గుఱిసేసి యేయువాఁడుగనుక, అట్టి కౌశలమువలన మున్ను తెలియక తాను జేసియున్నట్టి పాపకృత్యమిప్పుడతనికి స్ఫురించినదయ్యె. ఆ ప్రభువు మున్ను దాను చేసినపాపమువలనఁ గలిగినశోకమును, రామునింగూర్చినశోకమును, రెండును బైకొనఁగా మిక్కిలియుఁ బశ్చాత్తాపపడినవాఁడయ్యె. రాజు రెండు శోకంబులచేతను పురపురంబొక్కుచు, గడగడవడంకుచు, దలవాంచి, చేమోడ్పు గీలించి, అనుగ్రహముగోరుచు కౌసల్యంజూచి 'కౌసల్యా! నీవు నాయెడ ప్రసన్నురాలవగునట్లు వేఁడెద. ఇదిగో నీకుఁజేతులు మొగిడ్చితిని. నీవు పగవారియందుం గూడ మిక్కిలి దయసూపుదానవు. మంచిమనస్సుగలదానవు. దేవీ! ధర్మమును పరామర్శించు నినుబోటి స్త్రీలకు గుణవంతుఁడైనను గుణహీనుఁడైనను పెనిమిటియే ప్రత్యక్షదైవముగదా! అట్టిపతిదైవతయగునీవు, ఎల్లప్పుడును ధర్మమునందేయాసక్తి గలదానవు. లోకమునందలి యెక్కువతక్కువలు కనుఁగొన్నదానవు. ఇట్టినీవు నీకెంత దుఃఖము కలిగియున్నను నన్ను మిక్కిలి దుఃఖితుఁడ నగునట్లు ఇట్టి యప్రియములాడఁదగదు' అనెను. రాజు దీనుఁడై జాలిపుట్టునట్లు చెప్పిన యాపలుకులు విని కౌసల్య, మేడలపైనుండి వాననీళ్లు క్రిందికివచ్చుటకై మ్రానుమొదలగు వానితో రచించిన జలమార్గము క్రొత్తవాననీళ్లను జలజలగార్చునట్లు, కన్నీళ్లు విడిచెను. ఆకౌసల్య 'పతి నిట్లాడితినే' యని ధర్మమునకు భయపడి యేడ్చుచు రాజు చేమోడ్పును తామరయుంబోలె చేతులంబట్టి శిరముపై నిడుకొని సంభ్రమమునఁ దొట్రుపడు పలుకులతో 'దేవా! ప్రసన్నుండవగుము. నిన్ను తలసోఁక నేలంబడి మ్రొక్కి బతిమాలుచున్నాను. భర్తవగు నీవు నన్ను యాచించునట్లు చేసికొంటిని, కాన పాపిష్ఠనై పాడయితిని. కాఁబట్టి నేను నీకు దాసివలెఁ జక్కఁగా ప్రహరింపదగినదిగానా! వీరాగ్రణీ! కొనియాడఁదగినట్టి బుద్ధిమంతుఁడగు భర్త తన్ను మిక్కిలి వేఁడికొని కలఁకదేర్చునట్లు ఎవ్వతి గావించుకొనునో యాస్త్రీ రెండులోకములకునుగాదు సుమీ. ధర్మజ్ఞా! నేనుధర్మము నెఱుఁగుదును. నీవు సత్యవాది యనియు నెఱుఁగుదును. అయినను పుత్రశోకమునం బీడితనై ముందు వెనుకఁ జూడక యేమో తగనిమాట నిన్నాడితిని. ఇంతేకాన మన్నింపుము. శోకముచే ధైర్యమునశించును,

శోకమున విద్యయుచెడును. శోకమన్నిటిని దూలించునుగావున శోకమువంటి శత్రు వెవ్వఁడునులేఁడు. పగవానిచేతఁ దటాలున పడినదెబ్బనేనియు సహింపవచ్చును. అట్లే తటాలున శోకముపైకొనెనా, అదియెంత మిక్కిలి చుల్కగానున్నను దానిని సహింపఁ దరముగాదు. (వీరా! ధర్మజ్ఞులును వేదవిదులును, ధర్మమునుగుఱించి యించుకైన సందేహములేక తెలిసియున్న వారునునగు మహర్షులుగూడ శోకము మనస్సు మిక్కిలికలఁపగా, తెలివితప్పెదరు) రాముఁడు వనవాసము చేయ మొదలు పెట్టి యిప్పటికి * అయిదు రాత్రులైనవి. ఆయైదును దుఃఖమున సొంపు పెంపు

* తమసాతీరమున మొదటిరాత్రి, గంగాతీరమున రెండవది; వృక్షమూలమున మూఁడవది; ప్రయాగను నాలవది; యమునాతీరమున ఐదవది; ఆఱవనాఁడు, సుమంత్రుఁడు, రాముఁడు చిత్రకూటమునకుఁ బోఁగలఁడని తెలిసి నాఁటిసాయంకాలమునకు అయోధ్యను చేరినాఁడు. కనుక నింతవఱకు అయిదురాత్రులు లెక్కింపఁబడినవని కొందఱిమతము. మఱికొందఱు గంగను దాఁటువఱకును వనవాసముగా నేరదు గావునదానిని దాఁటినపిదప వృక్షమూలమునను భరద్వాజాశ్రమమునను యమునాతీరమునను చిత్రకూటమునను వరుసగా నాలుగురాత్రులు గడచినవి. ఆ నాలుగవ రాత్రియే సుమంత్రుఁడు బయలుదేఱినాఁడు. ఐదవరాత్రి కౌసల్య యీమాట చెప్పినది గావున 'పఞ్చరాత్రోఽద్యగణ్యతే' అనుచో 'అద్య' 'ఇప్పటికి' అన్నందులకు ఇట్లు గ్రహించుటే సరసముగానున్నదని చెప్పెదరు.

దీనివ్యవస్థ యెట్లనః—౫౪ వ సర్గమునందు 'భరద్వాజాభిగమనం ప్రయాగేచ సహాసనమ్। ఆగిరేర్గమనం తేషాం తత్రస్థైరభిలక్షితమ్' భరద్వాజాశ్రమమునకుఁ బోవుట, ప్రయాగయందు ఆమునితోఁ గూడ నుండుట, చిత్రకూటపర్వతమునకుఁ బోవుటవఱకును ఆగుహుని పురిలోని చారులచే తెలిసినది', అనియున్నది. రాముఁడు అయోధ్యను విడిచినయాఱవదినము చిత్రకూటమును జేరెను. అక్కడనుండి చారులు ఏడవనాఁడో ఎనిమిదవనాఁడో శృంగిబేరమందలి సుమంత్రునియొద్దకు వచ్చి రామవృత్తాంతము దెలిపిరి. సుమంత్రుఁడును అచ్చటనుండి బయలుదేఱి 'తతః సాయాహ్నసమయే తృతీయేఽహని సారథిః। అయోధ్యాం సమనుప్రాప్య' అని మూఁడవనాఁటిసాయంకాలము అయోధ్యను చేరినాఁడు, ఇప్పటికి దాదాపుగా పదిదినములగుచున్నవి. అయిదురాత్రులైన దనుట యెట్లు? అన్నచో, 'ఆగిరేర్గమనమ్' అనుటకు 'చిత్రకూటగిరికి పోవుటవఱకు' అనక 'ఆగిరికిపోవుటకై పూనియుండువఱకు' అని గ్రహించునది. అప్పుడు చారులు భరద్వాజాశ్రమముననే రాముఁడు చిత్రకూటమునకు బోవఁ బూనియుండుటను దెలిసి యచ్చటనుండియే సుమంత్రునికడకు బయలుదేఱిపోయిరని తెలియునది. 'తతః సాయాహ్నసమయే తృతీయేఽహని' అనుటకు 'మూఁడవదినముసాయంకాలము' అనక 'ఆదినము మూఁడవభాగమైన సాయంకాలము' అని గ్రహింపవలయును. సుమంత్రుఁడు శృంగిబేరపురమున 'దివసాన్ బహూన్' బహుదినములుండె ననుటను మూఁడుదినము లుండుటగా గ్రహించునది ఈమూఁడుదినములతో తమసానదితీరమున నుండిన దినమునుగూడ చేర్చుకొనఁగా అయోధ్యను విడిచి నాలుగుదినములగుచున్నవి. నాలుగవనాఁడు రాముఁడు భరద్వాజాశ్రమము సేరుటచే చారు లచ్చట రామునివృత్తాంతము దెలిసికొని చక్కనిదారిని శీఘ్రంబవలు నడచి మఱునాఁడు సుమంత్రుని! ఆవృత్తాంతమును తెలుపఁగా, వాఁడును ఆయైదవనాఁడే బయలుదేఱి నాటిసాయంకాలను వేగముగ అయోధ్యనుజేరినాఁడు. ఆయైదవనాటిరాత్రియే కౌసల్య 'పఞ్చరాత్రోఽద్యగణ్యతే' అని 'అద్య' శబ్దమునుంచి చెప్పినదని తెలియునది, అని గోవిందరాజులు,

దూలియున్న నాకు అయిదేండ్లకు సాటిగానున్నవి. వానిని దలంచుకొను చుండఁగానే నదీవేగముచే సముద్రజలము వృద్ధిఁబొందునట్లు, నామనంబున, ఆదుఃఖము వృద్ధినొందుచున్నది' అనెను. ఇట్లు కౌసల్య యూఱట గలిగించునట్టి మంచిమాటలు చెప్పుచుండఁగానే సూర్యుఁ డస్తమించెను. రాత్రియును వచ్చెను. రా జట్లు కౌసల్యాదేవి శుభవాక్యములం గలఁకదేఱి మిక్కిలి దుఃఖాక్రాంతుఁడై యున్నను, నిద్రాపరవశుఁ డయ్యెను. ఇది యఱువదిరెండవ సర్గము.





దశరథుఁడు కౌసల్యతోఁ దాను బూర్వము సరయూనదికడ నొకఋషి కుమారుని గజ మని తలఁచి చంపినవృత్తాంతమును చెప్పుట.

దశరథభూనాథుఁ డంత గడియసేపటికి మేలుకని దుఃఖంబున మనస్సు తల్లడిల్లఁగా చింతాక్రాంతుఁడయ్యెను. దేవేంద్రసదృశుఁడైన యాదశరథుఁడు రామలక్ష్మణుల వనమునకుఁ బంపుటవలన, సూర్యుఁడు రాహువుచే గ్రసింపఁబడినట్లు, మిక్కిలి యుపద్రవము నొందెను. రాముఁడు భార్యతోఁగూడి వనమునకుఁబోఁగానా కోసలాధిపతి దశరథుఁడు తాను దొల్లిగావించిన పాపములను దలఁచుకొనినల్లనిగడకన్నులుగల కౌసల్యకుఁ జెప్పంగోరినవాఁడయ్యె. రాము నడవికిఁబంపిన పిమ్మట, ఆ దశరథమహారాజు ఆఱవరాత్రిని అర్ధరాత్రమునందు మున్ను దాను జేసిన పాపకృత్యమును దలంచుకొనుచుండెను. అట్లు పుత్రశోకంబునం బొక్కుచున్న యారాజు తాను తొల్లి చేసినదుష్కృత్యములం దలంచుకొని తనవలెనే పుత్రదుఃఖమునంబొక్కుచున్న కౌసల్యం జూచి 'కల్యాణీ! ఎవఁడేని యితరునకు మంచిదో చెడ్డదో యేకర్మమునుజేయునో ఆకర్మమువలన ఆపరునికిఁ గలుగునట్టి ఫలమునే తానును బొందును. ఎవ్వఁడు కార్యములను జేయనారంభించునపుడు వానిఫలముల యెక్కువ తక్కువలను గాని, ఆ ఫలములవలని సుఖమును దుఃఖమునుగాని, తెలియఁడో వాఁడే మూఢుఁడని చెప్పఁబడును. ఎవఁడేని ఒకఁడు, పూవెంతో ఫలమును అంతేయుండునని, పువ్వునుజూచి ఫలమునందు పేరాసగొన్నవాఁడై, మామిడిపువ్వ

రాముఁడు ఆఱవదినము చిత్రకూటమును జేరెను గదా. సుమంత్రుఁగును ఆఱవనాఁడే అయోధ్యను జేరును. ఎట్లన, రాముఁడు అయోధ్యను విడిచిన నాలుగవనాఁడు భరద్వాజాశ్రమము జేరెను. ఆనాఁడే చారులు రామవృత్తాంతమును తెలిసికొని వచ్చి సుమంత్రునికి తెలుపఁగా వాఁడును ఆనాలుగవనాఁడే బయలుదేఱి 'తతః సాయాహ్నసమయే తృతీయేఽహని' అన్నట్లు ఆదినముతోఁగూడ మూఁడవనాఁటి సాయంకాలము-అనఁగా ఆఱవనాటిసాయంకాలము అయోధ్యను జేరినాఁడు. ఇంతకు మునుపే అయిదురాత్రులు అయినవి. గనుక కౌసల్య పంచరాత్రము లన్నదని తెలియునది అని మహేశ్వర తీర్థులు —ఇందు తతః సాయాహ్నసమయే తృతీయేఽహని, అనుటకు గోవిందరాజులు-ఆనాఁటి మూఁడవభాగమైన సాయంకాల మనియు, మహేశ్వరతీర్థులు మూఁడవనాఁటి సాయంకాలమనియు నర్థములు సేయుట తెలియునది.

చిన్నదియు రంగులేనిదియుఁ గావున నాచెట్టుఫలము చిన్నదిగానే యుండుననియు, పెద్దదియై తద్దయురంగుగల మోదుగుపువ్వులనుజూచి దానిచెట్లను ఫలము పెద్దదిగా నుండుననియు నెన్ని మామితోఁపును నఱికి మోదుగుచెట్లను నీళ్లుపోసి పెంచునేని వాఁడు ఫలముకలుగు కాలమున మోదుగుచెట్లయందు దానెదురుచూచిన మహా ఫలము గానక దుఃఖమునొందును. ఎవ్వఁడు రాఁగలఫలమును దెలియక మనస్సునకుఁ దోఁచినను కార్యములను జేయుచుండునో వాఁడు మామిడులనఱికి మోదుగుల నీళ్లు పోసి పెంచినవానివలె ఫలకాలములందు దుఃఖము నొందును. రాముని నభిషేకింపక యడవికిఁ బంపి కైకకుఁ బ్రియము సేసినట్టి నేను మామితోఁపులను నఱికి మోదుగు లను నీళ్లుపోసి పెంచినట్టి వాఁడనైతిని. కాఁబట్టి నేనిట్లు బుద్ధిచెడి, ఫలప్రాప్తికాల మున, అట్టి యశుభకార్యము చేసినందులకు ఫలముగా రామునిఁ బాసి, పిదప వానిని విడిచినఫల మనుభవించుచు దుఃఖించుచున్నాను. కౌసల్యా! నేను కుమారదశ యందు మంచివిలుకాఁడనై 'ఉపసివాఁడు శబ్దమే గుఱిగాఁగొని వేయువాఁ' డని ప్రసిద్ధిగాంచి యుంటిని. ఆపసితనమునం దీపాపమును చేసితిని. కర్మఫలము లోకాంతరముననో మఱియితరజన్మముననో కలుగుటగలదు. నాకో, లోకమున బాలుఁడు, అజ్ఞానముచేతను, విషముదినెనేని తోడనే వాని కది దుఃఖకరమగునట్లు నాయంతటఁ దెలియక చేసికొన్నపాపము ఫలముగా ఈదుఃఖ మిదిగో తోడనే కలిగినది. సామాన్యుఁడొకఁడు పుష్పములవలెనే ఫలము లుండునని తలఁచి మోదుగుపువ్వులు మంచివిగా నుండుటఁజూచి వానిఫలములును మంచివిగా నుండు నని భ్రమసినట్లు నేనును మృగముల ధ్వనినే గుఱిగాఁబట్టి బాణమున వానిం జంపుటవలనిలోకఖ్యాతిం జూచి, దాని ఫలమును అట్లే లోకపూజ్యముగా నుండు నని భ్రమసి దానివలన గలుగఁగల యనర్థఫలము తెలియనైతిని. దేవీ! నీకప్పటికి పెండ్లిగాలేదు. మాతండ్రియు నుండెను. నే నప్పుడు యువరాజుగా నుంటిని. అంత, మదమును కామమును వృద్ధిఁబొందించునట్టి వర్షాకాలము వచ్చినది. సూర్యుఁడు నిజకిరణములచే భూమియందలి రసములను గ్రహించి జగమును తపింపఁజేసి ప్రేత ములు తిరుగాడు భయదంపుదక్షిణదిశను బొందెను. అప్పుడు వేఁడిమి పోనుఁగుపడి మఱుఁగైనది. మేఘములు చల్లనై చూపట్టినవి. అంత కప్పలును చాతకపక్షులును నెమిళ్లును త్రుళ్లిక్రేళ్లుఱికినవి. పిట్టలు, ఱెక్కల పైభాగమంతయుఁ దడియుటచే స్నానములుచేసినట్లు చూపట్టుచు జోరనంగురియు వానకును వీచుచున్నగాలికిని కొనలల్లలాడుచున్న చెట్లపై తడిసినఱెక్కలతో నెట్లోకష్టమునఁ బోయిప్రాలినవి. మత్తిల్లినగజము, పడియును పడుచునున్న వర్షధారలచేఁ గప్పబడి యలలు లేక స్తంభించియున్న సముద్రమువలె విలసిల్లుచుండెను. జలప్రవాహములు తమంతట స్వచ్ఛములుగా నుండునవి యైనను తెల్లని యెఱ్ఱనిగైరికధాతువులఁ గూడుటఁజేసి, తెల్లగాను ఎఱ్ఱగాను గనుపట్టుచు కార్చిచ్చుచేఁ గలిగిన బూడిదతోడనుం గూడి

పలురంగులు గలపాములవలె కుటిలములై కొండలనుండి స్రవించినవి. (నీటివెల్లువలు తమంతట నిర్మలములైనను వర్షము గుఱియుటచే కలఁగి వండుగలసి యెఱ్ఱనై మెఱకపట్టులందుఁ గూడఁ బాఱుచుండినవి.) మిక్కిలియు సుఖముగూర్చు నకాలమున, నేను వేఁటాడవలయునని నిశ్చయించి విల్లును బాణములును దాల్చి రథమెక్కి సరయూనదిం గూర్చి పోయితిని. నేను, ఇంద్రియములను గెలువని మూఢుఁడను గావున, ఆయేట దిగి నీరుత్రాగెడిపట్టునందుఁ గాచియుండి నీళ్లుత్రావనందులకు వచ్చిన యెనుపోతునుగాని యేనుఁగునుగాని మఱివేఱు క్రూరమృగమునుగాని చంపఁగోరి యుంటిని. (ఆసరయూనదిగట్టున దానిరేవునందు నేను రాత్రి యేకతముగా విల్లు నెక్కుపెట్టుకొని యెచ్చరికతోనుంటిని. అచ్చట నేను మాటునఁ బొంచియుండ నాకు వినవచ్చినశబ్దమును గుఱిచేసి యానదీతీరమునకు వచ్చిన యడవిమృగములో నొక్కటిని జంపితిని. అవ్వల మఱియొక క్రూరమృగమును జంపితిని) అంత చిమ్మచీఁకటియందు కన్నులుగాననిచోట గర్జించుచప్పుడువలె ఏటిలో కుండను ముంచుశబ్దమును వింటిని. అంత, సర్పమువలె వెలుఁగుచున్న బాణమునెత్తి యాగజమును చంపఁగోరినవాఁడనై యాశబ్దము వచ్చినజాడనుబట్టి యింతకొలఁదిని గుఱిచేసి బాణము వేసితిని. నేను వాఁడిబాణమువైచిన తట్టునుండియే, నాబాణము మర్మములనాటఁగాఁ గూలి నీటంబడుచున్న యొక మునికుమారుఁడు 'అయ్యో! అయ్యో!' అని యఱచుపలుకు వేకువను స్పష్టముగా వినవచ్చినది. ఆబాణమును వేయఁగానే దానిని వేసినచోటనుండి 'నేను తపస్విని! కనుక నాకు పగవాఁడొకఁడును గల్గఁడే! ఇట్టి నాపై బాణమెట్లుపడెనో! నేను అర్ధరాత్రికాలమున, ఎవ్వఁడును లేనప్పుడు ఏటికి నీళ్లు ముంచుకొనిపోవుటకై వచ్చినాను. నన్నెవఁడు బాణమువేసి కొట్టినాఁడు? నే నెవ్వని కేమియపకారము చేసితిని? వాఙ్మనఃకాయములు మూఁటిచేతను పరులకించుకైనను హింసచేయక అడవియందు దొరకువానిని దినుచుఁ గాలము పుచ్చుచున్న ననుబోఁటి ఋషినిని ఆయుధముతోఁ జంపుట యెట్లుగలిగెను? జడలగుంపులను దాల్చి నారచీరలను కృష్ణాజినమును గట్టికొనియున్న ననుఁజంపి యెవ్వఁడు ప్రయోజనము నొందఁగోరినాఁడు? అట్టివానికి నేనేమియపకారము చేసితిని? ఇట్టి కార్యముజరిగినందున కేవల మనర్థముమాత్రమే కలిగినదికాని మఱియేఫలమును గలుగదు. ఇట్లు నన్నుఁ జేసినవానిని ఎవరైనను మంచిగా తలంతురా? గురుభార్యను బొందిన మహాపాతకునివలె తలంతురేకాని. నాప్రాణములు పోవుటకు నే నంతదుఃఖపడను. నేను జావఁగా నాతల్లిని తండ్రినిగూర్చి, దిక్కుమాలినవారగుటనుదలంచుకొని, దుఃఖించుచున్నానుగాని, బహుకాలముగా నేను వృద్ధులగు నీదంపతులను భోషించుచు వచ్చితిని. నేనుమరణము నొందఁగా, ఇఁక వీరేవిధమున బ్రతుకఁగలరు? ఎవ్వఁడు మిక్కిలియు మూఢుఁడై తెలివితేటలేక యొకబాణమున నన్నును ముదుసళ్లగు నాతలిదండ్రులను ముగ్వురిని జంపినాఁడు?' అని మనుష్య

వాక్యము వినఁబడెను. మిక్కిలిజాలి పుట్టించునామాటను విని, నేను ధర్మమునందా సక్తిగలవాఁడనుగాన, అధర్మముచేసితిమేయని మనస్సున పీడితుఁడుకాఁగా, నాచేత నుండి విల్లునుబాణమును నేలంబడినవి. రాత్రికాలమున నట్లు దీనముగా విలపించుచున్న యామునికుమారుని పెక్కు దీనాలాపములు వినఁగానే తత్తఱపడి శోకము మిక్కిలి పైకొనఁగా మిక్కిలి మెఱుకతప్పి యుండినవాఁడ నైతిని. నామనసువిన్ననై మిక్కిలి తల్లడిల్లఁగా ఆచోటికిం బోయి సరయూతీరమున బాణమునం గొట్టువడి పడియున్న మునిని జూచితిని. అతండు జడలగుంపు చెల్లాచెదరై విరియఁగా, కుండ యందలినీరు చిందియుండ, నెత్తురును దుమ్మునఁగలసి యంగములందుఁ గ్రమ్మి యుండ, అమ్మువొన నాటి పీడితుఁడగుచుఁ బడియుండెను. ఆ మునికుమారుండును, దిగులొంది మనస్సు కళవళించుచున్న నన్ను దహించువాఁడుం బోలె మెఱుఁగులు గిఱిగొనువాఁడిచూపులం జఱచుచుఁ జూచుచు నంతపరుసుగా 'రాజా! తలిదండ్రులకు నీళ్లు దీసికొని పోవుటకై వచ్చిన నన్నుఁ బాణమునఁ బడంగూల్చితివే! వనములో వసించుచుఁ గాలము గడపునట్టి నే నపకారమేమి సేసితిని' నా మర్మములందుఁ నొక్కబాణమునఁ గొట్టగానే నేను జచ్చుటయేకాక ముదుసళ్లును గ్రుడ్డివారునైన నా తల్లియును దండ్రియునుఁ గూడఁ జచ్చిపోవుదురే! వారిద్దఱును మిక్కిలి దుర్బలులై లేవకుండువారు, మఱియంధులు. వారుదప్పిగొని నే నెప్పుడు వత్తునోయని యెదురుచూచుచుందురు. చాలసేపువఱకు 'పిల్లవాఁడు నీళ్లుదెచ్చు' ననెడి యాశచే దుస్సహమైన దప్పిని అడఁచుకొని యుండఁగలరు. నే నిట్లు నేలంబడి పొరలుచుండుట మాతండ్రికిఁ దెలియదుగదా! మిక్కిలి తపస్సుచేసియు, చదువుచదివియు, తండ్రికి గూడఁ దెలియనట్లు నేలంగూలి పడియున్నానే! కాఁబట్టి యెంతతపస్సు చేసిననుగాని, ఎంతచదువు చదివిననుగాని, ఏమియు ఫలములేదు. నడవనుగూడఁ జాలని నాతండ్రికి, నే నిట్లుపడియుండుట తెలిసినను, తా నేమిసేయఁ గలఁడు? గాలిమున్నగు వానిచే యొకవృక్షము విఱిగి త్రెళ్లుచుండఁగా మఱియొక వృక్షముచూచుచున్నను,దానినిగాపాడ నేర్చునా? నేరదు. రాఘవా! నాతండ్రియొద్దకు నీవే శీఘ్రముగాఁబోయి నాసంగతిం జెప్పుము. అంత పెరిఁగిన కార్చిచ్చు అడవిని దహించునట్లు క్రుద్ధుఁడై నిన్ను దహింపఁడు, లేనిచో దహించునుజుమీ! ఈ యొక యడుగుకాలిత్రోవ నే పోయితి వేని నాతండ్రియాశ్రమమునకుం బోఁగలవు. నీవుపోయి ఆయనను గలకఁ దేర్చుము. అప్పుడు కుపితుండై నిన్ను శపింపకుండును. లేనిచో తప్పక శపించును. రాజా! నామేనిలోని శల్యమును బెఱికివైవుము. జలప్రవాహము, పొడవై యిసుకపారగుటచే మృదువుగానుండు తీరమును గరఁగించునట్లు, ఈవాఁడిబాణము నామర్మస్థానమును పీడించుచున్నది!' అనెను. మఱి 'మునికుమారుఁడు అలుఁగుతోనే యున్నయెడల బాధపడును. శల్యముపెఱికివేయుదునేని ప్రాణములతో నశించును. కనుక పెఱుకవచ్చునో రాదో' యని యాశల్యమును పెఱుకు

విషయమున నాలోఁ జింత చొరఁబడినది. 'ఇంతటియకార్యము చేసితినే' యని దుఃఖితుఁడనై 'బ్రహ్మహత్య గలుగునో యేమో' యని శోకంబునఁ బొక్కుచు, లోపల నేను జింతించుచుండుటను అమ్మునికుమారుఁ డూహించుకొనెను. అతండు అలసి సొలయుచు మిక్కిలియు బాధపడుచు స్రుక్కుచును అవయవములు ముడుచుకొని నేలఁబొరలుచును, మరణకాలము దాపింపఁగా నన్నుఁజూచి 'నేనుధైర్యమున దుఃఖము నడఁచుకొని మనస్సు గట్టిచేసికొని యున్నాను. కాన నీవునట్లే తబ్బిబ్బు పడకుండుము. నన్నుఁజంపినందులకు బ్రహ్మహత్య సంభవించెనేయని సంశయము మనస్సుననుండి తొలఁగింపుము. రాజా! నేను బ్రాహ్మణుఁడను కాను. అందులకై నీవు మనస్సున కొందలపడకుము. వైశ్యునికి శూద్రస్త్రీయందుఁ బుట్టిన కరణుఁడను' అనెను. అట్లతండు బాణము తననెఱఁకుల నాటి కాఱియ పెట్టుటచేత మాటాడ నేరకయుండి కష్టమున, నాకీమాట చెప్పి, ఒకప్పుడు గడగడవడఁకుచును, ఒకప్పుడు చేష్ట లుడిగియుండియు, ఒకప్పుడు భూమిమీఁదంబడి యల్లలాడుచును, నొవ్వునకు అవయవములు ముడుచుకొని బిగ్గఱనఱచుచును నుండఁగా, నతనిమేని నుండి శల్యమును వెలికిదీసితిని. ఆతపోధనుఁడు మిక్కిలి కళవళించి నన్నుఁ జూచుచునే ప్రాణములు విడిచెను. శుభాత్మురాలా! మర్మమున గంటువడి మిక్కిలి కష్టంబునం బలవించి యంత పలవింపఁజాలక, విడువక నిట్టూర్పులు పుచ్చుచు, జలంబుల నంగములు దడియ, సరయువుగట్టున భూమినివ్రాలియున్న యామునికుమారునిం జూచి మిక్కిలియు విషాదము నొందితి'' అనెను. ఇది యఱువదిమూఁడవసర్గము.



## దశరథుని మరణము.

ధర్మాత్ముఁడగు నాదశరథుఁడు ఆమహర్షిని ఎవ్వరును చేయనివిధమున దాను జంపుటను గూర్చియే పలవించుచు, నడుమనడుమ రామునిం దలఁచుకొని వగచుచు, మరలఁ గౌసల్యంజూచి ''అట్లు నేను తెలియక యామహాపాపమును గావించి,యంత హృదయము కలఁతనొందఁగా 'ఇంకనెట్లుచేసిన మేలుకలుగును' అని యొక్కఁడనే బుద్ధియం దాలోచించితిని. అంత నమ్ముని చెప్పినట్లు చేయుటయే మే లని యెంచి మంచిజలము నిండియున్న యాకుండనెత్తికొని యతండు చెప్పిన దారిఁబోయి, ఆయాశ్రమమును జేరితిని. అచ్చట దుర్బలులై కన్నులు దెలియనితమ్ముఁ జెయి పట్టి తీసికొనిపోవువాఁ డెవఁడునులేక ఱెక్కలుదెగిన పిట్టలవలె నున్న యతనిముదు సలితలిదండ్రులను జూచితిని. వారు నడవఁజాలరుగావున నూరక కొడుకునుగుఱించి యాయాముచ్చటలం జెప్పుకొనుచుఁ గూర్చుండి మఱి యేప్రయత్నమును జేయలేక దిక్కుమాలినవారివలె నుండిరి. నానిమిత్తమున వారికిఁ గొడుకు వచ్చునని కాని జలము దెచ్చునని కాని యాశయులేదయ్యె. మొద లమ్మునికుమారునిఁ జంపినంతలకే నామనస్సు శోకమున పల్లటిల్లుచుండెను, దిగులు గదరి నాబుద్ధియు కళ

వలించుచుండెను. ఇట్టినాకు ఆయాశ్రమస్థానమునకు బోయి యామునుసళ్లం జూడఁగానే మఱియు శోకము మిక్కిలి యతిశయించినదయ్యె. ఆముని నాకాలిచప్పుడు వినఁగానే * 'నాపుత్త్రుఁడా! ఏల యింతజాగు? జలము వేగ దెమ్ము నాయనా! నీ వెందుల కింతసేపు జలములో వేడుకగా నీఁదులాడుచుంటివి చెప్పుము? ఇదిగో నీతల్లి నినుఁ దలంచుకొని నీరాకకు తహతహపడుచున్నది. ఆశ్రమములోనికి వేగరమ్ము. పుత్త్రా! నీతల్లిగాని నేనుగాని, నీకేదేని యప్రియమో అపరాధమో కావించి యుందుమేని, నీవు తపస్వివిగావున దాని నెంతమాత్రము మనస్సులో నుంపరాదు. దిక్కులేని మాకు నీవేదిక్కు. నడవఁగాళ్లులేని మాకు నీవే నడక. కన్నులులేని మాకు కన్నులు నీవే మాప్రాణములు నీయందె నిలిచియున్నవి. నీవు మాతో మాటాడవేల' అనెను నే నామునిని జూచి, మిక్కిలిభయముగొని మాటలు తొట్రుపడ, అక్షరములు తొకతొకపడ, తేటపడనిమాటల మనస్సు నిట్టట్టుపోనీక చిక్కఁబట్టి, చేష్టలను గుదురుపఱచుకొని, తొట్రుపడుచున్న మాటలకు దిటవునూల్కొలిపి, యాతనికి భయమును బుట్టించు పుత్త్రమరణవిపత్తును చెప్పంబూని, "నేను క్షత్త్రియుండను. నాపేరు దశరథుఁడు. నేను మహాత్ముఁడగు నీపుత్త్రుండను గాను. పూర్వము నేను జేసికొన్న కర్మమువలన సత్పురుషనిందితమైన యీదుఃఖ మిపుడు వచ్చినది. మహాత్మా! నేను నదిలో నీళ్లుత్రావు రేవునకు వచ్చిన క్రూరజంతువును గాని యేనుఁగునుగాని చంప నువ్విళ్లూరుచు విల్లుగొని సరయూతీరమునకు వచ్చితిని. అంత నేను నీటిలోకుండను ముంచుధ్వనిని వింటిని. ఆచప్పుడు విని నే నది యేనుఁగుగా నుండునని తలఁచి దానిని గుఱిపెట్టి బాణము వేసికొట్టితిని. అంత నేను నదిగట్టునకు బోయి, యచట, నాబాణము ఱొమ్ము నగల్పగా, ప్రాణములుపోయినట్లు భూమిపయి వ్రాలియున్న యొక తాపసునిఁజూచితిని. మహాత్మా! నేను శబ్దమునుగుఱిసేసి యేనుంగును జంపఁగోరి జలమున బాణము విడువఁగా దానిచే నీకొడుకు హతుఁడయ్యెను. అంత నే నతనికడకుఁ బోయి, బాణవేదనకుఁదాళక పరితపించుచున్నయతఁడు 'శల్యము దీసివైవు' మని చెప్పఁగా, ఆమాటచొప్పున నే యపుడు తోడనే యాతని మర్మస్థానమునుండి బాణమును బెఱికివైచితిని. బాణము పెఱుకఁగానే యతఁడు 'నాతలిదండ్రులు గ్రుడ్డివారలే! ఇఁకవారి నెవ్వరు పోషింతురు!' అని మిమ్ముఁగూర్చి శోకించుచును పలవించుచును స్వర్గము నొందెను. నేను అజ్ఞానమున మీకొడుకును తటాలునఁ జంపితిని. ఇట్లు జరిగిపోయినది. ఇఁక మిగత శాపమో యనుగ్రహమో, ఏమి సేయవలయునో యదినాకు దయసేయుఁడు" అంటిని. భగవంతుఁడగునాఋషి, నే నాదుఃఖమును దెలుపఁగా క్రూరంబగు వాక్యము విని పైకొన్న తీవ్రంబగు వ్యసనమును

---

* ఇందులకు 'యన్నిమిత్తమిదం తాత సలిలే క్రీడితం త్వయా' అనిమూలము. దీనికి 'యన్నదత్తమిదంతాత' అనుపాఠమున 'నాయనా! నీవిదివఱకు జలముదెచ్చి యియ్యనందున జలముల నీదులాడు చుంటివి కాఁబోలు' అని యర్థము.

అడఁచుకొనుటకు శక్తుఁడుగాఁడయ్యె. మహాతేజుండగు నామహర్షి మొగంబునఁ గన్నీళ్లుగ్రమ్మ నిట్టూర్పులు పుచ్చుచు శోకంబునం బొక్కుచు చేతులుమోడ్చి ముందటనున్న నన్నుఁజూచి 'ఓరాజా! ఈయశుభ కార్యమును నీవే నాకుఁ జెప్పక మఱి యొకవిధమున నాకుఁ దెలియునేని, నీతల యాక్షణమే లక్షపఱియలుగా విరిసిపోయి యుండును. రాజా! పాలకుఁడగు రాజు తెలియక వానప్రస్థుని నెవనినైనఁ జంపునేని వాఁడు దేవేంద్రుఁడైనను తనపదవినుండి భ్రష్టుఁడగును. మఱి తెలిసి యట్లు చంపునేని విశేషించితోడనే వానికిపదభ్రంశము గలుగును. తపస్సులుపుచున్నట్టిబ్రహ్మవిదుఁడై యున్నమునిపైని తెలిసి యాయుధము వైచునట్టి వాని శిరస్సు పెక్కుపఱియ లగును. నీవిక్కార్యమును తెలియక చేసితివి, కావుననే బ్రతికియున్నావు. తెలిసియే చేసియుంటివేని నీయిక్ష్వాకుకులమంతయు నిపుడు లేనిదై యుండునే! ఇఁకనీవొక్కఁడవో యెంతమాత్రము. రాజా! ఇదియె నాకొడుకును చూచుకడసారి, ఇఁకమీఁద వానిని జూడలేము. కావున నిపుడు అవయవములు నెత్తుటందోఁగి కృష్ణాజినమును వస్త్రమును చెదరి నేలపైవ్రాలి నిస్సంజ్ఞుఁడై యమునివశమున నున్న యాపుత్రునిఁ గన్నారఁజూడఁ గోరెదము. మమ్మాచోటికిం గొనిపొమ్ము' అనిరి. అంత నేనొక్కండను మిక్కిలి దుఃఖితులైన యాయిరువురిని, ఆచోటికిఁగొనిపోయి వారలకుఁగన్నులు తెలియవు గావున నేనే యామునికిని అతనిభార్యకును వారికొడుకును దాఁకించితిని. ఆమునిదంపతు లిరువురును తమకొడుకును దడవిచూచి యతనిదగ్గఱకుం జేరి దుఃఖమున నాతనిదేహముపైఁ బడిరి. అందు తండ్రి కొడుకుంజూచి 'నాయనా! నన్నుఁ జూచియిపుడు మ్రొక్కవేమి? మఱియేమియు పలుకవు? నాపై కోపమాయేమి? ధర్మాత్మా! నీకు నాయందు ప్రీతి లేదేని నన్నుఁజూడవలదు. ఇదెనీతల్లి వచ్చియున్నది. చూడుము. మమ్మేల లేచి కౌఁగిలించుకొనవు? మృదువుగా మాతోఁ బలుకుమీ! చెవులార వినెదము. ఇఁక నెవ్వఁడు అర్ధరాత్రమున లేచి వేదశాస్త్రములనో మఱి యితరములగు పురాణాదులనో పఠించుచుండఁగా మనస్సున కింపైన యా మధుర ధ్వనిని నేనువినఁగలను? ఇంక నెవ్వఁడు స్నానముచేసి సంధ్యనుపాసించి అగ్నిహోత్రమునందు హోమముగావించి నాపొంతఁగూర్చుండి పుత్రదుఃఖంబున దిగులునొంది దురపిల్లుచున్న నాకుఁ బరిచర్య సేయఁగలఁడు. ఇంక నెవ్వఁడు, కర్మముల ననుష్ఠింప శక్తిలేక, నివ్వరి మొదలగువానిని సంగ్రహింప నలవిగాక, కఱ్ఱఁబట్టుకొని నడపించుకొనిపోవు దిక్కునుగానక యున్ననాకు, నీటంబుట్టు తామరదుంపలు మున్నగు గడ్డలును మిట్టంబుట్టు చేమ మొదలగు గడ్డలును పండ్లును తెచ్చి, ప్రియాతిథికిం బెట్టునట్లు భోజనము పెట్టును? నాయనా! కన్నులు తెలియనిదై ముదిమిగప్పి నీయందు మిక్కిలియు మక్కువ గలిగి నిన్నుఁబాసి దీనయై జాలి పుట్టునట్టిదుస్థితినున్న నీతల్లిని నీవుపోయినవెనుక నేనెట్లు పోషింపఁగలను? కొడుకా! ఆఁగుము; పోకుపోకు. రేపు నేనును నీతల్లియు గూడఁ రాఁగా యమునియింటికిఁ బోవచ్చును. అడవియందు

నిన్ను బాసి యనాథులమై దుఃఖమునఁ బొక్కుచు దీనులై నిమిషమేనియు మేమిరువుర ముండనేరము, ఇదె శీఘ్రముగా నీతోఁగూడనే యమునిలోకమునకు వచ్చెదము. అంతనేను యముని జూచి 'నాయీకుమారుఁడు తల్లిదండ్రులను జక్కఁగాఁ బోషించువాఁడు' అని యీమాట చెప్పెదను. ధర్మరాజును తనయొద్దకు నాకొడుకాలస్యముగా వచ్చుటను క్షమించుఁగాత. ఆయముఁడు మహాధార్మికుఁడు, మిక్కిలి కీర్తిమంతుఁడు, కనుక నిట్టి యనాథుఁడనగు నాకు, నాశరహితమైన యొకయభయదానమును దక్షిణగా నియ్యఁదగును. పుత్త్రా! ఈపాపకర్ముఁడు చంపుటచే నీపూర్వకృతపాపము పోయినది. కనుక నాసత్యముబలిమిని, యుద్ధముసేయు వీరుల కేలోకము కలుగునో నీ వాలోకములను వేగ పొందుము. కొడుకా! శూరులు యుద్ధమునమాఱుమొగమిడక వెనుకకు మరలక యెదుర్కొని పోరుచుండి హతులై యేగతిని బొందుదురో నీవును ఆపరమగతిని బొందుమీ. చిన్నికొడుకా! సగరుఁడును శైబ్యుఁడును దిలీపుఁడును జనమేజయుఁడును నహుషుఁడును దుందుమారుఁడును ఏగతిని బొందిరో నీ వాగతిని బొందుము. పుత్త్రకా! సత్పురుషులగు వారికందఱికిని వేదాధ్యయనపరులకును తపస్వులకును ఏగతులు గలుగునో, భూదానకరునికిని ఆహితాగ్నికిని ఏకపత్నీవ్రతునికిని ఏగతులు సిద్ధించునో, వేయిగోవుల దాన మొసంగినవార లేగతింబొందుదురో, గురుశుశ్రూష చేసినవారి కేగతియో, మహాప్రస్థానాదుల చేతఁగాని గంగాయమునాసంగమాదులంగాని యగ్నినిగాని సంకల్పపూర్వకముగా దేహత్యాగము చేసినవారికి నేగతి యగునో, యాగతులను నీవు పొందుమా. తపోనిష్ఠులగు మనయీకులమునం బుట్టినవాఁ డెవ్వఁడుగాని దుర్గతినిఁ బొందఁడుగదా! నా పుత్త్రుఁడవగు నిన్నుఁ బడఁగూల్చినవాఁడు మాత్రము దుర్గతిఁ బొందును' అని యిట్లాముని యచట సారెసారెకు విలాపముచేసెను. అంత నతఁడు భార్యంగూడి కుమారునకు సంస్కారము గావించి యుదకక్రియలు సేయుటకుఁ బూనెను. ధర్మవిదుఁడగు నామునిపుత్త్రుఁడు దనపుణ్యకర్మములవలన, దివ్యరూపమునొంది, యింద్రుఁడు తోడరా, రథమున స్వర్గలోకమునకుఁ బోయెను. ఆమునికుమారుఁడును ఇంద్రుఁడును, వృద్ధులగు నాతలిదండ్రులఁ గొంత యూఱడించి యంత వారింజూచి 'నేను మీకు శుశ్రూష సేయుటం జేసి నిరామయమగు పదమును బొందితిని. మీరిఁక శీఘ్రముగానే నాయున్న చోటికి రాఁగలరు' అనెను. జితేంద్రియుఁడగు నామునిపుత్త్రుడు ఇట్లు వారికిం జెప్పి ప్రశస్తమగు దివ్యవిమానము నారోహించి శీఘ్రమున స్వర్గముఁ బొందెను. మహాప్రభావుఁడగు నాముని, భార్యయుం దానును, పుత్త్రునకు జలతర్పణము గావించి దాపునఁ జేమోడ్చినిలుచున్న నన్నుం జూచి "రాజా! నన్నిపుడే చంపుము. చచ్చితినేని నాకు బాధలేకుండును. 'చచ్చుట బాధకాదో' యందువా? లేకలేక నాకు కొడుకు ఒక్కఁడె. ఆకొడుకును నీవు బాణమువేసి చంపి నన్ను పుత్త్రహీనునిగాఁ జేసితివే! ఇంతకన్న బాధయేది? మరణమే మేలు. నీవు నిర్మలుండగు

నాపుత్రుని తెలియక చంపితివి. కావుననే నేనిప్పుడు నిన్ను భస్మముసేయక మిగుల దుఃఖకరమగు దారుణశాపము నిచ్చుచున్నాను. రాజా! నాకిప్పుడు అంత్యకాలమున పుత్రనాశమువలన మరణాంతమగు దుఃఖమును కలిగించితివి. కావున నీవును ఈవిధమున పుత్రదుఃఖమున మృతినొందుదువు. రాజా! క్షత్రియుండవగునీవు మునిని తెలియక చంపితివి కావున నీకు దానివలన బ్రహ్మహత్యవంటి మహాపాతకము కలుగదు. నీవు ప్రాణాంతకరమైన యీఘోరస్థితిని నాకొసంగితివి కావున దక్షిణ నొసంగినవాఁడు దానికిఁ దగినట్టి పుణ్యమును బొందునట్లు నాయట్టిస్థితిని నీవును శీఘ్రమున ఈ జన్మమునందె పొందఁగలవు' అనెను. ఇట్లు నాకు శాపము పెట్టి యాదంపతు లిరువురును వినువారికి మనసు కరఁగునట్లు మిక్కిలి విలపించి యిద్దఱి బొందుల నొక్కటిగా కట్టుకొని చితినారోహించి స్వర్గమును బొందిరి. దేవీ! మరణాంతకమైన యీపుత్రశోకమునకుఁ గారణ మేమని చింతించుచుండఁగా తొల్లిబాల్యమునందు శబ్దమును గుఱిపెట్టివేయుట నలవాటు సేయుచుండినపుడు నేను మునికుమారునిఁ జంపిన పాతకము తనంతట నాకు తలంపునకు వచ్చినది. దేవీ అపథ్యములైన వానితోఁగూడ నన్నమును భుజింపఁగా వ్యాధివచ్చునట్లు నేను జేసినయీ పాపకార్యమునకు ఈదుఃఖము ఫలరూపముగా ప్రాప్తించినది. కల్యాణీ! నేనిపుడు పుత్రశోకమున ప్రాణము విడువనున్నాను. కావున మహనీయుఁడగు నాఋషి చెప్పిన శాపరూపమగు వచనార్థము నాకిపుడు ప్రాప్తించినది. కల్యాణీ! నాకన్నుల దృష్టి తప్పినది. కనుక నిన్ను నాకన్నులతోఁ జూడలేకున్నాను. నన్ను చక్కగా స్పృశింపుమీ' అనిచెప్పి మరలనేడ్చుచు బెదరుగదుర తిరుగ భార్యంజూచి 'దేవీ! రాముని యెడల నేను జేసినక్రూరకార్యము పాపిష్ఠుఁడగునాకు దగియే యున్నది. రాముఁడు నా పంపునకు మాఱాడక తోడనే యడవికిఁ బోయినాఁడే, అదిమాత్రము మహాధర్మాత్ముండైన యీరాముని కేతగును. మఱెవ్వరికిని తగదు. కొడుకును, వాఁడెంత దుర్మార్గుఁడైనను, పండితుఁ డగువాఁ డెవఁడు దిగవిడుచును? తండ్రి తన్ను వెడల బంపగా కొడు కెవ్వడు అతనిపై నసూయ చూపకుండును? రాముఁడు నన్ను ఇప్పుడు తాకునేని, లేక నాకన్నుల కగపడునేని, బ్రతుకుదును. యమలోకమునకుఁ బోయినవెనుక మనుష్యులు తమబంధువులను జూడఁజాలరు గదా. కనుక ప్రాణమున్నపుడే రామునిఁజూడఁ గోరెద. కౌసల్యా! నిన్నుఁగన్నారఁ జూడలేకున్నాను. నాకు స్మృతికూడ క్షీణించుచున్నది. ఇదిగో యమదూతలు నన్ను వేగ రమ్మని తొందరచేయుచున్నారు. మరణకాలమున ధర్మజ్ఞుఁడును సత్యపరాక్రముండును నగురామునిఁ జూడకున్నానే! ఇంతికన్న మఱిదుఃఖ మేమున్నది! రాముఁడు పూనినకార్యమున కడ్డిమెవరు సేయలేరు. ఇట్టిరాముని దర్శనములేమిచే నాకు గలుగుదుఃఖము, ఎండ కొంచెమునీటిని పీల్చుకొనునట్లు, ఇప్పుడు నా ప్రాణములను బీల్చుచున్నది. పదునేనవయేఁడు పుట్టఁగా, అపుడు సుందరమై సొగసైన

మేలికుండలములు తులకించుచుండు రాముని నెమ్మొగమును మరల నెవరు చూడఁగలుగుదురో వారు *దేవతలే యగుదురుగాని మనుష్యులుగారు. తామర పూరేకులంబోని కన్నులు గలిగి, సొగసుగా నున్నకనుబొమలతోఁగూడి, దవడల పలువరుస చెలువై తులకింపఁగా, ముక్కుచక్కని మురువుసూప, చంద్రబింబము వలె వెలయు రాముని మొగంబును పుణ్యాత్ములగువారు చూడఁగలరు. శరదృతువు నందలి చంద్రునివలెను, విరిసిన తామరపువ్వువలెను దళుకొత్తుచు కమ్మనితావిగు బులుకొనుచుండు నానాథుని రాముని యాముద్దుమొగమును పుణ్యాత్ములు చూడఁగలరు. వనవాసము తీర్చి మరలి యయోధ్యకు వచ్చిన రాముని, మౌఢ్యమువిడిచి యుచ్చమార్గమునుబొందిన శుక్రునింబోలె, సొంపుపెంపు దళుకొత్తుచుండఁగా, మహాత్ములగువారు చూడఁగలరు. కౌసల్యా! నామనము చీఁకటిగ్రమ్మి యున్నది. కావున, దానిపట్టయిన హృదయమును పెంపఱుచున్నది. మఱియు నాయింద్రియ ములతో శబ్దస్పర్శరసములు సంబంధించినను ఆ యింద్రియములు నశించుటచే ఆ శబ్దాదులు నాకు తెలియరాకున్నవి. నాయింద్రియములు చెడుటకు గారణము వినుము. చమురుతీసిపోవఁగా, దీపముతో ఎడతెగక కూడియుండు కిరణములును నశించునట్లు, నాశరీరము బిగి తప్పఁగా చిత్తమును నశించి దానికి సంబంధించిన నాయింద్రియములన్నియును నాశము నొందుచున్నవి. ఏటిప్రవాహము దానిగట్టును దెగఁగొట్టునట్లు, ఈ పుత్రశోకము, అనాథుఁడనయి, ప్రజ్ఞయుఁ దప్పియున్న నన్ను వేగ నురిగించుచున్నది. అయ్యో! రామా! మహాబాహూ! హా! మదీయదుఃఖ నాశకా! హా! తండ్రికిఁ బ్రియుఁడైనవాఁడ! నానాథా! హా! పుత్రా! ఇపు డెచటికిఁ బోతివి? అయ్యో! కౌసల్యా! హా! తపస్వినీ! సుమిత్రా! హా! క్రూరురాలా! నాపగ తురాలా! నాకులపాంసనీ! కైకేయీ!'' అని రామునితల్లి కౌసల్యయు సుమిత్రయు సమక్షమున దుఃఖించుచు, ఆ దశరథభూనాథుఁడు మరణమునొందెను. గొప్పకార్య దృష్టిగలయారాజు తనప్రియపుత్త్రు నడవికిఁ బంపినందులకు పురపురంబొక్కుచు, దీనాలాపములు పలుకుచుండి, యర్ధరాత్రము గడవఁగానే యపుడు దుఃఖము మిక్కి లియుఁ బీడింపఁగా నోరువలేక ప్రాణములు విడిచెను. ఇది యిఱువదినాలుగవ సర్గము.



* 'అహం పునర్దేవకుమారరూపమలంకృతం తం సుత మావ్రజన్తమ్। నన్దామిపశ్యన్నపి దర్శనేన భవామి దృష్ట్వాచ పునర్యువేవ' 'దేవకుమారునివలెనుండు నారామునిఁ జూచి మరల యౌవనవంతునివలెనగుదు' నని దశరథుఁడు చెప్పటఁబట్టి ఇచటమగల రాముని మొగమును చూడఁగలవారు మనుష్యులు కారనఁగా మనుష్యులవలె జరాయుక్తులుగారు. 'దేవతలవలె నిత్యయౌవనులగుదురని యర్థము. దీనిచే రాముని ముఖసౌందర్యాతిశయమహిమ స్ఫురితము.

—— దశరథునిమరణమునకు రాజభార్యలు విలపించుట. ——

అంత రాత్రి కడచనఁగా, మఱునాఁటి పెందలకడ, వందిజనులును, వంశావళిం గీర్తించుసూతులును, మంగళపాఠకులై గాంధర్వవిద్యయం దాఱితేరినట్టి గాయకులును, అందఱును వ్యాకరణాద్యుత్తమ సంస్కార యుక్తులై స్తుతిశీలు రగుచునొప్పి చక్కఁగా నలంకరించుకొని వచ్చి వేఱువేఱ, తమతమ కృత్యంబుల నెఱపుచు నారాజున్నగృహమును జేరినవారైరి. అప్పుడు రాజును బ్రస్తుతించుచు, పెద్దయెలుఁగున నాశీర్వచనముల నుడువుచున్న వారలస్తోత్రధ్వని యారాజగృహము పూర్ణవిస్తారముకొలఁదికి వ్యాపించినదయ్యె. అంత వంశావళికీర్తకులగు నాసూతులు రాజునుబొగడుచుండఁగా, తాళములు వేయువారు, పూర్వరాజులును దశరథమహారాజును గావించియున్న యద్భుతకార్యముల నెత్తి వర్ణించి యంత తాళములు వాయించుచుండిరి. ఆ రాజగృహమున, తోఁటయందలివృక్షముల శాఖలయందును పంజరములందును నుండు పక్షులన్నియు ఆశబ్దమును విని మేలుకని వివిధముగా ధ్వనులు సేసినవి. హరినారాయణాది పుణ్యశబ్దములును, బ్రాహ్మణులు పుణ్యపురుష క్షేత్రాదులను గుఱించి సేయుకీర్తనములును వీణియలనాదములును, రాజుచరితలం బ్రతిపాదించు ప్రబంధములను గొని యాశీర్వాదరూపముగాఁ జేయుగానమును, ఆరాజగృహ మంతయు వ్యాపించినవయ్యె. అంత పరిశుద్ధాచారులును, రాజసేవా చతురులునగు పరిచారకులు, అంతఃపురాధ్యక్షులగు స్త్రీలతోను నపుంసకులతోను గూడి మిక్కిలియుఁ గ్రందుకొని మునుపటివలె రాజును సేవించిరి. స్నానవిధియం దాఱితేరినభృత్యులు, స్నానముసేయుకాలమున విధిప్రకారమున,పసుపుచందనము గలపిన యుదకమును బంగారు కలశమును గొనితెచ్చిరి. వయసుకత్తియ లగుమఱి పెక్కండ్రు స్త్రీలు, తైలము నలుఁగుఁబిండి మున్నగు మంగళానులేపనములను, పలు దోమినవెనుక పుక్కిలించుటకు వలయుపదార్థములును, అద్దము వస్త్రాభరణములు మొదలగు నలంకారపరికరమును దెచ్చిరి. రాజునకుఁ బ్రాతఃకాలమున మంగళార్థముగాఁ దేరందగిన యాపదార్థములన్నియు సర్వలక్షణసంపన్నములై వాని వానికిం దగినట్లు బహూకృతములై గుణంబులు గలిగి కాంతియుక్తములుగా నుండెను. ఆ పరిజనులందఱును రాజునుగొలువ నుత్సుకులై సూర్యోదయమువఱకును గాచియుండి యంతకును రాజు రాకుండుటంజేసి 'రాజున కేమి యూఁడెనో' యని శంకితులై యుండిరి. అంత కోసలాధిపతియగు నాదశరథుని శయ్యకు దాపుననున్న యంతఃపురస్త్రీలు వచ్చి తమభర్తయగు నారాజును సవినయమృదు వాక్యముల మేలుకొలిపిరి. అట్లు మేలుకొలిపినను లేవనందున ఆ స్త్రీలు అప్పటికిం దగినవ్యాపారములచే, వినయమునను, యుక్తితోను నతఁడుపరుండు చోటును దాఁకి యూపిరి మున్నగునిదురపోవుజాడ లేవియును గానరైరి. ఆస్త్రీలు నిద్రాస్వభావపు లక్షణములనుజక్కఁగాఁ దెలిసినవారుగాన యారాజునందుఁ గాలుసేతులుగదల్చుట

గుండెకొట్టుకొనుట యూపిరివిడుచుట మొదలగునిదురజాడలలో నేదియు లేకుండుట గాంచిరి. ఆకాంతలు రాజుప్రాణము లున్నవో లేవోయని శంకితలై గడగడ వడంకుచు, ప్రవాహమున కెదురువడిన ప్రబ్బలి మొదలగుతృణముల మొనలుంబోలె చూపట్టిరి. అంత గడగడ వడంకు చున్నస్త్రీలను, రాజున్నయునికిని జూడగా, రాజు మరణించెనని యందఱికి మునుపు గలిగియున్న శంక యప్పుడు యథార్థమేయగునని నిశ్చయమయ్యెను. కౌసల్యయు సుమిత్రయుఁ బుత్రశోకము మిక్కిలి పైకొనఁగా వివశలై కంటికినిదురం జెందినవారుగావున,మృతినొందినవారివలె మేలుకొనకుండిరి. కౌసల్య, కాంతి తఱిఁగి, వన్నియమాఱి, శోకమునఁజిక్కి, యుత్పాతమునఁ బుట్టిన పొగచేఁ గలిగినచీఁకటి గ్రమ్మఁగా కొమరు దూలిననక్షత్రమువలెఁ బ్రకాశింపకుండెను. తొలుదొలుత, రాజు, మృతుఁడగుటవలనఁ గాంతి దూలియుండెను. అతనికి పిదపఁ గౌసల్య, కన్నీళ్లుగాఱికాఱి మొగము సొంపు గుందియుండుటవలనఁ గాంతి మాలియుండెను. ఆయమవెనుక సుమిత్రయు నట్లె కాంతి డిందువడియుండెను. ఆ స్త్రీలు, అట్లు నిద్రపోయినయాశుభార్తికలను గౌసల్యాసుమిత్రలను జూచి, యట్లే నిదురించుచునేయుండి ప్రాణములు పోయినరాజునుం గాంచిరి. అంతనా కాంతారత్నములు దీనలయి యరణ్యమునందు యూథమును బాసినయేఁనుగజములవలెఁ బెద్ద యెలుఁగున రోదనమునేసిరి. వారలరోదన ధ్వనిచేత, కౌసల్యయు సుమిత్రయుఁ దటాలున మెలఁకువగాంచి నిదురవిడిచి లేచిరి. కౌసల్యయు సుమిత్రయు, రాజును తేఱి చూచియు, తాఁకియు, మృతుడయ్యెనని తెలిసికొని 'హా! నాథా!' యని యాక్రోశించుచు నేలంబడిరి. కోసలరాజసుతయగు నా కౌసల్య, యట్లు నేలంబడి పొరలుచు, మేనెల్లదుమ్ము గ్రుంగ, ఆకసముననుండి నేల రాలినచుక్కపగిది కాంతిదక్కి యుండెను. దేహమునందలి యుష్ణాదిగుణములన్నియు నశించి రాజు మృతుఁడు కాఁగా, నేలంబడియున్న యాకౌసల్య, చంపఁబడి పుడమిం ద్రెళ్లిన యేఁనుగజమువలె, ఆ యంతఃపుర కాంతలకెల్లను జూపట్టెను. అంతఁ గైకేయి మొదలగురాజభార్య లందఱును, రాజుమరణము దెలిసి, యచటికి వచ్చి, శోకంబువం బొగులుచు నేడ్చుచును ప్రజ్ఞతప్పి నేలంబడిరి. కౌసల్య మొదలగు వారల రోదనధ్వని, వారికి వెనుక వచ్చిన కైక మొదలగువారి రోదనధ్వనితోఁ గలసి క్రందుకొన్నదై మిక్కిలి కుదురుకొని యాగృహ మంతయు వ్యాపించి మిక్కుటమైన ప్రతిధ్వనిని గావించినదయ్యె. మునుపు, మిక్కిలి యుత్సాహమున జనులు చెలరేఁగుచు నిండియుండిన రాజగృహమునందు, రాజు మృతినొందిన తోడనే, ఆజను లెల్లబెదరు గదిరి తొట్రిలంబడుచుండిరి. అందెచ్చటఁ జూచినను దొమ్మిగా రోదనములు వినఁబడుచుండెను. చుట్టములెల్ల పరితపించుచుఁ బొక్కుచుండిరి. ఆనంద మనుమాట తోడనే బొత్తిగా నశించినదయ్యె. ఎవ్వరిని జూచినను దీనులై సొంపు దూలి కనఁబడుచుండిరి. కీర్తిమంతుఁ డగునాభూకాంతుఁడు మృతుఁడగుట

తెలియఁగానే యాతనిపత్నులతనిం బరివేష్టించి యతిదుఃఖితలయి వినువారికి జాలి పుట్టునట్టు లెంతయు రోదనముసేయుచు, ఒండొరులచేతులు పట్టుకొని యనాథలుంబోలె, మిక్కిలియు పలవించిరి. ఇది యఱువదియైదవ సర్గము.



—{కౌసల్యాప్రలాపము. రాజును తైలద్రోణియందుఁ బ్రక్షేపించుట. రాజస్త్రీలవిలాపము. పురసంక్షోభము.}—

రాజు మృతుండై, చల్లారినయగ్నిహోత్రునికైవడిని, నీళ్లులేని సముద్రమువలెను, కాంతినశించిన సూర్యునిపగిదిని, తేజము దూలియుండఁగాఁజూచి, కౌసల్య శోకమున స్రుక్కుచు, కన్నులఁగన్నీరు వెల్లిగొన, రాజుశిరమును దొడపై నిడికొని నానావిధముల కైకంజూచి, 'క్రూరాత్మురాలా! దుష్టచారిణీ! కైకా! ఇఁక నీవు కృతార్థురాలవు గమ్మా! ఒకేపట్టుగానుండి నీపూనికి సాధించితివి. రాజును దిగవిడిచితివి. మఱిరాముఁడును లేఁడు. కనుక అకంటకముగా రాజ్యమునంతయు నీతలనే కట్టుకొని యనుభవింపవే. నన్నుదిగనాడి రాముఁడడవికిఁ బోయెను. నాపెనిమిటియు స్వర్గము నొందెను. చెడ్డదారిని జిక్కి తోడవచ్చినబిడారు దప్పినయాఁడు దానివలె నినుబోఁటి దుష్ట లున్నయీ ప్రదేశమున నాతోడైనమగనిని గొడుకును బాసి బ్రతుకనొల్లను. ధర్మమును దిగనాడిన కైక తప్ప మఱియెవ్వతి తనకు దైవమగు పెనిమిటిని విడిచి, బ్రతికియుండఁ గోరును? ముసిఁడిపండును దినఁ బేరాసగొన్నవానికి దానివలనం గలుగుకీళ్లు దెలియనట్లు, లుబ్ధుఁడైనవానికి తనలోభమువలన రానున్న దోషములు తెలియవు. ఒకకుబ్జనుబట్టి, కైక, రాజ్యమునందు పేరాసగొని దానివలనఁ గలుగుదోషములు తెలియక తనలోభమువలన రాఘవవంశమునంతయు నాశము సేసినది. మున్ను వరముల నిచ్చునప్పుడిట్టివరమని యేర్పాటు లేకున్నను, వానికిఁగా రాముని నడవికిఁ బంపి భరతునికిఁ బట్టముగట్టవలయునని, కైక నియోగింపఁగా, రాజు చేయునది లేక, రాముని నతనిభార్యతో నడవికిఁ బంపినాఁడని జనకరాజు విన్నయెడల నావలెనే పరితపించునే. *రాముఁడు బ్రతికియుండినను, ఇచట లేనందున నష్టప్రాయుఁడే యైనాఁడు. కనుక తామరరేకులవంటి కన్నులు గల యా ధార్మికుఁడు, నే నిపుడు అనాథనేకాక విధవనుగూడ నగుట నెఱుఁగఁడు గదా! దుఃఖము లనుభవింపఁదగనిదయ్యు దుఃఖములబారిం బడి జాలి గొలుపుచున్న యా జనకరాజకుమారి సీతయు నట్లే, అరణ్యమునందు దుఃఖమున భయము నొంది

---

* ఇందులకు 'స మామనాథాం విధవాం నాద్య జానాతి ధార్మికః। రామః కమలపత్రాక్షో జీవన్నాశమితో గతః' అని మూలము. ఇందు, 'జీవన్నాశమ్' అనుటకు 'జీవనాశమ్' అనుపాఠాన్తరమున 'తామరరేకులవంటి కన్నులుగల ధార్మికుఁడు రాముఁడు తానిచట లేఁడు గావున, రాజు మరణించుటచే ననాథనై విధవ నగుటయు నెఱుంగఁడు' అని యర్థాంతరము.

యుండఁగలదు. ఆబిడ, రాత్రులందు, భయంకరధ్వనిగల మృగములును పక్షులును అఱవఁగా, ఆధ్వని విని యులికిపడి రాముని కౌఁగిలించుకొనుట నిజము. వృద్ధుఁడై పుత్రులును లేకుండినట్టి యాజనకరాజు సయితము, తనకూఁతు సీతఁదలఁచుకొనుచు దుఃఖము పైకొనఁగా తాళలేక ప్రాణములువిడుచును. నేను బతివ్రతను, కావున నిపుడే పతివెంటఁ బ్రాణము విడుతును. ఈ పతిశరీరమును గౌఁగిలించుకొని యగ్నిహోత్రముసొచ్చెదను' అని విలపించెను. అంత *రాజ్యవ్యవహారములందు నియుక్తులైన మంత్రులావచ్చి, మిక్కిలి దుఃఖమున దురపిల్లుచున్నదై, జాలి గొలుపుచు, రాజుంగట్టుకొని విలపించుచున్న కౌసల్యను రాజునుండి విడిపించి యవ్వలికిం దోలఁగఁ గొనిపోయిరి. అంత మంత్రులు వసిష్ఠాదులయాజ్ఞచే రాజుకళేబరమును, తైలద్రోణియం దుంచి, యంతమీఁదటి రాచకార్యములను జరుపుచుండిరి. ఆమంత్రులు సమస్తధర్మములను దెలిసినవారు గావున, పుత్రుండులేక రాజునకు సంస్కారము మాత్రము సేయనొల్లరైరి. కావున నతనికళేబరమును జెడకుండ పదిలముగా నుంచిరి. మంత్రులు మృతుఁ డయినయారాజును నూనెదొన్నెయందు నుంచుటం జూడఁగానే యాస్త్రీలందఱును 'అయ్యో! ఇతఁడు మరణించెనే' యని మిక్కిలి ప్రలాపించిరి. వారు దీనలయి, చేతులుపయికెత్తి, కన్నులనీళ్లు వెల్లిగొనఁగా, వగలం బొగులుచు, నేడ్చుచు, వినువారికి జాలిపుట్టునట్లుగా 'అయ్యో! మహారాజా! ప్రియవాదియు సత్యసంధుఁడు నగురాముఁడు మొదలే మమ్ముదిగవిడిచినాఁడు. అట్టిమమ్ము నీవును నేలవిడిచెదవు? రాముఁడు మమ్ముఁబాసి పోవఁగా. పతివగు నీవును మృతి నొందఁగా, ఇఁక దుష్టాత్మురాలును బతిఘాతుకియు నగుకైకయొద్ద నెట్టులుండఁ గలము? రాముఁడు మాకును నీకును నెల్లప్పుడును బ్రభుండైనవాఁడు, మంచిమనస్సు గలవాఁడు, శ్రీమంతుఁడు. అట్టి రాముఁడును రాజ్యలక్ష్మిని బరిత్యజించి యడవికిఁ బోయినాఁడేకదా! నిన్నును, ఆవీరునిని, బాసి యావ్యసనమున మైమఱచియున్నవారము, దీనితోఁగూడ రాజ్యగర్వమున కైక పలువిధములం దిరస్కరించుచుండఁగా, దానినిగూడ సైఁచుకొని యెట్లుండఁగలము? పైనిమిటియగు మహారాజును, రామునిని, మహాబలుండగు లక్ష్మణునిని, సుకుమారియగు సీతనును ఎవ్వతె పరిత్యజించినదో, యట్టిది మఱియెవ్వరిని బరిత్యజింపదు?' అని విలపించిరి. ఉత్తమలగు నాదశరథునిభార్యలు, కన్నీళ్లుగ్రమ్మ శోకము ముమ్మరింప, సొంపుమాలి నేలంబడి పొరలిరి. చంద్రుఁడులేనిరాత్రివలెను, పురుషుఁడు లేనిపడఁతివలెను, మహాత్ముఁడగు నామహారాజు లేకుండుటం జేసి, ఆయయోధ్యాపురము ప్రకాశింపకుండినది. అందు జనులెల్ల కన్నీళ్లువిడుచుచుండిరి. స్త్రీలు హాహాకారములు సేయుచుండిరి. ముంగిళ్లును ఇండ్లనడికట్టులును, మ్రుగ్గులు అలుకుట మొదలగునవి లేక పాడుపడియుండెను గాన

* ఇందులకు 'వ్యావహారికాః' అని మూలము. దీనికి 'అంతఃపురాధ్యక్షులగు స్త్రీలు' అని మహేశ్వరతీర్థుల యర్థము.

యాపట్టణము పూర్వమువలెఁ బ్రకాశింపకుండెను. రాజు పుత్రశోకమును తాళలేక స్వర్గమునకుఁ బోఁగా, రాజభార్య లందఱు నేలపయిఁబడి పొరలి పలవించుచుండఁగానే, సూర్యుఁడు కిరణముల నుడిపికొని యస్తమించెను. అంత రాత్రియుఁ జీఁకట్లు దిక్కులం బిక్కటిల, పొడ తెంచినది. అప్పుడచ్చటనున్న కొందఱు 'రాజునకు బలపరాక్రమములు గలసత్పుత్రులున్నను దైవికముగా నపుడు వారియందొకఁడుగూడ దగ్గఱ లేఁడు. మనము ఊరకుండుట యుచితముకాదు. కాన యేదో యొకవిధమున రాజునకు సంస్కారముసేయుద' మనియత్నింపఁగా నచ్చటికి వచ్చిన బంధువులకు, కొడుకు లేక రాజునకు దహనాది సంస్కారములు ఎంతమాత్రమును జేయుట యిష్టముగాదయ్యె.కనుక కొడుకులేక సంస్కారము సేయరాదనినిశ్చయించి యచింత్యదర్శనుఁ డగు రాజుకళేబరమును తైలద్రోణియం దునిచిరి. సూర్యుని మాలి కాంతిసొంపు దూలిన యాకాశమువలెను, నక్షత్రసమూహము వెలుఁగని రాత్రివలెను, మహాత్ముఁ డగురాజును మాలి యాపురము, మార్గములందును చదుకములందును జనులు నెఱసి కన్నీళ్లచే డగ్గుత్తికవడి దుఃఖించుచుండఁగా, ప్రకాశింపకుండెను. రాజు మృతిఁ బొందఁగా నపుడు, ఆపురమందుఁగల పురుషులును స్త్రీలును, అందంద, గుంపులు గుంపులుగాఁ జేరి, భరతునితల్లిని కైకను దూఱుచు దురపిల్లు చుండిరికాని కొంచెమైన నూఱట నొందినవారుగారు. ఇది యఱువది యాఱవ సర్గము.



—మార్కండేయాదులు వసిష్ఠునితో నరాజకమును జెప్పి ప్రార్థించుట.—

అయోధ్యయందు జనులందఱును, ఆక్రందనముసేయుచు, నిరానందులై, కన్నీళ్లు డగ్గుత్తికవడ దుఃఖించుచుండఁగా నారాత్రి దుఃఖమువలన మిక్కిలి దీర్ఘముగాఁదోఁచుచు నెట్లో కడచినది. రాత్రిగడవఁగానే సూర్యోదయమయ్యెను. అంత రాజు నభిషేకించు బ్రాహ్మణులు వచ్చిసభగూడిరి. మార్కండేయుఁడు, మౌద్గల్యుఁడు, వామదేవుఁడు, కాశ్యపుఁడు, కాత్యాయనుఁడు, గౌతముఁడు, మహాకీర్తిమంతుఁ డగుజాబాలియునను రాజకర్తలగు నీబ్రాహ్మణోత్తములును మంత్రులును వచ్చి, రాజపురోహితుఁడగు వసిష్ఠుని దిక్కుమొగంబై వేఱువేఱ నతనితో 'ఈమనరాజు పుత్రశోకమున మరణము నొందెను. దానంజేసి యీ రాత్రిమనకు నూఱు సంవత్సరములవలెఁ గడపరానిదిగాఁ గనుపట్టి యతికష్టమునఁ గడిచినది. రాజుస్వర్గము నొందెను. రాముఁ డరణ్యముపాలయ్యెను. తేజోవంతుఁ డగులక్ష్మణుఁడు నిలువక రాముని వెంటనే పోయినాఁడు. పరంతపులగు భరతశత్రుఘ్ను లిరువురును, కేకయదేశమున రమణీయమగు రాజగృహ మనెడిపట్టణమందు మాతామహునింట నున్నారు. ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారిలో నెవనినైన నొకని, ఇపుడే యిచట రాజుగా నేర్పఱుప వలయును. రాజులేనియెడల రాజ్యము నాశము నొందకుండదు గదా.

అరాజక మగు దేశమునందు, మేఘము, మెఱుపులవరుసలు బారుగొని తుఱుఁగలింప ఉఱుములు మఱిమఱి వెలయ, దివ్యంబగు జలమును భూమిపయిని వర్షింపదు. అరాజక మగు దేశమునందు, పండినపుడు కొల్లవోవు ననుభయముచేత, విత్తనములు చల్లంబడవు. అరాజకమున, తప్పుసేయఁగా శిక్షకుఁడు లేనందున, తండ్రికిఁ గొడుకు గాని, పెనిమిటికిఁ బెండ్లముగాని లోనై నడచుకొనరు. అరాజకమైన దేశమున, దొంగ లపహరింతురుగాన ధనము గలుగదు. బంధుత్వము పుట్టదు గావున భార్యయు కలుగదు. ఇదిగాక మహాభయము మఱియొకటి యున్నది. రాజు లేకుండునేని, క్రయ విక్రయాది రూపమైన సత్యమెక్కడిది? ఇంతకన్న భయమేమి! రాజులేని దేశమున జనులు స్వస్థులై యుండరు గావున సంతోషముతో సభలుగూడరు. ఎవరైన ఛేదించి వేయుదు రనుభయమున రమణీయములగు నుద్యానవనములను నేర్పఱుపరు. దుష్టులు దాఁగుటకు దుర్గములగునని దేవాలయాది పుణ్యమందిరములను గట్టరు. రాజులేని దేశమునందు, ఎడ తెగక యాగము సేయువారును, వేదాధ్యయనపరులును, తీక్ష్ణవ్రతములాచరించువారును, జితేంద్రియులు నగు బ్రాహ్మణులు మహాయజ్ఞము లను విఘ్నభయమున ననుష్ఠింపరు. అరాజక మగు దేశమందు, యాగములను యజించు బ్రాహ్మణులు, ధనసంపన్నులయినను, యాగములు సేయునపుడు, తాము ధనికులని తెలిసినయెడల దండించి కొల్లగొట్టుదు రనుభయమున భూరిదక్షిణల నొసంగరు. అరాజక మగు దేశమందు, ప్రోత్సాహకుఁడుగాని, పారితోషికమిచ్చు వాఁడుగాని లేనందున, మిక్కిలి నటనర్తకులతోఁ గూడిన యుత్సవములును యాత్రలును రాష్ట్రవృద్ధి కలిగించునవయ్యు వర్ధిల్లవు. రాజులేని దేశమందు, దాయభాగాది వ్యవహారములు గలవారికిఁగాని క్రయవిక్రయరూపవ్యాపారములచే జీవించువారికిఁ గాని తీర్పరియైనను నియామకుఁడైనను గలుగనందున ప్రయోజనము కలుగదు. మఱియు నితిహాసపురాణకథలు చెప్పువారును, కథలువిన నాసగలవారికి కథలుచెప్పి పారితోషికాదు లిప్పించు ప్రభువులు లేమిచే రక్తి నొందరు. అరాజకమైన దేశము నందు చోరభయమువలన కన్నియలు బంగారుసొమ్ముల సింగారించుకొని, గుంపులుగా చెలికత్తియలం గూడికొని, సాయంకాలమున క్రీడించుటకై, యుద్యానవనములకుఁ బోవరు. రాజు లేని దేశమందు, దుష్టులు పరిభవింతు రనుభయమున, కాముకులగు పురుషులు, తమకాంతలతోఁగూడి వడిగాఁబోవు రథములనెక్కి, విహారార్థమై, వనములకుం బయలుదేఱరు. అరాజకమగు దేశమున, కృషివలనను గోవులవలనను జీవించు ధనాఢ్యులగు వైశ్యులు, దొంగలభయమున, గాలివచ్చుటకై, తలుపులు దెఱచుకొని సురక్షితముగా రాత్రులం బరుండనేరరు. అరాజక మగు దేశమున, కట్టంబడిన ఘంటలు గణగణ మొరయఁగా, మేటిదంతములు వన్నె చూప, అఱువదియేండ్లవయసుగల యేనుఁగులు రాజమార్గములం దిరుగాడుచుండవు. రాజులేని దేశమందు, అమంత్రకములైన యిషువులను సమంత్రకములైన బాణము

లను సాదనసేయునపుడు, ఎడతెగక యాబాణములను వేయుచుండు వారఱచేత నల్లెత్రాటిని దివియుచప్పుడు వినంబడదు. అరాజక మగుదేశమునందు, సరకులు పెక్కులు మోచుకొని విక్రయించుటకై దూరదేశమునకుఁ బోవు వర్తకులకు దారి క్షేమముగా సాఁగదు. అరాజక మగుదేశమందు, జితేంద్రియుఁడై, యొంటరిగాఁ దిరుగుచు, నెచ్చటఁ బ్రొద్దుగ్రుంకునో యదియె నివాసముగానుండు. యతి, అన్నము పెట్టువారులేనందున, మనమున పరమాత్మనుభావించుచు సంచరింపఁడు. అరాజక మగుదేశమున, యోగక్షేమములు గలుగవు. దళవాయి కలుగమిం జేసి సేనయు శత్రువులతాఁకును సహించి నిలువఁజాలదు. రాజులేని దేశమున, చోరభయమువలన, జనులు సొమ్ముల నలంకరించుకొని యుత్తమాశ్వములను రధములను ఎక్కి, సొంపుపెంపున, తలఁచినంతనే నిర్భయముగా విహారార్థమై బయలువెడలరు. అరాజకమగు దేశమున, దుష్టభయమున, శాస్త్రవిదులగు పండితులు, ఋష్యాశ్రమములుంగువనములందు, శాస్త్రార్థముల నుపన్యసించుచుండరు. అరాజక మగుదేశమున, విఘ్నభయమున, జనులు నియతులై, దేవతల నర్చించుకొఱకుఁ బూదండలను, కుడుములను దక్షిణలను సమకట్టరు అరాజక మగుదేశమునందు, రాచకుమారులు చందనమును అగురువును బూసికొని వసంతఋతువునందు, వృక్షములవలె, కన్నుల పండువు గావింపరు. జలములేని నదులును పచ్చికలేనివనమును, గాఁపరిలేని గోవులును, ప్రకాశింప కుండునట్లు రాజులేని రాష్ట్రమును బ్రకాశింపదు. రధమునకు ధ్వజము ప్రకాశకమగుచిహ్నము. అగ్నికి ధూమము ప్రకాశమగు గుఱుతు. అట్లే మనకందఱకును రాజు ధ్వజమువలె ప్రకాశకుఁడైనవాఁడు. అట్టిరాజు మనల నిట విడిచి స్వర్గమునొందెను. రాజులేని దేశమందు, ఎవ్వనిసొమ్ము వారికిఁ బదిలముగా నుండదు. చేఁపలు ఒండొంటిని భక్షించునట్లు మనుష్యులు నొకరినొకరు గీటడఁగించుచుందురు. *వర్ణాశ్రమాచార మర్యాదలను నుల్లంఘించి దైవములేదని వాదించుచు శంకమాలితిరుగుచుండు నాస్తికులు, రాజుండెనేని. అతనిశిక్షచే సాధువులు కాఁగలరు. దేహమునకుఁ, గన్ను మంచి కలిగించుచు నెబ్బర దొలఁగించుచు నెట్లు వర్తించుచుండునో, యట్లురాజును, రాజ్యమునకు మంచినెబ్బరలనరసి సత్యమును ధర్మమును బ్రవర్తింపఁ జేయువాఁడు. రాజే సత్కులమునఁ బుట్టినవారి కులాచారములఁ బ్రవర్తింపఁజేయువాఁడు, రాజేజనులకు తల్లియు దండ్రియు. రాజు జనులకు హితకరుఁడు. యముఁడు దండనముమాత్రమే సేయును. కుబేరుఁడు ధనమాత్రమునిచ్చును. ఇంద్రుఁడు పాలనము మాత్రముసేయును. వరుణుఁడు సదా

*ఇందులకు 'యేహి సంభిన్నమర్యాదా నాస్తికాశ్ఛిన్నసంశయాః। తేఽపి భావాయ కల్పన్తే రాజదణ్డనిపీడితాః' అనిమూలము. దీనికి 'శాస్త్రమర్యాదల నతిక్రమించి పూర్వము రాజదండనముచే బాధితులైయుండునాస్తికులిపుడు రాజదండనము కలుగునని జంకు కొంచెమైనను లేక బాహాటముగా ప్రవర్తించు చుందురు' అని గోవిందరాజులయర్థము.

చారమును మాత్రము కుదుర్చును. రాజో యీసర్వప్రకారములను దానొక్కఁడె చేసిరక్షించుటవలన, ఆయనకు బేరాములనలువురికిని విశేషించినవాఁడగుచున్నాడు. ఇదిమంచిది యిదిచెడ్డదియని వేలువేల నిర్ణయించి పద్ధతు లేర్పఱుచురాజు లోకమునలేకపోవునేని, అకటా! యీ జగమంతయు చీఁకటి గ్రమ్మినట్లుండును. కాని యిందు 'ఇదితగును ఇది తగదు' అని యేదియుఁదెలియదు. మహారాజు బ్రతికియున్నపుడును మేము సముద్రము చెలియలికట్టను దాఁటకుండునట్లు నీమాట నెంతమాత్ర మండఱము నతిక్రమింపము. ఇఁక రాజు గతించిన పిదపను నట్లే యుందు మనుట చెప్పనేల? బ్రాహ్మణోత్తమా! రాజును స్థాపించుట మనకుఁ గలవృత్తమగుట నాలోచించి, అరాజకత్వము వలన మా వృత్తములకుఁ గలుగు నాశమును దలపోసి, రాజులేకున్నయెడల రాజ్యమంతయు నరణ్యప్రాయమగుటయు నూహించి, యిక్ష్వాకువంశమునం బుట్టిన కొమారు నొక్కరుని రాజుగా పట్టాభిషేకము సేయుము.' అనిరి. ఇది యఱువదియేడవ సర్గము.



—వసిష్ఠుఁడు భరతునిఁదోడితెచ్చుటకై కేకయనగరమునకు దూతలనుబంపుట.—

వారల మాటలువిని వసిష్ఠుఁడు మిత్త్రులయినయాసుమంత్త్రాది మంత్త్రులను మార్కండేయాదిబ్రాహ్మణుల నందఱినిఁ జూచి, 'భరతుఁడు తనతమ్ముఁ డగుశత్త్రుఘ్నునితోఁగూడ రాజగృహపట్టణమున మేనమామ యింట సుఖముగా నున్నాఁడు. కావున నిపుడు వీరులైన యీయన్నదమ్ముల నిరువురను దోడ్కొనివచ్చుటకై వడిగాఁ బోవఁగల దూతలు వేగవంతములైనయశ్వములనెక్కి శీఘ్రముగాఁ బోదురుగాక. రాజు భరతునకు రాజ్యమిచ్చియున్నాఁడే! ఇక మనము విచారింపవలసిన దేమున్నది?'' అనెను. అంత మంత్త్రులు మొదలైన వారందఱును 'మీరు చెప్పినట్లు దూతలు పోదురుగాక' యని వసిష్ఠునితోఁ జెప్పిరి. వసిష్ఠుఁడును వారలు చెప్పినది విని, 'సిద్ధార్థా! విజయా, జయంతా! అశోకా! నందనా! *ఇటు రండు. మీకెల్ల నేమిచేయవలయునో చెప్పెదవినుఁడు. వడిగల గుఱ్ఱములనెక్కి మీరు వేగముగా రాజగృహపురమునకుఁబోయి, దుఃఖముమాని, నాయాజ్ఞ చొప్పున భరతునిఁజూచి యతనితో 'పురోహితుఁడును మంత్త్రులందఱును నీకుఁ దమ క్షేమమునుజెప్పిరి. ఒక కార్యము కాలముమించిపోవుచున్నది. నీవు దానిని జేయవలసియున్నది గావున జాగుచేయక తోడనే బయలువెడలుము' అనిచెప్పుఁడు. మీరుపోయి 'రాముఁడడవికిబోయినాఁ'డనిగాని, మీతండ్రి మృతిబొందినాఁ'డనిగాని, రఘుకులమునకుఁ బాటిల్లినయీతేజోనాశము నెంతమాత్రమును భరతునకుఁ జెప్పకుఁడు. కేకయరాజునకును భరతున

* ఇచ్చట సిద్ధార్థుఁడు మొదలగువారు మంత్రులుగారు; మంత్రుల పేళ్లవంటి పేళ్లుగల యితరులుకావున నే వీరితో మంత్రికానట్టినందనుఁడును గూర్పఁబడినాఁడు.

కును కానుకగా పట్టువస్త్రములును మేలైనభూషణములును శీఘ్రముగాఁ దీసికొని పొండు' అని యానతిచ్చెను. ఇట్లుచెప్పి దారిబత్తెములకిచ్చి పంపఁగా, ఆదూతలు పయనమునకుఁ దగినవిగా సమ్మతములైన మేటిగుఱ్ఱములనెక్కి కేకయదేశమునకుఁ బోవువారలై దారపుత్రాదులకుఁ దమపయనముఁ దెలుపుటకు తమతమగృహములకుంబోయిరి. అంత నాదూతలు పయనమునకుఁ గావలసినపాథేయము మున్నగు వానిని సమకట్టుకొను మిగతకార్యములను జూచుకొని, మరల వసిష్ఠునొద్దకువచ్చి యనుమతినొంది త్వరితముగాఁబోయిరి. వారు అయోధ్యనుండి * పడమరగాఁ బయలుదేఱి అవతాలపర్వతము పడమటిభాగముగాఁబోయి యాకొండకును దానికిఁ బడమరగానున్న ప్రలంబపర్వతమునకును నడుమ మాలినీనదీతీరమార్గమునఁ గొంత దూరము ఉత్తరముగాఁ జని యంత ప్రలంబపర్వతము నుత్తరభాగముననే పడమరగా పయనమైపోయిరి. వారు హస్తినాపురమునొద్దను గంగనుదాఁటి పశ్చిమాభిముఖులయి కురుదేశములోని జాంగలదేశము నడిమిమార్గమునఁబోయి పాంచాలదేశము సేరి యందు జలపూర్ణములగు సరస్సులనును నిర్మలజలంబు లగునదులనుఁ జూచుచుఁ గార్యవశమున నెచ్చటను నిలువక త్వరితముగాఁబోయిరి. వారు నిర్మలజలముగలిగి, నానావిధపక్షులు కొలకొలగూయ నొప్పుచు, స్నానపానములు సేయు జనులు నిండియున్న దివ్యంబగు శరదండానది కడకు శీఘ్రముగాఁబోయి యచట నిలువక దానిని దాఁటి యరిగిరి. వారాశరదండానది పడమటితీరమునందు దేవతాధిష్ఠానముగలదై కోరినకోర్కులు సఫలముగాఁ జేయుటచే సత్యోపయాచనమని యన్వర్థనామమును గలిగియున్న పుణ్యవృక్షమును జేరి, యెల్లవారికిని మ్రొక్కందగిన యావృక్షమునకుఁ బ్రదక్షిణముసేసి నమస్కరించి కుళింగాపురము ప్రవేశించిరి. పిదప వారు అభికాలమను గ్రామముసేరి యచట బోధిభవన మనుపర్వతమునుండి పుట్టినపుణ్యనది యగునిక్షుమతిని దాఁటిరి. ఆనదీతీరమందలి గ్రామములును దశరథవంశ్యులచే పితృపైతామహముగా ననుభవింపఁబడుచుండును. వారందు దోసెఁడునీళ్లుమాత్రమే యాహారముగాఁగొని యిక్షుమతీతీరమున తపస్సు చేయుచుండు వేదపారంగతులగు బ్రాహ్మణులను జూచి, బాహ్లీక దేశ జనపదముల నడిమిదారింబట్టి సుదామపర్వతమునకుఁబోయిరి. వారాపర్వతమునందు విష్ణుపదాం

* అయోధ్యకు ముందట పడమరదెసను అవతాలపర్వతము దక్షిణోత్తరముగా వ్యాపించియున్నది. దానికి పడమరగా ప్రలంబపర్వతము దక్షిణోత్తరముగా నిగిడి పిదప వంపుదిరిగి పూర్వపశ్చిమముగా సాఁగియున్నది. దూతలు అయోధ్యనుండి పడమరగా బయలుదేఱి, దక్షిణోత్తరముగాసాఁగియున్న యవతాలపర్వతము పడమటిచివరయోరగానే పోయి, దానికిని దానికిఁ బడమరగానున్న ప్రలంబపర్వతమునకును నడుమ మాలినీనది యోరగా తూర్పుదిక్కుగాఁబోయి, యంత ప్రలంబపర్వతము పూర్వపశ్చిమముగా వంపు దిరుగుచోట తాము పడమరగా తిరిగి యాప్రలంబపర్వతము నుత్తరభాగముననే పోయిరని తెలియునది.

కితమైన పుణ్యస్థానమును, పర్వతపర్యంతమునందలి పిపాసానదిని, దాని తీరమందలి శాల్మలీవృక్షమునుం, జూచుచు అంశంద నదులను నడబావులను చెఱువులను పడియలను కొలంకులను నానావిధములైన సింహవ్యాఘ్రమృగములను గజములను గనుఁగొనుచు, రాజాజ్ఞచే మిక్కిలిదూరం బగుమార్గంబును గడచిపోయిరి. అంత నాదూతలు మిక్కిలి దవ్వు దారినడచుటచేత గుఱ్ఱములు బడలికనొందఁగా, శీఘ్రమున గిరివ్రజ మనునామాంతరము గల కేకయరాజపట్టణమును జేరిరి. భరతుని శీఘ్రముగా దోడితెచ్చి యతనిచే నౌర్ధ్వదైహికాదులు సేయించి పరలోకప్రాప్తి రూపమైన ప్రియమును తమప్రభుండగు దశరథునకుఁ గలిగించుటకును, దశరథుని కులమువారందఱును అనాథులుగానుండుటచే భరతునిఁదెచ్చి నాథునింజేసి వారిని రక్షించుటకును, భర్తయగు దశరథునివంశములోని భరతాదులను ప్రతిష్ఠించుటచే అతని వంశమునకుఁ బ్రతిష్ఠ గావించుటకును, ఆదూతలాదరము మిగుల త్వరపడి పొద్దుగ్రుంకినను విడువక రాత్రియందును గొంతనడచి రాత్రిగనే యారాజగృహమును జేరిరి. ఇది యఱువదియెనిమిదవసర్గము.



## (కేకయనగరమున భరతుఁడు తనకైన దుఃస్వప్నము సుహృదులకుఁ జెప్పుకొనుట.)

ఆదూతలు గిరివ్రజపురమును జేరినరాత్రియే భరతునకు దుఃఖకరమగు నొకస్వప్నముగలిగినది. రాత్రి తెల్లవాఱుచుండఁగానే యప్రియమైన యాస్వప్నమునుగని రాజాధిరాజపుత్త్రుఁడగు భరతుఁ డట్టిస్వప్నమతిశీఘ్రముగా ఫలించునే యని మిక్కిలియుఁ బరితపించెను. ప్రియవాదులగు భరతుని చెలికాండ్రు అతఁడేమో పరితపించుచున్నాఁడని తెలిసి యాక్లేశమును బోఁగొట్టుటకై సభయందు పలువిధములయిన కథలు చెప్పిరి. భరతునిదుఃఖ ముపశమించుటకై కొందరు వీణాదులవాయించిరి. కొందఱు సుకుమారముగా నృత్యములాడిరి. మఱికొందఱు నాటకములఁజదివిరి. కొందఱు నవ్వునుబుట్టించు మాటలఁజెప్పిరి. రఘువంశ్యుఁడగు నామహాత్ముఁడు భరతుఁడు, ప్రియవాదులయినతనస్నేహితులు సభాసముచితములైన హాస్యము లెంతచేయుచున్నను సంతోషమునొందినవాఁడు గాఁడయ్యె. అప్పుడు స్నేహితులుబలిసియున్న భరతునిఁజూచి యంతరంగస్నేహితుఁడొకఁడు ‘చెలికాఁడా! చెలికాండ్రు నిన్నింతో యింపుగొలుపుచు చుట్టుఁగొలుచుచున్నను నీవు సంతోషము లేకున్నావేల’ అని యడిగెను. అట్లు నెచ్చెలియడుగఁగా భరతుఁడు వారితో ‘నాకీ విన్నఁబాటుగలుగుటకు కారణము చెప్పెద వినుము. నేను స్వప్నమున నాతండ్రి మలినదేహముతో తలవెండ్రుకలు విరియబోసికొని పర్వతశిఖరమునుండి కలుషమైన పేఁడమడుఁగులోఁ బడుచుండఁగాఁ జూచితిని. మఱియు నతఁడా పేఁడమడుఁగులో కప్పవలె తేలుచు దోసిటనూనెం ద్రావుచు మాటిమాటికి వికారముగా నవ్వుచు నుండఁ

గంటిని. అంతనతఁడు నువ్వులయన్నము భుజించి మాటిమాటికి తలక్రిందై దేహ మంతయు తైలముపూసికొని తైలమునందే మునిఁగెను. మఱియు నాస్వప్నమున సముద్రమెండుటయు, చంద్రుఁడుఁ భూమిపైఁబడుటయు, జగమంతయు జీఁకటి గ్రమ్మినట్లు ఏమియు నగపడకుండుటయు, రాజు పట్టపేనుఁగుదంతము తునుకలగు టయు, మండుచున్న యగ్నిహోత్రము తటాలునఁ జల్లారుటయు, భూమిబ్రద్దలు వాఱుటయు, పలువిధములైన వృక్షము లెండిపోవుటయు, పర్వతములన్నియు ధ్వంస మునొంది పొగయుచుండుటయుఁ, జూచితిని. ఆరాజు నల్లనివలువ గట్టుకొని యినుప పీఁటపై గూర్చుండఁగా, నలుపును గోరోచనపువన్నెయుగల స్త్రీలు అతనింజూచి నవ్వుచుండిరి. మఱియు నాధర్మాత్ముఁడు ఎఱ్ఱని పూదండలుదాల్చి కలపమును బూసి కొని వేగమున గాడిదలుఁగట్టిన తేరునెక్కి దక్షిణపుదిక్కును గూర్చి పోయెను. ఎఱ్ఱనివలువ గట్టుకొని వికారమగు మొగము గలిగియున్న రాక్షస స్త్రీయొక్కతె పెడనవ్వునవ్వుచు రాజును బట్టియీడ్చుకొని పోవుచుండఁగాఁ జూచితిని. ఇట్లీరాత్రి మహాభయంకరమైనయాస్వప్నము కంటిని. కాబట్టి నాకో రామునకో రాజునకో మఱిలక్ష్మణునకో మరణము గలుగును. స్వప్నమునందు ఏ మనుష్యుఁడు గాడిదల గట్టిన రథము నెక్కిపోయినట్లు గనఁబడునో చితియందు వాని దేహమునుండి పొగ సెగవెడలుట శీఘ్రముగానే చూపట్టును. ఈ కారణమునుబట్టి నేను దీనుఁడనై యున్నాఁడను, కావుననే మిమ్ముఁ బాటింపనైతిని. నాగొంతు ఎండుచున్నట్లున్నది. నామనస్సున కెంతమాత్రము కుదురులేకున్నది. భయముకలుగుటకు నాకేమియుఁ గారణము తోఁపలేదు. అయినను నాకును వశముగాక భయమే పైకొనుచున్నది. నాకంఠధ్వనియు నశించినది. నావన్నెయు వెలుకఁబాఱినది. నన్నే నేను జూచి యసహ్యాపడుకొనుచున్నట్లున్నది. కాని, యందులకు కారణమేమో నాకు తెలియ కున్నది. ఈ దుఃస్వప్నప్రకారము పలురూపములుగా నున్నది. ఇట్టి దింతకు మును పెన్నఁడును నేను విచారించినదిలేదు, ఇట్టిదానిని గని, గన్నారఁజూడరాకున్న రాజును దలంచుకొనఁగా, నామనస్సునకుఁ గలిగినయీమహాభయము విడువకున్నది' అని చెప్పెను. ఇది యఱువదితొమ్మిదవసర్గము.



## భరతుఁడయోధ్యకుఁ బయనమగుట.

భరతుఁ డట్లు దుస్స్వప్నవృత్తాంతము సెప్పుచుండఁగా, దూతలు, తమ గుఱ్ఱము లలసటనొందఁగా వచ్చి, పగవారికిని దాఁటరానియగడ్తలు గలదై రమణీ యంబగు నారాజగృహపురమును బ్రవేశించి కేకయరాజును రాజకుమారుఁ డగు యుధాజిత్తునెదుర్కొని, సేయు మన్ననలుగయికొని, కేకయరాజు పాదములకు నమస్కరించి యంత భరతునొద్దకుఁబోయి, యతనితో 'పురోహితుఁడు నీతో తనక్షేమమును జెప్పు' మనెను. అట్లే మంత్రులందఱును, నీతో క్షేమమును జెప్పు

మనిరి. కాన నీవు శీఘ్రముగా రావలయును. ఒక కార్యము కాలము మించిపోవు చున్నది. నీవు దానిని జేయవలయును. కాన త్వరితముగా బయలువెడలుము. విశాలాక్షా! మిగుల మేలయిన యీవస్త్రములును ఆభరణములును గయికొని నీమాతామహునకు మేనమామకునునిప్పించుము. రాజకుమారా! ఇందు,నీమాతా మహునికి కేకయరాజునకియ్యఁ దగినవస్త్రాభరణములు సరిగానిరువదికోట్లు విలువ గలవి. ఆట్లె నీమేనమామకు నియ్యఁదగినవి కొఱఁతలేక పదికోట్లధనము వెలగలవి, కావున నీవే యియ్యవచ్చును' అనిరి. భరతుఁడు సుహృజ్జనులందు మిక్కిలి యను రక్తిగలవాఁడు. కావున వాని నన్నింటిని దీసికొని మాతామహునకును మాతులు నకును నొసంగి, యాదూతలను అభిమతములైన ధనాదులిచ్చి తనిపి, యంత వారలంజూచి 'నాతండ్రి దశరథమహారాజు క్షేమమేకదా? మఱిరాముఁడును మహాత్ముఁ డగులక్ష్మణుఁడును ఆరోగ్యము గలిగియున్నారేకదా? బుద్ధిమంతుఁ డగు రామునితల్లియు, బూజ్యురాలును, ధర్మపరాయణయు, ధర్మజ్ఞయుఁ బ్రజలందు గుణమును మాత్రమే గ్రహించునదియు నగుకౌసల్య యారోగ్యము గలిగియున్నదా? లక్ష్మణునికిని వీరుఁడగుశత్రుఘ్నునికిని తల్లియు, ధర్మములం దెలిసినదియు, నడిమి తల్లియు నగుసుమిత్రయును, ఆరోగ్యముతో నున్నదేకదా? * స్వప్రయోజనమునే పాటించుచు, ఎప్పుడు నుగ్రురాలై, కోపమునఁ గొఱగొఱలాడుచుఁ, దన్ను ప్రాజ్ఞు రాలుగా నెన్నుకొని విఱ్ఱవీఁగుచుండునాతల్లికైక యారోగ్యముగలిగి యున్నదా? మఱిమీరు' తనబంధువులకడకు పోవుట తెలిసి యాయమ సమాచార మేమి చెప్పెను'? అని యడిగెను. మహాత్ముఁడగుభరతుఁ డిట్లు చెప్పఁగా నాదూతలప్పుడు సవినయముగా నతనింజూచి 'పురుషవ్యాఘ్రా! నీవు కుశలము గోరువారెల్లఁగుశలమే. †పద్మహస్తయగు లక్ష్మియు నిన్నువరించుచున్నది. రథమును బన్నఁ బంపుము' అనిచెప్పిరి. భరతుఁడును ఆదూత లిట్లు చెప్పఁగావిని వారలంజూచి "నేను కేకయ మహారాజుతో 'దూతలు వచ్చి నన్ను రమ్మని త్వరపెట్టుచున్నారు' అని చెప్పి వచ్చెద" నని చెప్పి యారాజకుమారుఁడు దూతల ప్రేరణమున మాతామహుఁ డగుకేకయరాజు నొద్దకుఁబోయి 'రాజా! నాతండ్రియొద్దనుండి దూతలువచ్చి నన్ను బిలుచుచున్నారు, కాన తండ్రికడకుఁ బోయెదను. మరల నీవెప్పుడు నేను రావ లయునని తలంచుకొందువో యప్పుడది తెలిసివచ్చెదను' అనెను. భరతుఁడట్లు చెప్పఁగా నతనిమాతామహుఁడైన యాకేకయరాజు ఆరఘువంశ్యుని శిరంబు మూర్కొని శుభవాక్యముల నప్పుడతనితో 'నాయనా! పరంతపా! నేను సెలవిచ్చి

* భరతుఁడు కైక నిట్లు వర్ణించుటచే, దుస్స్వప్నము గనుటవలనను దూతలు వచ్చుటవల నను ఆయమ యేమోయనర్థము చేసియుండునని యూహించెననుట తెలియునది.

† ఇందువలన రాజ్యలక్ష్మి నిన్ను బొందునని దూతలయంతరంగ భావము, అమంగళము తొలగుటకై శుభము గానట్లు చెప్పివారని భరతుని భావము.

తిని, పొమ్ము. నిన్నుఁ గనికైక సుపుత్త్రవతియైనది. నీతల్లికిని నీతండ్రికిని క్షేమము చెప్పుము. పురోహితుఁడగు వసిష్ఠునికిని మఱియు తక్కుంగల బ్రాహ్మణోత్తములకును గొప్పవిలుకాండ్రయిన యాయన్నదమ్ములకు రామలక్ష్మణులకును క్షేమమని చెప్పుము' అనెను. ఇట్లుచెప్పి కేకయుఁడు భరతునికి సత్కారపూర్వముగా నుత్తమములైన గజములను చిత్రములగు కంబళములను మేలయిన యజినములను మిక్కిలి ధనమును నిచ్చెను. మఱియు కేకయుఁడు కైకకుమారుని సత్కరించి యతనికి బంగరు కంఠభూషణములు రెండువేలును గుఱ్ఱములు పదియాఱు వందలును నిచ్చెను. మఱియు నాయశ్వపతి భరతునకు, ప్రభువుతోఁగూడ ప్రాణములు విడుచునంతటి స్వామిభక్తిపరాయణులును సహాయభూతులును విశ్వాసార్హులును గుణవంతులునగువారిని భరతుని వెంటఁబోవ నిచ్చిపుచ్చెను. భరతుని మేనమామ యుధాజిత్తు ఇరావంత మనుపర్వతమునను ఇంద్రశిరపర్వతమునను బుట్టినవై చూచుటకింపైకనుపట్టుగజములను, వేగవంతములై బరువుల మోయుటకు మిగులఁ బనుపడియుండుగాడిదలను, ధనమును నొసఁగెను. మఱియు నతం డంతఃపురమున గోముగాబెంపఁబడినవై పెద్దపులులవంటి వీర్యమును బలమును కలిగి కోఱలె యాయుధములుగా పెనుకాయములతో నొప్పు కుక్కలను కానుకగా నొసంగెను. అప్పుడు కైకకుమారుఁడగు భరతుఁడు పయనమందలి తొందరపాటుచేత కేకయమహారాజు తన కంతధన మొసఁగినందులకు సంతోషింపఁడయ్యె. అప్పుడు దూతలు వేగిరపడుటవలనను దుస్స్వప్నముగని యుండుటవలనను అనర్థమేదో కలిగియున్నదని యతని మనస్సునఁ బెద్దయు చింతకుదురు కొనెను, ఆశ్రీమంతుఁడు జనంబులును గజతురగంబులును బలసి మిక్కిలి పెద్దదైయుండునట్టి *తన గృహమునుండి వెడలి సాటిలేని రాజమార్గమునఁ బోయెను. అంత నా మహాబుద్ధిమంతుఁడు ఆ రాజమార్గము గడచి యంతఃపురముగాంచెను. పిదప శ్రీమంతుఁడగు నా భరతుఁడు, ఆ యంతఃపురము నడ్డులేక ప్రవేశించెను. ఆ భరతుఁడు శత్రుఘ్నునిఁ గూడి తాతయగు కేకయరాజును మేనమామయగుయుధాజిత్తును వీడ్కొని రథమునెక్కి పయనమైపోయెను. అట్లు భరతుఁడు పోవుచుండఁగా మిగులగుండ్రనైన చక్రములుగల రథములను పెక్కునూఱులకొలఁదిని లొట్టియలను ఎద్దులను గుఱ్ఱములును బూన్చి తోలుకొని, యతనిని వెంబడించిరి. మహాత్ముఁడగుభరతుఁడు, తాతసైన్యము కాపుదలసేయుచునుండఁగా, శత్రుఘ్నునిం దోడ్కొని, తన్నుంబోలిన సహాయులం గూడి యకంటకుఁడై, స్వర్గమునుండి సిద్ధుఁడు వెడలునట్లు గృహముననుండి వెడలెను.

ఇది డెబ్బదియవ సర్గము.



* దీనిచేత భరతునికిఁ గలిగిన దుఃస్వప్నమును దూతలురాకయు వినిన కేకయుఁడును యుధాజిత్తును భరతుఁ డున్నయింటికేవచ్చి కానుక లిచ్చిరనియు, కావున భరతుఁ డతనియింటిని విడిచి మాతామహి మొదలగువారినిఁ జూడ రాజమార్గమునఁ బోయెననియు నూహ్యము.

**భరతుఁ డయోధ్యకు వచ్చుట, తండ్రి గృహమునకుఁ బోవుట.**

అంత రఘుకులుఁడును కాంతిమంతుఁడును శ్రీమంతుఁడును ఇక్ష్వాకుకుల సంతోషకరుఁడు నయినయా భరతుఁడు రాజగృహపురము తూర్పుదిక్కుం గూర్చి పోవుచు సుదామానదింజూచి యానందించుచు దానినిదాఁటి యవ్వలిదరి దవ్వై విశాలముగా నున్నహ్లాదినీనది నుత్తరించి, పశ్చిమ ముఖముగాఁ బ్రవహించుచు నలలుగొట్టుచున్న శతద్రూనదినిని దాఁటెను. ఆ శ్రీమంతుడు ఏలాధానమను గ్రామమునొద్ద ఆ శతద్రూనదిని దరించి, విశ్రాంతికొఱకు నపరపర్వటమను గ్రామమును జేరి, శిలలనాకర్షించు స్వభావము గలశిలావహానదినిదాఁటి దాని కాగ్నేయ దిక్కున నున్నశల్యకర్తనమను పట్టణమును జూచుచును సత్యసంధుఁడును పరిశుద్ధుండును గాన నచటివారి కీతిబాధలునివారించునట్లు చెప్పి, యజ్ఞేచేసి, చైత్రరథమనువనమును జూచుకుతూహలమున మహాపర్వతములను గడచిపోయెను. అతఁడు సరస్వతీనదియు సింధునదియు సంగమమునుబొంది, వీరమత్స్యదేశమున కుత్తరమున నుండు భారుండ మనువనమును బ్రవేశించెను. అంత నతఁడు, వేగముగా బ్రవహించుచు మనస్సున కింపుగొలుపుచుఁ బర్వతంబులచే జుట్టంబడియున్న కుళింగానదిని ప్రవాహపు వేగమునను పర్వతావరణమువలనను దాఁటలేక యమునానదినిజేరి యచట దానినిదాఁటి యెండకు నలసిన సైన్యమును గొంత విశ్రమింప నానతిచ్చెను. ఆ కుళింగాయమునాసంగమస్థలమునందు గుఱ్ఱముల బడలికదీర్చి నీళ్లుపోసి మేనులకాఁక చల్లార్చి తానును నచట జలకమాడి నీరుద్రావి యింక ముందు నీళ్లుదొరకుట కష్టముగావున జలమును సంగ్రహించు కొనిపోయెను. మంగళాచారయుక్తుఁ డగునారాజ కుమారుఁడు భద్రజాతిగజము నెక్కి యంతగా జనసంచారములేని యామహారణ్యమును, వాయువు ఆకాశము నతిక్రమించు నట్లు సుఖముగా గడచిపోయెను. అంత నతఁడు అంశుధానపురముకడ మహానదియగు గంగనుదాఁటుట కష్టముగావున, ప్రాగ్వట మనుపురము దానిని దాఁటుటకుం దగినస్థలముగాఁ బ్రసిద్ధినొందిన దగుటచే నచట దానిని దాఁటుటకై పోయెను. అతఁడు ప్రాగ్వటమున గంగనుదాఁటి కుటికోష్ఠికానదిని జేరెను. అతఁడు సైన్యముతోఁగూడ ఆ నదినిదాఁటి యంత ధర్మవర్ధనమను గ్రామమును జేరెను. అచట నుండి తోరణగ్రామమును జేరి దానికి దక్షిణభాగమునఁ బోయి జంబూప్రస్థ మను గ్రామమునుబొంది యచటనుండి రమణీయమయిన వరూథమను నూరునకుఁ బోయెను. అతండాయూరిదాపున నున్న రమణీయవనమునం దారాత్రి వసించి యుండి యంతతూర్పు మొగమై యుజ్జిహానాపురి యుద్యాన వనమును జేరెను. ఆ యుద్యానవనమునందు కదంబవృక్షములు మిక్కిలియుఁగలవు. అతం డావనమందలి కదంబవృక్షములను జేరగానే యింకమీఁద నంతయు తనదేశమేగావున భయము లేక మెల్లగారండని సేనకున్నాజ్ఞాపించి యంత వడిగలగుఱ్ఱములఁ బూన్చి త్వరిత

ముగాఁబోయెను. అతఁడు * సర్వతీర్థమనెడి యూరను నొకరాత్రి వాసముచేసి యుత్తానికానదిని మఱియుఁ బలువిధములైన తక్కిన నదులను బర్వతదేశంబులం బుట్టిన గుఱ్ఱములనెక్కి కడచిపోయి హస్తిపృష్ఠకమను గ్రామముచేరి దానియొద్ద కుటికానదిని దాఁటెను. ఆపురుషసింహుఁడు లౌహిత్యనగరమునందు కపీవతీనదిని దాఁటెను. ఆతఁడు ఏకసాలగ్రామమున స్థాణుమతీ నదిని దర్శించి యంత గుఱ్ఱములు అలసటనొందుటవలన కళింగనగరము సమీపమున నున్న సాలవనమును విశ్రాంతికొఱకుఁజేరి యచట స్వల్పకాలమే యుండి యపుడే కదలి శీఘ్రముగా బోయెను. అతఁడా సాలవనమును ఆ రాత్రిని శీఘ్రముగా గడచి యంత నరుణోదయమునకు వైవస్వతమనువుచే నిర్మిత మయిన యయోధ్యానగరము గాంచెను. ఆపురుషశ్రేష్ఠుఁడు త్వరయురవడిచేత ఏడురాత్రులు దారినడిచి యంత నెనిమిదవ దినమున తనముందటఁ జూపట్టిన యయోధ్యనుగాంచి సారథింజూచి 'సారథీ! పుణ్యము లయినయుద్యానవనములు గలిగి, మిగుల పొగ ద్దగన్న మృత్తికతో నుల్లసిల్లు నయోధ్య యిదె కనఁబడుచున్నది చూడు. అందు యాగములుచేసిన వారును శమదమాదిగుణ సంపన్నులును వేదపారంగతులును మిక్కిలి ధనికులు నగుబ్రాహ్మణులు నెఱసియున్నారు. అది రాజర్షులచే పరిపాలితమైనది. ఇట్టి యయోధ్యయందు జనులు అంతగా సంతోషముతో నున్నట్టు తోఁపకున్నది. మున్ను అయోధ్యయందు నలుగడల పురుషులవలనను స్త్రీలవలనను గలుగు మహాధ్వని దొమ్మిగా వినఁబడుచుండును. ఆ ధ్వని యిప్పుడు నాకు వినరాకున్నది. † పూర్వము నరులు సాయంకాలములయందు ఉద్యానవనములకు వచ్చి క్రీడించి యంత చీఁకటిగ్రమ్ముటచే క్రీడించుటమాని నలుగడల వేవేగ యిండ్లకుఁ బాఱుచుండఁగా నవి యప్పుడొక చెలువునఁ బ్రకాశించుచుండినవి. ఇప్పుడు అవి కాముకు లెవ్వరునురాక విడుచుటం జేసి యేడ్చుచున్నట్లున్నది. సారథీ! పట్టణమంతయు అరణ్యమయినట్లు నాకగపడుచున్నది. పూర్వమువలె ప్రముఖులైన పురుషులు రథములమీఁదను ఏనుఁగులపైని గుఱ్ఱములనెక్కి పట్టణమునుండి పోవువారుగాని పట్టణములోనికి వచ్చువారుగాని యెవ్వరు గానఁబడరు. మున్ను ఉద్యానవనములు, పండ్లును, చిగుళ్లును, పూఁదేనియలునుగొని మత్తిల్లిన చిలుకలుమున్నగువానితో నొప్పుచును, పాదులుచేసి నీరు కట్టుటవలనఁ జిగిర్చి మిగులసొంపుగాఁ జూపట్టుచును, రతిక్రీడలకై వచ్చుజనులకు

---

* సర్వతీర్థమునకు సర్వతీర్థమని పాఠాంతరము. హస్తిపృష్ఠక మనఁగా నొక గ్రామపుపేరు. లేక యేనుఁగుమూఁపు నెక్కి కుటికానదిని దాఁటెనని మహేశ్వరతీర్థులయర్థము. ఇది యవసరముగానే యున్నది.

† ఇందులకు 'తొల్లిజనులు సాయంకాలము కడచనఁగా రాత్రులందు, నుద్యానములకు వచ్చి క్రీడించి తెల్లవాఱఁగానే క్రీడయుడిగి నలుదిక్కుల నిండ్లకు త్వరితముగాఁ బోవుచుండఁగా నపుడవి మఱియొకవిధమునఁ బ్రకాశించుచుండెను' అని గోవిందరాజుల యర్థము.

పూఁబొదరిండ్లు మొదలగు నొప్పిదములు మిక్కిలియును గులుకుచును, ప్రకాశించుచుండినవి. అట్టి యీయెలదోఁట లిపుడు దారిపొడువున నాకులన్నియురాలి యేడ్చుచున్నట్లున్న వృక్షములతోఁ గూడినవై, నలుగడల సొంపుదక్కి చూపట్టుచున్నవి. సూర్యోదయము కావచ్చినను, క్రీడామృగములును పక్షులును యథేష్టాహారముల మత్తిల్లి రాగముతో నవ్యక్తమధురముగాఁ జేయుశబ్దమేదియు వినఁబడకున్నది. మునుపటివలె చందనాగరువాసనలతోఁ గలసి ధూపవాసనలు నెఱసి గుబాళించుచుండు మేలయినగాలి యిప్పుడేల వీవకున్నది? మున్ను చేతులకోయ్యలు మొదలగువానిచే వాయింపఁగా నెడతెగక గంభీరముగా వినఁబడుచుండు బేరులయు మద్దెలలయు వీణెలయు ధ్వని యిప్పు డుడిగియున్న దేమి? అనిష్టసూచకములును గ్రూరములునై చూచినంతనే మిగులదుఃఖము కలిగించు నశుభనిమిత్తము లనేకములు కనఁబడుచున్నవి. దానంజేసి నా మనసు మిగుల స్రుక్కుచున్నది. సారథీ! నామనస్సునకు దుఃఖము కలుగుటకుఁ గారణము లేకున్నను, నామనసుమిక్కిలి స్రుక్కుచున్నదే! కావున నెట్లైనను నా బంధువులకుఁ గుశలము గలుగుట యరిదిగా తోఁచుచున్నదే' అనెను. ఇట్లు భరతుఁడు దుఃఖితుఁడై, హృదయముకలఁతనొంద, దిగులు మిగులఁబైకొన, ఇంద్రియములు చెల్లచెదరుగా ఇక్ష్వాకురాజులచేఁ బాలితంబగు నాయయోధ్యాపురమును శీఘ్రముగాఁ బ్రవేశించెను. *దూరప్రయాణము వలన బడలియున్న గుఱ్ఱములతో భరతుఁడు వైజయంతమను ద్వారమున పట్టణమును ప్రవేశించెను. అంత నచ్చట నున్నద్వారపాలురు దిగ్గన లేచి విజయం బడిగి వెంబడింపఁగా నతఁడు వారితోఁగూడం బోయెను. భరతుఁడు మనసు ఒకదానియందు నిలువక యాకులపడఁగా, ఆద్వారపాలకుల నుపచారపూర్వకముగా మరల్చి తనమనసునకుఁ గూర్చు నశ్వపతిసారథినింజూచి, 'అనఘా! కారణమేమియు లేక నన్ను వసిష్ఠుఁడు త్వరితముగాఁ బిలిపింపనేల? ఏమి యశుభమో యని మనస్సున శంకగలుగుచున్నది. నా స్వభావము దూలుచున్నట్లున్నది. సారథీ! పూర్వము రాజులకు నాశము సంభవించునపుడు ఎట్టితోఁపిక లుండునని మనము వినియున్నారమో అట్టితోఁపికలన్నియు నాకిచ్చట నగపడుచున్నవి. ఇట గృహస్థుల గృహములు ఊడ్చుటలేనందున గడుసుగా నున్నవి, వానితలుపులును మూయఁబడవు. అందెచ్చటఁ జూచినను కాంతిసొంపు మాసియున్నది. మఱి యందు బలికర్మములును గలుగవు; ధూపవాసనలును బుగులుకొనవు. అందలి కుటుంబములోని వారెల్ల భోజనమునైతము చేయక కాంతి బ్రుంగుడు పడి సొంపుచెడియున్నవారు. అందు సిరియు పెంపు సొంపారకున్నది. ఆగృహములు నాకిట్టిలక్షణముల నగపడుచున్నవి.

* ఇందులకు 'ద్వారేణ వైజయన్తేన ప్రావిశచ్ఛ్రాన్తవాహనః' అనిమూలము. ఇందు 'ద్వారేణ' అనుచోఁగల 'రే' అనునక్షరముచేత గాయత్రిని ఆఱవయక్షరమగు 'రే' గ్రహింపఁబడినది. దీనిచే ఆఱవ శ్లోకసహస్ర మారంభింపఁబడెనని తెలియునది.

దేవాలయములందు ద్వారములు పుష్పమాలికలసొంపు నింపకున్నవి. వానిముంగిళ్లను జక్కఁగా నలుకఁబడకున్నవి. మఱియు పూజక పరిచారకాదులు లేమిచే నవి పాడుపడి మునుపటివలెఁ బ్రకాశింపకున్నవి. దేవపూజలు లుప్తములై యున్నవి. యజ్ఞసభ లట్లేయున్నవి. పూదండలయంగళ్లయందు దండలును సొంపారకున్నవి. ఇపు డిచ్చట వర్తకులును చింతాకులితమానసులై క్రయవిక్రయాది వ్యాపారములుదూలి సంకోచము నొందియున్నారుగాని మునుపటివలెఁగానఁబడరు. దేవాలయములందును చదుకములందును నుండుపక్షిసమూహములు నట్లేదీనములై యున్నవి. పట్టణమునందు జనులు, స్త్రీలును, పురుషులును, మలిన దేహములతో కన్నులనిండ నీళ్లుగాఱ దీనులయి చింతలవంతలం జివికి తహతహ పడుచుండుట చూచుచున్నాను' అనెను. ఇట్లు భరతుఁ డయోధ్యయం దాయనిష్టశకునములను జూచి మనసువిరవిరఁబోవ సారథింజూచి యీప్రకారముచెప్పి దశరథమహారాజు గృహమునకుఁ బోయెను. అమరావతివలె వెలుఁగుచుండిన యాపురము చదుకములును గృహములును రాజమార్గములును జనులులేక పాడుపడియు, చిమ్ముట మున్నగునవి లేనందున ద్వారమందలి తలుపులు దారుబంధములు మొదలయినవి యెఱ్ఱగా దూళిబ్రుంగియు, నుండఁగా నతండు చూచి మిక్కిలియు దుఃఖాక్రాంతుఁ డయ్యె. ఆమహాత్ముఁడు ముందొకప్పుడును తనపట్టణమునందు గలుగని యాలక్షణములు మనస్సున కప్రియము లయినవి పెక్కులు గలుగుటఁజూచి తలవాంచి మనసు విరవిరఁబోవ సొంపుదూలి తండ్రిగృహమునకుఁ బోయెను. ఇది డెబ్బదియొకఁడవ సర్గము.



(కైకేయి భరతునికి దశరథమరణమును రాము నడవికిఁ బంపుటయుఁ దెలిపి రాజ్యము గట్టుకొనుమని చెప్పుట.)

అంత భరతుఁడచట తండ్రిగృహమున తండ్రినిం గానక తల్లినిజూచుటకై యామెయింటికిఁ బోయెను. కైకయప్పుడు, దేశాంతరమునకుఁ బోయి యుండిన తన కొడుకు వచ్చుటను జూడఁగానే, యుబ్బు పెల్లునఁ గూర్చుండినబంగారు నాసనము నుండి దిగ్గున లేచెను. ధర్మాత్ముఁడగు నాభరతుఁడు కాంతిసొంపు మాసియున్నతనతల్లి యింటికిం బోవఁగానే, శుభంబులగు తల్లి చరణంబులం బట్టుకొని మ్రొక్కెను. ఆయమ మంచికీర్తిగాంచిన యాతనిశిరమును మూర్కొని, యతనిని, గవుఁగిలించుకొని యొడిపైఁగూర్చుండఁబెట్టి విషయముల నడుగనారంభించి 'నీవుమాతామహుని యిల్లువిడిచి యింతకుఁ గొన్నిరాత్రులయినవి. రథముమీఁద మిక్కిలి వేగముగాఁ బాఱివచ్చితివే! మార్గాయాసములేదాయేమి? పుత్రా! పూజ్యుఁడగు నీతాతయు, నీమేనమామయు యుధాజిత్తును, మిక్కిలి క్షేమముగ నున్నారా? నీవు నిచటనుండి పోయినదాదిగా సుఖమా? ఇది యంతయు నాకుఁ జెప్పవలయును' అనెను. భరతుఁ

డామెతో 'నేను తాతగారి గృహమునుండి బయలుదేఱి నేఁటికి ఏడురాత్రులయినవి. అమ్మగారితండ్రి క్షేమముగనున్నారు. నా మేనమామ యుధాజిత్తునకును క్షేమమే. పరంతపుఁడు కేకయరాజు నాకొసఁగిన ధనములు రత్నములు, వానిం గొనివచ్చు వాహనాదులు దారి నడచి బడలియుండుటచే, దారియందే విడిచిపెట్టి నేను ముందుగా వచ్చితిని. రాజు చెప్పిపంపిన దూతలు ననుఁ ద్వరబెట్టఁగానే యిచ్చటికి వచ్చితిని. అమ్మా! నే నడుగఁ గోరినవానిని చెప్పఁదగును. బంగారముచే సింగారింపఁబడి పరుండుటకుఁ దగియుండు నీమంచము తండ్రి లేక పాడుపడియున్నది. దశరథుని వారగుజనులు సంతోషము లేకుండునట్లు నాకుఁ దోఁచుచున్నది. మహారాజు ఇచట అమ్మగారి యింట బహుతరముగా నుండువాఁడని తలఁచి యాతనిని జూడ నువ్విళ్లూరుచు నిచటికివచ్చితిని. ఇప్పు డతని నిచటఁ జూడలేకున్నాను. అమ్మా! తండ్రిపాదంబులఁబట్టి మ్రొక్కనున్నాను. అందులకై యడిగెదను. ఆయన యెక్కడనున్నాఁడు' చెప్పుము. ఒకవేళ నా పెద్దతల్లి కౌసల్య యింటనున్నాఁడా యేమి?' అని యడిగెను. అంతఁ గైక రాజ్యమందలిపేరాసచేత మతితప్పినది గావున, ఘోరమై మిక్కిలి యప్రియముగా నుండువృత్తాంతమును ప్రియమైనదిగా భావించి, జరిగిన దేమియుఁ దెలియని యాభరతునిఁజూచి, 'సకలప్రాణులును తప్పక యేగతిఁ బొందునో, మహాత్ముండును మహాతేజుండును యాగశీలుఁడును సజ్జనులకు దిక్కునైన మీతండ్రి మహారాజును అట్టిగతిని బొందెను' అనెను. ధర్మాత్ముఁడును సత్కులజాతుఁడును బరిశుద్ధుఁడు నగుభరతుఁడు తండ్రి మరణించె నన్న యావాక్యమును వినఁగానే తండ్రినిగూర్చిన దుఃఖవేగమునకు నలంగి తటాలున నేలంబడెను. మహాబాహుఁడగు నాపరాక్రమవంతుఁడు 'అయ్యో! హతుఁడనైతినే' యని దీనంబగు మాటఁజెప్పుచు బాహువులు విదుర్చుచు నేలంబడెను. అంత నమ్మహాతేజుండు తండ్రి మరణమునకు శోకము పైకొనఁగా దుఃఖితుఁడై, మనస్సు తబ్బిబ్బుపడి చెదరఁగా 'శరత్కాలమందు రాత్రిని విమలమైనయాకాశము చందురునిచే ప్రకాశించుచున్నట్లు మునుపు నా తండ్రి పరుండునీపాన్పు ఆయనవలన మిక్కిలి సొంపుగాఁ బ్రకాశించుచుండినది. అట్టియాపాన్పు, ఇపు డాధీమంతుఁడు లేమింజేసి చంద్రుఁడు లేనియాకాశమువలెను, నీళ్లింకినసముద్రముకైవడిని, సొంపుమాలి ప్రకాశింపకున్నదే' అని విలపించెను. నయశాలురయందు మేటియగు నాభరతుండు,గొంతెత్తి రోదనముచేసి కన్నీళ్లువిడిచి సిరి దొలఁకాడునెమ్మొగముపై వస్త్రము గప్పుకొని మిక్కిలియు పురపురంబొక్కుచు, మనంబు చాలఁ గొందలపడనుండెను. దేవతలుంబోలె వెలుఁగుచు, మదపుటేనుంగునకు సాటియై, చంద్రసూర్యులకు సరివచ్చు నాభరతుఁడు, వనమున గొడ్డలిచే నఱుకంబడిన మద్దిచెట్టుబోదియవలె నేలంబడియుండఁగాఁ జూచి, కైక యతనిని పుడమినుండి లేవనెత్తి 'రాజకుమారా! మహాకీర్తిమంతా! లే లెమ్ము, ఏల పరుండియున్నావు? నీవంటి సభాపూజ్యు లగుసుజనులు

ఎంతమాత్రము దుఃఖింపరు సుమీ! ధీమంతా! నీబుద్ధి, దానములందును యాగము లందును అధికరించియుండునది, మఱి సద్వృత్తమును వేదవాక్యములను అను వర్తించునదియుఁగదా. కాని యది,మందరపర్వతమున సూర్యుని కాంతి మిక్కిలియు వెలుఁగునట్లు, నీయందు మిక్కిలియుఁ బ్రకాశించుచుండును' అనెను. అతండు చాల సేపు రోదనముసేయుచును నేలం బొరలుచును నుండి, పలువిధము లైనశోకములు పయికొనగా, తల్లింజూచి 'రాజు నన్నుఁ బిలువఁబంపినాఁడే! రాముని కేమేని పట్టాభిషేకము సేయునా? లేక తా నేమైన యాగము సేయునా' యని మనమునఁ దలంపుగొని యుబ్బుచుఁ బయనమై వచ్చితినే. అట్టి నా తలంపు ఇపుడు మఱియొ కటియైనదే! నిత్యమును నాకు సంతోషము గూర్చుచు మేలు గావించుచుండునట్టి తండ్రిని జూడకున్న నాకు మనసు బ్రద్దలువాఱుచున్నది. అమ్మా! నేను రాకున్న ప్పుడు, రాజు ఏవ్యాధిచేత మృతినొందెను? కన్నతండ్రికిఁ దామై చేతులార సంస్కా రము సలుప నోఁచినట్టి రాముఁడు మొదలైనవాదందఱును బుణ్యాత్ములు. కీర్తి మంతుఁడగు మహారాజు, నేను వచ్చియున్నానని యెఱుఁగఁడు. ఇది నిజము. ఎఱుఁగు నేని, త్వరితముగా వచ్చి నన్ను వంచి నాశిరమును మూర్కొనునే! దుఃఖములను బోఁగొట్టు నట్టికార్యము లాచరించు నాతండ్రి యే హస్తముతో దూరముననుండి వచ్చి దుమ్ముగ్రమ్మియున్న నన్నుఁ దుడుచునో సుఖస్పర్శమైన యాహస్త మెచట నున్నది? ఎవ్వఁడు నాకు, అన్నయుఁ దండ్రియు బంధువునగునో, మఱియెవ్వనికి నేను దాసుఁడనో, దుఃఖము పోఁగొట్టుకార్యములు సేయునట్టి యారామునికి నేను వచ్చి యుండుటను వేగముగాఁ దెలుపుము. ధర్మము దెలిసినపూజ్యునికి, పెద్దన్న తండ్రియే యగునుగదా. కాన నతని పాదములనుబట్టుకొని మ్రొక్కెద. తండ్రిపోయినపిదప నిఁక నిప్పుడతఁడెకదా నాకుగతి. ధర్మములందెలిసి యెడతెగక ధర్మమునందే ప్రవ ర్తించుచు, సత్యసంధుఁడును పూనిన వ్రతమును విడువనివాఁడును సత్యపరా క్రముఁడును బూజ్యుఁడు నైననాతండ్రి మహారాజు ఏమిచెప్పిపోయెను? అతఁడు మరణసమయమున నన్ను గుఱించి యేమిచెప్పెనో దానినిఁ జక్కఁగా విన్గోరెద' నని యడిగెను. ఇట్లతఁ డడుగఁగా కైకేయి జరిగినది జరిగినట్లుగానే యాతనితో *''ఉత్కృష్టం బగుగతి గలవారలలోఁ గన్నా కయిన యామహాత్ముఁడు మహారాజు 'రామా! అయ్యోసీతా! లక్ష్మణా!' అని విలపించుచు పరలోకము నొందెను. మఱియు నీతండ్రి, పాశముచేఁ గట్టువడినమదపు టేనుఁగువలె కాలగతి పైకొనఁగా మరణసమయమున 'ఎవ్వరు ఇచటికి సీతతోఁగూడి మరలివచ్చిన రాముని మహా బాహుఁ డగులక్ష్మణుని చూడగలరో వారలు కృతార్థులు' అని యీమాటను మాత్రమే మందలించెను'' అని చెప్పెను. భరతుఁ డదివిని రాముఁడు పట్టణమున

* ఇచటఁ గైకేయి భరతునికి తండ్రియందు గలస్నేహమును తొలగించుటకై నిస్నేహియు దలఁచుకొనలేదు. రామాదులనే తలంచుకొని ప్రాణములు విడిచినాఁ'డని చెప్పుట తెలియునది.

లేఁ డను రెండవదుఃఖవార్తను వినుటవలన, మొగము వెలవెలఁబోవ మిక్కిలియు దుఃఖితుఁడై మరల తల్లినిజూచి 'ధర్మాత్ముఁడును కౌసల్య కానందము వర్ధిల్లఁజేయువాఁడు నగురాముఁడు, తమ్ముండగు లక్ష్మణునిని సీతనుంగూడి, యిప్పుడెచటికిఁ బోయియున్నాఁడు?' అని యడిగెను. అట్లతఁ డడుగఁగా కైక మిక్కిలి యప్రియమైన పెద్దమాటను ప్రియమైనదిగా భ్రమించి జరిగినది జరిగినట్టుగా నంతయును చెప్పఁ దొడంగి 'పుత్రా! ఆరాజకుమారుఁడు లక్ష్మణునిని సీతనుంగూడి నారచీరలు గట్టి దండకారణ్యమునకుఁ బోయెను' అని చెప్పెను. భరతుఁ డదివిని తనవంశమునకు సదాచారపరత్వమువలనఁ గలిగిన మాహాత్మ్యమును దలఁచి 'తనయన్న యేమి తప్పినడచెనో! ఇట్లడవిపాలగుటకు!' అని యతని చరిత్రముగుఱించి శంకించి భీతుఁడై మరల నడుగందొడఁగి, 'రాముఁడు బ్రాహ్మణునిధనము నపహరింప లేదుగదా? మఱియు ధనికునిఁ గాని దరిద్రునిఁగాని ఏపాపమును జేయనివాని నెవ్వనిని హింసింపలేదుగదా? ఆరాజకుమారుఁడు, పరకాంతలఁగోరఁడు కదా? రాముఁడేపాపము నెఱుఁగఁడే! సకలవేదశాఖాధ్యాయిని జంపినవానింబోలె రాముని దండకారణ్యమునకు రాజెందుల కంపినాఁడు?' అని యడిగెను. అంతఁజపలురాలగు నతనితల్లి తొల్లి రాజును వరము లడిగినపుడు చూపినట్టిస్వస్వభావముచేతనే తానుచేసినది మంచిదని తలఁచి యాతనికార్యము నంతయు కలరూపునఁ జెప్పబూనినదయ్యె. మహాత్ముఁడగు భరతుఁ డిట్లడుగఁగా, కైక, మూఢురాలగుటచేఁ దన్నుఁ బండితురాలని తలఁచి విఱ్ఱవీఁగుచుండును గాన, దానుజెప్పినది అతనికి ప్రియముగా నుండునని యుబ్బి యతనితో 'రాముఁడు ఏబ్రాహ్మణుని ధనమును అపహరింపలేదు. మఱి ధనికునిఁగాని దరిద్రునిఁగాని పాపముసేయనివాని నెవ్వనిని హింసింపలేదు. రాముఁడు పరస్త్రీలను గన్నెత్తియైనను జూడఁడు. పుత్త్రా! రామునకు అభిషేకముసేయ నుండుట విని నేనే నీకు రాజ్య మిమ్మనియు రామునడవికిఁ బంపుమనియు నీతండ్రిని యాచించితిని. నీతండ్రి యామహారాజు ఆడితప్పని తనవృత్తిని విడువక నే నడిగినదానిని అట్లే కావించెను. రాముఁడును లక్ష్మణునితోడను సీతతోడను అడవికిఁ బంపఁబడినాఁడు. మహాయశుఁడగురాజు, రాముఁడడవికిఁబోఁగా, ఆగారాబుకొడుకునుగానక పుత్త్రదుఃఖమునఁ బరితపించుచు మరణము నొందెను. నీవు రాజనీతి దెలిసిన వాఁడవు, కనుక నిపుడు రాజత్వము గైకొనుము. నే నిదంతయు నీకొఱకే కదా యిట్లు చేసితిని? నాయనా! దుఃఖపడకుము, సంతాపమును వలదు, ధైర్యము నవలంబింపుము. ఈ నగరమును నిరుపద్రవమయిన యీ రాజ్యమును నీ యధీనము గదా! పుత్త్రా! ఇట్లగుటంజేసి శాస్త్రజ్ఞులగువసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణోత్తములం గూడి వెనుదీయనివీర్యము గలమహారాజునకు విధిప్రకారమున వేగ సంస్కారముచేసి భూమికిఁ బట్టాభిషిక్తుఁడవు గమ్ము' అనెను. ఇది డెబ్బదిరెండవ సర్గము.



## భరతుఁడు కైకను దూఱుట.

భరతుఁడు, తండ్రి మరణము నొందుటయు అన్నదమ్ముల నడవికిఁ బంపుటయు వినఁగానే దుఃఖమున మిగులఁ బొక్కుచు 'తండ్రినిమాలి, తండ్రివంటితోఁ బుట్టువునుమాలి, హతుఁడనై, యంగలార్చుచున్న నాకిచట రాజ్యముతోఁ బనేమి? రాజునుమృత్యువుపాలుసేసి రామునినితాపసిగావించితివే! దుఃఖముమీఁది దుఃఖముఁ గూర్చితివే! ఉరిసినపుంటికి నుప్పు పెట్టితివే! నీవు మాకులము ఏమియులేక నశించుటకై ప్రళయకాలరాత్రివలె వచ్చితివో! నాతండ్రి నిప్పును గౌఁగిలించునట్లు, నిన్ను గౌఁగిలించుకొన్నాఁడు. నిన్ను తెలిసికొనకపోయినాఁడు. నీవు పాపమందే కన్నులు గలదానవే. కావున రాజునకు మృత్యువు దెచ్చి పెట్టితివి. కులపాంసనీ! అజ్ఞానమున మాకులమును ఇట్టిగతి పాలుసేసి యందు సుఖమే లేకుండునట్లు చేసితివే? నాతండ్రి దశరథమహారాజు మహాయశుఁడు, మిగుల సత్యసంధుఁడు. అట్టివాఁడు నిన్నుఁ జెట్టపట్టికదా తీవ్రమగుదుఃఖమున తపించుచు నిపుడు మృతిబొందినాఁడు! నాతండ్రి మిగుల ధర్మవిదుఁడే! అట్టి మహారాజును ఎందుకే నాశము సేసితివి? మఱియెందుల కని రాముని ఊరువెడలఁగొట్టి యడవిపాలుసేసితివే? నాతల్లియగు నీవు ఇచట దాఁపరించినందువలన కౌసల్యయు సుమిత్రయు పుత్రశోకమునఁ బీడితులైరి. ఇఁక వారలు జీవింపరు, ఒకవేళ జీవించిరేని యది మిగులఁ గష్టముగానే వారికుండును. పూజ్యుఁడగు రాముఁడును గురుజనులయెడ నడచుకొనువృత్తుల నెఱిఁగినవాఁడు, ధర్మాత్ముఁడు కనుక నతఁడు తనతల్లియెడల నడచుకొనునట్లే నీయెడల నెనలేనియట్టి శుశ్రూషావృత్తితో నడచుకొనుచుండునుగదా. దవ్వుల రాఁగల యనర్థమును మున్నుగానే కౌసల్య తెలిసికొనునట్టిది. కావున నాపెత్తల్లియగు నాయమయు అట్లే ధర్మమునూని, నిన్నుఁ జెల్లెలియట్ల చూచుకొను చున్నదిగదా! అట్టి ధార్మికురాలికొమారుని, పాపాత్మురాలా! బుద్ధిమంతుఁడగు రాముని, నారచీరలు గట్టుకొని యడవికి వాసముసేయఁ బంపి దుఃఖింపకెట్లున్నావే! రాముఁడు పాపమునందు దృష్టియే యుంపఁడు, మంచిబుద్ధిగలవాఁడు, మిక్కిలి యశస్సును బడసినవాఁడు. అట్టివానిని నారచీరలు గట్టుకొని యూరువెడలనంపితివే! ఇందులకేమి కారణము నీకుఁ దోఁచినది? దీనికేమిఫలముగంటివి? పేరాసపట్టిన దానవుగా! కావుననే రామునియెడ నేనెట్టివాఁడనగుదునో నినుబోఁటి లుబ్ధురాలికిఁ దెలియదయ్యెనని తలఁచుచున్నాను. అట్లు తెలియమిం జేసియేకదా నాకు రాజ్యముగలుగుటకై యిట్టి గొప్పయనర్థమునకు నీవొడిగట్టితివి! నేను పురుషసింహులగు రామలక్ష్మణులను జూడకయే, వారికనుఁబ్రాపు లేకయే, ఏశక్త్యతిశయమున రాజ్యమును బాలింప నుత్సహింతును? వారిరువురేకదా నాశక్త్యతిశయము. ననుబోఁటికే యతఁడాశ్రయముకాదు, మహాబలుఁడును ధర్మాత్ముఁడునగు మహారాజుగూడ, మేరుపర్వతము

స్వరక్షణమునకై, తనయందలి యరణ్యము నాశ్రయించినట్లు * ఎప్పుడును బలవంతుఁడై యొప్పు రామునే యాశ్రయించియుండెనుగదా! గొప్ప బరువును మోవం జాలిన పెనువృషభము మోయునట్టిబరువును తఱపిదూడపై మోపినట్లు, మహాబలుండగు మహారాజుచేఁ దాల్పఁబడిన యీ రాజ్యభారమును బాలుండగు నేను ఏయవష్టంభమున భరింపఁగలను? ఒకవేళ సామాద్యుపాయములచేఁగాని ధారణాదిబుద్ధిబలమునఁగాని రాజపుత్త్రుఁడ నగుటచే రాజ్యమును బాలింప నాకు శక్తిగలిగియుండినను, కొడుకునందలి పేరాసచే నిట్టి యనర్థముగావించిన నీకోర్కిమాత్రము నేను కొనసాఁగనీయను. రామునికిఁ, దనతల్లియందుఁ బోలె నీయందును భక్తిపూర్వకమైనదృష్టి లేకపోయెనేని, పాప నిశ్చయముగల నిన్ను దిగవిడుచుటకు నాకుఁగోరిక లేకుండదు. నిన్ను విడువనే కోరుదును. అతనికి నీయందలి గౌరవమును బట్టియే యేమికోపించునోయని నిన్ను విడువఁజాలకున్నాను. లేకున్న దిగవిడువనో? పాపమందే కన్నుగలదానా! సజ్జనులనడవడిని దిగనాడినదానా? మాపూర్వికుల కందఱికిని మిక్కిలి నిందితమయిన యిట్టిబుద్ధి నీకెట్లు గలిగినదే? మాయీకులమునందు జ్యేష్ఠునికి రాజ్యాభిషేకము సేయుటయే సంప్రదాయము గదా? తక్కినతోఁబుట్టువు లందఱును అతనిచిత్తానువర్తనమం దెచ్చరికగలిగి ప్రవర్తించుచుందురు. క్రూరాత్మురాలా! నీవు రాజధర్మమును బాటించుదానవు గావనియు, రాజుల కనాదిగా తప్పరానిదై వచ్చుచుండు సదాచార మిదియని గాని తెలియవనియు, నాకుఁ దోచుచున్నది. రాజుల యాచారవృత్తిని జూడఁగా ఎప్పుడును జ్యేష్ఠుఁడే రాజ్యమున కభిషిక్తుడగు చున్నాఁడుగదా. ఈవృత్తి రాజులకందఱికిని సమానమే కాని, అందును,సదాచారనిరతులైన యిక్ష్వాకువంశపురాజులకు నిది మఱియు విశేషించినది. వారు ధర్మమే తమకు రక్షగాఁ గొనియుండువారు. కులపరంపరాగతమైన చరితము నెప్పుడు విడువ కనుషించుచుండువారు. అట్టివారికి మావంటి సదాచార సంపన్నులు లేరు' అని తమచరిత్రమునుబట్టి గలిగినగర్వము నీవు దాఁపరించుటచే తూలిపోయినది గదే! మావంశపువారే కాదు. నీ పుట్టింటవారగు రాజులును జ్యేష్ఠునికే పట్టాభిషేకము సేయువారు; మఱియు మిక్కిలి మహనీయులు. ఇట్టివంశమున బుట్టియు నెందువలన నిట్టిబుద్ధితడఁబాటు నీకుఁ గలిగినది? నీవు పాపమునకుఁ దెగియున్నావు. కనుక నీకోర్కినిమాత్రము నేను జేయను జుమీ! నీవు నాకు ప్రాణాంతకరమైనవ్యసనమును మొదలుపెట్టితివి. నీ యిష్టమును జేయకపోవుట మాత్రమే కాదు. నీ కనిష్టమును జేసెదను. ఇదిగో నేను నీ కప్రియముచేయుటకై యిప్పుడే పోయి, పాపరహితుఁడును బంధుజనప్రియుఁడును నగునాయన్నను రాముని నడవి నుండి మరల్చి తోడ్కొని వచ్చెదను. ఇంతేకాదు. రాముని నట్లు మరల్చి తెచ్చి,

* మేరుపర్వతమునందలి యరణ్యము, ఇతరులు చొచ్చుటకు నలవికాకుండునట్లు పర్వతమును గాపాడునట్లు రాముఁడు దశరథునికి రక్షకుఁడైనాఁడనుట.

తేజంబు గ్రాఁగుచున్నయతనికి మిక్కిలియు నిలుకడయైన యంతఃకరణముతో దాసుఁడ నై యుండుదు' ననెను. మహాత్ముఁడగు భరతుఁడిట్లాకైకను దుఃఖకరము లగుమాటల బీడించుచు, మఱియు శోకము మిక్కిలి కొందలపెట్టఁగాఁ బర్వత గుహాయందు గర్జించు సింహమువలె పేరెలుంగున రోదనము సేసెను. ఇది డెబ్బది మూఁడవ సగము.



భరతుఁడు కోపాతిశయమునఁ గైకేయిని బరుషముగా దూఱుట. భరతుఁడు శోకమున మూర్ఛిల్లుట.

భరతుఁడు తనతల్లి నపు డట్లు మృదువుగా నిందించి, మరల రోషము మిక్కిలి పుట్టఁగొనఁగా, యాయమం జూచి "క్రూరాత్మురాలా! దుష్టచారిణీ! ధర్మమును దిగవిడిచితివిగదే! నీవు నీతల్లివలెనే రాజ్యమునుండి భ్రష్టురాలవుగమ్ము. నీకు నేను జచ్చినట్లేకావున నన్ను జచ్చినవానినిగాఁ దలఁచి యేడ్చుచుండుము. నీవు మహారాజునకు మరణమును రామునకు వనవాసమును నేకకాలమునఁ గలిగించితివే! ఆరాజుగాని పరమధార్మికుఁడగు రాముఁడుగాని, నిన్ను సంబంధించిన గుణమునో, పరిత్రాదులనో, దేనినిదూషించిరి? కైకేయీ! ఈ కులమును నాశము చేసితివి. కావున నీ కిప్పుడు భ్రూణహత్య కావించినంతటిపాతకము పట్టినదే. కాఁబట్టి నరకమునకే పొమ్ము. భర్తతోడి లోకము నీకు లేదు. భయంకరమైన వ్యవసాయమున కొడిగట్టి రాము నడవికిఁ బంపు నంతటిపాపమును జేసి తీర్చితివే! దీనివలన, సర్వలోకములకును ప్రియుండైన యా రాముని విడిచి యతని ప్రాపు లేకుండుటచే నాకు భయమే కలిగించితివి గాని రాజ్యమునుగాదు. నిన్నుఁబట్టి నా తండ్రి మృతుఁడు; రాముఁడు నడవిపాలయినాఁడు. కనుక 'తల్లి మూలముగాఁ దండ్రినిజంపి యన్నను తఱుమఁగొట్టినాఁ'డని యపకీర్తి యీప్రాణిలోకమందెల్ల నాకు గలిగినదే!. మాతృరూపమున నాకు దాఁపరించినశత్రువా! క్రూరురాలా! రాజ్యలుబ్ధురాలా! దురాచారము గలదానా! పతిని జంపినపాపీ! నాతో మాట లాడకుము. నామాటయే నీకు తలపెట్టఁ దగదే! కౌసల్యయు, సుమిత్రయు, మఱియుఁ దక్కిననాతల్లులందఱును, నీవు వంశమును బాడుసేయ దాఁపరించుట వలన మిక్కిలిదుఃఖము పాలైరి. నిత్యసత్యపరాయణుఁడైనధార్మికుని రాముని నడవికిఁ బంపితివి. ఆదుఃఖమున నాతండ్రిని పరలోకమునకుఁ బంపితివి. కావున నిట్టి నీవు ధర్మము ముఖ్యముగాఁ గలిగియుండురాజై బుద్ధిమంతుఁడై యొప్పు కేకయు నకు బుట్టినదానవు గావు. ఆతండ్రికులమును ధ్వంసముచేయుటకై, యచటఁ బుట్టిన రాక్షసివే యగుదువు. నీకుఁ బాపకార్యమే ముఖ్యము. అట్టిపాపము నీవు సేసినం దులకు దానిఫలము నాకును సంభవించి తండ్రిని బోఁగొట్టుకొని, యన్నదమ్ముల చేతను దూరమువఁబడి, సమస్తలోకములకును అప్రియుఁడను నైతిని. నీవు పాప [illegible].

మునకే తెగించియుండుదానవు, కావున నరకమునకే పోఁగలవు. ధార్మికురాలగు కౌసల్యకు పుత్రవియోగమును గలిగించి నీవేలోకమును బొందుదువో నీకై సృజింపఁబడియున్న నరకముగూడ నీకుఁ జాలదే. క్రూరురాలా! కౌసల్యాపుత్రుఁడగు రాముఁడు పరిశుద్ధుఁడనియు బంధువులకెల్లఁ బ్రాపనియు, జ్యేష్ఠుఁడగుటచే మాకిఁ దండ్రివంటివాఁడనియుఁ దెలియవా యేమి? ఇట్టిమహనీయుని బంధుఘాతకునిగాఁ దలఁచితివి! * పుత్రుఁడు తల్లిముఖము కంఠము మొదలైన యంగములవలనను, నేత్రము నాసిక మొదలైన యుపాంగములవలనను బుట్టుటయేకాక, ప్రత్యగాత్మస్థానమును అనురాగస్థానమునైన హృదయమునుండియుఁ బుట్టును, కావున తల్లికి వాఁడందఱికంటెను ప్రియతముఁడగును. బంధువులు కేవలప్రియులుమాత్రమే యగుదురుగావున పుత్రునివలె ప్రియతములుగారు, అట్లువాఁడు ప్రీతిపాత్రుఁడగుటచే తల్లికి కేవలబంధుమాత్రుఁడుగాఁడు. పూర్వమొకప్పుడు సకలధర్మములనుఁ దెలిసి దేవతలచే మన్ననగాంచి మించినట్టి కామధేనువు ఎద్దులరెంటిని గాంచెను. అవి యాధేనువు వంశమునఁ బుట్టినవిగాన దానికిఁ బుత్రులగును. అప్పుడవి భూమియందు నాఁగటిని మోసి దున్నుచు బడలి మూర్ఛిల్లియుండెను. ఆధేనువు, భూతలమునందు నాటి మధ్యాహ్నమువఱకు దున్ని యలసియున్న యీకొడుకులను జూచి వారిదుఃఖమున శోకముగలుగఁగా, కన్నులనిండ బాష్పములు వెల్లిగొన రోదనముసేసినది. అపుడా కామధేనువునకుఁ గ్రిందుగా మహాత్ముఁడగు దేవేంద్రుఁడు పోవుచుండఁగా, దానిబాష్పములు చిన్నబిందువులుగా మంచివాసన బగులుకొనుచు నాతనిదేహముపైఁ బడినవి. ఇంద్రుఁడును కమ్మనివాసనలు గుబాళించుచు పయింబడిన యీ బాష్పములం జూచి శ్రేష్ఠురాలగు కామధేనువు రోదనము సేయుచున్నదని తలఁచెను. ఇంద్రుఁడు నలుప్రక్కల కలయఁ జూచుచు, ఆకామధేనువు, ఆకాశమున, దీనయై మిక్కిలి దుఃఖమున రోదనము సేయుచుండఁగఁ జూచెను. వజ్రధరుఁడగు నా యింద్రుఁడు వగంబొగలుచున్న యాకామధేనువును, మహాయశస్వినింజూచి, డెందము కొందలపడ, చేమోడ్పు గీలించి దానితో 'మావారిలో నెవ్వరివలననుగాని నీకు గొప్పభయమేమియుఁ గలుగదేకదా! మఱి యిట్లు శోకించుటకుఁ గారణమేమి? నీవందఱికిని మేలు కోరుదానవే. నీ కెవరుకీడుచేసిరి? చెప్పుము' అనియె. బుద్ధిమంతుఁడగు నా దేవతాకాంతుఁ డిట్లు చెప్పఁగా కామధేను వామాట నేర్పరింజూచి యంత ధీరముగా 'దేవరాజా! ఇట్టియమంగళ మెప్పటికి లేకుండుఁగాక. మీయం దెవ్వరివలనను నాకు భయమేమియు లేదు. దేవేంద్రుఁడా! కర్షకుఁడు పట్టి నలంచుచుండఁగా చిక్కి విన్ననై యెండసోఁకున వాఁడి నవయుచు నిట్టిసంకటస్థితియందున్న నాయీకొడుకులను జూచి శోకించుచున్నానుగాని మఱేమియు లేదు.

*ఇందులకు 'అఙ్గాదఙ్గాత్సంభవసి హృదయాదధిజాయసే। ఆత్మావై పుత్రనామాసి' ఇత్యాదిశ్రుతులు ప్రమాణములగుట తెలియునది.

వీరు నాదే[illegible]నుండి పుట్టినవారలుగదా. కావున నిట్లు బరువుమోయలేక పీడితులై దుఃఖపడ[illegible]ం జూచి పరితపించుచున్నాను. ఇదియొక వింత కాదు. లోకమునం దెచ్చటఁగా, పుత్త్రునకు సాటియైన ప్రియుం డెవ్వఁడును గలుగఁడు' అనెను. కామధేనువు, ప్ర[illegible]చమునంతయు వ్యాపించియుండునట్లు వేలకొలఁదిగా పుత్త్రులనుగన్నదయ్యును, ఇద్దఱుకొడుకులు కష్టపడుచున్నారని యేడ్చుచుండుట జూడఁగా, ఇంద్రుఁడు పుత్త్రునికన్న నెక్కుడైనది మఱియొకటి లేదని తలఁచెను. తులలేనినడవడి గలిగి, పెంపుసొంపారుచు, ఎడతెగని సద్గుణములతోఁ గూడినదై, కోరినంతనే సృష్టిసేయంజాలినట్టిదైన కామధేనువు స్త్రీపురుషస్వభావమగు మైథునవ్యాపారపు పరంపరచే లోకసంగ్రహమును గోరినదై పెక్కువేలపుత్త్రులం బడసినదయ్యు, నిరువురుపుత్త్రులకష్టమునుజూచి శోకించుచున్నదే! ఇంక రాముఁ డొక్కడే పుత్త్రుఁడుగాఁ గల కౌసల్య యీయొక్క పుత్త్రునివిడిచి శోకించునని చెప్పనేల? ఆయమ లేక లేక యొక కొడుకు నేకన్నది. మఱియుఁ బతివ్రత, అట్టిదానిని కొడుకు లేనిదానినిగాఁ జేసితివి. కాఁబట్టి నీ వీలోకముననే కాక చచ్చి పరలోకమునకుఁ బోయినపుడును, ఎల్లపుడును దుఃఖమే యనుభవించుచుండఁ గలవు. నేను నాయన్న రాముని, నాతండ్రిని, ఈతీరున నెల్ల పూర్ణముగాఁ బూజించి మీఁదుమిక్కిలి కీర్తిని వర్ధిలఁ జేసికొనెదను. పూజించుతీరు వినుము. నేను కౌసల్యాకుమారుఁడైనమహాబలుని రామునిఁ దోడ్కొనివచ్చి, యతనికి మాఱుగా, నేనే మునులు వసించుచుండు నడవిని జొచ్చెదను. పాపంపుదలంపులదానా! పాపాత్మురాలా! ఈ పురమునందలి జనులు కుత్తుకలఁ గ్రమ్ము కన్నీళ్లతో నన్నుఁ జూచుచుండఁగా, నీవొడిగట్టిన యీ పాపమును భరించి యుండఁజాలను, అడవికే పోయెదను. అట్టి పరమపాతకము చేసిననీవు, అగ్నియందైన నుఱుకుము, లేక నీవై దండకారణ్యమునైనఁ జొరుము. లేక కుత్తుకకు నురియైనను బోసికొనుము. నీ కివితప్ప మఱియొకగతి లేదు. నేనును సత్యపరాక్రముఁ డగురాముఁడు రాజ్యమును బొందఁగా, దానిచే నా పాపమును, దూలఁబుచ్చుకొని, కృతకృత్యుఁడు నయ్యెదను'' అనెను. ఇట్లు భరతుఁడు మిక్కిలియుఁ గుపితుఁడై సర్పమువలె నిట్టూర్పులు పుచ్చుచు, అడవియందు, బోయలు తోమరములతోను అంకుశములతోను బొడువఁగా గర్తమునం బడుగజమువలె, నేలంబడెను. పరంతపుఁడగు నారాజకుమారుఁడు కోపమునఁ గన్ను లెఱ్ఱఁబాఱఁ వస్త్రముపీడ, నాభరణములెల్ల చెదరఁగా, ఉత్సవము తీరినకడపట నింద్రధ్వజము క్రిందఁ ద్రెళ్లినట్లు, నేలంబడెను. ఇది డెబ్బదినాల్గవ సర్గము.



## భరతశత్రుఘ్నులు కౌసల్యకడకుఁ బోవుట. భరతుఁడు కౌసల్యతో రామునిఁ దోడ్కొనివచ్చునట్లు శపథము సేయుట.

పరాక్రమవంతుఁ డగుభరతుఁడు, చాలసేపటికి తెలివి నొంది, కన్నులనిండఁ గన్నీ రొలుకుచుండఁగా, విన్ననై యున్నతల్లిం జూచి, యంతకు ముందుపే తనరాక యెఱిఁగి యచటికివచ్చి యున్నసుమంత్రాదిమంత్రులనడుమ, వారెఱుఁగుటకై మరల నామెను నిందించువాఁడై 'నే నొకప్పుడును రాజ్యము గోరలేదు. అట్లు రాజ్యము నకై తల్లితోఁ గుట్రయుఁ బన్నలేదు. రాజు నాయభిషేకమును ఆలోచించినవిషయ మును నాకెంతమాత్రమును దెలియదు. నేను శత్రుఘ్నునితోఁగూడ మిగులదూర దేశమున నుండుట మీకుం దెలియునేకదా. మహాత్ముఁ డగురామునకు వనవాసము పాటిల్లుట నాకుఁ దెలియదు. మఱి లక్ష్మణునికిని సీతకును వివాసన మెట్లు కలిగెనో యదియు నే నెఱుఁగను' అనెను. ఇట్లు మహాత్ముఁ డగుభరతుఁ డాక్రోశించు చున్న శబ్దము విని, కౌసల్య సుమిత్రనుజూచి 'క్రూరకార్యమున కొడిగట్టిన కైకకొడుకుభర తుఁడు వచ్చియున్నాఁడు. * వాఁడు దవ్వులఁజూచువాఁడు, వానిని జూడఁగోరెద' ననెను, దుఃఖమున వన్నెమాఱి, మలినయై, కృశించి యున్నయాకౌసల్య,సుమిత్ర తో నీమాట చెప్పి యంత గడగడ వడంకుచు, మాటికి సొమ్మసిలుచును భరతుఁ డుండుచోటికి బయలు వెడలెను. రామునితమ్ముఁడు భరతుఁడును శత్రుఘ్నునిం గూడి, కౌసల్య యుండుగృహమునకుఁ బోయెను. అంత భరతశత్రుఘ్నులు, దుఃఖా ర్తులై నేలంబడి సొమ్మసిల్లి యేడ్చుచున్న యాపూజ్యురాలిని, యామనస్వినిని, కౌసల్యను జేరి యామెం జూచి దుఃఖితులై రోదనముసేయుచు నిద్దఱును నామెను గవుంగిలించుకొనిరి. కౌసల్య యపుడు మిక్కిలి దుఃఖయై, భరతుంజూచి,'రాజ్యమున కువ్విళులూరుచు నున్ననీకు ఇదిగో యకంటకమైనరాజ్యము లభించినది. అక్కటా! కైకేయి చేసినక్రూరకర్మముచేత త్వరితముగా నీకు రాజ్యము ప్రాప్తించినది. కైక కార్యము ఇది. క్రూరకార్యములందే కన్నుగలకైక, నాకొడుకును నారచీరలు గట్టుకొని యడవియందుఁ గాఁపుండునట్లు చేసినదే! అట్లు సేసినందున దానికి లాభ మేమి? రాము నడవికిఁ బంపకయే రాజ్యము దక్కించుకొనఁ గూడదా? ఇఁక శీఘ్రముగ సర్వాధికృత యగుకైక, మహాయశుఁ డగునాకొడుకు నాబంగారుకొండ నారాముఁ డుండు చోటికి నన్నును బంపఁ దగును, అంతేల! నేను సుమిత్రను వెంటఁ బెట్టుకొని, సుఖముగా †దశరథునియగ్నిహోత్రమును కళేబరమును దీసికొని రాముఁ డుండు చోటికిఁ బోయెదను, పురుషశ్రేష్ఠుఁ డగునాపుత్త్రుఁడు

* ఇందులకు 'దీర్ఘదర్శివత్' అనిమూలము. దీనిచే భరతునికి రామవివాసనము సమ్మతము కాదని కౌసల్యకు తెలియుట సూచితమగుచున్నది.

† అగ్నిహోత్రము జ్యేష్ఠభార్య కధీనమైనది గావునను దశరథుఁడు భరతునిచే సంస్కా రము నిషేధించుటవలనను, ఆ యగ్నిహోత్రము తాను దీసికొనిపోవునట్లు కౌసల్య చెప్పినది. దీనిచే

రాముఁడు ఎచటఁ దపస్సు గావించుచున్నాఁడో, యచ్చటికి నీవైన నన్ను నిచ్చలు దీసికొనిపోయి విడువఁ దగును. మఱి విఱివిగలిగి ధనధాన్యములచే నెఱసి బెరసి రథగజతురగములచే నిండారియున్న యీరాజ్యమంతయు నీకుఁ గైక యిప్పించినది సుమా' అనెను. ఇట్టివి మొదలుగాఁ గలక్రూరవాక్యములు పెక్కు లాడి కౌసల్య తన్ను దూఱఁగా, ఏ పాపము నెఱుఁగనిభరతుఁడు, పూర్వమే పితృవియోగాదులకు దుఃఖితుఁడై యున్నవాఁడు గావున, పుంటిపై సూదితోఁ బొడిచినట్లు, ఆమాటలకు మిక్కిలి బాధితుఁడయ్యె. అప్పు డతఁడు మనసు తత్తఱపడ కౌసల్యపాదములపయిం బడి మిక్కిలి తెలివి దప్పియుండి, పెక్కువిధముల విలపించి యంతం గొంతవడికి తెప్పిఱి తేలెను. భరతుఁ డపుడట్లు పెక్కువగలంబొగలుచు పలవించు చున్న యాకౌసల్యం జూచి చేతులు మోడ్చి 'ఆర్యా! రామునియందు నాకు మిక్కిలియు దృఢమైన భక్తి గలదని నీకుఁ దెలియునే. తెలిసియు, ఈ యభిషేకాదుల నెంతమాత్రము నెఱుఁగక యేపాపమును జేయక యున్న న న్నెందులకు నిందించెదవు. [1]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవ సమ్మతించెనో, వాఁడు గురుముఖముగా శాస్త్రము ననుసరించి కఱచిన బుద్ధి యొకప్పుడును లేకపోవుఁగాక. [2]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవ సమ్మతించెనో, వాఁడు నీచజాతులకుఁ గొలువు సేసినవాఁడును, సూర్యుని కెదురుగాఁ గూర్చుండి మూత్రపురీషములు విడిచినవాఁడును, నిదురించు చున్నయావును గాలం దన్నినవాఁడునునగుఁ గాక. [3]ఎవఁడు రాముఁ డడవికిబోవ సమ్మతించెనో, వానికి, భృత్యునిచే పెద్దపని చేయించుకొని వానికి భృతియియ్యక వానిశ్రమము నిరర్థకముగాఁ జేయునట్టిభర్తకుఁ కలుగుపాపము కలుగుఁ గాక. [4]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవ

---

కౌసల్య భరతునికి, కైక చేసినపాపబంధమున రాజసంస్కారమున కధికారము లేదనియు సూచించినదని తెలియునది.

ఇది మొదలుగా భరతుఁడు తనపై కౌసల్య యారోపించినదోషమును బరిహరించుటకై శపథవాక్యము లాడుచున్నాఁడు. ఈశపథములు భరతుని పేరఁ జెప్పఁబడక సామాన్యముగా చెప్పఁబడినను భరతునికే యవి సంబంధించుచున్నవి. ఇట్లే మీఁదనెల్లఁ దెలియునది. మఱియును భరతుని శపథముల వ్యాజమున వాల్మీకి ధర్మవిశేషములను దెలుపుచున్నాఁడనియు నెఱుఁగునది.

1. ఇందు సత్పురుషున కపరాధము సేసినవానికి శాస్త్రజ్ఞానము భ్రంశము నొందునని తెలియుచున్నది.

2. నీచజాతులకుఁ గొలువు సేయుట మొదలగువానివలన పాపములను బొందును గాకయనియర్థము. దీనివలన నీచజాతులకుఁ గొలువు సేయరాదనియు సూర్యునకెదురుగా మలమూత్రములు విడువరాదనియు నిదురించుచున్న యావును గాలందన్నరాదనియు సూచింపఁబడుచున్నవి. నిదురించెడియావును దన్నరాదనుటచే తన్నుఁ బొడువవచ్చునావును దన్నినయెడల దోషము లేదని సూచితమగుచున్నది.

3. దీనిచే భృత్యునిచే పెద్దపని చేయించుకొని వానికిఁ దగుభృతి యియ్యకుండుట మహాదోషమని సూచితమైనది.

4. ధర్మయుక్తముగా ప్రజలనుబాలించు రాజునకు ద్రోహము చేయుట మహాదోషమని సూచితము.

సమ్మతించెనో వానికి, ప్రజలనందఱిని కన్నకొడుకులవలె ధర్మముగా పరిపాలనము సేయుచున్న రాజునకు ద్రోహముసేయువానికిఁ గలుగుపాపము గలుగునుగాక. [1]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవ సమ్మతించెనో వానికి, పండినదానిలో నాఱవపాలు కప్పము దీసికొని ప్రజలను రక్షింప కుండురాజునకుఁ గలుగుపాపము గలుగుఁగాక. [2]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వానికి యాగమునందు వ్రతోపవాసశీలు రగుఋత్విజులకు యాగదక్షిణ నిచ్చునట్లు ప్రతిజ్ఞచేసి పిదప లేదని చెప్పు వానికిం గలుగు పాపము గలుగుఁ గాక. [3]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు రథగజతురగములఁ గ్రిక్కిఱిసి భటులదొమ్మిగాఁగలసి యుద్ధము సేయునపుడు, వీరధర్మమునుమాని పలాయితుఁ డగునట్టివాఁ డగును. [4]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు బుద్ధిమంతుఁ డగునాచార్యుఁడు పరలోకసాధకము లగురహస్యార్థములతో వేదాంతాదివిశిష్ట మగుశాస్త్రార్థమును కష్టపడి యుపదేశింపఁగా దానిని మఱచిన దుష్టాత్ముఁడగుఁ గాక. [5]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో వానికి, రాముఁడు కండబలుపు గలిగినబుజములును మూఁపులునుగలిగిన సూర్యచంద్రులవలె తేజమున రాజిలుచు, రాజ్యము గట్టుకొని నిండుకొలువున సింహాసనమునం గూర్చుండియుండఁగా దర్శించుభాగ్యము లేకుండుఁగాక. [6]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు పాయసము నువ్వులుఁ బెల్లమును మేక మాంసమును దేవతాపితృతిథులకు నివేదింపక వ్యర్థముగా దయ మాలి భక్షించినవాఁడగును, తలిదండ్రులు మొదలగు పెద్దల

1. దీనివలన రాజు రైతులవలన నాఱవపాలుకన్న నెక్కువగాఁ గప్పము దీసికొనరాదనియు, అట్లాఱవపాలు దీసికొని ప్రజలను రక్షింపనిరాజు దోషము నొందుననియు తెలియునది.

2. ఇందువలన నొకరికి ఒకటియిచ్చునట్లు ప్రతిజ్ఞ నేసి పిమ్మట లేదనుట మఱియు దోషమనియు, అందును వ్రతోపవాసశీలురకు నిచ్చెదనని చెప్పి లేదనుట మఱియు దోషమనియు, అందును యాగమందు అట్టివారికి యాగదక్షిణ నియ్య నొప్పుకొని లేదనుట మహాదోషమనియు, అందును లేమిడిచే నియ్యకున్నను మహాదోషము గలుగుట యటుండఁగా ఇయ్యనని చెప్పువానిదోషము లెక్కింప నలవిగానిదనియు సూచితములు.

3. ఇందువలన యుద్ధమున భయపడి పాఱుట మహాదోష మని యూహ్యము.

4. దీనిచే గురువు నాశ్రయించి, యతఁ డనుగ్రహించి యుపదేశించిన మహారహస్యములను మఱచుటయు మహాదోషమని తెలియనగును.

5. దీనివలన రామరాజ్యకాలమున పాపిష్ఠు లగువారికి రామదర్శనము కలుగకుండె ననుట సూచితము.

6. దీనంజేసి పాయసమును నువ్వులను బెల్లమును మేఁకమాంసమును దేవతలకైనను పితరులకైనను అతిథులకైనను నివేదింపక యూరక తానే భక్షింపరాదనియు పెద్దల నవమానింపరాదనియు సూచితము.

మర్యాద సేయక యవమానించినవాఁడు నగును. [1]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాడు గోవులను కాలిచే తాఁకినవాఁడును, తానై గురువులను నిందించినవాఁడును, చెలికానికి ద్రోహము తలఁచినవాఁడును, అగుఁగాక. [2]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు తనతో ఒకస్నేహితుఁడు, నమ్మికచే రహస్యముగా నేదేని యపవాదమును జెప్పుకొనఁగా దానిని వెలిపుచ్చినట్టివాఁ డగుఁగాక. [3]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో. వాఁడు పరోపకారము సేయనివాఁడును, పరులు సేయు నుపకారమును మఱచునట్టివాఁడును, సజ్జనులచేఁ బరిత్యజింపఁ బడినవాఁడును, ఉరి మొదలగు వానిచేఁ బ్రాణములు విడిచి దుర్మరణము నొందినట్టివాడును, పాపమాచరించి ప్రాయశ్చిత్తమునైనను జేసికొన సిగ్గుమాలి తిరుగునట్టివాఁడును నై, లోకమున నెల్లవారికి ద్వేషింపఁ దగినవాడగునుగాక. [4]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు, తనయింటఁ గొడుకులును భార్యలును భృత్యులును చుట్టు నుండి చూచుచుండఁగా, వారలకుఁ బెట్టక తానుమాత్రము మృష్టాన్నమును గుడుచువానికిఁ గలుగుపాపము నొందునుగాక. [5]ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు తగినకులమునం బుట్టిన మంచిభార్యలను బొందక, అగ్నిహోత్రాది ధర్మకార్యముల ననుష్ఠింపలేక, సంతానముగూడఁ బడయక, యిట్లుభయలోకములకు భ్రష్టుడై మృతుఁడగుగాక. [6]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవు

1. దీనిచే గోవులను బాదముతో స్పృశింపరాదనియు, గురువులను ఇతరులు దూషించుచుండఁగా వినినను దోషము గలుగఁగా, వారిని తానే దూషించినయెడల మిక్కిలి దోషము గలుగుననియు, చెలికానికి ద్రోహము సేయ రాదనియు, సూచితములు.

2. దీనిచే ఒకరు నమ్మికవలనఁ దనతో రహస్యముగాఁ జెప్పుకొన్న తమదోషమును వెల్లడి సేయుట మహాదోషమని తెలియుచున్నది.

3. దీనిచే తనశక్తికొలఁది నుపకారము సేయకుండుట గూడదనియు, చేసినమేలును మఱవరాదనియు, ఉరిమొదలగువానిచే దుర్మరణమునొందరాదనియు, పాపముసేసినయెడల ప్రాయశ్చిత్తము సేసికొనవలయుననియు, సిగ్గుగలిగి యుండవలయుననియు, లోకులద్వేషమునకుఁ బాత్రుఁ డగుట కూడదనియు సూచితములు.

4. దీనివలన, ఒకరు చూచుచుండఁగా మంచిపదార్థములను వారి కిడక భక్షించుట దోషమనియు. మఱి దారపుత్రాదులు చూచుచుండఁగా నట్లు చేయుట మహాదోషమనియుఁ దెలియుచున్నది.

5. దీనిచే, సజ్జనులకుఁ గీడు సేసినవారికి మంచిభార్యలు దొరకరనియు, అగ్నిహోత్రాదిధర్మకార్యములు జరుగవనియు, సంతానము గలుగదనియు, కావున నుభయలోకభ్రంశము పాటిల్లుననియు ఊహ్యము.

6. దీనిచే, సత్పురుషులకుఁ గీడుసేసినవారికి ఆయువు నశించుననియు, దుఃఖమే కలుగుచుండుననియు, స్వభార్యయందు మంచిసంతానము గలుగదనియు నూహ్యము.

టకు సమ్మతించెనో, వాఁడు, పూర్ణాయుష్యముఁ బడయక దుఃఖితుఁడై తన భార్యయందును సంతానమును జూడకుండుఁగాక. [1] ఎవఁడు రాముఁ డడవికి బోవుటకు సమ్మతించెనో వానికి, రాజునుగాని స్త్రీనిగాని బాలునిగాని వృద్ధునిగాని, చంపినను, భృత్యుని పోషింపక దిగవిడిచినను, ఏపాపమో ఆపాపముగలుగును గాక. [2]ఎవఁడురాముఁడడవికిఁబోవుటకు సమ్మతించెనో, వాఁడు ఎల్లప్పుడును లక్కయుఁ మద్యము, మాంసము, లోహము, విషము మొదలైన నిషిద్ధవస్తువుల నమ్మికుటుంబ పోషణము సేసినట్టివాఁడగుగాక. [3] ఎవఁడు రాముఁడడవికిఁబోవుటకు సమ్మతించెనో, వాఁడు పగవారిపక్షమున భయంకరమైనయుద్ధము తారసిల్లఁగా, పిఱుదివిసి పాఱి పోవుచున్నపుడు చంపఁబడినట్టివాఁ డగుఁగాక. [4] ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు కపాలము దాల్చి గుడ్డపేలికలం గట్టికొని యున్మత్తునివలె నీ భూమి యంతయుఁ దిరిపమెత్తుచుఁ ద్రిమ్మరుఁగాక. [5] ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు ఎల్లప్పుడును కామక్రోధములకు డిందుపడి మద్యపానము సేయుచు స్త్రీలోలుఁడై జూదములం దవిలినవాఁడగుగాక. [6] ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు ధర్మమునందు మనస్సు నిలుపక, యధర్మమునే యాచరించు చుండువాఁ డగు గాక, మఱియు వాఁడు పాత్రులకుఁ గొంచెమయిన నియ్యక అపాత్రులకు నవ్వారిగా దానము సేయువాఁ డగుఁ గాక. [7]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు పలువిధములుగా వేల కొలఁదిని గూడఁబెట్టినధన మంతయు దొంగలపాలగుఁగాక. [8] ఎవఁడు రాముఁ డడ

1. దీనిచే, ఇతరులఁ జంపుటకంటెను రాజునుగాని స్త్రీనిగాని బాలునిగాని వృద్ధునిగాని చంపుట మిక్కిలియు దోషమనియు, భృత్యులఁ బోషకుండుటయు మహాదోషమనియుఁ దెలియుచున్నది.

2. ఇందువలన 'లాక్షాలవణమాంసాని వర్జనీయాని విక్రయే' అనుస్మృతిచొప్పున, లక్క, మద్యము, మాంసము మొదలగు వానిని అమ్మి జీవించుట మహాదోషమని తెలియుచున్నది.

3. దీనంజేసి యుద్ధమున వెనుకకుఁ దిరిగి పాఱిపోరాదనియు నట్లు పాఱిపోయిన వాఁడు బ్రతికినను చంపఁబడినను మరణమే పొందుననియు సూచ్యము.

4. దీనిచే కపాలము దాల్చి, చింపిగుడ్డలు కట్టుకొని, తిరిపమెత్తుచుఁ దిరుగుట మహాదోషమని తెలియుచున్నది. ఇట శైవమతమునందు ప్రవేశించుట నింద్యమని సూచితమయినట్లు గోవిందరాజులమతము.

5. కామక్రోధములకు లోనై మద్యపానమును స్త్రీలను జూదమును దగిలియుండుట మహాదోషమని తెలియుచున్నది.

6. ధర్మమునందు బుద్ధినుంపక యధర్మమునే సేయుటయు మహాదోషము. అపాత్రులకుఁ గొంచమిచ్చుటయు దోషము; మఱి యవ్వారిగా నిచ్చుట మహాదోషమని తెలియునది.

7. సత్పురుషులకుఁ గీడుసేసినవాని ద్రవ్యమంతయు దొంగలపాలగునని తెలియుచున్నది.

8. సంధ్యాసమయములందు నిద్రించుట మహాదోషమని సూచితము.

వికిఁ బోవుటకు సమ్మతించెనో, వానికి సూర్యోదయమునను సూర్యాస్తమయమునను నిదురించువాని పాపము గలుగును. [1]ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు ఇండ్లపై నిప్పుపెట్టినవాని కేపాపమో, గురుభార్యను గూడినవాని కెట్టి పాపమో, మిత్రద్రోహికి పాపమేదియో యట్టిపాపమును బొందునుగాక. [2] ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో. వాఁడు దేవతలకును, పితరులకును, తలిదండ్రులకును శుశ్రూషసేయనట్టివాఁ డగుఁగాక. [3] ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడుశీఘ్రముగానిప్పుడే సత్పురుషసమూహముచే విడువఁబడుఁగాక, సత్పురుషుల పొగడ్తకుఁ బాత్రుఁడుగాక తూలుఁగాక, సత్పురుషు లాచరించుకర్మములకుఁ దూలినవాఁడగుగాక, [4]ఎవఁడు, అజానుబాహుఁడును విశాలవక్షుఁడునగు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు మాతృశుశ్రూషను వదలి యధర్మము పాలగుఁగాక, [5] ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు పెక్కుపుత్రులను గని దరిద్రుఁడగుచు, జ్వరాదిరోగములతోఁ గూడి యెప్పుడును దుఃఖపడుచుండుఁగాక. [6] ఎవఁడు రాముఁ డడవికిఁబోవుటకు సమ్మతించెనో, వాఁడు ఉన్నతాసనమునఁ గూర్చుండి యున్నతన్ను, కన్నులుపైకెత్తిచూచుచు పొగడుచు, దీనులై యాచించుచున్నవారి యాశను వ్యర్థముచేసినట్టివాఁ డగుఁగాక. [7] ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు నిత్యమును, అధర్మాత్ముఁడై కఠినుఁడై కపటముగలిగి అపరిశుద్ధుఁడై రాజభయముతో మోసమునఁ దవిలి బ్రతుకు

1. ఇండ్లకు నిప్పుపెట్టుటయు, గురుభార్యను గూడుటయు, మిత్రునికి ద్రోహముచేయుటయు మహాపాతకములు. సత్పురుషులకుఁ గీడు సేసినయెడల నట్టిపాతకమే కలుగునని సూచితము.

2. దీనివలన దేవతలకు నిత్యమును నగ్నిహోత్రాదికర్మములచేఁ బూజలుసలుపవలయుననియు పితృదేవతలకు గ్రహణసమయములను వారిమరణతిథులను శ్రాద్ధాదు లిడవలయుననియు, బ్రతికి యున్న తలిదండ్రులకు శుశ్రూషసేయకుండుట మహాపాప మనియు సూచితము.

3. దీనిచే సత్పురుషసాంగత్యము విడువరాదనియు, సత్పురుషులపొగడ్తకు పాత్రుఁడుగాఁ దగుననియు, సజ్జను లాచరించునట్టి కర్మములు నాచరింపవలయు ననియు సూచితము.

4. దీనిచే మాతృశుశ్రూష చేయకుండుట మహాదోష మని సూచితము.

5. సత్పురుషునికి కీడుసేయఁగా దారిద్ర్యము కలిగి, యందును, పెక్కు కొడుకులు పుట్టి బిచ్చమెత్తుకొనియైనను ఆర్జించుటకు లేనట్లు జ్వరాదులు గలిగి, యెల్లప్పుడును గష్టపడుచుండుట గలుగునని దీనిచే తెలియవలయును.

6. దీనిచే దీనులై యాచించువారి యాశను వ్యర్థము సేయుట మహాదోషమని తెలియుచున్నది.

7. దీనిచే రాజవిరుద్ధము లగుకార్యములు గూడదనియు,అధార్మికత్వము,కాఠిన్యము,కాపట్యము, అపరిశుద్ధి, మోసము మొదలయినవి సత్పురుషులకు బాధసేయుటచేఁ గలుగుననియు సూచితము.

వాఁడగుఁగాక. [1]ఎవఁడు రాముఁడడవికిఁబోవుటకు సమ్మతించెనో, వాఁడు పతివ్రతయైన భార్యఋతుస్నాతయై ఋతుకాలనియమము ననుసరించి తనకు సన్నిహితయైయుండఁగా ఆబిడను విడనాడినవాఁ డగునుగాక, [2]ఎవఁడు రాముఁ డడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు ధర్మమునం దాసక్తివిడిచి మూఢుఁడై తనధర్మపత్నినివదలి పరస్త్రీలను బొందినవాఁడగుఁగాక. [3]ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు, సంతానము నష్టమైన బ్రాహ్మణునికిఁ గలుగునట్టిపాపము పొందును గాక. [4]ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వానికి, అందఱికి త్రావందగినజలమును చెఱిపిన నేపాపమో, ఎవరికైనను విషముపెట్టిన నేమిపాపమో, యారెండును గలుగుఁగాక. [5]ఎవఁడు రాముఁడడవికిఁబోవుటకు సమ్మతించెనో, వాఁడు ఇంద్రియములుచెడి, బ్రాహ్మణునకుఁ జేయ నిశ్చయింపఁబడినపూజను చెఱిపినట్టివాఁడగును, మఱియు ఈని పదిదినములుగాని లేదూడయావును పాలుపిదికినవాఁడగును, [6]ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు తనయింట పానీయముండియు, దప్పిగొన్న వానికి దాని నియ్యక మోసపుచ్చిన వానిపాపమును బొందునుగాక. [7]ఎవఁడు రాముఁడడవికిఁ బోవుటకు సమ్మతించెనో, వాఁడు ఇరువురు వివాదమాడుచుండఁగా అందొక్కనియందలి స్నేహమున జయోపాయమును దెలిసియుఁ జెప్పక యూరక చూచుచుండువానికిఁ గలుగుపాపమును బొందుఁగాక' అనెను. ఆరాజకుమారుఁడు పతినిబాసి పుత్రునిని విడిచియున్న కౌసల్యకు తనయందు నమ్మిక గలుగుటకై యిట్లు చెప్పుచునే దుఃఖమునఁగుందుచు నేలంబడెను. కౌసల్య

1. దీనిచే పతివ్రత యైనభార్య, ఋతుస్నాతయై, ఋతుస్నానదినమునఁ జేరఁరాఁగా నిరసించుట మహాపాతకమని తెలియుచున్నది.

2. దీనివలన పరస్త్రీలనుబొందుట పాపమనియు, అందును తనభార్యయుండఁగా దాని బరిత్యజించి, పరభార్యలంగూడుట మహాపాపమనియు తెలియుచున్నది.

3. దీనివలన భార్యయందు సంతానమువడసి పితరులఋణము దీర్చుకొన కుండుటయు, పుత్రవతి యగుభార్యను దిగవిడుచుటయు దోషమని యూహ్యము.

4. అందఱికిని త్రావ నుపయోగించుజలమును చెఱిపినను, ఒకరికి విషము పెట్టినను,మహాపాతకమని దీనివలన తేటపడుచున్నది.

5. దీనివలన బ్రాహ్మణునకుఁ జేయ నిశ్చయింపబడిన సత్కారమునకు విఘాతము సేయరాదనియు, ఆవును ఈనిన పదిదినములవఱకును బాలుపిదుక రాదనియు సూచితము.

6. దీనిచే దప్పిగొన్నవారికి జలమియ్యనియెడల దోషమనియు, అందును తనయొద్ద జలముండియు నియ్యనియెడల మహాదోషమనియుఁ దేలుచున్నది.

7. దీనిచే 'ఇద్దఱురచ్చలాడుచుండఁగాఅందొక్కనియెడ స్నేహమున వానికిమాత్రముజయోపాయముఁ జెప్పువాని పాపము గలుగుఁగాక' యనిగోవిందరాజులవారియర్థము. దీనివలన 'ఇద్దఱు తగవాడుచుండగా తగవు తీర్పశక్తియుండియు పక్షపాతమున తీర్పకుండుట, గాని లేక పక్షపాతమున మఱియొకనికి జయించుయుక్తిచెప్పుటగాని మహాదోషమని తెలియుచున్నది' అని మహేశ్వరతీర్థులు.

యంత నట్లు దుస్సహములైన శపథములు సేయుచు వగలంబొగులుచు మూర్ఛిల్లి యున్న భరతునిఁజూచి 'పుత్రా! నీవిట్లు శపథములు సేయుచుండఁగా నాదుఃఖము మఱిమఱి హెచ్చుచున్నది. నాప్రాణముల నలఁచుచున్నావు. *నాయనా! భాగ్య వశమున నీమనస్సు జ్యేష్ఠుని అనువర్తించు ధర్మమునుండి చలింపకున్నది. నాకు, లక్ష్మణునివలె ప్రతిజ్ఞఁ దప్పనివాఁడవై యున్నావు. కనుక సత్పురుషులు పడయు లోకమును బొందంగలవు' అనిచెప్పి తోఁబుట్టువునందు మిగుల ప్రీతి గల యామహా బాహుని భరతునిఁ దొడపయిం గూర్చుండఁ బెట్టుకొని కవుంగిలించుకొని పరమ దుఃఖితయై రోదనము గావించినది. ఇట్లు శపథములు పలుకుచు పలవించుచు దుఃఖ మునఁ బొక్కుచును నున్నయమ్మహాత్మునికి మూర్ఛవలనను శోకము పెట్టిన యడ్డపాటు వలనను మనసు మిక్కిలియు గలఁతనొందినదయ్యె. అతఁడు మిక్కిలియుఁ బలవించు చును తెలివితప్పి బుద్ధియుఁజెడి నేలంబడి మాటిమాటికిని వెచ్చనూర్చుచు శోకించు చుండఁగానే యారాత్రియుఁ గడచిపోయినదయ్యె. ఇది డెబ్బదియైదవ సర్గము.



## భరతుఁడు దశరథునికి సంస్కారము సేయుట.

మాటలాడువారిలో మేటియై మేలయినమాటలు పలుకువసిష్ఠమహర్షి యట్లు శోకమునఁ బొగులుచున్న కైకకుమారుని భరతునింజూచి 'రాజపుత్రా! నీవు మహాకీర్తిమంతుఁడవు, కాన దుఃఖపడుట చాలును. నీకు మంగళమగుఁగాక. దశరథ మహారాజు స్వర్గలోకమును బ్రాపించుటకు వలయు నుత్తరక్రియలను గావింపు' మనియె. ధర్మవిదుఁడగుభరతుఁడు వసిష్ఠుఁడుచెప్పిన మాటవిని ధైర్యమునొంది మనస్సు కుదుటఁబెట్టి తండ్రికిఁ జేయవలయుప్రేతకార్యముల నన్నిటిని జేసెను. దశ రథుని తైలద్రోణినుండి యెత్తి నూనెను తుడుచుటకై నేలపైనుంచిరి. నూనెయం దూరుటచే పసుపువన్నెపాటి యవయవము లింతకును ప్రిదులకుండుటవలన నిదుర పోయినట్లున్న యారాజు కళేబరమును వివిధమణిభూషితమైన మేలి పాన్పున నుంచి యంత పుత్రుండగు భరతుఁడు పరమదుఃఖితుఁడై 'రాజా! నేను దేశాంత రమునకుఁబోయి యిచటరాకుండఁగా, ధర్మజ్ఞుఁడగురామునిని మహాబలుఁడైన లక్ష్మణునిని వనమునకుఁ బంపి, నీవిపుడు స్వర్గగమనమునకై పూనినదేమి? మహా రాజా! అందఱికిని సొంపుగూర్చు కార్యమును గావించునట్టి పురుషసింహుని రాముని విడిచి దుఃఖార్తులమై యున్నయీజనమును వదలి యెచటికిఁ బోయితివి? తండ్రీ! నీవు రాజవుగదే. అట్లుండఁగా నీవు స్వర్గమునకుఁ బోయితివే. రాముఁ డడవిపాలయ్యె. ఇఁక నీపట్టణమునకు యోగక్షేమము లరయు వాఁడెవ్వఁడు?

* ఇందులకు 'ప్రాణా నుపరుణత్సి మే' అని మూలము. ప్రాణముల నడ్డగించు చున్నావని యర్థము. రాముని వియోగముచేఁ బోవుచున్న ప్రాణములను శపథముచే పోనీక నిలుపుచున్నావని యర్థాంతరము.

రాజా! నీవు లేనందున ఈ భూమి విధవయై సొంపుచూపకున్నది. నీవు లేనందున ఈ పురమును చంద్రుఁడులేని రాత్రివలె నాకుఁ దోఁచుచున్నది.' అని విలపించెను. అంత వసిష్ఠమహాముని యిట్లు మనస్సు విన్నయై విలపించుచున్న భరతునిఁ జూచి మరల 'మహాబాహూ! రాజునకిపుడు ప్రేతకార్యములేమి సేయవలయునో వానిని ఆలోచనచేఁ బ్రొద్దుపుచ్చుచుండక యేమఱుపాటులేక యన్నిటినిగావింపుము' అనెను. భరతుఁడును వల్లెయని వసిష్ఠుఁడుచెప్పినమాటను బాటించి ఋత్విజులను, పురోహితులను, ఆచార్యులను, శీఘ్రముగాఁగావింపుఁడని తీవరపెట్టెను. రాజగృహమునందు లోపల శవముండుటవలన బయటఁదెచ్చి యుంపఁబడిన గార్హపత్యాదు లగునగ్ని హోత్రములను, ఋత్విజులునుఁ పురోహితులును, విధివిధానమునఁ గొనితెచ్చిరి. అంతఁ బరిచారకులు మృతుఁడయినరాజును బల్లకియందుంచి, డెందంబులు కొందల పడ, కుత్తుకలఁ గన్నీళ్లుగ్రమ్మ, దుఃఖించుచుమోచికొనిపోయిరి. జనులువెండిపూవులను బంగారు పూవులను పలువిధములయిన వస్త్రములను, మార్గమున వెదజల్లుచు రాజునకుముందుగాఁబోయిరి. అట్లె మఱికొందఱు, చందనాగురుచూర్ణములను, గుగ్గిలమును, సరళ మనుధూపమును, పద్మకమను సుగంధికాష్ఠమును, దేవదారు వులను, మఱియుఁ దక్కిన నానావిధము లయినగంధ ద్రవ్యములను, జల్లుచుండిరి. అంతనచ్చటికిఁ బోయిన పిదప, రాజఋత్విజులు రాజకళేబరమును శిబికనుండియెత్తి చితిపయిని పరుండఁ బెట్టిరి. ఉద్గాత మొదలయిన ఋత్విజులు భరతునిచే రాజునకు త్రేతాగ్నిహోత్రము నిప్పించి యంత పైతృ మేధిక మంత్రములను జపించిరి. అందు సామగులు యథాశాస్త్రముగా సామగానములుసేసిరి. అప్పుడు, వృద్ధులగు పరి చారికలుచుట్టురా, నారాజుభార్యలు, తమతమకుఁ దగినట్లు, పల్లకీలను అశ్వాది యానములనునెక్కి పట్టణమునుండి వెడలి యక్కడికివచ్చిరి. అప్పుడు ఋత్విజులును వగలంబొగులుచున్న కౌసల్య మొదలయిన స్త్రీలును భరతుఁడును, పెక్కుయాగ ములవలన అగ్నిచయనము చేసినయారాజునకు అప్రదక్షిణమును ప్రదక్షిణమును గావించిరి. అచ్చట నాదుఃఖకాలమున స్త్రీలు దుఃఖపీడితలై కొంచపెంట్లవలె జాలి పుట్టునట్లు వేయివిధముల రోదనము సేయుచప్పుడు వినఁబడెను. అంత నయ్యుత్తమ కాంతలు రోదనము సేయుచును పరవశలయి మాటిమాటికి పలవించి వాహనముల నారోహించి సరయూనదీతీరమునకు వచ్చిదిగిరి. రాజుభార్యలును మంత్రులును పురో హితులును భరతునితోఁగూడ రాజునకు నుదకదానముసేసి పట్టణము ప్రవేశించి కన్నీళ్లొలుక నేడ్చుచు నేలపై శయనించుచు నిట్లు దుఃఖమున పదిదినములు * ఆశౌచము గడపిరి. ఇది డెబ్బదియాఱవ సర్గము.

---

* 'షోడశాహేన భూపాలాః' అనిశ్రుతియుండపడు నాఱుదినములు ఆశౌచముండగా ఇచట పదిదినములు చెప్పుట యెట్లనిన 'క్షత్రియస్తు దశాహేన స్వకర్మనిరత శ్శుచిః' 'స్వవిహిత కర్మము

భరతుఁడు పండ్రెండవదినమున శ్రాద్ధముచేయుట.
భరతశత్రుఘ్నులు తండ్రిని దలఁచుకొని
శోకింపఁగా వసిష్ఠాదు లూఱడించుట.

అంత పదిదినములు గడచిపోఁగానే, రాజకుమారుఁడగుభరతుఁడు పుణ్యాహవాచనాదులు గావించి యాశౌచముదీర్చుకొని పదునొకండవదినము రాఁగా నపుడు చేయవలసినశ్రాద్ధకర్మములను గావించెను. మఱియు తండ్రి పరలోకక్రియ నుద్దేశించి బ్రాహ్మణులకు రత్నములును ధనమును అన్నమును మేలయినవస్త్రములను మఱియు నానావిధములైన మేలివస్తువులను మేఁకలసమూహములను మిక్కిలి వెండిని, నూఱులకొలఁదిని గోవులను, దాసదాసీజనములను, వాహనములను, మిక్కిలి గొప్పలయిన గృహములను, ఆరాజకుమారుఁడు పుష్కలముగా దానము చేసెను. అంతఁ బదుమూఁడవదినమున ప్రాతఃకాలమున భరతుఁడు అస్థిసంచయనముకొఱకు, దహనస్థలమునకువచ్చి, శోకమున సొమ్మసిల్లుచు పెద్దయెలుఁగెత్తి రోదనముచేసెను. అట్లతఁడు పరమదుఃఖితుఁడై తండ్రిచితియొద్ద నతనింగూర్చి 'నాయనా! నీవునన్నెవ్వనికప్పగించిపోవలయునో యట్టినాయన్న రాముఁడు అడవికిఁ బోయినాఁడే! దిక్కులేనిచోట దిగవిడిచిపోతివి. రాజా! కన్నతండ్రీ! అనాథ యగు కౌసల్యకు గతియైనట్టి కొడుకును వనమునకుఁబంపితివే. బిడ్డనుబాసి దిక్కులేనిదైన యాతల్లిని కౌసల్యనుగూడ విడిచి యెక్కడికిఁబోయితివి' అని యేడ్చెను. అతఁడు, తండ్రిదేహము రూపుమాసినపట్టయి, మిక్కిలి కాలి యెఱ్ఱనై, బూడిద బ్రుంగి, కాలినయస్థులతోఁ గూడియున్న చితిపట్టుల పటలమును, జూచి, బిగ్గఱ నఱచుచు రోదనముసేసెను. భరతుఁ డట్లు ఆచితిని జూడఁగానే రోదనముసేయుచు దీనుఁడై దారములచే పయికెత్తఁబడుచున్న యింద్రధ్వజము గొంచెముదూరముసడలి నేలం బడునట్లు, భూమిపయిని బడెను. అంత నతనిపాటునుజూచి, జ్ఞాతులందఱును పుణ్యక్షయమునం బడినయయాతిని అతని దౌహిత్రులైన ఋషులు లేవనెత్తునట్లు, తామతనిని లేవనెత్త దగ్గఱికివచ్చిరి. శత్రుఘ్నుఁడింతవఱకు ధైర్యముతోనుండినను భరతుఁడు పడుటచూడఁగానే యాధైర్యమెడలి రాజును దలఁచుకొని మిక్కిలి దుఃఖితుఁడై మెయిమఱచి నేలంబడెను. ఆశత్రుఘ్నుఁడు తండ్రికిఁ గలయాయా గుణములను అతని యవయవములను దలఁచుకొని, పరమదుఃఖితుఁడై మైమఱచి

లను దప్పక జరుపుచుఁ బరిశుద్ధుఁడై యుండు క్షత్రియుఁడు పదిదినములచే శుద్ధుఁడగును' అనువిశేష శాస్త్రమును బట్టి పదిదినముల యాశౌచము చెల్లెనని తెలియునది. ఇచ్చోట ప్రేతముతోడ అగ్నిహోత్రములను గొనిపోవుట, ప్రేతమును చితియందుఁ బెట్టుట, సమంత్రకముగా అగ్నియిచ్చుట, ప్రదక్షిణము సేయుట, ఉదకమిచ్చుట, పదిదినములు ఆశౌచముండుట, నేలఁ బరుండుట, యను నింతమాత్రము దేశభేదమును కులభేదమును సూత్రభేదమునుబట్టి కలిగిన ఔర్ధ్వదైహిక విశేషములుగా చెప్పఁబడినవి కాని, లేక, ప్రధానములయినవానిని జెప్పుటచేతక్కిన వెల్లగ్రహించుకొనవలయునని కాని తెలియునది.

యున్నత్తునివలె "మంథరవలనం బుట్టినదై, కైకయను మొసలిగలిగి, వరదాన మనుజలముతోఁగూడి, తీవ్రమై కలఁచిపుచ్చరానట్టి దుఃఖసముద్రము మమ్ము ముంచినది. నాయనా! నీవెప్పుడు నుపలాలించుచుండు సుకుమారుఁడును బాలుఁడు నగుభరతుఁడు పలవించుచుండగా నీ వాతనిని విడిచి యెక్కడికిఁ బోయితివి? అయ్యో! భోజ్యపదార్థములందును పానద్రవ్యములందును వస్త్రములందు ఆభరణ ములందును 'నీకేదియిష్టమో దానిని దీసుకొను' మని బలవంతముగా మాకిష్టమైన దానిని మేమే తీసికొనునట్లు చేయుచుందువే! అట్లు మాకిఁక నెవ్వరుచేయుదురు. * ధర్మజ్ఞుఁడును మహాత్ముఁడగు నీవంటిరాజును విడిచియు భూమి బ్రద్దలుగా పెటిలి పోకున్నదే! కావున నీభూమి ప్రళయకాలమునందును బ్రద్దలుపాఱదు కాఁబోలు. తండ్రి స్వర్గమునుబొంది రాముఁడును అడవిపాలు కాఁగా నాకుజీవించుటకు శక్తి యేమున్నది? అగ్నినిజొచ్చి జీవము విడువవలసినదే. అన్నను విడిచి, తండ్రినిమాలి, ఇక్ష్వాకుపాలిత మగునయోధ్యాపట్టణ మిట్లు పాడుపడియుండ నేనెంతమాత్రమును బ్రవేశింపను, తపోవనమే ప్రవేశింతును" అని రోదనము చేసెను. వారిరువు రట్లు విలపించుటవిని వారిదుఃఖమునుజూచి వారివెంట వచ్చినవారందఱును మఱలమిక్కి లియు దుఃఖపీడితులైరి. అంత భరతశత్రుఘ్ను లిరువురును దుఃఖితులై పలవించి పలవించి మిక్కిలి యలసి కొమ్ములు విఱిగినవృషభములవలె నేలంబడి పొరలిరి. పిదప ప్రశస్త స్వభావుఁడును సర్వజ్ఞుఁడునై, యీభరతాదులతండ్రి దశరధునికిఁ బురోహితుఁడునగు వసిష్ఠుడు నేలఁ బొరలుచున్న భరతుని లేవనెత్తి, 'ప్రభూ! నీతండ్రికి సంస్కారముసేసి నేటికి పదుమూఁడవదినము. † అస్థిసంచయనకర్మము ఇంకను కొఱఁతవడియుండఁగా నిట్లు జాగుచేసెదవేల? ఆఁకలిదప్పులు, శోకమోహ ములు, జరామరణములు, అనెడి యీమూఁడుద్వంద్వములును సకలప్రాణులకును సమానములుగా సంభవించును. ఇవి కలుగనిదొకటిలేదు. ఇవి త్రోసిపుచ్చరానివై యుండఁగా వీనినిఁబట్టి నీయట్టివాఁడు మూఢునివలె నిట్లుపలవింపఁదగదు' అనెను. తత్త్వవిదుఁడగు సుమంత్రుఁడును, శత్రుఘ్నునిలేవనెత్తి కలఁకఁదేర్చి సకలప్రాణుల కును పుట్టుకయును జావును స్వాభావికములుగాన వానిని వారింప నలవికాదనియు కావున దుఃఖింపఁ దగదనియు వినిపించెను. మంచికీర్తిగాంచినయాపురుషసింహులు భరతశత్రుఘ్నులు లేచినవారై, యెండకును వానకును గాసిలియున్న యింద్రధ్వజ ములవలె వేఱువేఱ ప్రకాశించుచుండి, మంత్రులు, కన్నీళ్లుదుడుచుకొనుచు రోదన

* లేక ధర్మజ్ఞుఁడును మహాత్ముఁడునగు నినుబోఁటి రాజును విడుచుటచే భూమికి బ్రద్దలు పాఱవలసిన కాలమే యిది. అయినను ఇది బ్రద్దలు కాకున్నదే' అనియు నర్థము.

† దశాహమధ్యమున శాస్త్రవిహితమైన దగుప్రధానాస్థి సంచయమునుచేసి త్రయోదశదిన మునతద్దేశాచారముచే ప్రాప్తమయిన స్థలశోధనము మాత్రము చేయఁబడినదిగాన త్రయోదశాహమున సంచయనము చేయవలయు ననుస్మృతికి విరోధములేదని తెలియునది.

ముచే నెఱ్ఱఁబాఱినకన్నులతో దీనస్వరమున మాటలాడుచున్న యారాజకుమారులను తక్కినయస్థిసంచయనాదికార్యములను చేయుటకై త్వరితపెట్టిరి. ఇది డెబ్బదియేడవ సర్గము.



## శత్రుఘ్నుఁడు మంథరను శిక్షించుట. కైక మంథర నోదార్చుట.

అపరక్రియలు నిర్వర్తించి గృహమునకుఁ బోయినపిదప లక్ష్మణునితమ్ముఁడగు శత్రుఘ్నుఁడు రామునియొద్దకుఁబోవ నుద్యుక్తుఁడైయున్న భరతునిఁ జూచి "దుఃఖము కలుగునప్పుడు సమస్తప్రాణులకును దిక్కయి కాచునట్టిరాముఁడు తనకు దుఃఖము కలిగినప్పుడు తనకుఁదాను దిక్కై కాఁచుకొన నేర్చునని చెప్పనేల! అట్టి రాముఁడు తాను మహాబలవంతుఁడై యుండియు తుదకు నొకయబలచేత నడవికిఁ బంపఁబడినాఁడే! ఇదియేమిచిత్రము! 'తండ్రికిలోనై రాముఁడేమిసేయు' నందువా? సరే. బలవంతుఁడును పరాక్రమవంతుఁడు నగువాఁడు లక్ష్మణుఁ డని యొక్కఁడున్నాఁడే! అతఁడయినను తండ్రిని నిగ్రహించి రాముని వనవాసమునుండి యేల విడిపింపలేదు? దుష్టురాలైన యాఁడుదానివలలోఁజిక్కి తగనిమార్గమును ద్రొక్కిన రాజును, న్యాయాన్యాయములను పరిశీలించి యిట్టియనర్థము సంభవించుటకు మునుపే నిగ్రహింపవలసియుండెను" అనెను. లక్ష్మణునితమ్ముఁడగు శత్రుఘ్నుఁ డిట్లుమాటలాడుచుండఁగానే కుబ్జయపుడు తాను గోరినభరతాభిషేకసమయము నెదురుచూచుచు సమస్తాభరణముల నలంకరించుకొని దైవికముగా భరతశత్రుఘ్నులున్న గృహమునకుఁ దూర్పుతట్టువాకిలియొద్దకు వచ్చెను. అది యపుడు మేలయిన చందనపంక మలఁది, కైక యిచ్చినరాజయోగ్యము లగువస్త్రములను ధరించి, పలువిధము లయినరత్నములు పొదిఁగినపెక్కువగ లగునయ్యాభరణముల నలంకరించుకొని యొప్పుచుండినది. మఱియు నది నానావర్ణములగు మొలనూళ్లనును మఱియు మేలయిన పెక్కు భూషణములను గట్టుకొని, త్రాటం గట్టినకోఁతివలెఁ బ్రకాశించుచుండెను. అప్పుడు ద్వారపాలకులు మిక్కిలి పాపాత్మురాలును నిర్దయురాలు నగునామంథరను జూచి దానింబట్టుకొని శత్రుఘ్నున కప్పగించి 'ఎవ్వతెవలన రాముఁడడవికిఁబోయెనో, ఎవ్వతివలన మీతండ్రి దేహమును దొఱఁగెనో, అట్టిపాపాత్మురాలును క్రూరురాలును ఇదియే. దీనిని నీమనసు వచ్చినట్లు సేయు'మని చెప్పిరి. ధృతవ్రతుఁడగు శత్రుఘ్నుఁడును వారుచెప్పినది తెలిసి పరమ దుఃఖితుఁడై యంతఃపురమున నున్నవారల నందఱినిఁజూచి 'ఎవ్వతివలన నాతోఁ బుట్టువులకును తండ్రికిని ఇట్టితీవ్రదుఃఖముకలిగెనో అట్టిది తన క్రూరకార్యమునకు తగుఫల మిప్పు డనుభవించుగాక' అనెను. అతఁ డట్లుచెప్పి చెలికత్తెలు బలసియున్నయాకుబ్జను బలవంతముగాఁ బట్టికొనఁగా అది ఆగృహమంతయు శబ్దించునట్లు బిగ్గఱ నఱచెను. అంత దానిచెలికత్తెలందఱును శత్రుఘ్నుడు క్రుద్ధుఁడై

యుండుటఁజూచి మిక్కిలియుఁ బరితపించుచు పలువిధముల చెల్లాచెదరై పాఱిరి. దాని చెలికత్తెలందఱును తక్కినవారెల్లను ఒకరితో నొకరు మంతనమున 'ఇతఁ డారంభించినవిధమును జూడఁగా మనల నందఱిని నిశ్శేషముగాఁ జంపఁగలఁడు. కీర్తిమంతురాలగు కౌసల్య దయగలది, మంచిమాటలు పలుకునదియు, మఱిధర్మములను దెలిసినది, కనుక నామెను శరణుఁజొత్తము. ఆబిడయే మనకుగట్టిదిక్కు' అని యాలోచించుకొనిరి. అపుడు పగవారిని దపింపఁజేయు నాశత్రుఘ్నుఁడు కోపమున కన్నులెఱ్ఱఁబాఱ, అఱచుచున్నయాకుబ్జనుబట్టి నేలంబడవైచి యీడ్చుకొనిపోయెను. అతఁడు ఈడ్చుకొనిపోవుచుండఁగా నపుడు దానిమేనిపైనున్న వింతవింతలగు బహువిధభూషణములు అందందు నేలరాలినవి. అపు డాభూషణములు రాలియుండుటవలన కాంతి దళుకొత్తుచుండు రాజగృహ మంతయు శరత్కాలమునందు అచ్చంపుఁ జుక్కలతోఁగూడి యున్నయాకాశమువలె మిక్కిలియుఁ బ్రకాశించినది. బలవంతుఁ డగునాపురుషలలాముఁడు మిక్కిలి కోపమున బలవంతముగా దానిని బట్టుకొని దాని విడిపింప వచ్చినకైక నదల్చి పరుషంపు మాటలాడెను. కైకేయి దుఃఖకరము లైనపరుషవాక్యములకు మిక్కిలియు దుఃఖితయై శత్రుఘ్నుఁ డేమి సేయునో యనుభయమున వడఁకుచు తనకొడుకగుభరతుని శరణుఁజొచ్చినది. భరతుఁడు ఆకైకపాటునుజూచి, శత్రుఘ్నుఁడు క్రుద్ధుఁడై యుంటయుఁగాంచి యతనితో "సమస్తభూతములందును స్త్రీలనుజంపరాదు. కావున నోర్పుగలుగుము. రాముఁడు ధార్మికుఁడుగనుక నేను తల్లిని చంపితినేని మాతృఘాతకుఁడని నన్నతఁడు నిందించును. అతఁడట్లు నిందింపకుండునేని యీపాపాత్మురాలైన దుష్టచారిణిని యీకైకను నేనే చంపుదునే! 'మాతృహత్య కూడదుగాని కుట్రలకెల్ల మూలమైన దీనిని జంపరాదేల' యని యందువా? ఈకుబ్జనుగాని మనము చంపితిమని రాముఁడు వినెనేని ధర్మాత్ముఁడుగాన, యతఁడు స్త్రీవధము గావించితి వని నీతోఁగాని నాతోఁగాని యెంతమాత్రమును మాటలాడఁడు. ఇదినిజము!" అనెను. లక్ష్మణునితమ్ముఁ డగు శత్రుఘ్నుఁడు భరతుఁడు చెప్పినది విని యంత రోషముచాలించి యామంథరను విడిచిపెట్టెను. అదియు కైకేయి పాదములంబడి మిక్కిలియు దుఃఖమునఁ బొక్కుచు నిట్టూర్పులు పుచ్చుచు జాలిపుట్టునట్లు విలపించెను. శత్రుఘ్నుఁడు పట్టిచిమ్ముటచే మతితప్పి సొమ్మసిల్లి వలలం దగులుపడి దిక్కులు సూచుచున్న యాఁడుకొంచపిట్టవలె మిక్కిలియు దురపిల్లుచున్న యాకుబ్జనుజూచి భరతునితల్లికైక మెల్ల మెల్లగా నోదార్చెను. ఇది డెబ్బదియెనిమిదవ సర్గము.



—{భరతుఁడు రాజ్యమును గయికొనక రాముని మరలఁ దెచ్చుటకై పోవఁబూని మార్గమును జక్కఁబఱుప నియోగించుట.}—

అంత పదునాలుగవదినమున ప్రాతఃకాలసమయమున రాజును పట్టాభిషేకము సేయ నధికృతులైనవా రందఱువచ్చి భరతునిఁజూచి 'మనకు పరమగురువైన దశరథమహారాజు జ్యేష్ఠకుమారుఁ డగురామునిని మహాబలుఁ డగులక్ష్మణుని నడవికిఁ బంపి తానును స్వర్గమునకుఁబోయెను. రాజపుత్రా! నీవు మహాకీర్తి మంతుఁడవు. ఇప్పుడు నీవు మాకు రాజవుగమ్ము. ఈరాజ్యమింతవఱకు అనాయకమయ్యు దైవికముగా నిందలి ప్రజలెవ్వరును ఒకరికొకరు ద్రోహములు సేయక యపరాధములు గావింపకున్నారు రాజకుమారా! పట్టాభిషేకమునకుఁ గావలసిన పదార్థములనన్నిటినిఁ దీసికొని మంత్రులు మొదలైనవారును, పట్టణమున నుండు జనులును నిన్నెదురు చూచుచున్నారు. పురుషతిలకా! తండ్రితాతలనాఁటనుండి పరంపరాగతమై వచ్చియున్న యీ స్థిరరాజ్యమును బరిగ్రహించి యభిషేకము గావించుకొని మాంబోట్ల నందఱిని గాపాడుము' అనిరి. భరతుఁడు తన నియమమును దప్పనివాఁడు గావున, పట్టాభిషేకమునకై సమకట్టిన పదార్థముల నన్నిటికిని, ప్రదక్షిణము గావించి, రాజాభిషేక కర్తలగు నాపురుషుల నందఱిని జూచి, 'మావంశమున జ్యేష్ఠుఁడు రాజగుటయేకదా యుచితము, అట్లుండఁగా సకలమును దెలిసినప్రోడలగుమీరు నాతో నిట్టిమాట లాడందగదు. మీకు పెద్దతోఁబుట్టువైనరాముఁడే రాజు కావలయును. నేను అతనికి బదులుగా, పదునాలుగు సంవత్సరములు, వనమున నుండెదను. నేను వనమునకుఁబోయి నాజ్యేష్ఠభ్రాత యగురామునిఁ దోడుకొని వచ్చెదను. చతురంగములతోఁ గూడిన గొప్పసేనను రావింపుఁడు. వానితోఁగూడఁ బోయెదను. ఇపుడు పట్టాభిషేకమునకై సమకట్టిన యీసంస్కృతద్రవ్యముల నన్నిటిని రామపట్టాభిషేకము కొఱకై నాతోఁగూడఁ దీసికొని వనమునకుఁ బోవుచున్నాఁడను. పూజ్యుఁడగు నాపురుషశ్రేష్ఠుని రామునిని ఆవనముననే యభిషేకము గావించి యాగశాలనుండి త్రేతాగ్నిని గొనివచ్చునట్లు అతనిని వనమునుండి యిచటికిఁ దోడ్కొనివచ్చెదను. తల్లియనిపేరు మాత్రము గలదీనికోర్కి యీడేఱునట్లు నేనెంతమాత్రము సేయను. దీనికోర్కికివిరుద్ధముగా నేనే చోరరానియడవి యందుండెద. రాముఁడే రాజగును. శిల్పులుమిట్టపల్లములను సమముగాఁ జేయుచుదారిని జక్కపెట్టునట్లాజ్ఞాపింపుఁడు. మఱియు మార్గమున దుర్గమస్థలమును శోధించి తెలిసి యందుజనులను మెలపం జాలినరక్షకపురుషులు వెంబడింతురుగాక' యనెను. ఇట్లు రామునిని గుఱించి మిక్కిలి మెనలేని పెంపుగులుకు పలుకు లాడుచున్న యీరాజకుమారునిఁజూచి జనులందఱును 'నీవు జ్యేష్ఠుఁ డగురాజకుమారునికి రామునికి రాజ్యము నొసంగఁ గోరుచున్నావు. ఇట్టి వాఁడవగుటచే నీపొంతపద్మాలయ యగు లక్ష్మి యెడఁబాయక యుండుఁగాక' యనిరి. రామునిఁ దోడ్కొనిరావలయు నను

ప్రతిజ్ఞవిషయమై రాజకుమారుఁడగు భరతుఁడు చెప్పిన సాటిలేని యామాటను వినఁగానే పూజ్యులైన రాజాభిషేకకర్తలకు పరమ సంతోషమునఁ గన్నుల నుండి మోదమునఁ జిప్పిలి యానందబాష్ప బిందువులు దొరఁగెను వారును మంత్రులును మఱియు నితర సభ్యులును భరతుఁడు చెప్పినది విని దుఃఖమువిడిచి సంతోషంబుతో నతనింజూచి 'పురుషశ్రేష్ఠుఁడా! నీయాజ్ఞచొప్పున రాజభక్తిగల రక్షకులను మార్గము గాచుటకును, శిల్పులను మార్గము జక్క పెట్టుటకును దిట్టముచేసితి' మనిరి. ఇది డెబ్బదితొమ్మిదవ సర్గము.

---

## అయోధ్యమొదలుకొని గంగానదివఱకు మార్గమును జక్కఁబెట్టుట

అంత నాయాభూప్రదేశముల స్వభావములు దెలిసినవారును, భూతు లగు వాపీకూపములనుండి జలమును జేఁదుటకు వలయు సూత్రములు సేయువారును, సాలెవాండ్రును, తనుకార్య మయిన మార్గరక్షణమం దారి తేరినశూరులును, త్రవ్వువారలును, పెద్దకాలువలు మొదలైనవి దాఁటుటకు కొయ్యలతో యంత్రములు సేయువారును, ఉరులు మొదలయిన యంత్రములుపన్ను వారును, కూలిపని వాండ్రును, శిల్పులును, అధ్యక్షులగు రాజపురుషులును, ఓడతెడ్లు మొదలగుయంత్ర కార్యములందు నిపుణులైనవారును, వడ్రంగులును, మార్గమును చక్కఁబెట్ట నేర్చిన వారును, మార్గమున కడ్డుగానుండు వృక్షములను నఱికివైచు వడ్రవారును, బావులు త్రవ్వువారును, సున్నపుగచ్చు పూయువారును, వెదుళ్లపని సేయుమేదర వాండ్రును, తక్కినపనులయందు సమర్థులయినవారును, మార్గమున పెక్కుమార్లు పోయి యనుభవముగలవారును, ముందుగాఁ బోయిరి. అపారమైన యా జనసమూహము రామునిం జూచుకుతూహలమున నతఁ డుండుప్రదేశమును గూర్చిపోవుచుండు నపుడు, పున్నమయందు మిక్కిలి యురవడి గల సముద్రమువలె ప్రకాశించెను. దారిని జక్కఁబెట్టుటయందు నిపుణులైన యాపనివాండ్రు దారిని జక్కఁబెట్టుటలో తమతమ వంతునుం గైకొని తమ తెగవారిం గూడి గుద్దలి మొదలగు నానావిధ సాధనములు దీసికొని ముందుగాఁ బోయిరి. వారలు మార్గమును గ్రమ్ముకొని యుండు కొమ్మలను తీగలను బోదియలేని చిఱుచెట్లను ఎండినమ్రోడు మ్రాఁకులను తాలను మఱియు నానావిధములైన వృక్షములను ఛేదించి, పోవరాని చోట్ల మార్గము నేర్పఱిచిరి. కొందఱు వృక్షములులేనిచోట్ల వృక్షములనాటిరి. కొందఱు అచ్చటచ్చటి దారికడ్డపడుమ్రాఁకులు మొదలైనవానిని గొడ్డండ్రను గడ్డపాఱలను అంపములను గొని ఛేదించిరి. మఱియు బలవంతులగు గొందఱు త్రెంపనలవికాని యుపురుగంటలనుగాల్చి, పోవలవిగాని యెడుదొడుకుపట్ల నెల్లసమముగాఁ జేసిరి. మఱికొందఱు దారికడ్డముగా నుండుబావులను విశాలములయిన రంధ్రములను మట్టిపోసి పూడ్చిరి. అంతఁ గొందఱు పల్లపునేలలను మిట్టపోసి అంతటను నేల

మట్టముగాఁ జావుచేసిరి. అప్పుడు వార లయ్యెడల సేనలుదాఁటుటకు వంతెనలు గట్టవలసిన జలప్రదేశములందు వంతెనలు గట్టిరి. గులకరాళ్లను పొడిసేయ వలసిన పట్టులందు వానిని బొడి గావించిరి. అపు డాజనులు నీళ్లు చిదచిద యనుకచ్ఛము మొదలైన యూటపట్టులందు జలముపయికిరాఁ ద్రవ్వవలసినవానిని నట్లె భేదిల్లఁగా ద్రవ్విరి. చెఱువు మొదలగు వానికట్టలను జలముపోవుటకై పగులఁగొట్టిరి. వారలు స్వల్పకాలముననె, అల్పప్రవాహములకు కట్టలుగట్టి యధికజలములు గలిగి మెట్లు రేవులు మొదలగు పెక్కువిధముల నలవడి, సముద్రమునకు సాటిగానుండునట్లు గావించిరి. వారలు జలములేనిప్రదేశములందు మనుష్యులకు గజతురగాదులకును ద్రావ ననువుపడునట్లు పలువిధములుగా నమరియుండు మేలినడబావులనుద్రవ్వి నీళ్లు త్రావినవు డలసట దీర్చుకొనుటకై వానిదావున నందందు వరుఁగులును సొంపునింప నిర్మించిరి. సేననడచుమార్గమున సున్నములతో గట్టనసేయఁబడిన నెలకట్టులును గట్టఁబడెను. నీరుకట్టుటచే చెట్లుమిక్కిలియుఁ బూచియుండెను. పక్షుల కదుపులు మత్తిల్లి కెరలి కొలకొలఁ గూయుచుండెను. అందందు, వన్నెగులుక పతాక లెత్తంబడియుండెను విడిపట్టులందు చందనపునీటికలయంపులు చల్లబడియుండెను. మఱియుఁ బలువగలపూవులు నచ్చటచ్చట వెదచల్లఁబడియుండెను. కాన యామార్గము దేవమార్గమువలె మిక్కిలియుఁ బ్రకాశించుచుండెను. అట్లు దారి యేర్పఱచినపిదప శిబిరాదులను పన్నుటకునియమింపఁబడినవారు తామెల్ల నొక్కటిగాఁ గూడి, మిక్కిలి రుచ్యములయినఫలములుగల యింపయిన ప్రదేశములందు, మహాత్ముఁడైన భరతుని కభిమతముగా నుండునట్టితీరుగలవై, తమంతనే యలంకృతములైనట్లు సొంపు గులుకునట్టిపట్టులను, మేలుకట్లు బంగరుకలశములు పతాకలు మొదలయినయలంకారములచే మఱియు సొంపులుగులుకునట్లు కావించిరి. వాస్తుశాస్త్రవిదులైనవారలు, ప్రశస్తములైననక్షత్రములందు శుభముహూర్తములను భరతుఁడు విడియుటకు ఆయా స్థలముల శిబిరములు స్థాపించిరి. ఆశిబిరములు,అన్నిటను మంచిసన్ననియిసుకనేలలుగలిగి, చుట్టునగడ్తలు వెలయుచు, ఇంద్రకీలపర్వతమును సరిపోలుచుండెను. అందు మేల్మయినవీథులును వన్నెగులుకుచుండెను. దేవాలయపు వరుసలును నలుగడల నెఱసియుండెను. సున్నపుఁబూఁత తెల్లగానుండు ప్రాకారములును చుట్టునుండెను. మఱియు నవి పతాకలచే నలంకృతములై, సుందరముగా రచింపఁబడిన రాజవీథులుగలిగి, వెలుఁగుచుండెను. అందలి యేడునిలువుల మేడలు మిక్కిలి పొడవులగుటచే ఆకాశముతో నొరయుచున్నట్టు కనఁబడుచు, కొనలయందు గువ్వగూండ్లుగలిగి సిరిగులుకుచుండెను. ఇట్టి సొంపుపెంపులచే ఆ శిబిరములు దేవేంద్రునిపురమునకు సాటియై యెంతయుఁ బ్రకాశించుచుండెను. నానావిధవృక్షములు గలయడవులతోఁగూడినవై,యచ్ఛంపుఁజల్లనినీళ్లు గలిగి, పెను చేఁపల నెరసిబెరసి యుండుగంగానదివఱకును, ఆశిబిరములు ప్రకాశించుచుండెను.

దాని కవ్వల నసాధ్యమగుటంజేసి శిబిరములు స్థాపింపఁబడవయ్యె. రాత్రియందు నక్షత్రసమూహముతోను చంద్రునితోను గూడినయాకాశము ప్రకాశించునట్లు, సమర్థులైన శిల్పులు రచించుటంజేసి, రమణీయమై యాభరతునిమార్గము పయింబయిఁ బ్రకాశించుచుండెను. ఇది యెనుబదియవసర్గము.



భరతునిశోకము. వసిష్ఠుఁడు సుమంత్రునిఁబంపి భరతశత్రుఘ్నులు మొదలగువారిని రాజసభకు రప్పించుట. వారందఱును వచ్చుట.

అంత రామునిం దోడ్కొనివచ్చునభ్యుదయమును ప్రారంభించినయపరరాత్రియందు, మాటలపస నెఱింగినవందిమాగధులు మంగళశబ్దయుక్తము లైన స్తవముల భరతునిఁ బొగడిరి. జాము దెలుపునట్టిభేరియు బంగరుదండముచే వాయింపఁగా మిక్కిలియు ధ్వనించినది. అంత వేలకొలఁదిని శంఖములు పూరించిరి, కాహళాది నానావిధవాద్యములును వాయించిరి. ఆవాద్యధ్వని మిక్కిలియు వెల్లివిరిసి యాకాశమంతయు నిండుకొన్నట్లు చూపట్టుచు, శోకమున పురపురం బొక్కుచున్న భరతుని మఱియు మహాశోకమున చిల్లులుపుచ్చినదయ్యె. అంత భరతుఁడు మేల్కొని యాధ్వనినివిని 'నేను రాజుగాను, రాజును బొగడునట్లు నన్నుఁ బొగడకుఁడు' అనిచెప్పి దానిని నిలిపి శత్రుఘ్నునిఁజూచి 'శత్రుఘ్నా! కైక లోకమున కెంత గొప్పయపకారము సేసినదో చూడుము. దశరథమహారాజు దుఃఖముల నన్నిటిని నాయందు దిగవిడిచి పోయినాఁడు. మహాత్ముఁడైనయాధర్మరాజుదయిన యీ రాజలక్ష్మియు రాజునకు వెనుకఁ బెద్దకుమారునికిఁ బ్రాప్తించునట్టి ధర్మమునందే నెలకొన్నది. అట్టిది యిప్పుడు జలమునందు, మాలిమిలేనియోడవలె నల్లలాడుచున్నది. ఎవ్వఁడు మనకందఱికిని నాథుఁడో యట్టిరామునిఁగూడ, యీ నాతల్లి ధర్మమును దిగనాడి తానై యడవికిఁ బంపినదే' అనెను. అప్పుడు ఇట్లు విలపించుచు యెఱుకతప్పియున్నభరతుంజూచి, స్త్రీలందఱును పరమదుఃఖితలయి పేరెలుంగున రోదనము గావించిరి. ఆభరతుఁడట్లు విలపించుచుండగా, రాజధర్మవిదుఁడును మహాకీర్తిమంతుఁడు నగువసిష్ఠుఁడు రాజసభను బ్రవేశించెను. బంగారుమయమై, మనోజ్ఞమై,యుత్తమము లగుమణులచే నలంకృతమై సుధర్మ యనుదేవసభయుంబోలె వెలుంగుచున్న రాజసభను, ఆ ధర్మాత్ముఁడు శిష్యగణముతోఁగూడ ప్రవేశించెను. సకలవేదవిదుఁడైన యామునివరుఁడు హాయిగానున్నపఱుపు పఱువంబడిన బంగారుపీఠముపయిఁ గూర్చుండి దూతలనుజూచి 'మీరుకష్టసాధ్యమైనయొక కార్యమున్నది. కనుక మీరు జాగుసేయక బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్యులను మంత్రులను గణాధ్యక్షులను, రాజాంతరంగభృత్యులతోఁగూడ శత్రుఘ్నుని, కీర్తిమంతుఁడగు

భరతుని యుధాజిత్తును సుమంత్రుని మఱియు రాజ్యమునకు హితపరు లగువా రెవ్వరుగలరో వారినిదోడ్కొనిరండు' అని యాజ్ఞాపించెను. అంత నాయాజ్ఞ చొప్పున జనులందఱు తమతమయంతరువులకుఁ దగినట్లు రథములను గుఱ్ఱములను గజములను ఆరోహించి వచ్చుచుండఁగా దానంజేసి మహాధ్వని కలిగినది. అంత వచ్చుచున్న భరతునిఁజూచి ప్రజలు దేవతలు దేవేంద్రునిఁ గొనియాడునట్లును, మున్నుదశరథుని గొనియాడుచున్నట్లును, నతనిం గొనియాడిరి. పెద్దమత్స్యము తోను నీటిమేనుఁగుతోను గూడినదై, నిశ్చలమగు జలముగలిగి, మణులును సంకువులును గులకఱునుకగాఁ గలిగి వెలుఁగుచున్న సముద్రము దాపటిమడుఁగు వలె, దశరదకుమారులగు భరతశత్రుఘ్నులతోను వసిష్ఠునితోను సుమంత్రులు మున్నగువారితోను నొప్పుచున్న యాసభ, మునుపు, దశరథుఁ డుండినప్పటివలెనే మిక్కిలి ప్రకాశించుచుండెను. ఇది యెనుబదియొకఁడవ సర్గము.



-(భరతుఁడు రాజ్యమునొల్లక పౌరవర్గముతోడ రాముని కడకుఁ బయనమగుట.)-

బుద్ధిమంతుఁడగు భరతుఁడు వసిష్ఠాదిపూజ్యసమూహముతోఁ గూడియున్న యాసభను, పూర్ణచంద్రుఁడు బృహస్పతి మొదలైనశ్రేష్ఠగ్రహసమూహముతోఁ గూడినరాత్రిని జూచునట్లు సొంపారఁజూచెను. అప్పుడు పూజ్యులగుసభ్యులు సభను ప్రవేశించి వారివారిచొప్పునకుఁ దగినట్లు ఆసనములపైఁ గూర్చుండఁగా, వారు ధరించియున్న వస్త్రములయు చందనాదిలేపనములయు కాంతిచేత నామేటిసభ యెంతయుఁ బ్రకాశితమైనది. అప్పుడు భరతునకు నభిషేకము జరుగు నని పండిత సమూహములు చక్కఁగా నలంకరించుకొనివచ్చి నిండియుండఁగా ఆసభ మిక్కిలి యొప్పుగులుకుచు, శరత్కాలమునందు పూర్ణచంద్రునిచే వెలుంగుచున్న రాత్రివలె విలసిల్లుచుండినది. ధర్మవిదుఁ డైనయాపురోహితుఁడు నానాదేశపురాజులును, ముఖ్యముగా వలసిన సకలప్రజలును, అందఱును వచ్చియుండుటఁ జూచి మృదు వచనమున భరతునితో 'నాయనా! దశరథమహారాజు సత్యపరిపాలనధర్మమును దప్పక యాచరించువాఁడై ధనధాన్యములపెంపున మిక్కిలి సొంపారు చున్న భూమిని నీకొసంగి స్వర్గమునకుఁ బోయెను. ఆరాజువలెనే సత్యప్రియుఁ డగు రాముఁడు సత్పురుషులయాచారమును దలఁచుచు, ఉదయించిన చందురుఁడు వెన్నె లను బాయకుండునట్లు, తండ్రియాజ్ఞను విడువక యడవికిఁబోయెను. నీతండ్రియును నీతోఁబుట్టువును కంటకములనెల్లఁ బోఁగొట్టి సుఖప్రదముగా నుండునట్టిరాజ్యమును నీకొసంగిరి. కావున నీవు దానిని ముదముతో ననుభవింపుము. శీఘ్రముగా నభి షేకము సేసికొనుము. ఉత్తరపుదిక్కు రాజులును పడమటిదిశరాజులును తూర్పు దేశపురాజులును పడమటిదిశవారును అపరాంతదేశపు యవనులును, సముద్ర ద్వీపవాసు లగురాజులును, నీకుఁ గోటికొలఁదిని రత్నములు దెచ్చి కానుక లొసఁగు

దురుగాక' యనెను. *భరతుఁడు వసిష్ఠునివాక్యమువిని శోకమున మునింగి, ధర్మజ్ఞుఁడుగాన జ్యేష్ఠుని అనువర్తింపవలసిన ధర్మమును గాంక్షించి, మనసున, జ్యేష్ఠుఁడైనరాముని స్మరించెను. † రాయంచస్వరమువంటి కంఠధ్వని గల యాభరతుఁడు తాను భోగార్హమైన యౌవనదశయం దుండియు రాజ్యభోగములయందు మనసు నుంపక ధర్మమునే యెంచి రామునిఁ దలఁచుకొని కన్నీళ్లచే పలుకులు తొట్రుపడ సభామధ్యమున విలపించి పురోహితు నిందించి 'బ్రహ్మచర్యమున గురుకులవాసము ననుష్ఠించి వేదాధ్యయనము చేసినపిదప స్నాతకర్మముఁ బొంది వేదార్థముం దెలిపి తదుక్తధర్మములను అనుష్ఠించుచున్న రామునిరాజ్యమును శాస్త్రమునకు వశుఁడై వర్తించు నను ‡బోఁటివాఁ డెవ్వఁడు అపహరించును? §దశరథునకు

* ఇందులకు 'తచ్ఛ్రుత్వాభరతో వాక్యం శోకేనాభిపరిప్లుతః। జగామ మనసా రామం ధర్మజ్ఞో ధర్మకాంక్షయా' అనిమూలము. (తత్ శ్రుత్వా) ధర్మాధర్మముల తారతమ్యములను దెలిసినవాఁ య్యును వసిష్ఠుఁడట్లు చెప్పినమాటను విని (ధర్మజ్ఞః) జ్యేష్ఠుని అనువర్తింపవలయునను ధర్మము తెలిసినవాఁడగు భరతుఁడు, (శోకేన+అభిపరిప్లుతః) శోకముచేత మిక్కిలియు ముంపఁబడినవాఁడు మొదట దశరథమరణమునకే శోకమున ప్లుతుఁడైనవాఁడు. ఇప్పుడు సర్వజ్ఞుఁడును హితతముఁడును అగుగురువుకూడ ధర్మమును నెపమున అధర్మమునే చెప్పినాఁడేయని శోకమున అభిపరిప్లుతుఁడైనాఁడని భావము. (ధర్మకాంక్షయా) అధర్మమైన తనరాజ్యాభిషేకమును విన్నపాపమునకుఁ బ్రాయశ్చిత్తమనెడు బుద్ధితో, (మనసా రామంజగామ) మనస్సున స్మరించెను. ఇట్లు ఆచార్యుఁడు చెప్పినమాటను వినినట్టిపాపము నీవే క్షమింపవలయును అని మనస్సుచే రామునియందు ప్రపత్తిచేసినాఁడు. (ధర్మకాంక్షయా) రాజ్యపరిపాలనరూపమయిన సామాన్యధర్మమునకంటె అధికమైన రామకైంకర్య మనెడు ధర్మమును కాంక్షించి యిట్లు చేసినాఁడని యర్థము.

† ఇందులకు మూలము. 'సబాష్పకలయావాచా కలహంసస్వరో యువా। విలలాప సభామధ్యే జగర్హేచ పురోహితమ్' (బాష్పకలయా) బాష్పములచేత అవ్యక్తముగానున్న, (వాచా)। వాక్కుచేత బాష్పములు మిక్కుటమైపలుకునడ్డగించినను దానినిగూడనాఁపి-(కలహంసస్వరః) కలహంసవలె మధురగంభీరస్వరుఁడై అని భావము. డగ్గుత్తికను ఆఁపికలస్వరమునఁబలుకుటకు,(యువా) యౌవనవంతుఁడగుటచేసమర్థుఁడైనఁవాడు,(విలలాప) విలపించెను-(పురోహితంజగర్హే) పురోహితునినిందించెను-'మాకులమునకు రాఁగలహితము మ సెబాసు! చక్కఁగా ఊహించిచెప్పితివి' అని యెత్తిపొడిచెననుట (సభామధ్యే) అందఱునుజేరి నాయొక్కనికిఁ గలరామశేషత్వమును-పారతంత్ర్యమును-అపహరింపనొడిగట్టితి రేయనివిలపించెను. (సభామధ్యే) 'నియమాతిక్రమంరహసిబోధయేత్' 'నియమమునుజవదాఁటుటను రహస్యమున బోధించునది.' అనుశాస్త్రమునుదెలిసియు సభామధ్యమున నియమోల్లంఘన మగు అతిక్రూర ధర్మమునకు నన్నునియోగించినాఁడే యని దుఃఖపారవశ్యమున, 'నీవురహస్యముననే ధర్మము నుపదేశింతువు. సభామధ్యమున నీకిట్టిమాటలే యుక్తమో' యని దూఱినాఁడని యర్థము.

‡ దీనిచే బ్రహ్మచర్యాదిలక్షణలక్షితుఁడైనవాని ధనమును అపహరించుట మహాపాతక మని తెలిపినాఁడు.

§ ఇందులకుమూలము 'కథందశరథాజ్జాతో భవేద్రాజ్యాపహారకః। రాజ్యంచాహంచరామస్య ధర్మంవక్తుమిహార్హసి.' ఇందులకు విశేషార్థము,—(దశరథాత్ జాతః) దశరథునివలన పుట్టినవాఁడు-

బుట్టినవాఁడు తనయన్నకు రావలసిన రాజ్యమును అపహరించునా? ఈరాజ్యమును రామునిది. నేనును రామునివాఁడనే. ఈవిషయమునందు నీవు ధర్మమునే చెప్పవలయును. జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుఁడును, ధర్మాత్ముఁడును, దిలీపనహుషులతో సాటియైనవాఁడునునై యిట్లు సకలసుగుణసంపన్నుఁడగు కాకుత్స్థతిలకుఁడు రాముఁడే, దశరథుని యట్లు రాజ్యమును బొందఁదగినవాఁడు. అపూజ్యులైనవారికిం దగినదియు స్వర్గనాశహేతువైనదియు నగునిట్టిపాపమును జేయుదునేని, ఇక్ష్వాకువంశమును దుమ్మునఁగలపఁబుట్టిన వాఁడనగుదును. నాతల్లి యొడిగట్టిన పాపమును నేనెంతమాత్రము నొల్లను. నేనిచటనుండియె చేరరాని యడవియందున్న రామునకు నం

రాముని నెడఁబాసినయుత్తరక్షణమున నెప్రాణములు విడిచినట్టిదశరథునికడుపునఁబుట్టిన నేను,(కథం రాజ్యాపహారకోభవేత్) అతఁడు పరిత్యజించినరాజ్యము నెట్లు అపహరింతును. రాముని బాసినంతనే దశరథునివలె నేను ప్రాణములువిడువలేదుగాని ప్రాణములువిడువకపోయినను అట్టిదశరథునికడుపునఁ బుట్టినందులకు రాముని రాజ్యమునపహరింతునా? అపహరింపనేరనని. నాస్వరూపమునుఆలోచించినను నేను రాజ్యమునకర్తుఁడుగాదనుట తెలియుననుచున్నాఁడు—(రాజ్యంచ అహంచ రామస్య) రాజ్యము నేనును రాముని సంబంధించినవారము. రామునికి శేషభూతులమనుట స్వామియే శేషవస్తువును ఏలునుగాని శేషవస్తువు మఱియొక శేషవస్తువును ఏలునా? ఏలఁగూడునేని, శేషభూతుఁడను నేనే రాజ్యమును ఏలునట్లే శేషమగురాజ్యమును నన్ను ఎందుకేలరాదు? కాఁబట్టి శేషమగు నేను శేషమగు రాజ్యమును ఏలఁదగదు. (ధర్మం వక్తు మిహ అర్హసి) నీవు ఈవిషయమున ధర్మమును చెప్పఁదగుదువు. లోకమందు కన్నతండ్రులను నిగ్రహించి రాజ్యము సేయువారునుగలరు. వారివలెనన్నెంచకుమా. (ఇహ) నావిషయమందు నాస్వభావమును దెలిసి, (ధర్మం) పాలింపఁదగువాఁడు వీఁడు, పాలింపఁబడఁదగినదియిది, యనుధర్మమును చెప్పదగునుకాని శేషవస్తువే మఱియొక శేషవస్తువును పాలింపఁదగునని యధర్మమును జెప్పకుమా. అయితే 'రత్నమును పెట్టెయును రెండును శేషవస్తువులుగానుండియు ఒకటి రక్షకుఁడుగాను, మఱియొకటి రక్ష్యముగాను నుండలేదా? అట్లెనీవు రక్షకుఁడై రాజ్యము నేలవచ్చు'నందువేని ఆపెట్టెకు బీగము మొదలైనవానిని వేసి స్వామియైనవాఁడు రత్నమునకు రక్షకముగా వినియోగించుటవలననే అదిరక్షకత్వమునొందినదికాని తనంతట అదిరత్నమునకు రక్షకమైనదిగాదు. అట్లె నాస్వామి యగురాముఁడును రాజ్యమునకు నన్నురక్షుఁడుగావినియోగింపలేదు. కనుక నాయంతట నేనుదానికి రక్షకుఁడుగానేరను. తానుమాత్ర మేధరింపఁదగినరత్నమును అవసరములేనపుడు పెట్టెయందుంచుచున్నాఁడు. అట్లే తానే పాలింపఁదగినరాజ్యమును మనము చేతనైనంతవఱకు ననుగ్రహింప వేఁడినను తనకు అవసరము కానందున నావశముచేయునేని, అపుడు అతనిశక్తివలననే, అతనికి పరతంత్రుఁడనై యుండియే, పెట్టెవలె అతఁడువచ్చువఱకు దానినిరక్షించుచుండెదను. కాఁబట్టి యతనిని మరల్చుటయే సర్వవిధములఁ జేయవలసినకార్యము. మొట్టమొదట వరనిర్బంధముచే రాజ్యము నాదియయ్యె ననుతలంపు రామునిసమక్షమునకుఁబోయి పరిహరింపవలయునని భావము. (ధర్మంవక్తుమిహార్హసి) రాముఁడడవికిఁబోవఁగా 'రాజ్యమునకురాజులేదే ఉన్నవారికి అభిషేకము సేయుఁ'డనియింతమాత్రమే విచారించితివి కాని యట్లునేనుచేసికొన్నయెడల రామునికి శేషమగు నాస్వరూపము నశించునని విచారింపక పోయితివి. కాఁబట్టి యిఁక నట్లుచెప్పక ధర్మమే-రామకైంకర్యమనెడి ధర్మమే-చెప్పందగును గాని రాజ్యపరిపాలనమును చెప్పఁదగదు.

జలి గీలించి నమస్కరించెదను. నేను రామునే యనుసరించుచుందును. పురుష లలాముఁ డగునారాముఁడే రాజుగాని మఱెవ్వరును గారు. రాముఁ డీరాజ్యమునకు మాత్రమే కాదు, ముల్లోకములనుగూడ రాజ్యముసేయఁ జాలువాఁడు' అనెను. సభ్యులందఱును ధర్మయుక్తమైన యాభరతుని వాక్యమును విని, మిక్కిలి సంతుష్టులై, రామునియందుఁ దగిలిన మనములతో, ఆనందబాష్పములు విడిచిరి. భరతుఁడు 'నేను బూజ్యుండగురాముని నెంతప్రార్థించియు వనమునుండి మరల్చి దోడ్కొని రాఁజాలనయితినేని, పూజ్యుఁ డగులక్ష్మణునితోఁ గూడ నేను అచ్చటనే వనమున నుండెదను. సత్పురుషులును గుణప్రవర్తనులు నైనయీసభ్యుల సమక్షమందే రామునివనమునుండి తోడ్కొనివచ్చుటకు నాచేతఁ గూడినంతవఱకు సమస్తోపాయములను బ్రయత్నించి చూచెదను. కనుక మీరందఱు నాతోఁగూడ రావలయును. నేను *మును పే, వెట్టికి వచ్చినవారలను, పనిచేసి కూలిపుచ్చుకొను వారలను, మార్గమును చక్కఁబెట్టి గాచుచుండుటకై పంపియున్నాను. ఇఁక నాకును బోవలసి మనసు ఉవ్విళ్లూరుచున్నది' అనెను. ధర్మాత్ముఁ డగుభరతుఁడు, భ్రాతయందు మిక్కిలి ప్రీతినిబట్టి యిట్లు వసిష్ఠాదులతోఁ జెప్పి, ఆలోచనములందు గడిదేఱిన సుమంత్రుఁడు దాఁపున నుండఁగా వానింజూచి 'సుమంత్రా! నీవు నాపంపున లేచిపోయి పయనము కావలయునని యాజ్ఞాపించి బలమును దోడ్కొనిరమ్ము' అనెను. సుమంత్రుఁడు, మహాత్ముఁడగు భరతుఁ డిట్లు చెప్పఁగావిని, మిక్కిలి సంతసిల్లి తనయిష్టమునకుఁ దగునట్లుగా భరతుఁడు గావించినయాజ్ఞను సైనికులకుఁ జెప్పెను. ఆప్రజలును సేనాపతులును, భరతుఁడు రామునిం దెచ్చుటకై సైన్యమునకు పయనమగుట కాజ్ఞాపించెనని విని పరమసంతుష్టులయిరి. అంత నింటింటను, బంట్లభార్య లందఱును, రామునియొద్దకు బయనము సమకూడెనని తెలిసి సంతసిల్లి తమతమభర్తలను శీఘ్రముగాఁ బొండని త్వరపెట్టిరి. ఆసేనాధ్యక్షులు, గుఱ్ఱములను వడి గలయెద్దుల బండ్లను మహావేగములగు రథములను యోధులను గలసి సైన్యమంతయు సిద్ధమగునట్లు నాజ్ఞ సేసిరి. భరతుఁడు బలమంతయు ఆయితమగుటఁజూచి, గురుఁ డగువసిష్ఠునియనుజ్ఞకై యతని సన్నిధానమున 'రథమును వేగ తెమ్మ'ని ప్రక్కనున్న సుమంత్రున కానతిచ్చెను. సుమంత్రుఁడును భరతునియాజ్ఞను శిరసా వహించి సంతసించి, యుత్తమాశ్వములను బూన్చినరథమును దెచ్చెను. అప్పుడు రఘువంశప్రసూతుఁడును అమోఘధైర్యుఁడును మహాపరాక్రమవంతుఁడు నగుభరతుఁడు, మిక్కిలి యుక్తములగుమాటల, మహారణ్యమున నున్నకీర్తిమంతుఁ డగురాముని ప్రసన్నునిగాఁ జేయఁబూని సుమంత్రునింజూచి 'సుమంత్రా! నీవు శీఘ్రముగ లేచి బలాధ్యక్షుల యొద్దకుఁ బోయి బలములను గూర్చునట్లుసేయుము, నేను జగమునకు హితముగోరి

* దీనిచేత వసిష్ఠునకు మార్గమును జక్కఁబెట్ట భరతుఁడు చేసినప్రయత్నములు తెలియవనియు కావుననే యతఁ డట్లు సభగూర్చినాఁడనియు తేలుచున్నది.

వనమందున్నయారాఘవుని ప్రసన్నునింజేసి తోడ్కొని రాఁగోరుచున్నాను జుమీ’ అనెను. భరతుఁడట్లు గట్టిగా నాజ్ఞసేయఁగా ఆసుమంత్రుఁడు దానిచే తనకోర్కు లన్నియు మిక్కిలి యొడఁగూడినవాఁడై ప్రజలయందు ప్రముఖులైన వారికిని, బలాధ్యక్షులకును సుహృజ్జనులకును అందఱికిని భరతునాజ్ఞను దెలిపెను. అంత ప్రతిగృహమునందును బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును శూద్రులును, ఒంటెలను కంచరగాడిదలను రథములను గజములను ఉత్తమాశ్వములను యథా యోగ్యముగా నెక్కి పయనమయిరి. ఇది యెనుబదిరెండవ సర్గము.



భరతుఁడు సైన్యముతోడఁ బయనమై గంగాతీరమున విడియుట.

అంత భరతుఁడు ప్రాతఃకాలమున లేచి యుత్తమమైన రథము నారోహించి రామునిం జూచుకుతూహలమున శీఘ్రముగాఁబోయెను. మంత్రులును పురోహితులును, అశ్వములు పూన్పఁబడి సూర్యుని తేరికి సాటివచ్చుచున్న రథముల నెక్కి భరతునకు ముందు నడచిరి. భరతునియాజ్ఞ చొప్పున, అయోధ్యయందుఁగల యేనుఁగులలో తొమ్మిదివేల యేనుంగులు, ఇక్ష్వాకుకులమునకు సొంపు గూర్చుభరతుఁడు పోవుచుండఁగా, వెంటఁబోయినవి. మిక్కిలి కీర్తిమంతుఁడగు నారాజకుమారుఁడు భరతుఁడు పోవుచుండఁగా నతనిని వెంబడించి యాఱువేల రథములును, వివిధాయుధములును ధరించి విండ్లనుబూనిన యోధులును బోయిరి. గుఱ్ఱపురౌతులు లక్షమంది రఘువంశజాతుఁడును, సత్యసంధుఁడును, జితేంద్రియుండు నగుభరతుఁడు పోవుచుండఁగా, నతనివెంబడించి పోయిరి. కైకేయియు, సుమిత్రయు, మిక్కిలి కీర్తి గాంచిన కౌసల్యయు, రామునిని దోడ్కొనివచ్చు సొంపుపెంపున నుల్లసిల్లుచు వేఱువేఱ ప్రకాశించుచున్న వాహనముల నెక్కి పోయిరి. అందు కైక, తాను జేసిన యకార్యమునకు పశ్చాత్తాపము నొందినదై మునుముందుగా నడచినది. పూజ్యులగుజనులు, గుంపులుగొని లక్ష్మణసహితుం డగురామునిం జూచుటకై యుల్లములు పల్లవింపఁగా *‘మేఘమువలెనల్లనిరూపు గలిగి, నిడుదబుజములు దాల్చి, స్థిరమైన

* ఇందులకు ‘మేఘశ్యామం మహాబాహుంస్థిరసత్త్వం దృఢవ్రతమ్। కదాద్రక్ష్యామహేరామం జగతశ్శోకనాశనమ్’ అనిమూలము. విశేషార్థము:-(మేఘశ్యామం) మబ్బువలె నల్లనివాఁడు-మబ్బువలె దూరస్థుఁడుగా నుండినను వానిసౌందర్యమును అనుభవింపక త్రోసిపుచ్చుటకు శక్యముగాదనుట. దూరమునందు నున్నమబ్బువలె తనసౌందర్యము కన్నులపండువు సేయువాఁడనుట. (మేఘశ్యామం) వేసవినితపించువారికిమబ్బువలె చూచినంతమాత్రముననె సర్వసంతాపములనుహరించువాఁడు,(మహాబాహుం) నిడుదలైన గుండ్రనిబుజములుగలవాఁడు,(మహాబాహుం)బాహులుదానసాధనములుగావున పూర్వోక్తమైన తనసౌందర్యమును అనుభవించుటను దానము సేయునౌదార్యముగలవాఁడు,(మహాబాహుం) తనసౌందర్యానుభవమునకువిరోధముగలిగించువారిని ఖండింపఁజాలువాఁడు. కావుననే ‘రామమిన్దీవరశ్యామం సర్వశత్రునిబర్హణమ్’ నల్లగలుగ రేకులవంటి కాంతిగలవాఁడును, సకలశత్రువులను

పూనికయును ధృఢమైన యాశ్రితరక్షణ వ్రతమును గలిగి, లోకములకెల్లను శోక
ముచు బోఁగొట్టునట్టి రాముని నెప్పుడు చూడఁగలము! * రాముఁడు కనఁబడినఁ
జాలును, దూరమున నుదయించిన సూర్యుఁడు లోకమునందలి చీకటినంతయును,
నశింపఁజేయునట్లు అతఁడు కనఁబడినంతనే, మనశోకమునంతయుఁ బోఁగొట్టఁగలడు'
అని చిత్రములగు రాముని కథలనే ముచ్చటించుకొనుచుఁ బోయిరి. ఆపురజనులిట్లు
రామునిఁగూర్చి మేలయిన సుద్దులను మిక్కిలి సంతసమున ముచ్చటించుకొనుచు,
ఒకరినొకరు కౌఁగిలించుకొనుచును బోయిరి. మఱియు నెవరెవరు రామునకుఁ
బ్రియులో వారందఱును, వర్తకులును, అశ్లేపట్టణమునందలి ప్రజలందఱును, రాము
నొద్దకు పరమసంతోషమునఁ బోయిరి. మఱియు పద్మరాగాదిమణులను సానఁ
బెట్టువారును, తమ పనులయందు నిపుణులగు కుమ్మరులును, సాలెవాండ్రును,
ఆయుధములు సేయువారును, నెమలిపురులచే వీవనలు మొదలగునవి చేయువారును,
అంపములచే చందనము మొదలగు మ్రానులను నఱుకువారును, దంతము గోడలు
మొదలగువానికి మెఱుఁగుపెట్టువారును, దారువులు మణులు మున్నగువానికి
బెజ్జము వేయువారును, దంతపుఁబనివాండ్రును, సున్నపుగచ్చుపనివాండ్రును, సుగంధ
ద్రవ్యముల నమ్మి బ్రతుకువారును, మిక్కిలి పొగడ్తగన్న కంసాలులును, కంబళ్ల
యందలి ముఱికిదీయువారలును, తలయంటి స్నానము చేయించువారును, ఒడలు
పిసికి నలుఁగులు పెట్టువారును, వైద్యులును, గృహములందు వాసనబుగులుకొను

---

గీటడంచువాఁడును, అగురాముని' అని కాంతిప్రయుక్తమైన సౌందర్యమును పరాక్రమను జెప్పఁబడి
నవి. (స్థిరసత్త్వం) 'ద్రవ్యాసువ్యవసాయేషు సత్త్వం' అన్నట్లు సత్వమనఁగా వ్యవసాయము-పూనిక
గనుక స్థిరమైన పూనికగలవాఁడు-స్థిరచిత్తుఁడనుట-తన యాశ్రితులే తనకు ప్రతికూలురైనను మనస్సు
కలగనివాఁడనుట, (దృఢవ్రతమ్) అంతరంగులగువారికిని చలింపఁజేయరానట్టి యాశ్రితరక్షణవ్రతము
గలవాఁడు, ఇట్టి (రామం) రమింపఁజేయునట్టి రాముని, (కదాద్రక్ష్యామః) ఎప్పుడు చూడఁగలము.
అతని ముఖమును చూచునంతమాత్రముగలిగినను జాలును, కైకమాటలవలనఁ బుట్టిన తాపములన్నియు
నివర్తించును. (జగతః శోకనాశనమ్) వాఁడు సర్వలోకులకును శోకమును బోగొట్టువాఁడై యుండఁ
గా మాకుమాత్రము శోక మెట్లు కలిగినది? వాని సర్వలోకముల శోకము నివర్తింపఁజేయుస్వభావ
మునకును మాశోకమునకు సంబంధము లేదే; మాకెట్లు శోకము కలిగినదని యాశయము.

* ఇందులకు 'దృష్ట ఏవహి న శ్శోక మపనేష్యతి రాఘవః ।' తమస్సర్వస్యలోకస్య సము
ద్యన్నివ భాస్కరః' అనిమూలము- (దృష్టఏవ) చూడఁబడినంతనే-మమ్ముఁజూచి చిఱునవ్వునవ్వ
నక్కఱలేదు; మమ్ము కడకంటఁ జూచుచును ఇంపైన పలు కేది మాటాడనక్కఱలేదు; మేమును
ఏమియు ప్రయత్నము సేయనక్కఱలేదు, అతఁడు దూరమున కనఁబడిన చాలును; మాశోకము
లన్నియు నశించునని యర్థము. (సముద్యద్భాస్కరం) దూరమున ఉదయించుచున్న సూర్యుఁడు,
(సర్వస్యలోకస్యతమఇవ) సకలలోకములయొక్క చీఁకటిని బోఁగొట్టునట్లు, దూరమున రాముఁడు
కనఁబడినంతనే మాశోకాంధకారమునెల్ల పోఁగొట్టునని యాశయము.

ధూపములు వేయువారును, పలువగలమద్యములు సేయువారును, చాకలివారును, కుట్రపువాండ్రును, గ్రామములందును, గొల్లపల్లెలందును ముఖ్యులయిన వారును, పడఁతుల మూలముగా బ్రతుకునట్టివారును, వారస్త్రీలును, చెంబడివాండ్రును, రాముని జూచుటకు భరతునివెంటఁ బోయిరి. యోగనిష్ఠులును వేదవిదులును, సదాచారపరులును అగుబ్రాహ్మణులు, వేపురకోలఁదిని ఎద్దుబండ్ల నెక్కి భరతుఁడు పోవుచుండఁగా వెంబడించిరి. ఇట్లువారందఱును చక్కఁగా నలంకరించుకొని నిర్మలములైన వస్త్రములనుగట్టుకొని ఎఱ్ఱనిచందనమును మెయినిండఁ బూసికొని, పలువిధములైన వాహనములనెక్కి, మెల్లగా భరతుని వెంబడించిపోయిరి. సైనికులు మేనం బులకలుపుట్ట మనస్సున సంతసిల్లినవారై, తోఁబుట్టువునందలి ప్రీతిచే నతనిఁ దోడ్కొనివచ్చుటకై పోవుచున్నకైకకుమారుని భరతుని వెంబడించిరి. వారు రథములును గుఱ్ఱములును గజములును పల్లకీలు మొదలయిన వాహనములనుఎక్కి బహుదూరము పోయిరి. అట్లు రాముని చెలికాఁడును వీరుఁడును అగు గుహుఁడు బంధుజనపరివృతుఁడై, మెచ్చరికగలిగి యచటిదేశమును బాలించుచు వాసము సేయుచుండు శృంగిబేరపురమునుగూర్చి వారు పోవుచు దానికి సమీపమున గంగానదిని జేరిరి. భరతుని వెంటఁ బోయినయాసైన్యము చక్రవాకపక్షులచే చెలువుగులుకుచున్న గంగానదీతీరమును జేరి యచట విడిసెను. మాటనేటుకాఁ డగుభరతుఁడు తనవెంట వచ్చినసైన్యమును, మంగళజలములతో నొప్పు నాగంగనుజూచి,మంత్రులందఱితో 'మీయందఱి యభిప్రాయము చొప్పున నాసైన్యమును అచ్చటచ్చట విడియింపుఁడు. ఇపుడిచ్చట విశ్రమించి రేపు ఈ నదిని దాఁటుదము. మఱియు నేను నదిలోనికి దిగి, స్వర్గగతుఁ డగుమహారాజునకు, అతని యూర్ధ్వదేహసౌఖ్యమును గూర్చి జలతర్పణము నొసఁగఁ గోరుచున్నాఁడను'అనెను. అతఁడట్లు చెప్పఁగా మంత్రులు వల్లె యని, మెచ్చరికగలిగి, తమయిచ్చచొప్పున వేఱువేఱ, ఆసేనకంతయు విడుదులేర్పరచిరి. భరతుఁడు మహానది యగుగంగ గట్టున పెక్కువిధములయినయేర్పాటులు సేసి డేరాలు మొదలగుపరికరముతోడ సైన్యమును విడియించి మహాత్ముఁ డగురాముని దోడ్కొని వచ్చువిషయముంగూర్చి యాలోచించుచు నం దుండెను. ఇది యెనుబదిమూఁడవ సర్గము.

---

భరతునకు గుహుఁడాతిథ్యము నొసఁగుట.

అంత గంగానదియొరగా విడిసియున్న సేనలను జూడఁగానే నిషాదరాజగు గుహుఁడు తత్తఱపడి తన బంధువులంజూచి 'ఇచట సముద్రమువలె మిక్కిలి విఱివియై యీ మహాసేన యగపడుచున్నది. ఎంతచూచినను దీని తుదను మనస్సునఁ దలఁచుటకును శక్యముగాకున్నది. భరతుఁడు, దుర్బుద్ధియగు తన తల్లిచేసినది కాక, తానె, రాముని బాధింపవచ్చినాఁడు కాఁబోలు! ఇది నిశ్చయము. రథము

నందు పెనుపొడవుగల కోవిదారధ్వజము కనఁబడుచున్నదే. ఈ భరతుఁడు మన చెంబడివారల నందఱిని బంధించిన బంధించును, లేక మనల నందఱిని జంపినను జంపును. లేక ఈ కైకేయికొడుకు, రాజగుటకు సర్వార్హుఁడయిన రాముఁడు మరల వచ్చునేని, తనకు రాజ్యలక్ష్మి దక్కదని తలంచి, అతనికది యెంతమాత్రమును బొందుట కశక్యమై తనకే పరిపూర్ణముగా దక్కవలయునని కోరి, యందులకై, తండ్రి రాజ్యమునుండి వెడలఁబంపఁగా సహాయసంపత్తిమాలి దుర్బలుండై యున్న తన దాయాదిని రాముని చంపుటకై వచ్చుచున్నాఁడు. 'కాఁబట్టి దాని వలన నీ కేమి' యందురా? దశరథకుమారుఁడు రాముఁడు నాకు ప్రభుఁడును మిత్రుఁడును, కావున రాముని ప్రయోజనమును గోరి మీరందఱు నాయితపడి గంగాతీరమున గట్టిగా నెలకొనియుండుఁడు. మన చెంబడివార లందఱు గంగా నదిపొడుగున నడ్డముగా సైన్యములం గూడి పన్నియుండి యోడలలోనే మాంసములను ఫలములను దినుచు ఏటిరేవును గాచుచుందురుగాక. అయిదు వందల యోడలను సమకట్టి, యోడ ఒక్కొక్కటికి యుద్ధసన్నద్ధులును వయసుకాండ్రునగు చెంబడివారు నూర్గురేసివంతునఁ గాపుగా నుండురుగాక' అని యాజ్ఞాపించెను. మఱియు నా గుహుఁడు 'భరతుఁడు రామునియెడల దుష్టభావము లేనివాఁడగునేని యపుడు అతని యీసైన్యమును శుభముగా నీ గంగానదిని దాఁటుఁగాక అట్లు గాదేని వీనిని జంపవలయు' నని చెప్పెను. ఆ నిషాదనాథుఁడు పట్టువలువలు మొదలయినవియు, మత్స్యములను, మృగమాంసములను, తేనెను కానుకలుగా గొని, భరతుని కెదురుపోయెను. అంత ప్రతాపవంతుఁడును, వినయ కుశలుఁడు నగుసుమంత్రుఁడు ఆగుహుఁడు వచ్చుచుండుటఁజూచి వినయమున భరతునితో 'నిషాదప్రభువును వేవురకొలందిని బంధువులు చుట్టుకొని కొలుచుచుందురు. వీఁడు దండకారణ్యమునందు సంచరించుటయందు నిపుణుఁడు, వృద్ధుఁడు, నీ యన్నకు చెలికాఁడును నగు. కాకుత్స్థా! ఇట్టివాఁడు గావున నిషాదప్రభుఁ డగు నీ గుహునకు దర్శనమిత్తువుగాక, మన రామలక్ష్మణు లెచటనున్నారో వీనికి నిస్సంశయముగాఁ దెలిసియుండును' అనెను. సుమంత్రుఁడు చెప్పిన యా శుభవచనమును విని భరతుఁడు 'శీఘ్రముగా గుహుఁడు నన్నుఁ జూడనిమ్ము' అనెను. గుహుఁడు అనుజ్ఞనొంది సంతుష్టుఁడై బంధువులతోఁ గూడివచ్చి భరతునిఁజూచి నమ్రుఁడై 'ఈనాదేశము నీ యింటిపెరటితోఁటవంటిదే సుమా! నీరాక తెలియక పోవుటచే మేమందఱమును మోసపోయితిమి. అదిమాకుఁ దెలిసియుండునేని చేయవలసిన ప్రత్యుద్గమనాదులు చేసియుందుము. నీవు నీ సొంతదాసులయింట నుండి పోవలయునని మా యందఱి మనవి. మానిషాదులు, మూలములను ఫలములను బచ్చిమాంసమును ఎండిన మాంసములను మఱియు నివ్వరి మొదలగు పలుదెఱఁగుల యడవిధాన్యములను సమకట్టియున్నారు. ఈ సైన్యమంతయు మాచోట

లెస్సగా భుజించి యీ రాత్రియంతయు వసించి యుండవలయునని ప్రార్థించుచున్నాను. కాఁబట్టి నీవు, నీ కోరినట్లెల్ల మేముసేయు నానావిధపూజలం బూజితుఁడవై, రేపు సైన్యముతోడ పోవచ్చును' అనెను ఇది యెనుబదినాలుగవసర్గము.



## గుహుడు భరతుని నూఱడించుట.

నిషాదప్రభు విట్లుచెప్పఁగా మిక్కిలి ప్రాజ్ఞుఁడగుభరతుఁడు సహేతుకముగా పసమీఱ నతనినిఁ జూచి 'నా పెద్దవాని రాముని చెలీ! నీవు ఒక్కఁడవే కొలఁది యిడరాని నా యింతటిసైన్యమునకుఁ బూజలు సేయఁగోరుచున్నావే! అట్లు సేయ వలయు నని పైపయి కోరికను కోరినంతమాత్రముననే మాకుఁ బూజగావించి నట్లే యైనది' అనెను. మహాతేజుఁడుగాన గంభీరుఁడై యప్పటి హర్షంపు సొంపున కాంతి దళుకొత్తుచున్న భరతుఁడు, బోయలరాజుతోడ నట్లు మేలయిన మాట చెప్పి మరల నతనింజూచి 'గుహా! భరద్వాజాశ్రమమునకు ఏ మార్గమునఁ బోవ లయును? ఈ దేశము మిక్కిలి చొరరానిదై యున్నది. మఱియు గంగను జేరిన జవుకుపట్లను గడచుటయే కష్టము' అనెను. గుహుఁడు అడవులంను మిక్కిలి దిరుగ మరిగినవాఁడు కనుక బుద్ధిమంతుఁడగునారాజకుమారుని మాటవిని చేతులు మోడ్చి 'రాజకుమారా! కీర్తినిధీ! మా వెంబడివారు ధనువునుదాల్చి మిక్కిలి జాగరూకులై నీ వెంబడివత్తురు. నేనును నీ వెంబడినే వచ్చెద. కనుక మార్గమును గుఱించిన చింత నీకు అక్కఱలేదు. మఱిమనరాముఁ డెవ్వరికినిదుఃఖముకలిగించునట్టి కార్యమును జేయఁడు. అట్టి రామునకుఁ జెఱుపుదలఁచి నీవు పోవుచున్నాఁడవుగావే కదా? నీతోఁగూడ వచ్చిన యంతగొప్పసేనను జూడగా నాకుఁ గొంత సందేహము కలుగుచున్నది, రామునిఁ జూచుటకుమాత్రమె పోవునెడల ఇంతసేన యక్కఱలేదు' అనెను. భరతుఁడు ఆకాశమువలె నిర్మలుఁడు గావున నిట్లు పలుకుచున్న గుహుని జూచి వాఁ డట్లడిగినందులకుఁ గోపములేక మృదువైనవాక్యమున 'రామునకు చెఱుపు దలఁచువాఁడని నీకు సందేహముగూడఁ గలుగనయ్యెనా! ఇట్టికష్టకాలము కలుగకుండుఁగాక. కనుక నన్ను గూర్చి నీవు సందేహపడఁదగదు. ఏలన రాముఁడు నాకు పెద్దన్న. కనుక నతఁడు నాకుఁ దండ్రివలెనే భావింపఁదగును జుమీ! గుహా! అడవియందు వసించియున్న రాముని మరల్చి తోడ్కొని వచ్చుటకై పోవుచున్నాను. కాన నీవు మఱియొక విధముగాఁ దలంపరాదు. నేను నీకుఁ జెప్పునది సత్యమే చుమీ' అనెను. ఆ గుహుఁడు భరతుఁడు సెప్పినమాటవిని ప్రసన్నముఖుఁడై, పరమ సంతోషమున మరల భరతునితో, 'ఏప్రయత్నమును లేక తనంతనే ప్రాప్తించు నట్టి రాజ్యమునుగూడ విడువఁ గోరుచున్నావే! నీ వెంత ధర్మాత్ముఁడవు, నీవంటి ధన్యుని భూలోకమున నెచట నే నింతవఱకును జూడలేదు. నీవు, వ్యసనము పాలై యున్నరాముని మరలఁ దోడ్కొనివచ్చి సుఖముగూర్పఁ గోరుచున్నావు గావున

నీకీర్తి శాశ్వతముగా సమస్తలోకములందును వ్యాపించి యుండఁగలదు' అనెను. అపుడు గుహుఁ డిట్లు మాట లాడుచుండఁగానే 'సూర్యునికాంతి మఱుఁగయ్యె. అంత రాత్రియు వచ్చినది. అంత నా శ్రీమంతుఁడు సేనను అయ్యైస్థలములందు విడియించి, గుహుఁడు తనకు సంతోషము గొలుపుచుండఁగా, శత్రుఘ్నుఁడు దానును పాన్పునఁ బవ్వళించిరి. భరతుఁడు ఆగర్భశ్రీమంతుఁడు, దుఃఖమున కెంతయుఁ దగఁడు. మహాధైర్యవంతుఁడు, శోకము గలిగించునట్టి పాపమేమియుఁ జేయనట్టి ధర్మబుద్ధి గలవాఁడు. ఇట్టివాఁడైనను, రామునింగూర్చిన చింత యితనికి సహింపఁ గూడక యవాఙ్మానసగోచరమైన యటువంటి శోకమును సంభవించినదయ్యెఁగా! దాపున నుంచునడవి కాలుచుండఁగా, ఆ వేఁడికి మిక్కిలి తప్తమైయున్న వృక్షమును, దానితొఱ్ఱలోనిప్పు గూఢముగాఁ బుట్టి మఱింత తపింపఁజేయునట్లు, పైనిశోకాగ్ని చేఁదపించుచున్న భరతుని,లోపల రాముని గూర్చినచింతయనెడునగ్ని మఱియుఁ దపింపఁజేయుచుండినది. సూర్యకిరణములకుఁ గ్రాఁగి హిమవత్పర్వతము నుండి మంచినీళ్లు కాఱునట్లు, భరతుని సకలావయవములనుండియు, శోకాగ్నిచే చెమటనీళ్లు గాఱినవి. కైకకొడుకగుభరతునికి దుఃఖమను మహాపర్వతము పైఁ బడ్డయట్టులయ్యె. *ఆపర్వతమునకు ఎడతెగని ధ్యానపరంపరయే గుహలందు దట్టముగా నలముకొనియున్న పగులని పెనుబండలగుంపు, నిట్టూర్పులె నానావిధములైన ధాతువులు, విరవిరఁ బోయినయవయవములే వృక్షసమూహము, పైపై పెచ్చు పెరుఁగు చున్నశోకమును ఆయాసమును మానసవ్యథయునే శిఖరములు, మోహములే లెక్కలేని జంతువులు, సంతాపములే యోషధులును వెదుళ్లు నగు. పురుషతిలకుఁ డగునాభరతుఁడు, డెందము మిక్కిలియుఁ గలఁతనొంద నిట్టూర్పులు పుచ్చుచు సంజ్ఞ మిక్కిలి తప్పుచు, నిట్లు, మిక్కిలియు విపత్తునంబడి మనస్సు తుందుడుకుచే తల్లడిల్లుచు, గుంపు తప్పిన వృషభమువలె పరితపించుచుండెను గాని యూఱట పొందినవాఁడు గాఁడయ్యె. మహానుభావుఁ డగుభరతుఁడు పరివారసహితుఁడై యేకాగ్రచిత్తముతో నుండఁగా గుహుఁడువచ్చి యతనితోఁ గలిసెను. అంత గుహుఁడును, ఆభరతునిఁజూచి తానతనికంటెను మనస్సున తల్లడిల్లుచు రామునింగూర్చిన మాటలు పలుకుచు నతనిని నూఱడించెను. ఇది యెనుబదియైదవ సర్గము.



* ధ్యానపరంపర లెడతెగకనుండుటచే పగులని పెనుబండలు గాను, అవయవములు ప్రోడువడినట్లుండుటచే ప్రాఁకులుగాలు, శోకాదులు పైపై నిక్కుచుండుటచే నిక్కుగల శిఖరములుగాను, మోహములు ప్రాణభయశంక కలిగించుటచే క్రూరజంతువులుగాను, సంతాపములు గజిబిజిగాను చొరరాకుండుటచే వెదుళ్లుగాను, ఇట్టివానితోఁగూడినశోకము సహింపరానిభరముగలదిగా నుండుటచే మహాపర్వతముగాను రూపింపఁబడినది.

-:గుహుఁడు రాముని గూర్చినవిషయములు భరతునితో ముచ్చటించుట.:-

*అంత వనంబునం దిరుగ మరిగినగుహుఁడు కొలఁదిలేనిమహిమ గలభరతునితో మహాత్ముఁడగు లక్ష్మణునికి పెద్దన్నయందుఁ గలభక్తిరూపమయిన మంచిస్వభావమును చెప్పంబూని "అన్నను గాచుటకై విల్లును బాణములను దాల్చి కనుఱెప్ప వేయక మేలుకొనియున్న గుణవంతుని లక్ష్మణునింజూచి నేను 'రఘుకులమునకు సొంపు గూర్చు లక్ష్మణా! ఇదిగో నీకొఱకు హాయిగా పాన్పు రచింపఁబడియున్నది. నీవు నెమ్మదితో దీనిపయిని సుఖముగాఁ బరుండుము. ధర్మాత్మా! ఈ మేమందఱమును దుఃఖ మనుభవించుటకుఁ దగినవారమే. నీవో సుఖమునకే తగినవాఁడవుకాన నిదురింపుము. రామునిఁగాచుటకై మేమందఱమును మేలుకొనియుండెదము. ఈభూలోకమున రామునికన్న ప్రియుఁడు నాకెవ్వడును లేఁడు, కావున నీవు రామునకై తమకపడి మేలుకొననక్కఱలేదు. నీయెదుట నేను దీనినిగుఱించి దబ్బఱలాడుదునా? ఈ రాముని యనుగ్రహమువలననే, నేను, ఈలోకమున మిక్కిలి గొప్పకీర్తిని, పరలోకసాధనభూతమైన ధర్మమును, మఱియు న్యాయముగా ప్రాప్తించిన ధనాదికమును, బొందఁ గోరుచున్నాఁడను. అట్టివాఁడను గావుననే, నేను, విలుదాలిచి నాబంధువులనందఱిం గూడి, సీతాదేవితోడఁ బరుండి నిదురించుచున్న నాయనుంగుచెలికానిని రాముని రక్షించుచుండెదను. నేనెల్లప్పుడును ఈయడవిలో తిరుగుచుండువాఁడనుగనుక, ఇందు నాకుఁ దెలియని కందువపట్టు లేవియుఁ గలుగవు. మేము చతురంగబలములు వచ్చి మార్కొన్నను దానితాఁకు నోర్వఁగలము' అంటిని. మహాత్ముఁడగు లక్ష్మణుఁడు

*ఇందులకు 'ఆచచక్షేథ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః। భరతాయాప్రమేయాయ గుహో గహనగోచరః' అనిమూలము. విశేషార్థము —(అథ) భరతుని యభిప్రాయము దెలిసినపిదప లేక భరతుని నోదార్చినపిదప,(మహాత్మనః) మహాత్ముఁడైన-సముద్రజలమును చేతితో తొలఁగింప నుద్యుక్తుఁడైనట్టివాఁడనుట,(లక్ష్మణస్య)లక్ష్మణునియొక్క, సద్భావం-సత్ + భావమ్)బాల్యాత్ప్రభృతిసుస్నిగ్ధ, 'బాల్యమాదిగా మిక్కిలి నెయ్యముగలవాఁడు'అన్నట్లు, వెలయుచున్నట్టి మంచి-స్వభావమును అనఁగా జ్యేష్ఠుని అనువర్తించునట్టి మేలయిన స్వభావమును,(ఆచచక్షే) చెప్పెను. దీనివలన భగవద్విషయోపదేశమున క్రొత్తవారు ప్రాఁతవారు అనుభేదములేదు; చెప్పువారెల్ల గురువులు; ఆదరముగలవారే శ్రోతలు అని తెలియునది. (ఆచచక్షే) ఆఙ్, అనుఉపసర్గకు కొంచెము అనునర్థముగలదు. లక్ష్మణుని సద్భావము వాగింద్రియమునకు విషయమైనంతే చెప్పినాఁడుగాని, అశక్తమగుటచే పూర్ణముగా చెప్పినవాఁడుగాఁడనియర్థము. (భరతాయ అప్రమేయాయ) కొలఁది యిడరాని మహిమగల భరతునికి చెప్పినాఁడనుట. దీనినిబట్టి, యిట్టివానికే యుపదేశింపవలయునను వ్యవస్థలేనిదయ్యె. ఎట్టివానికిని ఉపదేశింపవచ్చుననుట (గుహః) గుహుఁడు,(గహనగోచరః) అడవియందు తిరుగువాఁడు-అడవివృక్షములభేదములుమాత్రమే తెలిసినవాఁడైనను ఇట్టిస్వభావమునుగూడ తెలిసికొన్నవాఁడయ్యెను. లేక (గహనగోచరః) రామునిఎడఁబాసినందున ఒకపొదరింటిలో ఏమియు దోఁపక కూర్చుండి తనదేశపువారురాగా లేచి యడవిని దిరుగఁబడినాఁడనియు నర్థము.

ధర్మమునందే కన్నుగలవాఁడు గనుక మేము చెప్పినది యాలోచించి మమ్మందఱిని మంచి మాటలతో 'దశరథమహారాజు కడుపునఁబుట్టినరాముఁడు, సీతతోఁగూడ నేలపయిఁ బరుండి యుండఁగా నాకు ప్రాణములు పెట్టుకొనియుండుటయే కష్టముగానున్నదే. ఇంక నిదుర యెట్లుపోవును? మఱి యితర సుఖములుగాని యెట్లు నాకుఁ బొందుపడును. గుహా! దేవాసురు లందఱునుగూడి యొక్కమ్మడిగా నెత్తివచ్చినను యుద్ధమున నెవ్వని మార్కొని నిలువశక్యముగాదో యట్టి మహాపరాక్రమశాలి యగురాముఁడిపుడు భార్యతోఁగూడ పచ్చికనేలపయిఁ బరుండియున్నాఁడు చూడుము. దశరథుఁడు మహాతపస్సుచేసి పలువిధము లైనవ్రతములు సలిపి యనేకయాగములను గావించి యీపుత్త్రునిఁ గన్నాఁడు. ఈయొక్కఁడును తండ్రింబోలె సమాన సులక్షణములును గలవాఁడు. ఇతఁడు అడవికివచ్చినపిదప నిఁక మహారాజు చిరకాలము జీవించియుండఁడు. ఇఁక శీఘ్రముగానే భూమియు విధవకాఁగలదు. ఇది నిశ్చయము. నాయనా! అంతఃపురస్త్రీలు మహాధ్వనిగా నిపుడు రోదనము సేసి, యలసిసొలసి, యూరకుందురు. అంత రాజగృహమున శబ్దము రేఁగి పిదప శబ్దమంతయు నడఁగియుండునని తోఁచుచున్నది. కౌసల్యయు, రాజును, నాతల్లియు, నిఁక నెంతమాత్రము జీవింపరు. ఒకవేళ జీవించియుండిరేని యీరాత్రిమాత్రముందురు గాని యటమీఁద నుండరు. నాతల్లి సుమిత్త్రయు రెండవకుమారుని శత్రుఘ్నునిఁ జూచుచు బ్రతికియుండిన నుండవచ్చునేమోకాని, వీరునిఁగన్నతల్లి కౌసల్య మాత్రము నాశమునొందకతప్పదు. మించిపోయినది! మించిపోయినది! అంతయు చెడిపోయినది. నాతండ్రి దశరథమహారాజు, రాజ్యమునందు రాముని నుంపక, తనకోర్కె కొనసాఁగించుకొనకయె, నాశమునొందుచున్నాఁడే! తండ్రియగు మహారాజు మృతిఁ బొందినప్పుడు అతనికి అన్త్యకాలములందు, సమస్త సంస్కారములు గావించునట్టి భరతశత్రుఘ్నులు కృతార్థులు. మాతండ్రి మరణమునొందినట్టికాలమురాఁగా మృతుఁడైనయామహారాజును సకలప్రేతకాలములందును సంస్కారముచేయునట్టివారు కృతార్థులు. మనతండ్రి రాజధాని ఆ యయోధ్య రమణీయమైన చదుకములుగలిగి చక్కఁగా విభజించి యేర్పఱుపఁబడిన రాజమార్గములతోఁ గూడి ధనవంతులమేడలును దేవాలయములును రాజులయుప్పరిగెలును నెరసి బెరసి మేలయిన పదార్థములచే పొలుపుచూపుచుండును. మఱియు నందు రథములు గజములును తురగములును క్రిక్కిఱిసియు వాద్యధ్వనుల ప్రతిధ్వను లెసంగుచును నుండును. మఱియు నందు సమస్తమంగళముల నిండారి, జనులెల్ల తుష్టియు ధనధాన్యపుష్టియుం గలిగి వెలుఁగుచుందురు. అందు తోఁటలును రాజులయుద్యానవనములును మెండుకొనియుండును, ఉత్సవసమూహములు ఎప్పుడు నొప్పుచుండును. అట్టి రాజధానియందు సుఖాత్ములైనవారే విహరించుచుందురు. మేము ఈపదునాలుగేండ్లగడువు గడచినపిమ్మట వనవాసప్రతిజ్ఞ తీర్చుకొని క్షేమముగా నున్నరాముని

తోఁగూడ సుఖముగా అయోధ్యానగరమును ప్రవేశింతుమా' అనెను. మిగుల మహాత్ముఁడగు నా రాజకుమారుఁ డిట్లు విలపించుచునే యుండఁగా యా రాత్రి కడచినది. అంత చక్కఁగా ప్రొద్దుపొడిచినంతనే వారిరువురును ఈ గంగానదిగట్టుననే జడలు గావించుకొనిరి. అంత నేను వారలను సుఖముగా గంగను దాఁటించితిని. మహాబలవంతులై మేటియేనుఁగుమిన్నలకు సాటియై పగవారిని గ్రాఁచునట్టి యా రామలక్ష్మణు లిద్దఱును జడలు దాల్చి నారచీరలఁ గట్టి మేలైన బాణములను విండ్లను గత్తులును, గొని మిక్కిలి మెచ్చరికతో నలుదిక్కులు పరికించుచు సీతం గూడి పోయిరి." అనెను. ఇది యెనుబదియాఱవ సర్గము.



—{ గుహుఁడు భరతునకు రాముఁడు జలాహారము సేసి సీతతో గార చెట్టు క్రిందఁ బరుండుట మొదలయిన వృత్తాంతములు సెప్పుట. }—

గుహుఁడు 'రామలక్ష్మణులు జడలు దాల్చి యరణ్యమునఁ బోయి' రని మిక్కిలి యప్రియమైన మాటను చెప్పఁగా భరతుఁడు విని రాముఁ డట్లు జడలం దాల్చి పోవుటను గుఱించి యతఁడు తన కోరిక చొప్పున మరలునో మరలఁడో యని చింతాపరవశుఁ డయ్యె. అతి సుకుమారుఁడును మహాబలుఁడునై సింహమువంటి మూఁపులును నిడుదలైన గుండ్రని బుజములును తెల్లతామర రేకులవంటి వెడఁదకన్నులును గలిగి, యెలపరువము దళుకొత్త కన్నులపండువుగా చూపట్టుచున్న భరతుఁడు కొంతసేపు మాత్రము తెప్పిఱిలి యెంతయు నుల్లము మిక్కిలియు పల్లటిల్లఁగా సహింపఁజాలక, బరిగోలతో మీఁదు మిక్కిలి పొడువంబడిన యేనుఁగువలె, గొబ్బున నేలఁబడెను. దాపుననే యున్న శత్రుఘ్నుఁడు, అట్టి యవస్థను బొందియున్న భరతునిఁ గౌఁగిలించుకొని శోకము మిక్కిలి స్రుక్కింపఁగా సైఁపలేక విపన్నుఁడై పెద్దయెలుఁగున రోదనము చేసెను. అంత భర్తను బాసిన వ్యసనమున స్రుక్కి, దీనులై, యుపవాసములం జిక్కి, నవయుచున్న భరతుని తల్లులందఱును అచ్చటికి వచ్చిరి. వారును నేలఁబడియున్న భరతునిఁ జుట్టుకొని రోదనము సేసిరి. అందు కౌసల్యామాత్రము మనసు తల్లడిల్ల భరతుని దాపునకుఁ బోయి కవుఁగిలించుకొనెను. దూడయందు మిక్కిలి ప్రీతి గల యావు తన దూడనెట్లో యట్లె శోచనీయ యగు కౌసల్యయు భరతునిఁ గౌఁగిలించుకొని శోకపరవశయై యేడ్చుచు నతనిం జూచి "కొడుకా! నీ దేహమును రామవిరహవ్యాధి యేమైనను బాధించుచున్నదా, ఇప్పుడు రాజవంశములో సి మాయందఱి ప్రాణములు నీయట చేతనున్నవి. పుత్రా! రాముఁడు తన తమ్మునితో నడవికిఁ బోయినాఁడు, దశరథమహారాజును మృతుఁడయ్యెను. కనుక నీవొక్కఁడవే యిపుడు మాకందఱికి దిక్కు. 'నీ మొగము వెలవెల పాటును జూచియైనను రాముఁడు మరలి రాకపోఁడు' అను నాశతో నిన్నుఁ జూచి జీవించియున్నాను. పుత్రా! లక్ష్మణుని గుఱించి కాని, నా కడుపున లేక లేక యొకఁడే పుట్టి, యిపుడు భార్యతోఁ గూడ నడివికిఁ బోయియున్న నా కుమారుఁడు

రామునిగుఱించికాని, నీకెవ్వరైన నప్రియవార్త వినిపించిరా యేమి?" అనియడిగెను. మహాయశుఁడగునాభరతుఁడు కొంతవడికిఁ దెప్పిరిలి రోదనము సేయుచునే కౌసల్యతో 'తల్లీ! నీవుచెప్పిన దేమియు లేదని యూఱడించి గుహునిఁజూచి 'గుహా! నాయన్న రాముఁడు రాత్రి యెచటనుండెను? సీతాదేవి యెచటనుండెను? లక్ష్మణుఁ డెక్కడనుండె? మఱివారేమి భుజించి యెచటఁబరుండి నిదురించిరి? ఇవంతయునాకు జెప్పు' మనెను. బోయలరాజగునాగుహుఁడును రామునివృత్తాంతమును గీర్తించు నంతభాగ్యము గలిగెననియుబ్బుచు, తనప్రియుండును హితుఁడు నగురాముఁడు తన యొద్దకు అతిథియై రాఁగా నతనికి తానెట్టి యుపచారాదులుచేసెనో రాముఁడేమేమి గావించెనో వానినంతయు భరతునకుఁ జెప్పఁబూని "నేను రామునిభోజనమునకై నానావిధమైన యన్నమును భక్ష్యములును పలువిధము లయినఫలములను మఱియు చోష్యలేహ్యాదులు పెక్కులునుసమకట్టించితిని. దానముసేయుటయే క్షత్రధర్మముగాని పుచ్చుకొనుటగాదు. కనుక రాముఁడాక్షత్రధర్మమును దలఁచి వానినంతయును ప్రతిగ్రహింపలేదు. కాని యాసత్యపరాక్రముఁడు వానినెల్ల నన్నే మరలఁ దీసికొనిపొమ్మని యానతిచ్చెను. రాజా! ఆమహాత్ముఁడు నాతో 'చెలికాఁడా! క్షత్రియుల మగుమాకు ఎప్పుడును ప్రతిగ్రహించుట కూడదు. దానము మాత్రమే తగును' అనిచెప్పి * సమాధానపెట్టెను. మహాయశుఁ డగురాముఁడు లక్ష్మణుఁడు దెచ్చియిచ్చిన జలమునుద్రావి యపుడు సీతయుదానును ఉపవాసముండెను. అంత నపుడు రాముఁడుత్రావఁగా మిగిలినజలమును లక్ష్మణుఁడు త్రాగెను. వారు†ముగ్గురును వాజ్నియతితో నేకాగ్రచిత్తులై ‡సంధ్యనుపాసించిరి. అటమీఁద లక్ష్మణుఁడు తానే శీఘ్రముగా బోయిదర్భలనుదెచ్చిచక్కఁగా బఱచి శయ్యగావించెను. రాముఁడును సీతయు నాశయ్యపయిని బవ్వళించిరి. సీతారాముల పాదములు గంగాతీరమున నడచుటచే

---

* 'సమాధానపెట్టె'ననుటచే తనపాదభక్తులలో మేటియైన గుహుఁడుసమర్పించినఫలాదులు వానిభక్తిచేత పవిత్రములైనవిగావుననుశబరివిదురులవలెవాఁడును పరమభాగవతుఁడు గావునను స్వీకరింపందగినవిగానుండియు తనకు ప్రియతములైనతలిదండ్రులు మొదలగుబహుజనులనుబాసినదుఃఖాతిశయముచేతునస్పృహతు నింపులేనందునను పుణ్యనదీతీరమున ఉపవాసము సేయఁగోరినందునను గుహుఁడు సమర్పించినది రాముఁడు ప్రతిగ్రహింపలేదని గుహునికిఁ గూడ తెలిసెనని తెలియుచున్నది.

† ముగ్గురును అనుటచే సీతకుఁ గూడ సంధ్యాసమయమున ధ్యానజపాదులు కలవని తెలియుచున్నది.

‡ పూర్వము 'తతశ్చీరోత్తరాసంగస్సంధ్యా మన్వాస్య పశ్చిమామ్ జలమేవాదదే భోజ్యం లక్ష్మణే నాహృతం స్వయమ్' అని మొదట సంధ్యనుపాసించి పిదప జలపానము సేసినట్లుండఁగా నిచట జలపానము సేసిన పిదప సంధ్యనుపాసించె ననుట యెట్లనియడుగవచ్చును. ముందుచెప్పినదే క్రమము. ఇచ్చట గుహుఁడు తెచ్చినయన్నమును రాముఁడు భుజింపలేదన్నపుడు మఱియేమి భుజించెనని ప్రసక్తి మొదటరాఁగా దానినిబట్టి మొదట జలపానము చెప్పి పిదప సంధ్యోపాసనము చెప్పఁబడినది. ఇంతేకాని దోషము లేదని తెలియునది.

బురదతగిలి యుండుటవలన, లక్ష్మణుఁడు రామునిపాదములు తానై కడగి సీతకుజలము దెచ్చియిచ్చి పాదములు గడుగుకొనఁజేసి యంత నవ్వలికిఁబోయి దూరమునఁగాచి యుండెను. రాముఁడును సీతయు నిద్దఱు ఆరాత్రి పరుండినగార చెట్టుమూలమిదియె. వారు పరుండిన దర్భలు నివియె. పరంతపుఁ డగులక్ష్మణుఁడు అల్లెత్రాటిదెబ్బ తాఁక కుండుటకై కట్టికొనెడి యుత్తమును హస్తకవచమును దాల్చి, బాణములును నిం డారియున్న యమ్ములపొదులను రెంటిని వెనుక ప్రక్కగా మూఁపులంగట్టుకొని, విల్లెక్కు పెట్టి చేతం దాల్చి, కనుఱెప్ప వేయక రామునిచుట్టును గాపుదలగా తిరుగుచుండెను. అంత నే నపుడు, రాముఁడు నిదురించుచుండగా లక్ష్మణుఁ డేమి సేయునోయని శం కించి మేటి బాణములును విల్లునుదాల్చి లక్ష్మణుఁడున్న చోట్లనెల్ల నడుగడునకు నతని వెంబడించుచునే, నాబంధువులు ధనుర్ధరులై ప్రాలుమాలిక లేక నన్నుఁగొలువ, దేవేంద్రసమానుఁడైన రామునిఁ బరిపాలించుచుంటిని" అనెను. ఇది యెనుఁబది యేడవ సర్గము.



—{భరతుఁడు గారచెట్టుక్రింద సీతయాభరణములనుండి రాలినబంగరు పొడిని నా దేవి పట్టువస్త్రముపోఁగులను జూచి శోకించుట.}—

భరతుఁడు తాను మంత్రులును గుహుఁడుచెప్పినమాటల నెల్ల సూటిగా విని గారచెట్టు క్రిందికి బోయి రాముఁడు పరుండిన శయ్యనుజూచి తల్లులందఱితోను ఇచట 'మహాత్ముఁ డగురాముఁడు రాత్రి పరుండెను. ఈచోటు, అతఁడు పరుండుటచే నలఁగుడుపడి యున్నది. మహాభాగ్యవంత మగునిక్ష్వాకు కులమునఁబుట్టి మహాభాగ్య గామియు బుద్ధిమంతుఁడు నగుదశరథమహారాజుకడుపునం బుట్టినరాముఁడు నేలఁ బరుండి నిదురింపఁదగఁడు, మెత్తనై, కదళిమొద లయినజింకలతోలు పయిదుప్ప టిగా పఱపఁబడినవై, ఆయాశీతోష్ణాది కాలములకుఁ దగునట్లు పెక్కులగుచు, మేలైన పఱుపులు మీఁదఁబఱువంబడి యున్న మంచములమీఁద పురుషలలాముఁడు రాముఁడు పరుండియుండి, యిపుడు భూమిపయిని ఎట్లు పరుండుచున్నాఁడు? విమాన ములవంటి యుప్పరిగల మీఁదుభాగములందును, కూటాగారములందును, మఱియు బంగారువెండి నెలకట్టులుగలిగి, విలువలేని కంబళిపఱపుల మురువుసూపుచు, పలు వగల పువ్వుల నివ్వటిల్లుచు, చందనాగరు ధూపములు వాసనలు గుబాళించుచు, తెల్లని మబ్బులవలె తలతలలాడుచు, చిలుకలరొదలుపొదల, చలువలు నలుపుసూప, పచ్చకప్పురము మున్నగువాని తావులు బుగులుకొనుచు, బంగరుగోడల రంగారుచు, మేరుపర్వతములవలెవెలయుచును, మీటయి యున్నయుప్పరిగలయందును, ఆపరంత పుఁడుఎప్పుడునుబరుండువాఁడై, గీతములునుదానికనుగుణములై నవీణాదివాద్యధ్వను లును సెలంగ, ఇటునటు మెలఁగుచుండు పరిచారికలకడియములుఅందెలు మొలనూళ్లు మొదలయిన యాభరణములశబ్దములు మొరయ, మద్దెలలబిట్టుచప్పళ్లు బోరుకొన,

నిత్యమును మేలుకొంచి, ప్రాతఃకాలమున, వందిజనులు సూతులు మాగధులు మున్నగువెక్కండ్రచే, అనురూపములయిన గద్యవిశేషములచేతను స్తోత్రప్రబంధములచేతను స్తుతింపఁబడుచుండునే! అట్టి రాముఁడు భూమిపయి నెట్లు పరుండుచున్నాఁడు! క్రూరమృగములయఱపుల కెట్లు మేలుకొనుచున్నాఁడు! ఒంటిగా నెట్లున్నాఁడు! రాముఁడు గడ్డిపఱపుమీఁదఁ బరుండుట మొదలైనవి నమ్మఁదగినవిగా నాకుఁగనుపట్టవు. ఇదిసత్యముకాదని నాకుఁదోచుచున్నది, లేక నాహృదయము తెలివి తప్పెనా! లేక నేను విన్నదంతయుకలయే యనినానిశ్చయము. కాకున్న రాముని వంటివానికినిట్టివిగూడఁ గలుగునా! దశరథమహారాజు కడుపునఁ బుట్టినరాముఁడు గూడ భూమిమీఁదనే పరుండఁ గలిగెనే! కావున కాలమునకంటె దైవము బలీయమైనది కానేరదు, ఇదినిజము. విదేహరాజుకూఁతు రయినసీత, కనులపండువుగా గనుపట్టుసుకుమారి, ఇట్టియిడుములకు తగనిది, రామునికి ప్రాణములకంటె నెక్కుడయినది, మఱిమహారాజగు దశరథునికిఁ గోడలు. అట్టిసీతకూడ భూమిపయిని పరుండినదే! ఇదిగో నాయన్నపరుండినశయ్య. ఇందు నిదురించునపుడు గడు సయిన నేల యొత్తుకొనఁగా శ్రమమువలన నతఁడిటునటు పొరలుట యిదె తెలియుచున్నది. కావుననె యతని యవయవముల యొత్తుడువలన ఈసెజ్జయందలి దర్భలన్నియును నలఁగియున్నవి. మేలయిన యీపాన్పునందు, సీత మార్గాయాసమున అలసిసొలసి యుండుటచే ఆభరణములను విడిచిపుచ్చక వానిని ధరించియె పరుండినదని తలఁచెదను. కావుననే యందంద యీమెబంగరు సొమ్ములనుండి రాలినబంగారుపొడి యంటుకొనియున్నది. అపుడు సీతపయిచీర, యిందు తగిలియుండిన దనుట తెల్లముగానున్నది. కావుననే అచ్చటచ్చట యీ పట్టుపోఁగులు తగులువడి యెంతయు ప్రకాశించుచున్నవి. జాలిపుట్టించుదశయం దున్నయీపతివ్రత సీతతాను బాలయు సుకుమారియు నయ్యు, ఇట్టికటికి శయ్యపయిఁ బరుండి దుఃఖము నెఱుఁగకున్నదే! దీనిని బట్టి, పతివ్రతలకు పెనిమిటితోడిశయ్య, అది యెట్టిదైనను, సుఖముగానే యుండునని తలఁచెదను. రాముఁడు భార్యతోఁగూడ, అనాథునివలె నిట్టి కటికి శయ్యపై, నానిమిత్తమై పరుండినాఁడుగదా! అయ్యో! నేనెంత పాపాత్ముఁడను! రాముఁడు చక్రవర్తులకులమునఁ బుట్టినవాఁడు, సకలలోకములకును మనస్సునకుఁ గూర్చువాఁడు; సమస్తలోకులకును ప్రియుఁడు, నల్లగలువలగంటి చాయగలవాఁడు, ఎఱ్ఱనికనుఁగొలుకులవాఁడు, చూపఱకు కనువిందులు సేయువాఁడు. ఇట్లు జన్మమునను, గుణమునను, ప్రజారంజకత్వమునను, శరీరలక్షణమునను, రాజ్యార్హుఁడై సుఖమును బొందుటకే తగిన యీరఘుకులలలాముఁడు దుఃఖమున కెంతమాత్రము నర్హుఁడుగాఁడు. అట్టి రాముఁడు, సుఖకరంబై సాటిలేకున్న యట్టి రాజ్యమునువిడిచి కఱకునేలపయి నెట్లు పరుండియుండెను? మహాభాగుండును శుభలక్షణలక్షితుఁడునగు లక్ష్మణుఁడు అన్నయగు రాముని సంకటకాలమునందు

విడువక యనువర్తించుచున్నాఁడు. కావున వాఁడుగదా ధన్యుఁడు? సీతయు పెని మిటిని వెంబడించి యడవికిఁబోయినదిగావున, ఆయమయు కృతార్థురాలుసుమీ! మన మందఱమును ఆమహాత్ముని మాలియున్నాము. అతఁడు మనలను చేపట్టునో చేపట్టఁడో సందేహముగానున్నది. దశరథుఁడు స్వర్గమునకుఁబోయి రాముఁ డర ణ్యముపాలు కాఁగా, ఈభూమి, మాలిమి లేనియోడవలె. ప్రధాననాయకుఁడు లేక పాడుపడినట్లు నాకుఁ దోఁచుచున్నది. ఇట్లు రాజ్యమంతయు అనాయకమై యుండినను, ఇరుగుపొరుగు రాజెవ్వఁడు గాని, రాముని భుజపరాక్రమమున రక్షి తమై యున్న యీభూరాజ్యమును, అతఁ డడవిలోనున్నను, ఆక్రమించుటకు మనస్సునన్ నైనను తలంపఁడు. ఇపు డయోధ్య, ప్రాకారరక్షకులు లేక, గుల్మస్థాన ముల గుప్తియుఁ గానక యున్నది. అందలి గుఱ్ఱములును ఏనుఁగులును, వాని రౌతులు రామపారవశ్యమున నుండుటచే, కట్టంబడకయు సన్నద్ధములు గాకయు నున్నవి. మఱి పురద్వారములన్నియు తెఱవఁబడియున్నవి. అందలి సైన్యములో సొంపుపెంపులేక సురుఁగుచున్నవి. కావుననే యీరాజధాని తగిన కాపుదల లేక, సాధనములు కొఱవడి, బాహ్యరక్షకులును చుట్టు కాపైయుండుట మాలి, దుర్దశ పాలై యుండియు, శత్రురాజులు రామభయమున విషము గలిపినపిండివంటలం బోలె, దానిని లోఁగొనుటకు దలంపకున్నారు. నేనిది మొదలుగా నిత్యమునుఫలమూ లాహారుఁడనై, జడలుదాల్చి, నారచీరలుగట్టుకొని, వట్టినేలమీఁదనో మఱిగడ్డిపఱచు కొనియో పరుండెదను. మఱిరాముఁడుచేసిన ప్రతిజ్ఞను, అతనికి లేకుండునట్లు నేనెత్తు కొని, రామునికిఁగాను ఇదివఱకుఁ జెల్లినదిపోఁగా నిఁక నతఁ డుండవలసినకడమకాల మంతయు హాయిగా వనములో వసించియుండెదను. ఇట్లుసేయుటవలన రాముని ప్రతిజ్ఞయు పొల్లుకానేరదు. నాయన్నకుఁగాను నేనడవిలోనుండగా శత్రుఘ్నుఁడు నన్ననుసరించి కూడనుండును. పూజ్యుం డగురాముఁడు లక్ష్మణునితోఁగూడి అయో ధ్యనుపాలించుచుండఁగలఁడు. అయోధ్యయందు బ్రాహ్మణులు రామునకు నభిషేకము గావింతురు. నాయిష్టదేవతలు నేను గోరుచున్నయీకోర్కిని సఫలముఁజేయుదురా! నేను నాయంతట తలసోఁకఁ బ్రణామముచేసి పరిపరివిధముల బ్రసన్నునిగావించి నను, రాముఁడు ప్రసన్నతనొందఁడేని, యపుడు నేను రాముఁ డుండునంతకాల మును వనములో వసించుచు అతనిని అనువర్తించియుండెదను. తమ్ముఁడును దాసుఁ డును అగు నన్ను ఈ యనుచరణమాత్రమునకైనను రాముఁ డంగీకరింపకుండఁ దగఁడు' అని విలపించెను. ఇది యెనుబదియెనిమిదవ సర్గము.



—భరతుఁడు గంగానదిని దాఁటి భరద్వాజాశ్రమమును బ్రవేశించుట.—

రఘుకులప్రసూతుఁడైనభరతుఁడు రాత్రియంతయు నా గంగాతీరముననే యుండి, ప్రాతఃకాలమునలేచి శత్రుఘ్నునింజూచి 'శత్రుఘ్నా! లెమ్ము. ఇంకను

బరుండియున్నావేమి? శీఘ్రముగా బోయలరా జగుగుహునిఁ దోడ్కొనిరమ్ము. నీకు శుభమగుఁగాక. అతఁడు మనల నదిని దాఁటించును' అనెను. అతఁ డిట్లు పురికొలుపఁగా, తమ్ముఁ డగుశత్రుఘ్నుఁడును *'నేనును నీవు తలంచుకొనుచున్నయా యార్యుని నే చింతించుచు మేలుకొనియే యున్నాను, నిదురింపలేదు' అనెను. ఆపురుషసింహు లిరువురు నిట్లు పరస్పరము మాటలాడుకొనుచుండఁగానే, గుహుఁడు భరతునిఁ జూచుటకుఁ దగినవేళయెఱిఁగి లోనికిబోయి యతనిఁజూచి చేతులు మొగుడ్చుకొని, 'కాకుత్థ్సా! ఈరాత్రి నదీతీరమున హాయిగా నుబుసుపుచ్చితివే కదా! నీకును నీ సైన్యమునకును అందఱికిని ఉపద్రవ మేమియు లేదే కదా?' అని యడిగెను. రామాయత్తుం డగుభరతుఁడు, గుహుఁడు స్నేహమునం బలికినమాటను విని, వానింజూచి 'నిషాదరాజా! మాకు రాత్రి సుఖముగానే యుండినది. ఇంతేకాక వలసిన పూజలన్నియు నీవలనఁ జక్కఁగా జరిగినవి. మీ చెంబడివారలు ఓడలను పెక్కింటిని దెచ్చి యీ గంగానదినిమాత్రము మమ్మందఱను దాఁటింపవలయును' అనెను. అంత గుహుఁడు, భరతుఁడు త్వరితముగాఁ జేసినయాజ్ఞను విని మరల తనపట్టణమును ప్రవేశించి తనబంధువులను జూచి 'మేలుకొనుఁడు. లెండు. మీకెప్పుడును శుభమగుఁగాక. ఓడలను లాఁగి దీసికొనిరండు. భరతాదులను ఏఱుదాఁటింతము' అనెను. అట్లతఁడు చెప్పఁగా వారు రాజాజ్ఞ యగుటచే లేచిత్వరితముగాఁబోయి, నలుగడలనన్ని రేవులనుండియు, అయిదువందలయోడలను దీసికొనివచ్చిరి. ఆయోడలనేకాక స్వస్తికము లనంబడు రాజార్హము లైన మేలియోడలను గూడ దీసికొనివచ్చిరి. వీనికి నాలుగు మూలలందును పెద్దఘంటలు గట్టంబడియుండెను. మఱియు నవి బంగరుపూఁతచే తలతలలాడుచు, పతాకలతోఁ గూడియుండెను. అందు పలకలతో గోడలును అందుఁ దగునట్లు కిటికీలును నుండుటచే దగినంతమాత్రము వాయువు వీచుచుండెను. మఱియు నవి యినుపచీలలు మొదలగునవి గొట్టంబడి దృఢముగా రచింపఁబడియుండెను. అంత స్వస్తికములనెడి యానావలలో మిక్కిలి శోభిలుచున్న యొకయోడను గుహుఁడు దెచ్చెను. అందలి తలప్రదేశమంతయు తెల్లకంబళితోఁ గప్పఁబడి యుండెను. గంటలు మొదలగువానిచే నది సొంపుపుట్ట గణగణ శబ్దించుచుండెను. ఆయోడపై భరతుఁడును మహాబలుఁ డగుశత్రుఘ్నుఁడును నెక్కిరి. అంత పురోహితుఁ డగు వసిష్ఠుఁడును, మఱియుఁ బెద్దలయిన బ్రాహ్మణులు, దానిపై ముందుగా నెక్కిరి. పిదప రాజభార్య లగుకౌసల్యాదు లారోహించిరి. అంత నట్లే బండ్లును అంగడిసరకులును నెక్కింపఁబడెను. † తమవిడిసి యున్న పట్టులను నిప్పు

*దీనిచే, చరమపర్వనిష్ఠుఁ డైనవానికి ప్రథమపర్వము దఖినివేళము తనశేషికి తృప్తి గలిగించు కొఱకే యని తెలియునది.

† రాజభటులు తాము మఱొకచోటునకుఁబోవునపుడు మునుపుండిన పౌసస్థానములను లక్ష్మీసమాగమముకొఱకుఁ గాల్చువాడుక నిట తెలియునది.

దగిల్చి పెటపెటమని కాల్చుచున్నవారి చప్పుడును. ఓడనెక్కుటకై నేను నేనని మునిమిడి రేవునకు వచ్చుచున్న వారియులివును, గంగాతీర్థమున జలకము నాడువారి యలుకుడును, తమతమ యుపకరణములను నాది నాది యని తొందరపడి పుచ్చుకొనువారి కలకలమును, చేరి మహాధ్వని యై మిన్నుముట్టినది. అప్పుడు, ఓడలకు గాలిచే బలముగా నీడ్వఁబడుటకై ధ్వజములు కట్టఁబడియుండుటచే, అవి చెంబడివార లెక్కినంత మాత్రమున వారిప్రయత్నమేమియు నక్కఱలేక యతి వేగముతో, ఎక్కినజను లందఱిని వహించిపోయినవి. వానిలోఁ గొన్ని యోడలందు స్త్రీలుమాత్రము నిండియుండిరి. కొన్నిట గుఱ్ఱములు నిండియుండినవి. మఱికొన్నిటి యందు మిక్కిలి విలువగల రథములు బండ్లు మొదలగునవియు, వానికిఁ గట్టు కంచరగాడిదలును ఎద్దులును నుండినవి. అంత నాయోడలవ్వాలి గట్టును జేరి యెక్కినజనులను దింపి, మరలివచ్చునపుడు గుహునిబంధువు లగుచెంబడి వారు భారము లేకుండుటచే తేలికగా నుండుటవలన, ఆయోడలను జలములందు లీలార్థము చిత్రగతులం ద్రిప్పిరి. *పయిని గృహములు గల యేనుఁగులు మావటీలు పురికొలుపఁగా నీళ్లనుదిగి నదినిదాఁటుచు. నడుచుచున్న పర్వతములవలెఁ, బ్రకాశించినవి. కొందఱు నావల నెక్కిదాఁటిరి. కొందఱు తెప్పలపై దాఁటిరి. మఱి కొందఱు కుండలచేఁ దరించిరి. వేఱుకొందఱు చేతులతో నీఁదులాడుచు నుత్తరించిరి. గంగాస్నానమునఁ బవిత్రమైన యాసైన్యము, చెంబడివారలు దాఁటింపఁగా, ఆనదిని దాఁటి మైత్రమనెడు ముహూర్తమునందు ప్రయాగవనమును జేరెను. మహాత్ముఁడగుభరతుఁడు సైన్యమున కంతయు నూఱటగలిగించి, వారివారికి వలయుపట్టులందు హాయిగా విడియునట్లు విడుదులుకల్పించి మిక్కిలివయస్సుచెల్లిన ఋషితిలకుం డగు భరద్వాజునిదర్శించి యభివందనముసేయుటకై వసిష్ఠాదిఋత్విజులు చుట్టిరాకాలినడకం బోయెను. ఆభరతుఁడు, బహువేదాధ్యయనశాలియు మహాస్వభావుఁడును బృహస్పతిపుత్త్రుఁ డగుటచే దేవతలకుఁ బురోహితుఁడు బ్రాహ్మణోత్తముఁడు నగుభరద్వాజమహర్షి యాశ్రమముకడకుఁ బోయి యచట రమణీయము లైనపర్ణశాలలును వృక్ష సమూహములును గలిగి యొప్పు గులుకుచున్న యొక గొప్ప వనమును జూచెను. ఇది యెనుబదితొమ్మిదవ సర్గము.



*ఇందులకు 'సవైజయన్తాస్తు గజాః' అని మూలము. రాజులు ఏనుఁగుల మూఁపులమీద గృహములు నిర్మించి యందుండి పయన మగుట గలదు గావున 'సవైజయన్తా గజాః' అనుటకు గృహముతోఁగూడిన యేనుఁగు లనియర్థము సేయఁబడియె. దీని కనుగుణముగా 'సధ్వజా ఇవ పర్వతాః' అను దృష్టాంతవాక్యమున 'ధ్వజగతా' అను వ్యుత్పత్తినిబట్టి జంగమపర్వతము లనియర్థము సెప్పఁబడియె. లేక 'ధ్వజములతోఁ గూడిన యేనుఁగులు, మావటీలు పురికొలుపఁగా నీళ్లనుదిగి నదినిదాఁటుచు ధ్వజములతోఁ గూడిన కొండవలె ప్రకాశించె' అనియు నర్థము గ్రాహ్యము.

— భరతుఁడు భరద్వాజుని దర్శించుట. అన్యోన్యకుశల ప్రశ్నాదులు. —

పురుషసింహుఁడును ధర్మజ్ఞుఁడగు నా భరతుఁడు క్రోసుదూరముననే భరద్వాజాశ్రమమును జూచి, సైన్యమునంతయు నిలిపి, ఆయుధములను ఆభరణములను విడిపుచ్చి, వస్త్రములన్నియు దీసివైచి పయిని అడుగునను రెండు * పట్టు వస్త్రములను గట్టుకొని, పురోహితుని మున్నిడుకొని, మంత్రులంగూడి కాలినడకనే యాశ్రమమునకుఁ బోయెను. భరద్వాజాశ్రమమును దూరమునఁ గనుపట్టఁగానే రఘువంశ వృత్తములను దెలిసిన యాభరతుఁడు, మంత్రులనుగూడ నిలిపి పురోహితుని మున్నిడుకొని భరద్వాజునిఁ జూడంబోయెను. అంత మహాతపస్వి యగుభరద్వాజుఁడును వసిష్ఠునిఁ జూడఁగానే శిష్యులతో 'అర్ఘ్యముదెం' డని చెప్పుచు శీఘ్రముగా నాసనమునుండి లేచెను. మహాతేజుఁడగు భరద్వాజుఁడు వసిష్ఠునిని భరతునిం గలసి వా † రభివాదనము సేయఁగా, వసిష్ఠుని సాహచర్యమువలన అతనిని దశరథుని కుమారుఁడుగా నెఱిఁగెను. అంత ధర్మజ్ఞుఁ డగు నా భరద్వాజుఁడు క్రమమున వసిష్ఠునికిని భరతునకును అర్ఘ్యపాద్యము లొసఁగి పిదప ఫలములనిచ్చి, యంత 'గృహమం దెల్లవారును క్షేమమా?' యని యడిగి పిదప, 'అయోధ్య క్షేమమా? బలమును కోశమును కుశలమా? స్నేహితులును మంత్రులును కుశలముగా నున్నారా?' అని యడిగెను, కాని దశరథ మహారాజు మృతిఁబొందెనని యెఱిఁగి యున్నవాఁడు గావున నా రాజువిషయమే యెత్తలేదు. వసిష్ఠుఁడును భరతుఁడును భరద్వాజునిం జూచి ‡ 'మీ దేహము ఆరోగ్యమా? అగ్నిహోత్రములు చక్కఁగా జరుగుచున్నవా? వృక్షములు చక్కఁగా నున్నవా? శిష్యుల క్షేమమా? వనమునందలి మృగములును పక్షులును కుశలమా?' యని యడిగిరి. మహాతపస్సంపన్నుఁ డగుభరద్వాజుఁడు వా రిరువురతో 'అన్నిటను క్షేమమే' యని చెప్పి యంత, రామునియెడఁ గల స్నేహానుబంధమున భరతునిఁజూచి "నీవు రాజ్యమును పాలించుచుండు సమయమున దానిని విడిచి యిపుడిచటి కేల వచ్చితివి? నా కంతయు విశదముగా వివరింపుము. కారణము తెలియనందున నామనస్సు తేటగా లేదు సుమీ. పగవారిని దునుమాడుచు సకలప్రాణులకును ఆనందము సొంపారఁ గూర్చుచునుండునట్టి యెవ్వానిని కౌసల్యాదేవి కన్నదో, తమ్మునితోడను, భార్యతోడను

* ముందు భరతుఁడు నారచీరలు గట్టుకొన్నట్లు చెప్పియుండఁగా ఇచట పట్టువస్త్రములను గట్టుకొనెననుట యెట్లని యడుగవచ్చును. అయినను మునుపు నారచీరలు గట్టుకొనునట్లు ప్రతిజ్ఞమాత్రమే చేసెనుగనుక భారద్వాజాశ్రమమునకువచ్చినపిదప నేదానిని అనుష్ఠించినాఁడని తెలియునది.

† సమానవయస్సునుబట్టి వసిష్ఠుఁడు నమస్కారము చేయలేదని తెలియునది.

‡ భరద్వాజునికి శరీరాగ్నులు తపస్సాధనములు గావునను, వనమందలి మృగపక్షులతని యాశ్రమునందలివి కాఁబట్టి పవిత్రములై యాతనిశిష్యులను బోలుటచేతను, వసిష్ఠభరతులు వాని క్షేమను లడిగి రని తెలియునది.

బహుకాల మడవినుండుటకై యెవ్వఁడు పంపఁబడెనో, మఱియు తండ్రి యగు దశరథుఁడు ఆఁడుదానికి లోనై 'పదునాలుగేండ్లు అడవిలో నుండుము' అని యేమహాయశుని నాజ్ఞాపించెనో, పాపమేమియు నెఱుఁగని యారామునికిని, అతని తమ్ముఁడు లక్ష్మణునికిని, నీవు రాజ్యముగలిగియు అకంటకముగా దానిని అనుభవింపవలయునను తలంపున, పాపకార్యమేమియు సేయఁగోరవే కదా?" అని యడిగెను. భరద్వాజుఁ డిట్లు చెప్పఁగా భరతుఁడు కన్నుఁగవల కన్నీళ్లు చుట్టునుగాఱ పలుకు దొట్రుపడ నామునినిఁజూచి 'భూతభవిష్యద్వర్తమానములం దెలిసిన భగవంతుఁడ వగునీవు నన్నిట్టివానినిగాఁ దలంతువేని నేను హతుఁడనైతిని, నా వలన దోషమే గలుగదు గనుక నేనేమైన దోషము చేసితినని సందేహముగూడ నాకు లేదు. కనుక నీ విట్లు కర్ణకఠోరముగా నా కానతీయరాదు. మా తల్లియే యింతలు చేసినను, నేను లేనప్పుడు ఆమె చెప్పిచేసిన యీ కార్యము నేను సమ్మతించినదికాదు. దానిచే నాకు సంతోషమును గలుగలేదు. దాని నే నంగీకరింపనులేదు. నేనుపురుషలలాముఁడైన యీ రాముని ప్రసన్నునిగాఁ జేసికొని, అయోధ్యకుఁ గొనిపోయి, యతని పాదములకు మ్రొక్కుచుండుటకై వచ్చినాను. నీవు నే నిట్టితలంపుతో యిట వచ్చిన వానినిఁగా దలఁచి నా యం దనుగ్రహముంపవలయును. మహాత్మా! మహీపతి యగురాముఁ డిపు డెచటనున్నాఁడు? నాకుఁ జెప్పుము' అని యడిగెను. వసిష్ఠాదులైనఋత్విజులును 'భరతునియెడ ప్రసన్నుఁడవు గ'మ్మని ప్రార్థింపఁగా, సంత భగవంతుఁ డగుభరద్వాజుఁడును ప్రసన్నుఁడై భరతునితో 'పురుషతిలకా! పెద్దవానిని యనువర్తించుట, ఇంద్రియములఁ జిక్కఁబట్టుట, సత్పురుషుల మనస్సును అనుసరించుట, అను నివన్నియు రఘువంశమునఁ బుట్టిననీకుఁ దగును. నేను యోగప్రభావమున నీ మనస్సులో నున్నయీవిషయమును తెలిసికొనియే యున్నాను. అయినను అది మఱింత దృఢము గావించుటకును, నీకు పెద్దన్నను అనువర్తించుట వలనికీర్తిని నలుదిక్కుల వృద్ధిఁబొందించుటకును, ఇట్లడిగితిని. ధర్మజ్ఞుఁడైన రాముఁడును సీతయు లక్ష్మణుఁడును ఎచ్చట నున్నారో నాకుఁ దెలియును. నీయన్న రాముఁడు చిత్రకూట మనుమహాపర్వతమునం దున్నాఁడు. ఆచోటికి రేపుపోదువు. నేఁడిచ్చట నీవును నీ మంత్రులతోఁ గూడ నుండుము. నీవు మిక్కిలి ప్రాజ్ఞుఁడవు; కోరినవాని నొసఁగుటయందు కుశలుఁడవు, కనుక నాకోరినట్లు సేయుము' అనెను. రాజకుమారుఁ డగుభరతుఁడు మిక్కిలియు గొప్పబుద్ధిగలవాఁడు గావున ముని చెప్పినదానికి మిక్కిలియు హర్షించి, 'యట్లెచేసెద' నని చెప్పి యారాత్రి యమ్మునియాశ్రమునం దుండుటకు తలంపు గొన్నవాఁడయ్యెను. ఇది తొంబదవ సర్గము.



— భరద్వాజుఁడు భరతునికిని నతనిసైన్యమునకును నాతిథ్య మొసఁగుట. —

అప్పు డాయాశ్రమముననే యుండుటకు మనసున నిశ్చయించి యున్న కైక సుతుని భరతునిఁజూచి భరద్వాజముని 'భోజనపర్యంతము అతిధిసత్కారముగైకొన వలయు' నని ప్రార్థించెను. భరతుఁడు నతనిని జూచి 'మును లగుమీకు నడవియందు దొరకు కొలఁదికిని, పాద్యమును, అర్ఘ్యమును, ఫలమూలాదులును నొసంగి మాకా తిథ్యముగావించి యైనదే! ఇంక నేమి?' యనెను. అంత భరద్వాజుఁడు మొగముననవ్వు దెలుపునట్టి భావముతో, భరతునిఁజూచి, 'నాయందు నీకుఁ బ్రీతియున్నదని యెఱుగుదును. ఏపాటియుపచారమున కైనను నీవు సంతోషించువాఁడవే. అయినను, పురుషతిలకా! నీవెంటవచ్చిన యీసైన్యమున కంతయు విందు సేయఁగోరుచున్నాను. నాప్రీతియెట్టిదో యందులకుఁ దగునట్టు నీ వనుమతించుటయే యుక్తము. నరవరా! సైన్యమునంతయు దూరమునందేల నిలిపి నీవుమాత్ర మిచ్చటికి వచ్చితివి? సైన్య సమేతముగా నెందులకు రావైతివి?' అనియడిగెను. భరతుఁడు చేమోడ్చి గీలించి యాతపోధనునిఁజూచి 'మహాత్మా! నీవుకోపింతు వనుభయమున సైన్యములతో గూడి రానైతిని. మహాత్మా! రాజుగాని రాజకుమారుఁడుగాని సైన్యములతో, ప్రయాణముసేయు కాలమున, తమదేశములలో తాపసులుండుపట్లను తప్పించి వారికాసేన వలన బాధకలుగకుండునట్లు మఱివేఱుమార్గమునఁబోవలయును. మహాత్మా! ఈమహా సైన్యము, మేటిగుఱ్ఱములును మనుష్యులును మత్తిల్లిన మేటియేనుఁగులును గలదై మిగుల విశాలమైనభూమిని గ్రమ్ముకొని నావెంట వచ్చుచున్నది. అవన్నియు నిచ్చటికి వచ్చి యాశ్రమములందలి వృక్షములను, కొలఁకులను, నేలను, పర్ణశాలలను పాడుసేయ కుండవలయునని, యీకారణమున, నే నొక్కఁడనే వచ్చితిని' అనెను. ఆ మహర్షి 'ఇచటికి సైన్యమును రప్పింపు' మని యాజ్ఞాపింపఁగా నంత భరతుఁడు సేన నయ్యాశ్రమమునకు వచ్చునట్లు గావించెను. అంత భరద్వాజుఁడు పావనత్వమునకై అగ్నిహోత్రగృహమునకుఁ బోయి మూఁడుమాఱు లాచమించి రెండు మాఱులు బెదవులు తుడుచుకొని, యాతిథ్యమును సమకట్టుటకై యాహ్వానమంత్రముతో విశ్వకర్మను ఇట్లు పిలిచెను. 'నేను, గృహాదులను తోడనే నిర్మించునట్టి విశ్వకర్మను బిలుచుచున్నాను. భరతునకును అతని సైన్యమునకును ఆతిథ్యముసేయఁ గోరియున్నాను. ఆవిషయమున విశ్వకర్మ తనకానతిచ్చినది సమకట్టుఁగాక. అగ్నియమ వరుణ కుబేరుల మువ్వురదిక్పాలురను, దేవేంద్రుఁడు మొదలుగాఁగల దేవతలను బిలుచుచున్నాను, ఆతిథ్యము సేయఁగోరెదను. ఆవిషయమున వారువారు వచ్చి సమకట్టఁబడు నన్నపానాదులకుఁ గాపుసేయవలయును. భూమియందును, అంతరిక్షమందును, తూర్పుతట్టో పడమర దిక్కుననో పాఱెడు నదులన్నియును ఒక్కుమ్మడిగానే యిప్పు డిచటికి వచ్చుఁగాక. వానిలో కొన్ని ఖర్జూరాదులతోఁ జేయఁబడిన మైరేయ మనుమద్యమును దొరుఁగుఁగాక. కొన్ని చక్కఁగా పక్వముసేయఁ

బడిన సుర నొసఁగుఁగాక. మఱికొన్ని నదులు చెఱకురసమువలె తీయనైన చల్లని జలముల నొసఁగుఁగాక. మఱియు గానముసేయుటకై, * దేవగంధర్వజాతులయిన విశ్వావసువును, హాహాయనువానిని, హూహూయనువానిని, అట్లె దేవజాతు లగు నప్సరసలను, గంధర్వజాతులగు నప్సరసలను, అందఱిని బిలుచుచున్నాను. మఱియు నాట్యమునకై, ఘృతాచిని, విశ్వాచిని, మిశ్రకేశిని, యలంబుసను, నాగదంతను, హేమను, పర్వతమునఁ గాఁపున్న హిమను, బిలుచుచున్నాను. దేవేంద్రునిఁ గొలిచి యుండు నప్సరసలను † బ్రహ్మదేవునిఁ గొలిచియుండు నప్సరసలను అందఱిని వారి నృత్తగీతాద్యు పకరణములతోఁ గూడ, గానశిక్షకుఁ డగు తుంబురువుతోఁ గలసి రావలయునని పిలుచుచున్నాను. మే లయినవస్త్రాభరణములే పత్రములుగాను, మంచివనితలే ఫలములుగాను గల్గి యుత్తర కురుదేశములందు దేవతార్థమై విల సిల్లుచున్న చైత్రరథ మను కుబేరవనము, ఇచ్చటికి వచ్చుఁగాక. భగవంతుఁ డగు చంద్రుఁ డిచ్చట, నాకొఱకై భక్ష్య భోజ్య చోష్య లేహ్యము లను చతుర్విధాన్నము లను అందఱికిని పలువిధములుగాను అవ్వారిగానునుండునట్లు కల్పించుఁ గాక. మఱియు నా చంద్రుఁడు ఓషధీశుఁడు గావున, చెట్లనుండి యప్పుడు రాలిన వింతవింత లగుపూలమాలికలను, సురమొదలైన పానద్రవ్యములను, పలువిధముల యిన మాంసములను నొసంగుఁగాక' అని యాహ్వానమంత్రములు జపించెను. యోగబలమునను, పిలిచినట్లు రానియెడల దండింపఁ జాలినట్టి యెనలేని ప్రభావము నను గూడి, యమ్మని, శిక్షాశాస్త్రము చెప్పిన స్వరములు స్వచ్ఛముగాను నిర్దు ష్టముగాను బలుకుచు, ఈమంత్రవాక్యములను జపించెను. ఆముని యిట్లు తూర్పు మొగమై, చేమోడ్పుగీలించి, మనస్సున ధ్యానించుచుండఁగానే యాదేవత లంద ఱును వేఱువేఱ నయ్యాశ్రమమునకు వచ్చిచేరిరి. అంత వాయువు మలయదర్దుర పర్వతములమీఁదుగా పొలసి చెమట నీళ్లనార్చుచు మంచివాసనతో నెల్లవారికి హాయిగాను మంగళకరముగాను వీచుచుండెను. అంత దేవతలు స్వర్గమునుండి పువ్వులసోనలు జడిగొనునట్లు కురియించిరి. నలుగడల దేవదుందుభులు బోరుకొను చుండెను, వాయువులు మిక్కిలియింపుగా వీచినవి. అప్సరస లాడిరి. దేవగంధర్వులు పాడిరి. మఱియు వీణియలను వాయించిరి. వీణాది వాద్యములచే నుప్పతిల్లినయాచ ప్పుడు మిక్కిలిమృదువై, శ్రుతి సామ్యముగలిగి లయగుణముతోఁగూడినదై, యాకాశ మునను భూమిని వ్యాపించియున్న సకలప్రాణులకును శ్రవణములకు విషయంబయ్యె. మనుష్యులకెల్ల వారికిని, జెవుల కింపయినయాదివ్యధ్వని నిలువగానే భరతునిసైన్యము

* మనుష్యజాతి గంధర్వులు దేవజాతిగంధర్వులని రెండువిధములు గలవు గాన యిట దేవగంధర్వు లనఁబడిరి.

† 'తం పంచశతా న్యప్సరసాం ప్రతిధావన్తి' అనుటచే బ్రహ్మలోకమందును అప్సరసలు గలరని తెలియుచున్నది.

వారు విశ్వకర్మనిర్మాణవిశేషమును బొడఁగాంచిరి. భూమి, నాలుగుప్రక్కలను అయిదామడలవఱకు మిట్టపల్లములు లేక సమమై నీలములవలెను వైడూర్యములవలెను దులకించు చిన్నపచ్చికపట్లు గలిగి మెచ్చులు గులుకుచుండెను. ఆభూప్రదేశమునందు పండ్లచే సొంపు పెంపారుచుండు బిల్వవృక్షములును, వెలఁగచెట్లును, పనసవృక్షములును, మాదీఫలపుఁ జెట్లును, ఉసిరికచెట్లును మామిడిచెట్లును గలిగెను. ఉత్తరకురుదేశమునుండి, దివ్యములైన యుపభోగములకుం దగిన చైత్రరధ వనమును వచ్చినది. దివ్యనదులును, తీరములందు పెక్కువృక్షములు విలసిల్ల నొప్పుచు, నచటఁ బొడసూపినవి. నిర్మలములయిన నాలుగిండ్ల బవంతులును, మేడలును ఉప్పరిగలును, ఏనుఁగులను గట్టు కొట్టములును, గుఱ్ఱములను గట్టు లాయములును, శుభంబులగు పుష్పాదితోరణములును ఆవిర్భవించినవి. మఱియు తెలిగచ్చుపూఁతచే తెల్లనిమబ్బువలె నుల్లసిల్లుచు మేలయిన ద్వారముగలిగిన రాజగృహము ఒకటి యావిర్భవించినది. అది తెల్లపూవుల మాలలచే నలంకరింపఁబడినదై, మేలయిన చందనము చల్లంబడి, యుల్లసిల్లుచు నలుచదరమై, యెఱుకలేక మిక్కిలియుఁ బఱపుగలిగి, పలువిధములయిన పాన్పులును ఆసనములును వాహనములును గలిగి వెలుఁగుచుండెను. అందు దివ్యములైన శర్కరాది సకలరసములును, మేలయిన శాల్యన్నమును మంచి జిలుగు వస్త్రములును వెలయుచుండెను. మఱియు నందు పలువిధములైన యపూపాదులు గల యన్నములును సమకట్టింపఁబడి యుండెను. పాత్రములన్నియుఁ జక్కఁగా దొడయంబడి నిర్మలములై నిగనిగలాడుచుండెను. ఇంతేకాక యందు భోజనస్నానాద్యాసనములు వేఱువేఱ చక్కఁగా నమర్పఁబడియుండెను. మేలయిన దుప్పటిపఱుపు గలిగి నిదురించుటకైన మేటిశయ్యయు నందు శోభిల్లుచుండెను. మహాబాహుఁడైన యా కైకకొడుకు భరతుఁడు మహర్షి యనుజ్ఞసేయఁగా, పలువిధములైన యుత్తమద్రవ్యములు నిండియున్న యాగృహమును ప్రవేశించెను. పురోహితులును మంత్రులు నందఱును భరతునివెంట దానిం బ్రవేశించిరి. వార లాగృహమును రచించియున్న తీరునుజూచి యెంతయు సంతసిల్లినవారునైరి. భరతుఁడచ్చటనుండు దివ్యసింహాసనమునకును, వింజామరమునకును, శ్వేతచ్ఛత్రమునకును, రాజునకుఁ జేయునట్లు, మంత్రులతోఁగూడఁ బ్రదక్షిణము సేసెను. ఇంతేకాక యతఁడు దానిని రాజుంబోలె పూజించి యందు రాముఁడు గూర్చుండునట్లు భావించి యతనికి నమస్కరించి, తాను వింజామరను బట్టుకొని దానికి క్రిందుగా మంత్రులు కూర్చుండఁ దగిన యొక యాసనమునం గూర్చుండెను. మంత్రులును పురోహితులును వరుసచొప్పునఁ గూర్చుండిరి. పిమ్మట సేనాధిపతియు, నతనికిఁ బిదప శిబిరకర్తయును గూర్చుండిరి. అంత నపుడు ఒక ముహూర్తమున నే భరద్వాజునియాజ్ఞవలన పాయసంపురొంపులుగల నదులు భరతుని ముందటఁ బ్రవహించినవి. ఆనదులకు రెండు గట్టులందును, ఆమహర్షియనుగ్రహమువలన తెలిగచ్చుపూఁతలచే మెచ్చులుగులు

కుచు మిగుల సొగసై దివ్యము లగుగృహములు ఆవిర్భవించినవి. ఆముహూర్తమున బ్రహ్మ పంపఁగా దివ్యాభరణభూషిత లగునప్సరసలు ఇరువదివేలమంది వచ్చిరి.అంత కుబేరుఁడు పంపఁగా, సువర్ణభూషణములును రత్నమయాభరణములను ముక్తారచిత భూషణములును పగడంపుసొమ్ములును గైసేసికొని యిరువదివేలమంది యప్సరసలు వచ్చిరి. పురుషుఁ డెవ్వఁడేని తమ్ముగాఁగిలించుకొనఁగానే మరులెత్తి పిచ్చిగొన్నవాని వలె పరవశుని గావించునట్టిచెలువు గులుకుచున్నయప్సరసలుఇరువదివేలమంది దేవేంద్రుఁడు పంపఁగా నందనవనమునుండి వచ్చిరి. నారదుఁడు, తుంబురుఁడును, గోపుఁడు ననెడి యీ ముగ్వురు మేటిగంధర్వరాజులు సూర్యతేజంబున వెలుఁగుచు భరతుని ముందటఁ బాడిరి. అంత భరద్వాజునియాజ్ఞవలన అలంబుసయు, మిశ్రకేశియు పుండరీకయు. వామనయు, ననెడి యప్సరసలు భరతునిముందట నాట్యము సేసిరి. దేవోద్యానము లయిననందనాదులందును, కుబేరుని చైత్రరధమునను, ఏయేపుష్ప మాలికలు గలవో అవన్నియు భరద్వాజుని ప్రభావమువలన ప్రయాగయందలి యాతనియాశ్రమవనవృక్షములందును సొడసూపినవి. ఇంతవఱకును భరతున కుప చారములుకాఁగా,ఇఁక తక్కినసైనికులకుఁగానుభరద్వాజునియాజ్ఞవలన బిల్వవృక్షములు మద్దెలలువాయించినవి. తాండ్రచెట్లు తాళములు వేసినవి. అశ్వత్థవృక్షములు నృత్తముగావించినవి. అంత మునిమహత్త్వమువలన, సరళవృక్షములును, తాటిచెట్లును, బొట్టుగుచెట్లును, గానుఁగుచెట్లును, గూనులును గిటకలునై తిరుగుచుండినవి. మఱియు నా భరద్వాజాశ్రమమునందుఁ గల*శింశుపావృక్షములును, ఆమలకీ (ఉసిరిక) వృక్షములును,జంబూ (నేరెడు) తరువులును, మఱియు నడవులయందుఁగల యితరవృక్షములును సన్నజాజి, మల్లె, జాజి, మొదలైన యడవియందలి లతలును, స్త్రీరూపములు దాల్చి భరతసైనికులం జూచి 'వారివారికి వలయునంత వఱకును తృప్తిగా సారాయిత్రాగువారు సారాయమును ద్రాగుఁడు, భోజనముసేయఁగోరువారు ఇష్టముకొలఁదిని పాయసమును గ్రోలుఁడు. పరిశుద్ధములైనమాంసములను భక్షింపుఁడు' అనిచెప్పెను. ఒక్కొకపురుషునికిని ఏడెనిమిదిమంది స్త్రీలుచేరి నలుఁగులు పెట్టి రమణీయములైన నదీతీరముల స్నానములు సేయించిరి. సొగసుంగన్నులుగల వన్నెలాండ్రు వారికిఁ గాలుపిసుకుటకై వచ్చి వారల దేహమందలి తడియొత్తి, యలంకరించి, యేకతమున వారలచే సురను త్రాగించిరి. భరద్వాజుని మహత్త్వమున నేర్పడిన వాహనపాలకులు, గుఱ్ఱములకును ఏనుఁగులకును, గాడిదలకును, ఒంటెలకును, అల్లె యెద్దులకును విధిచొప్పున వానివానికిం దగినయాహారముల నొసఁగిరి. మంచి బలము గలయావాహనపాలకులు ఇక్ష్వాకుకులతిలకుఁడై నభరతుని బంట్లకుఁ గల యేనుఁగులు మొదలైన వాహనములను దినుటకై ప్రేరేపించుచు, వానికి

* ఇచట స్త్రీలింగవృక్షములు స్త్రీరూపములు దాల్చి పరిచరించె ననుట తెలియనది.

చెఱకు గడలను, తేనియ గలపిన పేలాలను, కుడువం బెట్టిరి. గుఱ్ఱపువాఁడు తన గుఱ్ఱమిది యని తెలియఁడయ్యె. ఏనుఁగువాఁడు తన యేనుఁగును తెలిసికొననేరఁ డయ్యె. ఆ సైనికులందఱును మదకరము లైనద్రవ్యములచే మత్తిల్లి మధు పానమున మైమఱచి హారచందనాదులచే నుల్లాసముఁబొంది విలసిల్లిరి. వారు కోరినపదార్థము లన్నియు నిచ్చలు ననుభవించి తృప్తినొంది యెఱ్ఱని చందనమును మేన నలఁదుకొని యొక్కొక్కరును పెక్కం డప్సరసలంగూడి పరమసంతుష్టులై 'మే మయోధ్యకుఁ బోము. దండకారణ్యమునకును బోము. ఇచ్చటనే యుందుము. భరతుఁడు ఎట్లోయొకవిధమున కుశలముగా నుండు గాక. రాముఁడు నట్లే హాయిగా నుండుఁగాక' అనిరి. కాలుబంట్లును, ఏనుఁగుబంట్లును, గుఱ్ఱపురౌతులును, ఏనుఁగులను గుఱ్ఱములను గట్టుట మొదలగు పనిసేయువారును, ఆమునిగావించిన సత్కారవిధికి మత్తిల్లి తమకు నాథుఁడు లేఁ డనుకొని స్వతంత్రులై యీమాటలం బలికిరి. భరతుని వెంటవచ్చిన సైనికులు అందంద వేలువేలు మిక్కిలి యుబ్బు నొంది బిగ్గఱ నఱచుచు 'ఇదేస్వర్గము. మఱొకటిగాదు' అని చెప్పిరి. ఆ సైనికులం దఱును పూదండలు దాల్చి వేపుర కొలఁగిని మూఁకలుగట్టి నృత్తము సేయుచును, నవ్వుచును, పాడుచును, నలుప్రక్కలకుం బరుగిడుచును నుండిరి. అంత వారలు అమృతమువలె చవులుగులికెడియాయన్నమును యథేష్టముగాభుజించియు, దివ్యము లైన యందలిభక్ష్యములం జూచి తృప్తినొందక మరలం దినుటకు బుద్ధిగలిగిరి. ఆసేన యందు పరిచారికలును, దాసీలును, బంట్లభార్యలును, మఱియు నందుఁగల తక్కిన స్త్రీలును, అందఱును వేలకొలఁదిని, నూతనవస్త్రములను గట్టుకొని మిక్కిలియు సొంపుపెంపున విఱ్ఱవీగుచుండిరి. అందలి యేనుఁగులును, గాడిదలును, ఒంటెలును, గోవులును, గుఱ్ఱములును, క్రీడార్థము సైనికులు దెచ్చుకొన్న మృగములును, పక్షు లును, భరద్వాజుమహిమచేఁ గలిగినభక్ష్యాదులచే మిక్కిలియుఁ బుష్టినొందకయుం డెను. అం దెవ్వఁడును మఱి వేఱు ఆహారము దేనినిగాని దినఁడయ్యె. అందు ఒక్కఁ డైనను నల్లనిబట్టలు దొడిగినవాఁడుగాని, ఆకలిగొన్నవాఁడుగాని, మాసినయొడలు గల వాడుఁగాని, ధూళిబ్రుంగి మాసినతలవెండ్రుకలు గలవాఁడుగాని, కానఁబడఁ డయ్యె. అందఱును తెల్లనివస్త్రములుగట్టి, యాకలినెఱుఁగక యభ్యంగస్నానాదులు చేసి శుచిగా వెలయుచుండిరి. మఱియు మేకమాంసములును, పందిమాంసములును, ఉత్తమములైన వ్యంజనసమూహములును, చక్కఁగా మాఁగినపండ్లును, చక్కెర మొదలైనవియుఁ గలిపి కాచిన కాపీరసములును, పాకభేదములచే పలువిధము లైనవాసనలును, రసములును బొందిన సూపములును, తెల్లని యన్నములును నిండియున్నవై, పూవులచిత్తరు పనిచే తళుకొత్తుచు నలుగడల వేలకొలందిని నున్న లోహ (బంగారు) పాత్రములంజూచి యాసైనికు లత్యాశ్చర్యమునొందిరి. అప్పు డరణ్యముననుండు బావులన్నియును పరమాన్నములతో నిండియుండెను.

అచ్చట మునుపు దిరుగుచుండినయావులును, ఎంతగోరినను అంత పాలు పితుకుచుండెను. అచ్చటి వృక్షములన్నియును దేనియలు గాఱుచుండినవి. అందలి నడబావులు మైరేయ మనుమద్యముతో నిండియుండెను. వానిచుట్టును కుండలందు చక్కఁగా పచనముసేయఁబడిన యిఱ్ఱినెమిలికోడి మొదలగువాని మేలయినమాంసములు వెలయుచుండెను. వేలకొలఁదిని అన్నకుంభములును లక్షలకొలదిని వ్యంజనపులోవలును, కోట్లకొలఁదిని బంగారుభోజనపాత్రలును, శుంఠి మొదలగునవి వేసి చక్కఁగా సంస్కరింపఁబడిన పెరుఁగు నిండియుండు కుండలును, దుత్తలును, గిండీలవంటి పెద్ద చట్లును, ఉండినవి. అందు కొన్నిమడుఁగులు, *మిక్కిలి ప్రాఁతదియు క్రొత్తదియుఁగాక వెలఁగపండువాసనలతోఁగూడిన తెల్లనిమేలి మజ్జిగ నిండియుండెను. కొన్ని సొంటి పిప్పళ్లు మిరియములును ఏలకులు లవంగములు తక్కోలము నాగపుష్పము చక్కెరయల్లమును జీలకఱ్ఱయుఁజేర్చితిరుగఁబోఁతసేసిన పెరుఁగుతోనిండియుండెను. కొన్ని పాయసపూర్ణములై యుండెను. వీనికి వ్యంజనములుగా చక్కెరయు చక్కెరతోఁ గలసిన యవలపిండివంటలును రాసులు రాసులుగా నుండినవి. ఆ సైనికులు నదులరేవులందు పాత్రములం దుంపఁబడి యున్నయుసిరికకాయ మొదలగువానితోఁజేయఁబడ్డ యటకలి ద్రవ్యములును, ఒడలు రుద్దుకొనుటకై మినుములు మొదలగువానితోఁ జేయఁబడిన వాసనపుఁబొడులును, నూనె వేఁడినీళ్లు మొదలగు నానావిధములయిన స్నానద్రవ్యములునుం జూచిరి. మఱియు సిగ్మలములై కూర్చములతోఁ గూడిన దంతకాష్ఠముల సమూహములును, దొప్పలయందున్న తెల్లని చందనపంకములను, చక్కఁగా దోఁడయుంబడి తలతలలాడుచున్న యద్దములును, వస్త్రసమూహములును, వేలకొలఁది పావుకోళ్ల జతలును, చెప్పులజతలును, కాటుకబరణులును, దువ్వెనలును, మీసములు మొదలగునవి సవరించు చిన్న చిక్కోలలును, అలంకారార్థమైన కత్తి మొదలగునాయుధములును, ధనువులును, కవచములును, వింతవింత లగుశయ్యలును, ఆసనములును, గాడిదలును ఒంటెలును ఏనుఁగులును గుఱ్ఱములును గడ్డిమెసఁగినపిదప జీర్ణించుకొనుటకు త్రాగుటకైన నీళ్లునిండియున్న మడుఁగులును, జలకమాడుటకుం దగిన రేవులును, గలిగి, కలువలును తామరలును చెలువుసూపుచు, ఆకాశమువలె స్వచ్ఛమయిన జలములుగలిగి, హాయిగా స్నానముసేయం గూడినకొలఁకులును, నీలములయు వైడూర్యములయు వన్నెగులుకుచు మెత్తనయి పశువుల కొసంగ సమకట్టింపఁబడిన గడ్డి

---

* ఇందుకు 'యౌవనస్థస్య గౌరస్య కపిత్థస్య సుగన్ధినః। హ్రదాః పూరారసాలస్య దధ్నశ్శ్వేతస్యచాపరే' అనిమూలము. ఇచట కపిత్థమనఁగా 'తక్రం కపిత్థం మథితం' అని చిలికినమజ్జిగ. రసాలమనఁగా 'అపక్వతిక్రం సవ్యోషం చతుర్జాతగుడార్ద్రికం సజీరకంరసాలంస్యాత్' అన్నట్లు వ్యోషములను శుంఠి పిప్పలి మిరియములును, చతుర్జాతమను ఏలా లవంగ తక్కోలి నాగపుష్పములును, గుడము (చక్కెరయు)ను, ఆర్ద్రిమును (అల్లమును) కలిగిన పక్వముగాని పెరుఁగు.

ప్రోవులును, వారు అంతటను జూచిరి. ఆసైనికులు నింతవఱకెన్నఁడు కన్నదియు విన్నదియుఁ గానిదై, ఏప్రయత్నమునులేకయే సిద్ధించినదై, యాశ్చర్యకరమై యుండుటవలన స్వప్నముతో సాటియై, యిట్టిదట్టిదని చెప్ప నలవిగాని యట్లు, మహర్షి భరతునకుఁ గావించిన యాయాతిథ్యపువిందును జూచి మిక్కిలి విస్మితులైరి. నందనవనమున దేవతలు క్రీడించునట్లు, రమణీయమైన భరద్వాజాశ్రమమున నీవిధముగా వారు నానావిధక్రీడలం దేలుచుండఁగానే యారాత్రిగడచినది. అంత ఆనదులును దేవగంధర్వులును ఆయుత్తమ స్త్రీలందఱును భరద్వాజమునిని వీడ్కొని, వచ్చినరీతినే తమతమపట్టులకుంబోయిరి. తెల్లవారినపిదపఁగూడ మనుష్యులు ఆప్రకారముననే మద్యముచే మిక్కిలి మత్తుగొని యశ్లే దివ్యాగరుచందనపుఁబూఁతలతోఁ దులకించుచుండిరి. * దివ్యములైన పలువిధముల మేలి పూదండలు మునుపటిపూదండలవలెఁగాక, మనుష్యులచే భోగవశమునఁ నలఁగుడుపడి యచ్చటచ్చట చెల్లచెదురుగా పడియుండియు, అనుభవించుకాలము నందున్నట్లే తళుకొత్తుచుండినవి. ఇది తొంబదియొకఁడవ సర్గము.



భరతుఁడు భరద్వాజునకుఁ గౌసల్యాదులను దెలుపుట. చిత్రకూట ప్రయాణము. నడుమ యమునాతీరవనమును బ్రవేశించుట.

అంత భరతుఁడు సపరివారముగా ఆతిథ్యముఁబడసి రామునిం జూడ నువ్విళ్లూరుచు భరద్వాజునియొద్దకుఁబోయెను. భరద్వాజమహర్షియు అగ్నిహోత్ర కార్యముతీఱఁగానే తనకడకువచ్చి చేతులుమోడ్చి నిలువంబడియున్న పురుషతిలకు నాభరతునింజూచి †'పాపరహితా! నీకిచట మాయాశ్రమమున రాత్రి సుఖముగా నుండినదేకదా! నేను గావించినయాతిథ్యమునకు నీజనులందఱును తృప్తులయిరా యేమి? నాకిది చెప్పుము' అని యడిగెను. మిక్కిలియు తేజమున రాజిల్లుచు తాను బయలుదేఱినపుడే తన్నుఁ జూడ నాశ్రమముననుండి బయలుదేఱుచున్న యా ఋషినిజూచి భరతుఁ డంజలిగావించి నమస్కరించి యతనితో 'మహాత్మా! నేనును నామంత్రులును నాసైనికులును గుఱ్ఱములు మొదలయిన వాహనములును, అందఱును సమస్తములైన కామితపదార్థములచేతను తృప్తినొంది సుఖముగా నున్నా

* దీనివలన నిదియింద్రజాలమువలె అనుభవించునప్పుడుమాత్రమేయుండి పిమ్మట నేమియు లేకపోవునట్టిదికాక అంతయు యథార్థమేయగునని తెలియునది.

† భరద్వాజమహర్షి భరతునిహృదయమును పరీక్షించుటకేయిట్టియాతిథ్యమును జరిపినాఁడు. భరతునకు రామునియెడ భక్తిలేనిచో తానుపన్నినభోగములందు మగ్నుఁడై నిలిచియుండు నని ఋషి యభిప్రాయము. భరతుఁ డట్లు మగ్నుఁడుగాక రామునిఁ జూడవలయునని తహతహపడుట తెలియునది.

రము. మాపరిచారకులు మొదలుగా మేమందరమును బడలికలు వీడి మేనితాప
ములడఁగి సమృద్ధముగా నన్నపానములుగొని నుంచిగృహములందు మిక్కిలియు
సులభముగా వసించియుంటిమి. ఋషితిలకా! నిన్ను యథేష్టముగా వీడ్కొనెదను.
నాయన్నసమీపమునకుఁ బోవుచున్నాఁడను. నన్ను స్నేహదృష్టిం గటాక్షింపుము.
నీవు యోగధర్మమున సమస్తమును దెలియువాఁడవు. కనుక పితృవచన పరిపాలన
ధర్మము నాచరించు నామహాధీరుఁడుండు నాశ్రమమేదియో చెప్పుము. అందు
లకుఁ బోవుమార్గ మెద్ది? అది యిచటి కెంతదూరము? ఇదంతయు నాకు సవిస్తర
ముగాచెప్పుము' అనెను. భరతుఁ డట్లడుగఁగా మహాతేజుఁడును మహాతపస్వియు
నగుభరద్వాజుఁడు అన్ననుజూడ నువ్విళులూరుచున్న యాభరతునిఁజూచి 'భరతా!
రెండున్నఆయామడ గడచిపోఁగా మునులుతప్ప తక్కిన మనుష్యులెవ్వరును గాన
రాని యడవియందు సుందరములైన సానువులును వనములును గలచిత్రకూట
మనునొకపర్వత మున్నది. దాని కుత్తరపార్శ్వమున మందాకిని యనునది
యొకటియున్నది. దానితీరములందు వృక్షములు పుష్పించి దట్టముగా గ్రమ్ముగొని
యుండును, రమణీయముగా పుష్పించియున్న యడవులును నుండును. నాయనా!
ఆ నదికిఁ బ్రక్కగానే చిత్రకూటపర్వతమున్నది. అందొక పర్ణశాలగలదు. దాని
యందు వారు కాఁపున్నారు. ఇది నిశ్చయము, సేనానాయకా! మహాభాగా!
ఇక్కడికి దక్షిణముగాఁ బోవుమార్గమునఁ గొంతదూరము రథగజతురగసంకుల
మైన సైన్యమును దీసికొనిపోయి యవతల నిరృతి దిక్కుగాఁజీలిపోవుమార్గమునం
బొమ్ము. అడవియందు మార్గము సన్నగానుండునుగాన దానికి కుడిప్రక్కఁగాని
యెడమప్రక్కఁగాని గలవిస్తారప్రదేశములందు సైన్యమును నడపించికొనిపొమ్ము.
అంత రామునిఁజూడఁగలవు' అనెను. ప్రయాణమని విని రాజరాజగు దశరథుని
భార్యలు కౌసల్య మొదలైనవారు, వాహనములు విడువఁదగనివారయ్యును,
వాహనములుడిగ్గి వందనములు సేయుటకై భరద్వాజమహర్షిని పరివేష్టించినవా
రైరి. అందు వార్థకమునను ఋషిదర్శనమునను వడఁకుచు పుత్రదుఃఖమునఁగృశించి
దీనయైయున్న కౌసల్యాదేవి సుమిత్రాదేవితోఁగూడ అమ్మునిపాదములను తమ
హస్తములంబట్టుకొని నమస్కారముసేసెను. అంత, నిష్ఫలమైనకోరికను గోరి,
దానిచే సమస్తలోకమునకును నిందితయైన కైకయు రాముని నడవిపాలుసేసినందు
లకు సిగ్గుగదుర నమ్మునిపాదములకు నమస్కరించెను. అప్పుడాకైక మనసు విన్నయై
కౌసల్యాదులవలె నమ్మహామునియెదుట నిలువ మొగములేక యాభగవంతుని ప్రద
క్షిణముసేయునెపమున అచటినుండిదాటి భరతునికిదాపునఁ బోయియుండినదయ్యె.
అంత దృఢవ్రతుండగు భరద్వాజుఁడు భరతునిఁజూచి 'రఘుకులతిలకా! *నీతల్లులలో

* సర్వజ్ఞుఁడగు మునికి కౌసల్యాదులను తెలియకపోవదు. అయినను భరతుని మూలముగా
కైక యోగ్యతను వెలిపుచ్చుటకై యడిగినాఁడని తెలియునది.

వారివారి పేళ్లు మొదలైనవి తెలియఁగోరెద, చెప్పుము' అనియడిగెను. భరతుఁడుమాటలాడుటయందు నిపుణుఁడు కావునబుద్ధిమంతుఁడైనభరద్వాజుఁడు చెప్పినమాటవిని చేమోడ్పు గీలించి, 'మహాత్మా! ఇదిగో దీనయై శోకమునను భోజనములేనందునను కృశించి ధర్మదేవతయుంబోలె నీకుఁ గనుపట్టుచున్నదే! ఈయమ నాతండ్రికి పట్టపుదేవి, ఈమె పేరు కౌసల్య. అదితి విష్ణుదేవునిఁ గన్నట్లు ఈమెయే పురుషసింహుఁడును సింహమువలె ధీరముగా నడచువాఁడునగు నారాముని గన్నది. మనస్సుకందికుందఁగా అడవియందు పువ్వులు రాలినకొండగోఁగు కొమ్మవలెఁ గనబడుచు వడఁకుచున్న యీకౌసల్య యెడమబుజమును తాను ఊఁతయైపట్టుకొని నిలుచున్నదే ఆయమ సుమిత్ర. వీరులును సత్యపరాక్రములునై యశ్వి దేవతలంబోలె వెలుఁగుకుమారులగు లక్ష్మణ శత్రుఘ్ను లిరువురును ఈదేవికుమారులు. ఎవ్వతికిఁగాను పురుషతిలకులగు రామలక్ష్మణులు రాక్షసులు క్రిక్కిఱిసిన దండకారణ్యమునకుం బంపఁబడి జీవనాశము నొందినంతటి వారలై యీవనముపా లయిరో, ఎవ్వతికొఱకు రాజగు దశరథుఁడు కొడుకులను దిగనాడి స్వర్గమును బొందెనో, అట్టికోపిష్ఠురాలును చక్కనిబుద్ధిలేనిదియు సౌందర్యముగలదానని తనకుఁదానే యెన్నుకొనుచుండునదియు, ధర్మమును మాని కేవల మైశ్వర్యమునే కోరునదియు, దుష్టురాలును, యోగ్యురాలివలె పైకి కనఁబడునదియు, క్రూరురాలును, పాపమునే గట్టిగా నూఁదినదియు నగుమాతల్లి కైకేయి యీయమయే. ఈమెవలననే నే నిట్టిమహావ్యసనమును గాంచుచున్నాను' అనెను. ఆపురుషవరుఁడు కన్నీటిచే మాటతొట్రుపడ నిట్లుసెప్పి కన్నులెఱ్ఱఁబాఱ కోపమునొంది బుసలుకొట్టుచున్న సర్పమువలె నిట్టూర్పులు విడుచుచుండెను. భావి విషయములం దెలిసికొను మహాబుద్ధిశాలియగు భరద్వాజమహర్షియు నట్లు చెప్పుచున్న భరతునిఁజూచి ప్రయోజనము గలుగునట్లుగా 'భరతా! నీవు* కైకేయియందు దోషమున్నవని తలఁపరాదు. రాము నడవికిఁ బంపుటవలన ఇకముందు మిక్కిలి సుఖము కలుగనున్నది. ఇపుడు రాము నడవికిపంపుటవలన దేవతలకును దానవులకును ఆత్మవిదులయిన ఋషులకును హితమే కలుగనున్నది' యనెను. భరతుఁడు మహర్షికి నమస్కరించి యాశీర్వాదము గయికొని యతనికిఁ బ్రదక్షిణము గావించి సైన్యమును బిలిచి ప్రయాణమునకు సన్నాహముకావించు నట్లాజ్ఞాపించెను. అంత నాసైన్యజనులు పలువిధములైన వారగుటచే తమతమకుఁ దగినట్లుగా బంగారమున నలంకృతములై సిద్ధముగానున్న దివ్యములయిన గుఱ్ఱములను రథములను నెక్కిరి. అంత నాఁడుగజములును, మగయేనుగులును, బంగారపునడిమిత్రాళ్లును, పతాకలును గలవై వర్షాకాలమున గర్జనలతోఁడిగూడిన మేఘములవలె గంటల ఘోషములతో బయలుదేఱినవి. పెద్దవియుఁ జిన్నవియును నానావిధములునై మిక్కిలి విలువగల

---

* దేవప్రేరణమునకై'' యట్లుచెసియుండుటయు, రావణాదివధములచే లోకమునకు సుఖము గలుగనుండుటయు, సర్వజ్ఞుఁడుగావున ముని తెలిసికొని యిట్లు చెప్పినాఁడని తెలియునది.

మేలివాహనములు మనుష్యులం దాల్చి బయలుదేఱినవి. కాలుబంట్లు కాలినడనే కూడఁబోయిరి. అంత నపుడు కౌసల్యమొదలైనస్త్రీలు రాముని జూచుకోరికతో నుబ్బి తిలకించుచు నుత్తమములైన వాహనములెక్కి పోయిరి. శ్రీమంతుఁడగుభరతుఁడు పొడసూపుచున్న చంద్రసూర్యులవలెఁ గాంతి దళుకొత్తుచును, శుభమయినట్టి పల్లకిని వసిష్ఠాదులు నియోగింపఁ దేరఁగా, నెక్కి సపరివారముగా పోయెను. రథగజతురగ సంకలితమై దక్షిణవాహిని యగుగంగానది దక్షిణపుగట్టున విడిసియుండిన మహాసైన్యము కొండల యందును నదులప్రక్కలను మృగపక్షివిలసితము లైయున్న వనముల నతిక్రమించి పైకి నుప్పతిల్లిన మేఘమువలె దక్షిణదిశ నావరించి పయనమైపోయినది అపుడు గజములును అశ్వములును యోధులును మిక్కిలి సంతోషమున నుల్లసిల్లుచున్న యాభరతసైన్యము ఆ మహారణ్యమును ప్రవేశించుచు నందుఁ గలమృగపక్షి సమూహములను బెదరించుచు నెంతయు నందు రాజిలుచుండెను. ఇది తొంబదిరెండవ సర్గము.



భరతుఁడు చిత్రకూటప్రాంతమందలి వనమును బ్రవేశించుట. వనవర్ణనము. రాముని యాశ్రమమును వెదకుట. రామాశ్రమము నందలి పొగజాడనుబట్టి తెలిసికొని సైన్యము నావనమునందే నిలుపుట.

ఆమహాసైన్యము పోవుచుండఁగా నడవియందుండు గజాదియూథ నాథములు దానిని జూచి కలఁగి గాసినొంది తమతమ కదుపులతోఁ గూడి పరుగిడినవి. అడవుల వరుసలందును, కొండ లందును, నదుల యందును, నలుప్రక్కల ఎలుఁగుబంట్లును, చుక్కలుగల జింకలును, నల్లచాఱలును నులిగొమ్ములును గల దుప్పులును జూపట్టుచుండెను. ధర్మాత్ముఁ డగునాదశరథకుమారుఁడు ప్రీతుండై, తనగొప్పసైన్యము రథఘోషహేషితాదులచే ధ్వనిఁగొలుపుచు బలసిరాఁగా పయనమైపోయెను. మహాత్ముం డగుభరతుని సైన్యము సముద్రమువలె నతి విస్తారమై, వర్షాకాలమున మేఘము ఆకాశమును గ్రమ్ముకొనునట్లు భూమి నావరించి నడచినది. ఆసమయమున భూమి మిక్కిలి వడిగల గుఱ్ఱముల పిండుచేతను ఏనుంగులచేతను వ్యాప్తమై, పెద్దయుంబ్రొద్దువఱకును గానరాకయే యుండెను. శ్రీమంతుఁడైన యాభరతుఁడు బహుదూరమట్లు పోయి, వాహనములు మిక్కిలి యలసియుండుటఁ జూచి మంత్రకార్యములందు మిక్కిలికుశలుం డగువసిష్ఠునింజూచి 'ఎట్టిరూపముగా నుండునని మొదటనూహించితిమో, నేనెట్లు వినియున్నానో, యట్లే యిదె కనుపట్టుచున్నది. భరద్వాజుఁడు చెప్పినట్టి ప్రదేశమునకు స్పష్టముగా మనము వచ్చితిమి. ఇదిగో! ఈ పర్వతమే చిత్రకూటము. ఈనదియె మందాకిని. అల్లదిగో! దవ్వున నల్లని మేఘమువలె వనము గారుకొనుచు వెలయుచున్నది. ఇటు చూడుము. కొండలవలె గండు మీఱుచున్న నాయేనుఁగులు, ఇపుడు రమణీయములైన చిత్రకూటగిరి నెత్తములను

గ్రొచ్చి కోరాడుచున్నవి. వర్షాకాలమున నీళ్లు గ్రమ్ముకొని నల్లనై యుండు మేఘములు నీళ్లు దొరఁగుసట్లు ఈబాగడచెట్లు కొండనెత్తములందు పువ్వులను రాల్చుచున్నవి చూడుము' అని చెప్పి యంత తమ్మునిం జూచి 'శత్రుఘ్నా! సముద్రము మొసళ్లచే నిండియున్నట్లు, మృగములచే నిండినదై, కిన్నరులు మెలఁగునట్టి పట్లు గలిగి వెలుఁగుచున్న యీ పర్వతమును జూడుము. శరత్కాలమునందు, వర్షము గురిసి తేలికగానుండు మబ్బులబంతులు వాయుప్రేరితములై యాకసమున మిగుల వేగముగాఁ బఱచునట్లు, ఈజింకలకదుపులు మనసైనికులు తఱుమఁగా నతివేగముగాఁ బరుగిడుట బెడఁగు చూపుచున్నది చూడుము. దాక్షిణాత్యులు మేఘమువలె నల్లఁగాఁ దళుకొత్తు వెండ్రుకలను పలకలుగా నొకవిధమైన సిగవేసి యందు పువ్వులు దుఱుముకొనునట్లు, ఈ వృక్షములును మబ్బులవలె గారుకొను చున్న తమశిరస్సులందు తావులు బుగులుకొనుచున్న పువ్వులను తలపువ్వులుగాఁ దాల్చియున్నవి. ఘోరముగాఁ గనుపట్టు నీయరణ్యమును ముందు మనుష్యుల యలుకుడే లేనిదిగా నుండి యిపుడు మనసైనికజనములచే నెరసి బెరసి జనసంకులమైన యయోధ్యవలె తిన్నని పట్టణముగా నాకుఁ గాన్పించుచున్నది. గుఱ్ఱములు మొదలైన వాని గొరిజలచే రేఁగినధూళి అడవినంతయు (లేక ఆకాశమునంతయు) ఆవరించియున్నది. అట్లుండినచో నాకు రామాశ్రమమును గనిపెట్ట నలవికాదు గావున వాయువు నాకు ప్రియము సేయునట్లుంబోలె, శీఘ్రముగా నాధూళిని బాఱఁదోలుచున్నది. శత్రుఘ్నా! సారథిశ్రేష్ఠులు, రామదర్శన కుతూహలమున నడవియందు గుఱ్ఱముల బూన్చినరథములనెక్కి వానిని నిదిగో శీఘ్రముగాను జక్కఁగాను దోలుచున్నారు చూడుము. మంచి పింఛెలు గలిగి చూడ్కులకు వేడ్కలు సేయుచున్న యీ నెమిళ్లు రథాదులధ్వనికి నులికి శీఘ్రముగా నివిగో తమతమనెలవులను జేరుచున్నవి చూడుము. ఈ ప్రదేశము మిక్కిలియు మనోహరముగా నున్నది గనుక నాకు నిది స్వర్గమార్గమో యనునట్లు తోఁచుచున్నది. కాఁబట్టి యిది ఋషుల వాసస్థలమనుట స్పష్టము. అడవియందు తెల్లచుక్కలుగల జింక లనేకములు ఆఁడుజింకలను గూడి, మేనియందు పూవులతో చిత్రింపఁబడినట్లు, మనోహరములైన రూపములతోఁ జూపట్టుచున్నవి. పురుషశ్రేష్ఠు లగురామలక్ష్మణులు అగపడుటకుఁగాను సైనికులు పోయి యరణ్యము నందంతయుఁ జక్కఁగా వెదకుదురు గాక' అనెను. భరతుఁడు చెప్పిన మాటను విని శూరు లగుపురుషులు కొందఱు, ఆయుధపాణులై యాయడవిని బ్రవేశించి యంతఁ గొంత వడికి ధూమమును బొడగాంచిరి. వారట్లు ధూమంపుమొనను పొడగాంచి మరలి భరతునికడకు వచ్చి 'మనుష్యులు లేనిచోట అగ్ని యుండదు, కావున నిచ్చటనే రామలక్ష్మణులున్నారనుట స్పష్టము. ఒకవేళ పరంతపులును పురుషతిలకులునగు నారాజకుమారులు ఇచ్చట లేకున్నను, మఱి యిచ్చట రామునికి సాటియైనవేటి

తాపసులై నను ఉండవలయును. ఇందులకు సందేహములేదని తలఁచుచున్నాము' అనిరి. పగవారిబలములను పీఁచమడఁచునట్టి భరతుఁడు, వారలు న్యాయవిదులకు సమ్మతముగాఁ జెప్పినమాటనువిని, సైనికుల నందఱినిజూచి, 'మీరిచ్చట సద్దు సేయక యుండుఁడు. ఇంతకుమీఁద మీరు గడచి రావలదు. రాజులలో నేనొక్కఁడును, మంత్రులలో సుమంత్రుఁడును, ఋత్విజులలో గురుం డగువసిష్ఠుఁడును ఈ ముగ్గురుమాత్రమే పోయెదము' అని యాజ్ఞాపించెను. ఇట్లాజ్ఞాపింపఁగా ఆసైనికులందఱును అచటనే నలుగడల నెలకొనియుండిరి. భరతుఁడు, ఆధూమశిఖ కను పట్టినచోట చూడ్కినిలిపిచూచెను. అప్పుడు భరతుఁడు నిలువరించిపోయిన సైనికులును, ఇంక శీఘ్రముగానే ప్రియుఁడైన రాముని జూడఁ గలుగునని యెఱిగి పరమ సంతుష్టులై విడువక యాధూమశిఖనే చూచుచుండిరి. ఇదితొంబదిమూఁడవసర్గము.



రాముఁడు చిత్రకూటమును బ్రవేశించిన దాదిగా నిప్పటివఱకు జరిగిన ప్రతిదినవృత్తాంతము. రాముఁడు చిత్రకూట మయోధ్య కంటె రమణీయముగా నున్నదని రూపించుట.

అంత నచట దేవసమానుఁడైన రాముఁడు పర్వతములందును వనములందును ప్రీతిగలవాఁడు గావున ఆచిత్రకూటపర్వతమున నొక మాసమువఱకు వాసముసేసి భరతుండు వచ్చునాఁడు సీతకు సంతోషముసేయఁగోరి తనమనస్సునకుఁ గొంత వినోదము గావింపనుంబూని దేవేంద్రుఁడు శచీదేవికిఁజెప్పునట్లు తన యిల్లాలికి చిత్రంబగు నాచిత్రకూటమునందలి విశేషములఁ జూపి, కల్యాణీ! రమణీయమైన యీ చిత్రకూటపర్వతమును జూచుచుండుటవలన రాజ్యము భ్రంశమగుటగాని స్నేహితులనుబాసి వచ్చుటనుగాని నామనస్సున కెంతమాత్రమును దుఃఖము గొలుప కున్నది. కల్యాణీ! ఈపర్వతము పలువిధములైన పక్షులతోఁ గూడి, ధాతుమంతములై యాకాశమునొరయుచున్నట్లు, మిక్కిలి పొడవులైన శిఖరములచే రంగారుచున్నది. పర్వతరాజ మైన యీచిత్రకూటము పలువిధము లైన ధాతువులతోఁ గూడిన దగుటంజేసి యిందుఁ గొన్నిప్రదేశములు రజతమువంటివిగాను, కొన్ని రక్తమువలె నెఱ్ఱగాను, కొన్ని పీతములుగాను, గొన్ని చిత్రవర్ణములుగాను, గొన్ని యింద్రనీలమణి వర్ణములుగాను, గొన్ని పుష్యరాగమణివర్ణములుగాను, గొన్ని పటికంపు రంగుగలవిగాను, గొన్ని మొగలిపూవన్నె గలవిగాను, గొన్ని చుక్కలకాంతిగలవిగాను, గొన్ని పాదరసమువన్నె దొలఁకుచును, ఎంతయు నొప్పుచున్నవి.' యీ చిత్రకూటపర్వతము, మునుల సన్నిధానమువలన అతిశాంతములై యుండునట్టి పలువగల జింకలును, పెద్ద పులులును, ఎలుఁగుగొడ్డులును, పెక్కుపక్షులునుం గలిగి యెంతయు వెలుఁగుచున్నది. మఱియు మామిడిచెట్లును, నేరేడుచెట్లును, వేఁగిస చెట్లును, లొద్దుగుచెట్లును, మోరటిచెట్లును, పనసచెట్లును,

చంద్ర చెట్లును, ఊడుగు చెట్లును, మంచితినాసపుచెట్లును, బిల్వవృక్షములును, తుమ్మికిచెట్లును, వెదుళ్లును, గుమ్ముడుచెట్లును, వేపమ్రాకులును, ఉలిమిరిచెట్లును, ఇప్పచెట్లును, బొట్టుగుచెట్లును, రేఁగుచెట్లును, ఉసిరికచెట్లును, కడిమిచెట్లును, ప్రేప తీఁగలును, ఏఱుమద్దిచెట్లును, దానిమ్మచెట్లును, ఇవి మొదలుగా ననేకవృక్షములును జక్కఁగాఁ పూఁచియు పండ్లుపండియు, మిక్కిలినీడలిచ్చుచు మనస్సునకు సొంపుగూర్చుచు నలుగడల నెరసి బెరసియుండుటచే, ఈకొండ మిక్కిలియు సిరి పెంపు నింపుచున్నది. కల్యాణీ! రమణీయములైన కొండనెత్తములందు. చూచినంతనే పులకలుపుట్టించు కిన్నరులు దంపతులుగా పరస్పర బద్ధానురాగులై కూడి యిదె క్రీడించుచున్నారు చూడుము. విద్యాధరులు వృక్షశాఖలందు ఖడ్గములను మిక్కిలి మేలయిన వస్త్రములను దగిల్చి యున్నారు చూడుము. మఱియు వారును వారి స్త్రీలును క్రీడించు ప్రదేశము లెంత రమణీయములుగా నున్నవో చూడుము. ఒకచోట పొడవున నుండి పడు సెలయేళ్లును, ఒకచోట భూమిని పెకలించుకొని యుబికెడి యూటలును స్రవించుచుండగాఁ నీకొండ మదమును స్రవించుచున్న యేనుఁగువలె ప్రకాశించుచున్నది. ఇందలి గుహనుండి వీచుచున్నట్టి యీ వాయువు పలువగల పూవుల తావులు కొల్లగొనుచు ఘ్రాణేంద్రియమునకు మిక్కిలియింపుగా నున్నదే! ఇందులకెవ్వఁడు సంతోషింపఁడు? సర్వాంగసుందరీ! ఇచట నిన్నును లక్ష్మణునిని గూడి యనేకసంవత్సరము *లున్ననుగాని నాకు అయోధ్యను విడిచివచ్చిన శోకమెంతమాత్రమును గుందింపదు. భామినీ! పెక్కువగల పువ్వులును పండ్లునుగలిగి పలువిధములైనపక్షిగణములతోఁగూడ విచిత్రములైన శిఖరములతో నొప్పి యొప్పులు గులుకుచు పంచేంద్రియములకును, నింపుగూర్చుచున్న యీపర్వతమునందు నాకు మిక్కిలియు నింపుగలిగియున్నది. ఈవనవాసము సలుపుటవలన, ధర్మమునఁ దండ్రి ఋణము తీర్చుకొనుటయు, భరతునికి ప్రియము గూర్చుటయు, నను ఫలములు రెండు నాకు ప్రాప్తించినవి. వైదేహీ! ఇచట మలయానిలము కోవెల పలుకులు పండ్లు పువ్వులు మొదలుగా వివిధములైన శృంగారరసోద్దీపకములగు విభావములును, మఱికిన్నరులు మృగములు మొదలైనవాని చేష్టలును, మనోవాక్కాయములను మూటిని వశముసేసికొనునంత మనోహరములుగా నున్నవి. ఈసొంపులనెల్లఁ జూచుచు త్రికరణశుద్ధిగా నాతోఁగూడ నీ చిత్రకూటపర్వతమున క్రీడింతువేకదా? రాణీ! నాముత్తాతలు మొదలయిన మునుపటిరాజర్షులు, దేహమును విడిచినపిమ్మట సంసారనాశనమునకై యమృతమువలె భోగ్యమైన యీవనవాసమునే మోక్షసాధనముగాఁ జెప్పిరి. నలుపును పసుపును తెలుపును ఎఱుపును మొదలైన పలువిధముల వర్ణములతోఁగూడినవై విశాలములుగా నున్నయీ

---

* ఇందులకు 'యది వత్స్యామి' అని మూలము. ఈ 'యది' శబ్దముచే 'అట్లు నిలుకడగా ఉండుటకు వీలుపడక యింక నీత సెడఁబాయుట గలుగు' ననుభావము సూచితమగుచున్నది.

కొండశిలలు మిక్కిలి తఱుచై నలుప్రక్కలను గ్రిక్కిఱిసి, వందలకొలఁదిని ప్రకాశించుచున్నవి. ఈపర్వతరాజమునందుఁ గలమహౌషధులు, వేనవేలుగా రాత్రికాలములందు, తమకాంతులవలనఁ గనఁబడుచు, కాంతిపెంపున వెలుఁగుచు, అగ్నిజ్వాలలవలె ప్రకాశించుచున్నవి. భామినీ! ఈపర్వతమున కొన్నిప్రదేశములు మిక్కిలి గుహలుకలిగియుండుటచే గృహములవలెను, కొన్ని చెట్లు చేమలు మిక్కిలి గలిగియుండుటచే ఉద్యానములవలెను, కొన్ని చా పయినయొకటే శిలగాను, ప్రకాశించుచున్నవి. చిత్రకూటపర్వతము భూమిని పెకలించుకొని పైకిలేచినదో యనునట్లు వెలయుచున్నది. ఈచిత్రకూటమునం దీశిఖరము, అంతటను రమణీయముగా కనఁబడుచున్నది. నల్ల గలువలును, పున్నాగపుష్పములును, పుత్రజీవిపువ్వులును, భూర్జపత్రములును, పయిని పఱవంబడియును తామరసదళములతోఁ గూడియున్న కాముకులపఱపులను జూడుము. వనితా! కాముకులు మూర్కొనుట వలన నలిగి పాఱవైవంబడిన తామరపూదండలును, మఱియు వారనుభవించి పాఱవైచిన పలువగలపండ్లును, గనఁబడుచున్నవి చూడుము. ఈచిత్రకూటము, పెక్కు మూలములును ఫలములును జలములును గలదై, అలకాపురమును, సౌగంధిక సరస్సును, ఉత్తరకురుదేశములనుగూడ నతిశయించుచున్నట్లున్నది. వనితా! నేను ఉత్తమములైన నియమములతో సత్పురుషులమార్గము నవలంబించి యిచట నిన్నును లక్ష్మణునింగూడి యీపదునాలుగేండ్ల కాలమును విహరించి గడపి పిదప కులధర్మమగు ప్రజాపాలనమును పెంపు నొందించు రాజసుఖమును బొందెదను' అనెను. ఇది తొంబదినాలుగవసర్గము.



## రాముఁడు మందాకిని యనునది రామణీయకమునుజూచుచు సీత నుపలాలించుట.

రాముం డట్లు సీతాదేవికి చిత్రకూటపర్వతమునందలి చిత్రములను జూపి దానిని విడిచి యంత నచ్ఛంపుజలములు గలిగి సొగసుగులుకుచున్న మందాకినీనదిని జూపెను. బలితంపుపిఱుఁదులుగలిగి, వనమును పర్వతమును జూచు కుతుకమువలన మొగము వికసిల్లి, యందఁపు బగుచందమామువలె వెలయుచున్నవిదేహరాజసుతను సీతను జూచి రాముండు తామరలవంటి కన్నులు విస్మయమున వికసిల్లఁగా *'వింత వింత లగునిసుకదిబ్బలు గలిగి, హంసలును బెగ్గురులును సంచరింపఁగా, తామర పువ్వులచే సిరి నివ్వటిలుచున్న యీ మందాకినీనదిని జూడుము. ఇది తనతీరములందు పలువిధములైనపుష్పవృక్షములును ఫలవృక్షములును మొలచి గమిచికొని యుండఁ

* దీనివలన 'నీ బలుపిఱుఁదులవంటి యిసుకదిబ్బలును, నీయందెల రవళివంటి హంససారస కూజితములును, నీకరచరణవదనములవంటి కమలములును గలిగి యీనది నీవలెనే యొప్పుచుండు చున్నది' అను నలంకారధ్వని.

గా, అంతటను కుబేరుని సౌగంధికసరస్సువలెఁ బ్రకాశించుచున్నది. మృగసమూహములువచ్చి త్రాగుటచే నీళ్లు కలఁగి రమణీయములై యున్న దీని రేవులనుజూడఁగా నాకు నిందు జలకమాడవలయునని ప్రీతి గలుగుచున్నది. ప్రియురాలా! జటలును కృష్ణాజినమునుదాల్చి నారచీరల నుత్తరీయములుగాఁ గట్టుకొనియుండు ఋషులు, తమ నియమములకుఁ దగినకాలమున, ఈ మందాకినీ నదియందు జలక మాడు చున్నారు చూడుము. విశాలాక్షి! ఇదిగో వాఁడి నియమములుగల మఱికొందఱు మునులు, నియమంబునఁ జేతులు పైకిఁజాఁచి, సూర్యునిగూర్చి యుపస్థానము సేయుచున్నారు. పర్వతమందలి వృక్షములు, గాలికి కొమ్మలు అల్లలాడఁగా, పువ్వులను ఆకులను నదిచుట్టును దొరిఁగించుచుండుటను చూడఁగా, ఈ కొండ, నృత్యముసేయఁ బూనినవాఁడు పువ్వులనుచల్లి చేతులను త్రిప్పునట్లు తానును జేయుచున్నదో యని తోఁచుచున్నది. * ఈ మందాకినీ నదియందు, ఒకానొకచోట ముత్తియములవలె జలములు తేటగా తళతళలాడుచున్నది, మఱియొకచోట నిసుకదిన్నెలు వన్నెగులుకుచున్నవి, ఇంకొకచోట స్నానముచేయుటకై సిద్ధజనులు నెఱసిమెఱయుచున్నారు చూడుము. మఱియు గాలికి రాలినపువ్వుజొంపములు కొన్నితీరములంబడి నెఱసియున్నవి చూడుము. † నీళ్లనడుమంబడి మిక్కిలియు తెప్పలఁదేలుచున్న మఱికొన్ని పూవుంజొంపములను జూడుము కల్యాణీ! ‡ చక్రవాకము లనఁబడుపిట్టలు ఒకటినొకటి రతికొఱకు మిక్కిలి ముద్దుపలుకులం బిలుచుచు, రతిసేయునప్పటి యెలుంగులను మిక్కిలియు నింపుగాఁ గూయుచు, మరుకేళికై యాపూలరాసుల నారోహించుచున్నవి. శోభనా! ఈచిత్రకూటము మిక్కిలి యేకాంతమైన భోగస్థానముగా నుండుటవలన దీనిని జూచుచు నిందు వసించియుండుట అయోధ్యాపురవాసముకంటె అధికసుఖకరమగునని నాకుఁ దోఁచుచున్నది. ఈమందాకినీనది యట్లు మన్మథోద్దీపకముగా నుండుటవలన, దీనింజూచుట, నిన్నుఁజూచుటకంటె,నధికసుఖముగానున్నదని నేనుతలఁచుచున్నాను. తపస్సును దమమును శమమును గలిగి, దానివలన పాపములనెల్లఁ దూలఁబుచ్చిన

---

* ఇందు ముత్తెములవంటి జలమనుటచే తెల్లని వస్త్రముగలదై, ఇసుకదిన్నెలను చెప్పుటచే బలితంపు పిఱుఁదులు గలిగి, సిద్ధులు నెఱసియున్నారనుటచే కాముకు లావరించుకొనియున్నదైన, యొక స్త్రీ సూచిత యగుచున్నది.

† ఇందు జలములందలి పువ్వులు గాలిచేఁ జిమ్మఁబడి గట్టునకుఁ జేరుటను జెప్పుటచే ప్రియుఁడైనవాఁడు లాఁగికొన్న వస్త్రముగలదై, మఱికొన్ని పువ్వులందు తేలుచుండుటను జెప్పుటచే సగముమాత్రము వీడినవస్త్రముగలది యగు, స్త్రీ వ్యంజితయగుచున్నది. ఇచట గాలి ప్రియుఁడుగాను, పువ్వులు గట్టునకుఁ జిమ్మబడుట వస్త్రమును లాఁగికొనుటగాను, మఱికొన్ని పువ్వులు నడుమఁదేలుట సగము జాఱిన వలువగాను రూపించుకొనునది.

‡ ఇందు చక్రవాకరతి; తెలుపంబడినది.

సిద్ధులు నిత్యమును స్నానముచేయుటచే దీనిజలములు కలఁగుండువడి తత్పాదరజము వలన ధన్యమైయుండును. అట్టి యీపుణ్యజలములందు నాతోఁగూడి జలక్రీడ ననుభవింపుము. సీతా! నీచన్నులును పిఱుఁదులును పలుమాఱుమోదఁగాఁ బుట్టిన యలలతాఁకున నీ వెఱ్ఱతామరలను తెల్లదామరలను జలమున మునుఁగఁజేయుచు, చెలికత్తియతోడంబోలె నాతోఁగూడ మందాకినీనదిలో జలక్రీడఁ గావింపుము. వనితా! నీవింక వనచరజంతువులనే పురజనులను గాను, ఈపర్వతమునే అయోధ్య గాను, ఈనదినే సరయువుగాను ప్రీతితో, నిత్యమును భావించుకొనుము. కావున పురజనాదులను చూడమైతిమే యనుక్లేశ మింకఁ దగదు. వైదేహీ! లక్ష్మణుఁడును ధర్మాత్ముఁడై నాపంపును తప్పక చేయుచును, నీవును నాకనుకూలవై నడచుకొనుచును, మీయిరువురు నాకెంతయు సంతోషముగూర్చుచున్నారు. ఇట్టితోఁబుట్టువును ఇల్లాలినిబడసి యుండుటకన్నను సుఖావహమేమి? ఇట్లు మూఁడుసందెలయందును స్నానముసేయుచు తేనియనుమూలములను ఫలములను ఆహారముగాఁగొనుచు నీతోఁగూడియున్నవాఁడనై అయోధ్యనుగాని రాజ్యమునుగాని యొల్లను. ఈమందాకినీనది రమణీయమై మృగసమూహములచే సొంపుగులుకుచుండును. మఱియు నాశ్రమము మహిమవలన నిందు గజములును సింహములును వానరములును పరస్పరవైరములు మాని జలములు ద్రావుచుండునుగాన, యిది పవిత్రమునైనది. మఱియు నిందు చెట్లు చక్కఁగాఁబూచి సొంపుగూర్చుచుండుటచే నిది యుద్దీపనమునైనది. ఇట్టి మందాకినీనదియందు జలకమాడియు, బడలిక వీడి సుఖము నొందనివాఁడెవ్వఁడును గలుగఁడు' అనెను. రఘువంశవర్ధనుఁడగు రాముఁడు ప్రియురాలింగూడి, యిట్లు నదినిగూర్చి ప్రసంగవశమున పెక్కుమాటలుచెప్పుచు, కంటికాటుకవలెఁ గాంతి దళుకొత్తుచు సొగసుగులుకుచున్న చిత్రకూటపర్వతమునందు విహరించెను. ఇది తొంబదియేనవసర్గము.



రాముఁడును సీతయు మాంసాహారము గొను చున్నపుడు అడవి మృగములు కలఁతనొందుటఁ జూచి దానికారణము తెలియుటకు లక్ష్మణునిఁ బంపఁగా నతఁడు వృక్షము నెక్కి భరతుఁడు ససైన్యముగా వచ్చుటఁ జూచి శంకించుట.

ధర్మాత్ముఁ డారాముఁ డట్లు సీతకు పర్వతనది యగుమందాకినిసొంపులను జూపి యంతఁ గొండనెత్తమునందుఁ గూర్చుండి యాబిడకు మాంసములఁ గొని 'ఇది పరిశుద్ధమైనది, ఇది రసముగలిగినది, ఇది చక్కఁగా పక్వమైనది' యని యామెను వశీకరించుమాటలను జెప్పుచు నాబిడతోఁగూడియుండెను. అట్లు రాముఁడచటఁ గూర్చుండియుండఁగా యతనికై వచ్చుచున్న భరతుని సైన్యముల తొక్కుళ్లచేఁ గలిగిన ధూళియు ధ్వనియును మిన్నుముట్టి చెలంగినవి. ఈ సమ

యమునందే, ఆపెనుశబ్దమునకు బెదరి చెదరి కలఁగి నలఁగి, ఆయాకదుపుల గఱికాండ్రగు మృగములు తమతమ కదుపులతోఁగూడ దిక్కులకుం బాఱినవి. ఆ రాముఁడును సైన్యమువలనఁ బుట్టినయాధ్వని వినెను, దానికి నులికి నలుగడల పఱుగిడుచున్న యా యూధనాధములనుంజూచెను. రాముండు పరుగెత్తుచున్న యామృగములనుఁజూచియు, ఆ పెనుశబ్దము నాలించియు, తేజంబున వెలుఁగుచున్న సుమిత్రాపుత్రుని లక్ష్మణునింజూచి 'ఆ! ఇదేమి! లక్ష్మణా! ఈ వైపుచూడుము. నీవు సుమిత్రకడుపు చల్లఁగాఁ బుట్టినసుపుత్త్రుఁడవు భయంకరమైన మబ్బు నుఱుము వలె గంభీరమై దొమ్మిగా నొక మహాధ్వని వినఁబడుచున్నది. అరణ్యమునందు సింహములవలన మిక్కిలిబెదరి యేనుఁగులకదుపులో యెనుపోతులో మఱి యితర మృగములో నలుదిక్కులకుం బాఱుచున్నవి. రాజో రాజసమానుఁడో, యెవఁడేని యడవిని వేఁటాడుచున్నాఁడో? లేక మఱియేదైన యొక క్రూరజంతువు, వనములో తిరుగుచున్నదా? లక్ష్మణా! దీనిని దెలిసికొనవలయును. లక్ష్మణా! పక్షులకుఁగూడ నిపు డీపర్వతమున సంచరింప నలవి గాకున్నది. ఈ చెప్పిన యన్నిటిలో కారణమేదియో, ఉన్నది యున్నట్టు, శీఘ్రముగా నీవు తెలిసికొనవలయును' అనెను. ఆ లక్ష్మణుఁడు చక్కఁగా పూచియుండుటచే ఆకులు పలుచనై చూపున కడ్డు గావింపనియొకవృక్షమును త్వరితముగానెక్కి యన్నిదిక్కులును గలయఁజూచుచు వచ్చి, యంత తూర్పుదిక్కును జూచెను. అట్లు ఉత్తరపుదిక్కు చూడఁగా రథములును అశ్వములును గజములును గ్రిక్కిఱిసినదై సన్నద్ధులైయున్నపదాతులతోఁ గూడి వచ్చుచున్న యొకమహాసైన్య మగపడెను. అశ్వములును గజములును నిండి పడఁగలచే నలంకృతములైన రథములు గలిగిన యొక సేనవచ్చుచున్నదని రామునకుం దెల్పి యంత నతనిఁజూచి, 'ఇఁక నగ్నిహోత్రమును చల్లార్పుఁడు. సీత గుహలోనికిఁ బోనీ. విల్లెక్కుపెట్టుము. బాణములను కవచమును గయికొనుము' అనఁగా పురుషతిలకుఁడగురాముఁ డతనిఁజూచి 'ఓయీ లక్ష్మణా! చక్కఁగాఁజూడుము. ఈసేన యెవ్వనిదిగా నీకుఁ దోఁచుచున్నది.' అని యడిగెను. ఇట్లు రాముఁ డడుగఁగా లక్ష్మణుఁడు కోపమున నగ్నివలె మండిపడి యాసేనను గాల్చునట్లు చుఱచుఱం జూచుచు రామునితో 'కైకకొడుకు భరతుఁడు తల్లివరముచొప్పున అభిషిక్తుఁడై యంతటితో తృప్తినొందక రాజ్యమునెల్ల నిష్కంటకముగాఁ బడయఁగోరి, దానికి పాలికాఁపుల మగుటచే వానికి కంటకుల మైనమనలను జంప నెదురువచ్చుచున్నాఁడు. ఇది తెల్లము. ఇదిగో! మిక్కిలియు పెద్దదై కాంతిదళుకొత్తుచున్న వృక్షము ధ్వజమునఁ గనుపట్టుచున్నది. పొడవైనబోదియ గలకాంచనపుఁజెట్టు పడఁగ రథమున మిగుల ప్రకాశించుచున్నది (*మిక్కిలి గొప్పబోదియయు గొమ్మలును గలిగిన యీకాంచనపుచెట్టుపడఁగ మహాసైన్యమునందు రథమున వెలుగు

* ఇది వ్యాఖ్యానములందుఁ గానిపించుచున్నది.

చున్నది) ఈ గుఱ్ఱపురౌతులు వడిగలగుఱ్ఱములనెక్కి నిచ్చలు నిచ్చోటికి వచ్చుచున్నారు. ఈయేనుఁగుబంట్లు ఏనుఁగులనెక్కి కూర్చుండి మిక్కిలి యుబ్బుపెల్లున విలసిల్లుచున్నారు. వీరా! మనము విలు గయికొని దుర్గముగా పర్వతము నాశ్రయింతము, అటుగాదేని, సన్నద్ధులమై యాయుధములుదాల్చి యిచటనే నిలిచెదము. ఇఁక కోవిదారధ్వజుఁడు యుద్ధమున మనచేతులం జిక్కునా? రాఘవా! ఎవని నిమిత్తమై నీవును సీతయు నేనును, మహావ్యసనము పాలైతిమో, యట్టిభరతు నిపుడు రణమునం జూతునా? వీరోత్తమా! రాఘవా! ఎవ్వనినిమిత్తమై, నీవు శాశ్వతమైన రాజ్యమును దిగవిడువనయ్యెనో, అట్టి యాపగవాఁడు భరతుఁడువచ్చినాఁడు. వీఁడు నాకు వధ్యుఁడే. రాఘవా! భరతుని వధించుటయందు దోషమేదియు నాకుఁదోఁపలేదు. ముందుగా నపకారము గావించినవారిని వధించుట అధర్మమని శాస్త్రములు విధింపలేదుగదా! రాఘవా! భరతుఁడు మనకు ముందుగా నపకారము సేసినవాఁడు, ఏమఱుపాటునఁగాదు, ధర్మమును దిగవిడిచియే యట్లుచేసినాఁడు. వాఁడు హతుఁడుకాఁగా నీవు భూమినంతయు హాయిగాఁ బాలింపుము. రాజ్యమునకై పేరాసగలకైక, యేనుఁగుచే విఱువఁబడిన మహావృక్షమువలె, నిపుడు యుద్ధమున నాచేత హతుండైన కొడుకుంగని మిక్కిలియు దుఃఖమునఁ గంది కుందఁగలదు. కైకను, మంథర మొదలైన దాని యనుబంధములతోను మఱి దాని సమస్తబంధువులతోను గూడ వధించెదను. నేఁటికి భూమి కైకయనెడి మహాపాపమును విడిచిపుచ్చి పరిశుద్ధమగుఁగాక. రామా! నీవు మానము గాపాడువాఁడవు. ఇంతకాలము లోపల నడంచుకొనియుండిన కోపమును, పడ్డయవమానమును, ఇపుడు నాబాణములనెపమున ఎండినవామిపై నగ్గిని దగులుకొలుపునట్లు పగతుని సైన్యములపై విడిచెదను. ఇపుడు వాఁడిబాణములచే పగవారి శరీరములను తునుమాడి యీచిత్రకూటపునడవి నంతయు నెత్తుటఁ దోఁచుచున్నాను. నా బాణములచే ఱొమ్ములు అగలికూలిన యేనుఁగులను గుఱ్ఱములను నాచే హతులైన మనుష్యులను నిందలి వ్యాఘ్రాది క్రూరమృగములు ఈడ్చుకొనిపోవుఁగాక. నేనిదివఱకుఁ బెక్కుయుద్ధముల నాబాణములకును వింటికిని కావలసినంత శత్రుకళేబరములను ఆహారముగా నిచ్చి వానియప్పు దీర్చుకొనియే యున్నాను. ఇప్పుడును మహాయుద్ధముసేసి భరతునిని వానిసైన్యములను తునిమి తూటాడి బాణాదులఋణము దీర్చుకొనెదను. ఇందులకు సందియములేదు’ అనిచెప్పెను. ఇది తొంబదియాఱవసర్గము.



రాముఁడు కుపితుఁడైనలక్ష్మణుని నోదార్చుట.

అంత రాముఁడో యట్లు మిక్కిలియుఁ గుపితుఁడై యెంతయు సంరంభించుచున్న లక్ష్మణుని నోదార్చుచు నతనితో “భరతుఁడు గొప్ప విలుకాఁడు. మఱియు మిక్కిలి ప్రాజ్ఞుఁడు. అట్టివాఁడు గావున మఱియొకరి ప్రేరణములేక తానై మన యొద్దకు వచ్చినపుడు మనకు వింటితోఁగాని కత్తితోఁగాని పనియేమి? లక్ష్మణా! పితృ

వాక్యమును పాలించెదనని ప్రతిజ్ఞచేసి, నాయొద్దకు వచ్చినభరతునిఁ జంపుదునేని, అట్లు తండ్రి భరతునికి రాజ్య మియ్యఁగా రాముఁడతనిం జంపి రాజ్యము నపహరించెనని జనులచే నిందపాలగుదునే! అట్టిరాజ్యము నాకెందుకు? బంధువులకుఁగాని స్నేహితులకుఁగాని నాశముగలుగుటచే నేద్రవ్యమువచ్చునో యది విషభక్ష్యమువంటిది. దానిని నేనెంతమాత్రమును ప్రతిగ్రహింపను. లక్ష్మణా! ధర్మమును రత్నాదిరూపమైన యర్థమును కామమును భూమిని మీనిమిత్తమై నేను గోరుచున్నానుగాని వేఱు గాదు. నీవు నమ్మవేని యట్లని ప్రతిజ్ఞ జేసెద. లక్ష్మణా! అట్టి రాజ్యము బహుచ్ఛిద్రములు గలది గావున అది నాకిష్టముగాదు. రాజ్యమును సైతము, తమ్ములకై ధనము సేకరించుటకును వారికి కోరినవస్తువు లొసఁగి సుఖము గూర్చుటకును వారివృద్ధికొఱకును కోరుచున్నాను గాని నాకొఱకుఁగాదు. నేనుచెప్పినది సత్యమగునట్లుగా నాయాయుధమును ముట్టి శపథముచేసెదను. సౌమ్యా! సముద్రపర్యంత మైన యీభూమిని సంపాదించుట నాకు కష్టముగాదు. అయినను అధర్మముచేతఁ గలుగునేని యింద్రత్వమునైన నొల్లను. మానదా! భరతునకును నీకును శత్రుఘ్నునకును గానట్టి సుఖమేది నాకుఁ గలుగునో దానిని అగ్ని భస్మము గావించుగాక. అది యెట్టిదైనను నే నొల్లను. నాకు ప్రాణములకంటె ప్రియుఁడగు భరతుఁడు అన్నదమ్ములయందు మిక్కిలిమక్కువ గలవాఁడు గావున మామయింట నుండి పితృశుశ్రూష సేయుకులధర్మమును దలఁచి అయోధ్యకు వచ్చియుండును. వీరా! పురుషవరేణ్యా! అట్లు వచ్చి నేను తండ్రిపంపున జటావల్కలములు ధరించి నిన్నును సీతనుంగూడి యడవికి వచ్చుట విని నాయందలి నెయ్యము మనస్సున నుమ్మరించుటచే శోకమునొంది ఇంద్రియములు కలఁతఁజెంద మనలను జూడ వచ్చినాఁడు గాని వేఱు గా దని నాకు తోఁచుచున్నది. ఆశ్రీమంతుఁడు మిక్కిలి కుపితుఁడై తల్లి యగుకైకేయిని పరుషము లయినయప్రియము లాడి తండ్రిని ప్రార్థించి ప్రసన్నునిఁగావించి నాకు రాజ్యమొసఁగుటకై యిట వచ్చినాఁగు. ఈభరతుఁడిపుడు మనలఁ జూడవచ్చుటయు కాలోచితముగానే యున్నది. ఇతఁడు మనస్సుననైనను మనకపకార మేదియుఁ దలఁపఁడు. ఇంతకు మునుపు ఎప్పుడేని భరతుఁడు నీకపకారము సేసియున్నాఁడా? లేక యిట్టిభయమును పుట్టించు నట్టిమాటనుగాని చెప్పి యున్నాఁడా? ఏల భరతునియందిచట సందేహించుచున్నావు? నీవు భరతునిఁ జూచి యెంతమాత్రమును పరుషవచనము గాని అప్రియవాక్యముగాని చెప్పఁదగదు. వానిని అప్రియములాడినయెడల అది నన్నాడుటయే యగును జుమి లక్ష్మణా! *ఏదోయొక యాపద వచ్చినప్పుడు అందులకుగాను కొడుకులు తమకు ప్రాణభూతుఁ

* మునుపు లక్ష్మణుఁడు తండ్రియగు దశరథునినిగూడ చంపవలయునని చెప్పెను. ఇప్పుడు భరతుని చంపవలయు ననుచున్నాఁడు. ఇఁకను ఊరకుండినయెడల కార్యహాని కలుగునని భయపడి రాముఁ డతనిక్రౌద్రబుద్ధిని అడఁచుటకై యిట్లు చెప్పినాఁడని తెలియునది.

డైన తండ్రినిగాని, అన్నదమ్ముఁడు తనకు ప్రాణపదమైన తోఁబుట్టువునుగాని యెట్లు చంపును? నీవు రాజ్యము గావలయు ననుకోర్కిచే నిట్లు భరతుని చెప్పదువేని భరతుఁడు రాఁగానే వానిని జూచి "భరతా! రాజ్యము లక్ష్మణుని కిచ్చివేయుము' అని చెప్పెదను. లక్ష్మణా! నేను భరతునితో 'రాజ్యమును లక్ష్మణునకు నిమ్మని మనస్సు లేక మాటమాత్రమును చెప్పినను వాఁడు నిజముగా 'అట్లే యిచ్చెదను' అని చెప్పనేకాని మఱియొకటి చెప్పఁడు" అనెను. లక్ష్మణుఁడు రాముని హితము నందే మిక్కిలియు మనస్సు గలవాఁడు గావున నతని కేమిగలుగునో యను దిగులున ముందువెనుక చూడక యట్లు మాటలాడినను ధర్మస్వభావుఁడగుతనయన్న యట్లు చెప్పినదానికి లజ్జితుఁడై తనయవయవములలోనే తాను జొచ్చెనో యన్నట్లు అంగములన్నియు మిక్కిలి ముడుచుకొని తలవాంచి యుండెను. ఇట్లు లక్ష్మణుఁడు రామునిమాట విని లజ్జితుఁడై యతనితో 'మనతండ్రి దశరథుఁడు తానే నిన్నుఁజూచుటకు వచ్చినాఁడని నాకు తోఁచుచున్నది' అనెను. అట్లు లక్ష్మణుఁడు మఱియొక ప్రస్తావమును జేయుటంబట్టి రాముఁ డతఁడు లజ్జితుఁడై యున్నాఁడని కనుఁగొని యాధార్మికుఁడు దానిని బోఁగొట్టుటకై యదియే ప్రస్తావముగా 'మహాబాహువైన యాదశరథుఁడు మనలను జూచుటకై యిటవచ్చినాఁడని తలఁచెదను. లేక యతఁడు మనము సుఖమునకే తగినవారమని తలఁచుచు వనవాసము కష్టమని చింతించి మనల నింటికి నిజముగాఁ దోడ్కొని పోవుననియు తలఁచుచున్నాను. శ్రీమంతుఁడగు నాతండ్రి దశరథుఁడు మిక్కిలియు సుఖమునే యనుభవించినదైన యాసీతను అడవినుండి యింటికిఁ గొనిపోవఁగలఁడు. వీరోత్తమా! మంచికులమునఁ బుట్టి మనసునకింపై వేగమున వాయువును బోలి రాజోపవాహ్యములైన యాయుత్తమాశ్వములు రెండును మిక్కిలియు నొప్పుచున్నవి చూడుము. మిక్కిలి బుద్ధిమంతులైన మననాయనగారి పట్టపుటేనుఁగు పెద్ద కాయముగలిగి మిక్కిలి పొడవై యుండు శత్రుంజయ మనునది యిదిగో తల గదల్చుచు సేనాముఖమున వచ్చుచున్నది. మహాబాహూ! లోకోత్తరమును దివ్యమునైన నాయనగారి తెల్లనిఛత్రము మాత్రము కానరాదు. కనుక నాయనవిషయమందు నాకు సందేహము గలుగుచున్నది. లక్ష్మణా! నీవు చెట్టుకొననుండి దిగుము. నేను చెప్పినట్లు చేయుము" అని లక్ష్మణునికిఁ జెప్పెను. పగవారి సేనల గెలుచుదిట్ట యగు నాలక్ష్మణుఁడు అంత చెట్టుమీఁద నుండి దిగి చేమోడ్చు గీలించి యన్నకు తటాలున నేమి భయము కలుగునో యనుశంకం జేసి యతనిపార్శ్వభాగమునఁ గొలిచియుండెను. రాముని యాశ్రమమునకు నిఱుకటము గలుగరాదని భరతుఁడాజ్ఞాపించుటం జేసి యతని సైన్యము చిత్రకూట పర్వతము చుట్టును మండలాకారముగా విడిసియుండెను. గజములును అశ్వములును రథములును క్రిక్కిఱిసి

యున్న యాయిక్ష్వాకుసైన్యము ఒకటిన్నఱ యామడదూరము ఆపర్వతప్రాంత భాగమును ఆవరించి విడిసినదయ్యె. సేన లాశ్రమమున మూఁగిన యెడల రాముని ప్రసాదము కలుగ దను నీతిని భరతుఁ డెఱింగిన వాఁడు గావున, రాజుకడ వినయ ముతోడి వేషమునఁ బోవలయుననెడి ధర్మమును మన్నిడుకొని, గర్వమును విడిచి రామునిఁ బ్రసన్నునిఁ జేయుటకై తోడ్కొని వచ్చిన యాసేన చిత్రకూటమునకు సమీపమున నెంతయుఁ బ్రకాశించు చుండెను. ఇది తొంబది యేఁడవ సర్గము.



భరతుఁడు శత్రుఘ్నునిని గుహాదులనుగూడి పాదచారియై రామాశ్రమమును వెదకుట, దానిజాడ యగుధూమ మును జూచినవెనుకఁ దక్కినవారిని నిలిపి తాను గుహశత్రుఘ్నులతో నచటికిఁ బోవుట.

పరమధార్మికుఁడైన రామునికడకు నడచిపోవుభాగ్యము తనపాదములకుఁ గలుగుటం జేసి పాదములు గలవారలలో నుత్తముఁడైన యాప్రభుండు భరతుఁడు సేనను విడియించి, పిత్రాజ్ఞానువర్తియగు రామునొద్దకుఁ బాదములతో నడచిపోవఁ గోరెను. సైన్యము నియతములైన యయ్యెస్థలములో విడియఁగానే భరతుఁడు జాగుసేయక వినయముతోడి వేషమును గైకొని తమ్ముని శత్రుఘ్నునింబిలిచి 'సౌమ్యా! నీవిపుడు ఈమనుష్యసమూహములను బోయలనుగూడి శీఘ్రముగా నీ వనమున నలుప్రక్కల వెదకవలయును. గుహుఁడు, బాణములను విండ్లను కత్తులను దాల్చి వేవురకొలఁది బంధువులు తన్ను పరివేష్టించి రాఁగా తానే కాకుత్స్థులు లైన రామలక్ష్మణులను వెదకుఁగాక. మంత్రులును పురజనులును గురువులును బ్రాహ్మణులును చుట్టు బలసిరాఁగా నేనై వనమంతయు పాదములతోడ తిరిగెదను. రామునిఁ గాని మహాబలుండగు లక్ష్మణునిఁగాని మహాభాగ్యవతియైన సీతనుగాని చూచు నంతవఱకు నాకు దుఃఖశాంతి గలుగదు. చందురునివలె తులకించుచు తామరపూ రేకులవంటి వాలుఁగన్నులుగలిగి సొగసు గులుకుచున్న రాముని మొగంబును జూచు నంతవఱకును నాకు దుఃఖశాంతి గలుగదు. వజ్రధ్వజారవిందాంకుశకలశాదిరాజ లక్షణలక్షితములైన రామునిపాదములను శిరస్సునఁ దాల్చునంతవఱకును నా దుఃఖము శమింపదు. రాజ్యార్హుఁడైన రాముఁడు అభిషేకజలములఁ దోఁగి పిత్రు పైతామహమైనరాజ్యమున నెలకొనువఱకు నా దుఃఖమునకు శాంతి గలుగదు. అచ్ఛంపుఁజందురునివలె విలసిల్లుచు తామరలవంటికన్నులు చెన్నుగులుక మిక్కిలియు కాంతి దళుకొత్తుచున్న రాముని నెమ్మొగమును జూచుచుండు లక్ష్మణుఁ డెంతయు కృతార్థుఁడుగదా. సముద్రము కడపలగాఁ గలభూతలమునకంతయు నధి నాథుండగు రాముని వెంటఁబోయినది గావున మహాభాగ్యయైన జనకరాజసుత సీత

కృతకృత్యురాలైనది. *కుబేరుఁడు నందనవనమునందుఁబోలె, రాముఁ డీపర్వతమున వాసముచేయుచున్నాఁడు. కావున హిమవత్పర్వతముతో సాటియైన యీ చిత్రకూటపర్వతమును భాగ్యవంతమైనది. మహాతేజమునఁ దళుకొత్తుచు ఆయుధధారులందు మేటియైన రాముఁడు వాసముసేయుచున్నాఁడు గావున క్రూరమృగములు నెరసి బెరసి దుర్గమంబై యున్న యీయరణ్యమును గృతార్థము' అని చెప్పెను. మహాతేజుఁడును మహాభుజుఁడును పురుషతిలకుఁడునగు భరతుఁడిట్లు శత్రు

* ఇందులకు 'సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః। యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవనన్దనే' అని మూలము. విశేషార్థము, (సుభగః) ఇతరములైన స్థలములకంటె రమణీయమైనది. ఇచట రమణీయమైనదనఁగా ఎల్ల వారికిని గోరఁదగియుండునదనుట, అయోధ్యయందు వసించినట్లిది యందును రాముఁడు వసించుటచే ఆరాజధానియే ఉన్నట్లుండి యిచ్చటికివచ్చి యిట్లయ్యెనో యనఁదగునట్లు రమణీయమైనది. రాముఁడు వసించియుండుమాత్రముచేతనే యిది సుభగ మైనది కాదు. (చిత్రకూటః) తనస్వరూపముచేతనుగూడ ఇది సుభగమైనది. (చిత్రకూటః) అయోధ్యనుండి లంకకు వేంచేయుచుండిన శ్రీరంగనాథుఁడు శ్రీరంగక్షేత్రపుభోగ్యతచే నచటనే స్థిరముగానిలిచినట్లు అయోధ్యనుండి దండకావనమునకు వేంచేయుఁబూని 'జగామ చాశ్రమాన్ రమ్యాన్ పర్యాయేణ తపస్వినామ్' అన్నట్లు వరుసగా ఆయాయాశ్రమములం ద్రిమ్మరుచున్న రాముఁడు ఇచ్చట సీతతోఁగూడ నింపుమీఱ వసించినాఁడు గనుక నిది అతిభోగ్యమైనది. (చిత్రకూటః) నానావిధధాతువులచేతను రత్నములచేతను శిఖరములచేతను ఇంపుగొలుపునది. ఇట్లు చిత్రములైన కూటాగారములు అయోధ్యయందును గలవుగాన చిత్రకూటమనఁగా అయోధ్యయా యనఁగా, (అసౌగిరిః) కాదు, పర్వతము. అయోధ్యను సైతము త్యజించి రాముని కాదరింపఁదగినట్టిది. ఇది యెట్టిదనఁగా (గిరిరాజోపమః) శ్రీనివాసుఁడు సన్నిహితుఁడై యుండు వేంకటాచలమువంటిది. ఇంతటియతిశయమునకుఁ గారణము చెప్పుచున్నాఁడు. (యస్మిన్ వసతి కాకుత్స్థః) పుట్టి పెరిఁగినవెనుక వెగటు పుట్టించిన అయోధ్యవంటిదిగాదు; పుట్టినపుడే వెగటుపుట్టించిన మధురాపురివంటిదియుఁగాదు; వాఁడు ఎడతెగక వర్తించునట్టి స్థలమిది, (కాకుత్స్థఃయస్మిన్ వసతి) కకుత్స్థకులమునఁబుట్టినవాఁడగుటచే అయోధ్యానగరమున వర్తించునట్టిరాముఁడు ఆస్వదేశమును విడిచి పరిచితము కాని యిందు వసించుచున్నాఁడు. (కాకుత్స్థో యస్మిన్ వసతి) ఈతఁడీపర్వతముమీఁద వసించుట ఇతనికులమునకు కూటస్థుఁడైనయొక రాజు వృషభమై వచ్చినయింద్రుని మూఁపురముమీద వసించినట్లున్నది. ఇందులకు దృష్టాంతము చెప్పుచున్నాఁడు.(కుబేర ఇవనన్దనే)చైత్రరథమునందు వసింపఁదగినకుబేరుఁడు ఇంద్రునియుద్యానమైననందనమున విహరించునట్లు అయోధ్యనువిడిచి చిత్రకూటమున రాముఁడు వసించుచున్నాఁడు, లేక (కుబేర ఇవనన్దనే)' ఇక్ష్వాకూణామియం భూమిః సశైలవనకాననా' అన్నట్లు చిత్రకూటమును రామునిదేశములోనిదే కనుక తన గృహమును విడిచి తనగృహోద్యానమున విహరించు కుబేరునివలె రాముఁడుతనయయోధ్యనువిడిచితనదేశములోనిదైనచిత్రకూటమునవసించుచున్నాఁడు.(కాకుత్స్థః) తనకులమును కృతార్థముగాఁజేసినవాఁడు గావున తనవాసస్థలమును గృతార్థముగాఁజేసెననిభావము. (కుబేరః)కు=భూమియే, బేరః=శరీరముగాఁ గలవాఁడు—జగచ్ఛరీరుఁడగు పరమాత్మ,(నన్దనే)వైకుంఠనందనమున వసించుచున్నట్లు రాముఁడు నిందు వసించుచున్నాఁడనుట. చిత్రకూటమునకునందనమును ఉపమానముగా చెప్పుటచే రామునకు అందుఁ గలభోగ్యతాతిశయము సూచితమగుచున్నది.

ఘ్నునకుఁజెప్పి యంతఁబాదములతోనే, యమ్మహారణ్యమును బ్రవేశించెను. భరతుఁడు మాటలాడుటయందు మేటి గావున రామునితో మాటాడ వలయుదానిని చింతించుకొనుచునే యీకొండనెత్తములందు కొనలుపూచియున్న వృక్షముల నడుమఁ బోయెను. అతఁ డట్లుపోయి చిత్రకూటపర్వతమునందలి యొక పూచిన వృక్షమునుజేరి అట రామాశ్రమమందలి యగ్నిహోత్రమునుండి పొడవుగాలేచిన పొగను జూచెను. భరతుఁడు దానింజూచినవాఁడై సంతసమునఁ గాంతి దళుకొత్తుచు రాముఁడక్కడ నున్నాఁడని యెఱింగి బంధువులును దానును ఆనందమున పారవశ్యము నొందెను. అప్పుడు భరతుఁడు, సముద్రమునఁ బడినవాఁడు గట్టునకువచ్చినట్లు గనుపట్టుచుండెను. ఆమహాత్ముఁడు చిత్రకూటమునందు సత్పురుషసముపపన్నంబైన రాముని యాశ్రమమును జూచి రాముని వెదకుటకై తనతోఁగూడి వచ్చినసైనికులనుగూడ నిలిపి, గుహునితోఁగూడ త్వరితముగాఁ బోయెను. ఇది తొంబదియెనిమిదవ సర్గము.



భరతుఁడు విడిదిపట్టున నున్నతల్లులను దోడ్కొని రా వసిష్ఠునిఁ బంపి తానును గుహసుమంత్రులతోఁ బోయి రామునిఁ జేరుట.

అటు సైన్యము విడిసియుండఁగా తా నచట క్షణముండి భరతుఁడు రాముని దర్శింప తహతహపడుచు శత్రుఘ్నునకు రామాశ్రమచిహ్నములను జూపుచు రామునిఁజూచుటకైపోయెను. గురువత్సలుఁడైనయాభరతుఁడు వసిష్ఠమహర్షింజూచి 'నీవు నాతల్లులను వేగ తీసికొనిరమ్ము' అని చెప్పి తానుముందు శీఘ్రముగాఁబోయెను. రామునింజూడవలయు ననుకోర్కి, భరతునికింబోలెనే శత్రుఘ్నునికినిగల్గియుండినది. శ్రీమంతుఁ డగుభరతుఁడు కొంతదూరముపోయి యంత తాపసగృహమువలె తీర్చి కట్టంబడినదై అగ్నిహోత్రగృహముగా నున్నపర్ణశాలను దానికి ముందు చూడ వచ్చినవారితో సుఖముగాఁ గూర్చుండుటకై యేర్పఱుపఁబడిన పర్ణమంటపమునుం జూచెను. భరతుఁడప్పుడు ఆపర్ణశాలకుముందు రాత్రి మంట వేయుటకై విఱిచి తెచ్చియున్నకట్టెలను పూజార్థమై సమకట్టియున్న పుష్పములనుఁ జూచెను. రాముఁడును లక్ష్మణుఁడును జలకమాడుటకై నీటిపట్టులకుఁ బోయి మరలి తమయాశ్రమమునకు వచ్చునపుడు మార్గముఁదెలియుటకును, ఒండొరులరాకపోకలు దెలియుటకును, అచ్చటచ్చట వృక్షములందు దర్భలచేతను వల్కలములచేతను గావింపంబడినగుఱుతులను జూచెను. అతం డావనమున చలిని బోఁగొట్టుకొనుటకు మృగములయు మహిషములయు పేఁడకడులనుఎండినవానిని గొప్పరాసులుగా సేకరించియుండుటయుఁజూచెను. అప్పుడు మహాబాహుఁ డగుభరతుఁడు కాంతి తులకింపఁ బోవుచు వానినెల్లఁజూచి హర్షమునొంది శత్రుఘ్నునిని మఱియామంత్రుల నందఱినిఁ జూచి 'భరద్వాజుఁడు

చెప్పిన ప్రదేశమునకు వచ్చితిమని తలఁచుచున్నాను. మందాకినినదిగూడ ఇచ్చటికి మిక్కిలి దూరము కాదని తోఁచుచున్నది. నారచీర పేలికలు పొడవుగా వృక్షముల పైని ఈచాయగా కట్టఁబడియున్నవి. ఇది లక్ష్మణుఁడు అకాలము లైననాయంశా లామలందు ఫలజలాదులను దెచ్చుటకై పోయి రావలసినప్పుడు దారిచక్కఁగాఁ దెలియుటకై యడియాలము లేర్పఱచినమార్గముగానుండును. కాన యీదారినే పోవుదము. ఇచట*మిక్కిలి వేగవంతము లైనయేనుఁగులుకోపమునతమనిడుదదంతములతో వేగముగా ఒకటినొకటి చూచి గర్జించుచుఁ బొడుచుకొనుచుఁ గ్రుమ్మరినచోటుగా తెలియుచున్నది. †అడవియందు తాపసులు రేపుమాపును హోమముసేయుటకై

*ఇట్లు ఏనుగుల త్రొక్కుడులచేత దారిగలని మాసిపోయి తెలియరాకుండుటచేతనే నారచీరలు మొదలైనయడియాలములు పొడవుగా ఆదారి తెలియుటకై కట్టబడినవని తెలియునది.

†ఇందులకు (యమే వాధాతుమిచ్ఛన్తి తాపసాస్సతతంవనే। తస్యాసౌదృశ్యతే ధూమస్సఙ్కులః కృష్ణవర్త్మనః) అని మూలము. ఇచట నగ్నిని 'సంకులః' అనఁగా 'మిక్కిలిదట్టమైనది' అన్నాఁడు, పచనము సేయూనప్పుడు మంటలునుహోమము సేయునప్పుడునిప్పుకలునే ఆవశ్యకములు గావున నప్పుడు దట్టముగా పొగ కలుగదు. కావున నీయగ్ని పచనాగ్నియు హోమాగ్నియుఁ గాదు. ఎల్లప్పుడుపదిలముగాఁ బెట్టుకొనియుండు గార్హపత్యాగ్నియే యగును. దీనిచేత రాముఁడు అగ్నిని ఆధానము (పవిత్రీకరణము) సేయుట లేమిచే శ్రౌతాగ్ని యిచట చెప్పఁబడినదిగాదు. ధార్యమగు స్మార్తాగ్నియే చెప్పఁబడినది. రామునకు శ్రౌతాగ్నికలదేని యపుడు రాముఁడు వనమునుండి అయోధ్యకువచ్చునపుడు 'రామః కమలపత్రాక్షః పురోధస మథాబ్రవీత్। అగ్నిహోత్రం వ్రజ త్వగ్రే సర్పిర్జ్వలితపావకమ్' అని అగ్నిహోత్రమును పురస్కరించుకొనుట వినంబడుటవలన వనమునకుఁ బోవునపుడును, ఆట్లే యతఁడు చేయుట గనఁబడియుండును. ఏలనఁగా అతనిని తమసాతీరమువఱకు అనుసరించిన పౌరవృద్ధులు 'సాగ్నయ ఏవసమాగతాః' 'అగ్నులతోఁగూడియే వచ్చి' రని చెప్పినపుడు రాముఁడును అట్లేచేసినట్లు చెప్పఁబడియుండును. అయిన నట్లుచెప్పఁబడలేదు, గావున, అతండు శ్రౌతాగ్ని తీసికొనిరాలేదని తెలియుచున్నది. మఱి యిచ్చట నొకపూర్వపక్షము. అదేదియనఁగా ("దీక్షితం వ్రతసంపన్నం వరాజినధరం శుచిం। కురఙ్గశృఙ్గపాణించ పశ్యన్తీత్వాం భజామ్యహమ్) అని సీత రామునియజ్ఞ దీక్షను కాంక్షించుటచే రాజ్యాభిషేకమునకు మునుపతఁడు యజ్ఞమును యనుష్ఠింపలేదని తెలియుచున్నది. కాఁబట్టి యిచట చెప్పంబడినయగ్ని గృహ్యాగ్నియే యగును. దానిని తెచ్చుటయేని మునుపు చెప్పఁబడలేదనరాదు. దానిని ఆత్మసమారోపణముచే తెచ్చుట శక్యమగును. ఆత్మసమారోపణము చేసినను రేపును మాపును దానిచే హోమము చేయరాదు. అట్లు చేసినట్లును చెప్పంబడలేదు. మఱి తమసానదీతీరముననుగంగాకూలముననుఁ, వృక్షమూలముననుభరద్వాజాశ్రమమునను యమునాతటమునను సంధ్యావందనమే చెప్పఁబడినది. మఱియు శ్లోకమందలి తాపసశబ్దముచేతను వనశబ్దముచేతను, వనమందు తాపసులు చలిని పోఁగొట్టుటకు వెలుతురు కలిగించుటకును, కందమూలాదులను పక్వము సేయుటకును సంగ్రహించుకొను నగ్నియే చెప్పఁబడినదని చెప్ప నొప్పును. కనుక 'ఆధాతుం' అనఁగా 'సంగ్రహించుటకు' అని యర్థము. కాఁబట్టి యీ యగ్ని పచనాదులకొఱకైన యగ్నియేకాని ధార్యమయినస్మార్తాగ్ని కాదు."—ఇందులకు సిద్ధాంత మెట్లన —'ప్రాగుదక్ప్రవణాం వేదిం విశాలాం దీప్తపావకామ్' అని మీఁద చెప్పఁబడుచున్నది. సంస్కరింపఁబడనియగ్నికి వేది

మెల్లప్పుడును గాపాడుచుండునట్టియగ్నినుండి దట్టమయినపొగ లేచుట కానంబడు చున్నది. ఈయాశ్రమమునందు మేలయిన మంత్రోపదేశములు సేయుమహర్షివలె తులకించుచు పురుషలలాముఁడును పూజ్యుఁడు నగురాముని మిక్కిలి సంతోషమునఁ జూడఁగలను' అనెను. అంత నాభరతుఁడు చిత్రకూటపర్వతమునఁ గొంతసేపుపోయి మందాకినీనదిని జేరి యాశత్రుఘ్నాదిజనులను జూచి 'జనాధిపతియు పురుష లలాముఁడునగు రాముఁడు నిర్జనమైనవనమునందు వట్టినేలపయిని వీరాసనమునఁ గూర్చుండియున్నాఁడే! ఇఁక నాజన్మము నాప్రాణమును ఇసీ! యెందుకు? రాముఁడు లోకమునకంతయు నాధుఁడు. మిక్కిలి కాంతిమంతుఁడు. అట్టివాఁడు, కైక నా కొఱకై చేసినకార్యమునుబట్టి, రాజ్యమును బాసి, మహావ్యసనము నొంది, సమస్త కామములును విడిచి, యరణ్యముననున్నాఁడే! ఇట్లు నానావిధముల లోకులచే నప వాదము పడుచున్న నేను, రాముని ప్రసన్నుని జేయుటకై యతనిపాదములం బడెద. సీతపాదములను మాటిమాటికిఁ బడెదను. వారిరువురును ప్రసన్నులు కారైరేని లక్ష్మణుని పాదముల మీఁదనుం బడుదును' అనెను. దశరధకుమారుఁ డైనయా భరతుఁ డావనమున నిట్లు విలపించుచు నంత మిక్కిలిగొప్పదియు పవిత్రము నైన రామునిపర్ణశాలం గాంచెను. అందు మద్ది యినుమద్ది తాడి మొదలగువాని యాకులజొంపములు మిక్కిలియుఁ గ్రమ్మియుండెను. మఱియు నది విశాలమై యాగ వేదికవలె మెత్తనిదర్భలచే నెరసిబెరసియుండెను. మఱియు నందు ఇంద్రాయుధము లకు సాటియై నూఱుపలములయెత్తు గలిగి పిడుఁదులందు బంగరుపూఁతచే తలతల లాడుచు మంచిసత్త్వగలిగి పగవారిని బీడించుమేటివిండ్లు వన్నె గులుకుచుండెను.

---

సంబంధము ప్రసిద్ధము గాదు. 'ప్రాగుదక్ప్రవణాం' ఇత్యాదిలక్షణములు వేదికి చెప్పుటచే వేదియు నందలియగ్నియు సంస్కృతములైనవని తెలియుచున్నవి. ఇట్టి సంస్కృతమైన యగ్నిని గృహ్యాగ్ని యనుట విరుద్ధము. సంస్కృతాగ్ని యైనయెడల దానిచే రేపును మాపును హోమముచేయుట నేల చెప్పలేదన్నచో ముని నిరంకుశుఁడు గావున ఒకతూరి చెప్పినదానిని అతనికి ఇచ్చలేకున్నను మరల మరల చెప్పవలసినది లేదు. మీఁద సుతీక్ష్ణాశ్రమమందు ఈవిషయ మొకతూరి చెప్పనున్నాఁడు. 'అథ తేగ్నిం సురాంశ్చైవ వైదేహీ రామలక్ష్మణౌ। కాల్యంవిధివ దభ్యర్చ్య తపస్వి శరణేవనే। ఉదయస్థం దినకరం దృష్ట్వావిగతకల్మషాః। సుతీక్ష్ణమభిగమ్య' అని యిచట హోమము చెప్పలేదన్నయెడల ఉదయమునకు మునుపు అగ్నికార్యమును చెప్పుటచేత, ఔపాసనము చక్కఁగాచెప్పఁబడినదని తెలియుచున్నది. ఇట్లే అన్నియెడలను దెలియునది. ఇచట అగ్నికార్య మునందు, రాముఁడు ప్రధానశక్తిగాను, సీత సహభావమున ప్రణయసాదులచేతను, లక్ష్మణుఁడు సమి ధలు మొదలయినవి సమకూర్చుతోడ్పాటుచేతను, అన్వయించుట తెలియునది. కనుక వనవాస కాలమైన పదునాలుగేండ్లలో సీతను రావణుఁడు కొనిపోవువఱకు రాముఁడు చిత్రకూటము మొద లుగా పంచవటివఱకుఁ గలప్రదేశములందు మాసముల సంవత్సరములకాలందిగా చిరకాలమున్నచోట్ల వెలుపల స్మార్తనిత్యాగ్నిని ధరించుటయు తక్కినచోట్ల ఆత్మయందో సమిధలందో ఆరోపణముచేసి హోమకాలమందు అవరోపించి రేపుమాపును ఔపాసనము సేయుటయును తెలియునది.

వాతులు ధగధగమని వెలుఁగ సూర్యకిరణములవలె తులకించుచుఁ బొదులయం దిమ్ముకొని యున్న బెడిదంపుబాణములచే నది, సర్పంబులచే భోగవతీపురమువలె, నెంతయు రాణించుచుండెను. బంగారపుటొఱలు గలమేటికత్తులును నీటు గులుకు చుండెను. బంగారపుబొట్లచే నందందు నీటుగులుకుచున్న డాలువాఱులజత యొఱపు మీఱుచుండెను. మఱియు బంగారుచే రంగారుచు నల్లెత్రాటిదెబ్బ తగులకుండు టకై చేతికిఁ గట్టుకొనునట్టి చిత్రములైన యుడుపతోలి కవచములును, అంగుళీ కవచములు నందు వ్రేలాడుచుండెను. మృగములకు సింగం బున్నగుహవలె, మహా శత్రుసంఘములకడిచొర రానిదై వెలయుచుండెను. భరతుఁడారాముని గృహమునందు విశాలమై పవిత్రం బగునగ్నివేదికను గాంచెను. అది యీశాన్యపుదిక్కున క్రమ ముగా తగ్గియుండెను. అందగ్నిహోత్రమును మండుచుండెను. *పర్ణశాలయందు జటామండలముదాల్చి గూర్చున్నరాముని భరతుఁడు జటలు దాల్చుటంబట్టి రాముఁడో కాడో యని గడియసేపు దేఱిచూచి యంత తినయన్న యని కనుం గొనెను. సింగములవంటి మూఁపులును. నిడుదలైన బుజములును, తెల్లదామర రేకులవంటి కన్నులునుగలిగి మహాచక్రవర్తిలక్షణలక్షితుఁడై సముద్రపర్యంత మయిన భూమికి నాయకుఁడుగానుండియు ధర్మాచరణమునకుఁగాను † కృష్ణాజినము నుత్తరీయముగా వేసికొని నారచీరలుగట్టి దర్భలుపఱచిన నేలపై లక్ష్మణుఁడు గొలువ

* ఇందులకు మూలము. 'నిరీక్ష్యసముహూర్తంతు దదర్శభరతోగురుమ్ । ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్' ఇందు 'జటామండలధారిణమ్' అనుదానియందుఁగల 'జ' కారము గాయత్రి యేడవయక్షరము కాఁబట్టి యింతవఱకు ఆఱుసహస్రముల శ్లోకములై ఏడవసహస్ర మారం భించినదని తెలియునది.

† ఇందులకు మూలము 'తం తు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్ । దదర్శరామ మాసీన మభితః పావకోపమమ్' విశేషార్థము. (తం) అని ముందు మహార్హవసనోపేతుఁడైనట్టి రాముని చెప్పి అట్టివానికి యిప్పుడు గలిగినభేదమును చెప్పుచున్నాఁడు. (కృష్ణాజినధరం) కృష్ణాజినమును ఉత్తరీయముగా దాల్చినవానిని, (చీరవల్కలవాసనం) నారచీరలు క్రిందివస్త్రములుగాఁ గట్టుకొన్న వానిని, (రామం) వల్కలాదులు ధరించినను తూలిపోవని రమణీయతగలవానిని, (ఆసీనం) ఒకా నొక ఆసనముగట్టుకొని ఆత్మధ్యానము సేయువానిని, (అభితఃపావకోపమమ్) అట్టి తపోవిశేషముచే తనచుట్టును అగ్నివంటి తేజస్సుచే పరివృతుఁడైనట్టివానిని లేక 'నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా' అన్నట్లు మెఱుపుఁదీఁగల నడుమనుండు నల్లనిమబ్బువలె నున్నవానిని, లేక (పావకోప మమ్)విరోధులకు క్రిందుపఱుపరాని ప్రతాపముగలవానిని, లేక అయోధ్యయందలిసభకన్న ఈఉటజ సభ గొప్పదైనది. ఎట్లన ఆసభయందు, సమీపమున వర్తించినట్టి తమ్మునికిఁగూడ, ఈసభయందు సమీపమునకుఁ బోవుట అలవిగాకున్నది. ఏలననఁగా, (అభితఃపావకోపమమ్) అగ్ని జ్వలించుచుం డఁగా సమీపమునకుఁ బోవుట కెవ్వరికిని శక్యము గాదు గదా. (పావకోపమమ్) అగ్నివలె చూడరాని వాఁడు కావుననే పూర్వము భరతుఁడు గడియసేపు నిదానించి చూచియే తెలిసికొన్నవాఁడని చెప్పఁబడినది.

శాశ్వతుండైన బ్రహ్మదేవుఁడుబోలె సీతతోఁగూడి ఒకానొకయాసనము గయి కొని కూర్చుండి యాత్మధ్యానముసేయుచు అగ్నివలె నెట్టివారికిని అంటను డాయను దేజిచూడను రాకుండు ప్రభచుట్టును పర్వఁగా నొప్పుచున్న రాముని భరతుఁడు గాంచెను. ధర్మాత్ముఁడగు నా శ్రీమంతుఁడు భరతుఁడు అట్లున్న రామునిఁజూచి దుఃఖ మునను శోకమునను తెప్పలఁదేలుచు నతనియొద్దకువచ్చెను. కైకకుమారుఁడు భరతుఁడు రామునిఁ జూడగానే ఆర్తుఁడై ఆయార్తిని సహింపఁజాలక విలపించి యంత కొంతవడికి ధైర్యము తెచ్చుకొని శోకముచాలించి మాటలు తెలివిడి గాక తొట్రుపడ 'ఎవఁడు సభయందు మంత్రులు మొదలయిన సభ్యులచేఁ గొలువఁ దగియుండునో, అట్టియీనాయన్న ఇపుడు అడవిమృగములచేత సేవింపఁబడు చున్నాఁడు. ఏమహాత్ముఁడు మున్ను పెక్కువేలనాణెముల వెలగల మేలివస్త్రము లకుఁ దగియుండునో యట్టియితఁడు ఇపుడు ధర్మమునాచరించువాఁడై కృష్ణాజిన ములం దాల్చియున్నాఁడు. ఎవ్వఁడు మునుపు పలువిధము లైనపువ్వులను శిరస్సున ముడుచుకొనియుండెనో అట్టియితఁడు జటాభరము నిపుడెట్లు దాల్చుచున్నాఁడు. అనేక యజ్ఞములు యథావిధిగాఁ గావించుటచేత ధర్మమును సంగ్రహింపఁదగి నట్టి రాముఁడు ఇప్పుడు వానప్రస్థులవలె శరీరక్లేశముచే ధర్మమును ఆర్జింపఁదివురు చున్నాఁడే! ఎవ్వనిమేను మిక్కిలియుత్తమ మైన చందనపుఁబూఁతలు మున్ను గలిగియుండెనో, అట్టి యీ పూజ్యునిశరీర మిపుడు మురికితో నెట్లు గూడి యున్నది! సుఖమునకే తగినరాముఁడు నానిమిత్తమె యిట్టి మహాదుఃఖముపాలై నాఁడు. ఇట్లు క్రూరుఁడై లోకనిందితుఁడై యున్న నను బోఁటిప్రాణములు ఇసీ! ఎందుకు' అని విలపించెను. భరతుఁడు దీనుఁడై తామరవంటిమొగము చెమటచే తొప్పదోఁగ నిట్లు విలపించి యంత రాముని పాదములంబడఁబోయి కన్నీటిపెల్లుచే గానరాకుండుటవలన వానిపయింబడక యేడ్చుచు నేలంబడెను. మహాబలుఁడైన యారాజకుమారుఁడు భరతుఁడు దుఃఖమున పురపురం బొక్కుటవలన 'ఆర్యా' యని యొక్కమాటే చెప్పి యంతనేమియుఁ బలుకఁజాలఁడయ్యె. అప్పుడు భర తుఁడు కీర్తిమంతుఁడైనరామునిని జూచి 'ఆర్యా' యని యొకమాఱు బిగ్గఱ నఱచి యంత కన్నీళ్లగొంతుక్రమ్మఁగా నటమీఁద మాటాడనేరఁడయ్యె. శత్రు ఘ్నుఁడును రోదనమ్ము సేయుచు రామునిచరణములకు వందనములు చేసెను. అతఁడు భరతశత్రుఘ్నుల నిరువురిని గవుఁగిలించుకొని కన్నీళ్లువిడిచెను. అంత నాయరణ్యమున ఆరామలక్ష్మణులు చంద్రసూర్యులు బృహస్పతితోను శుక్రుని తోను జేరునట్లు సుమంత్రునితోడను గుహునితోడను జేరిరి. అట్టిసుఖాత్ములైన యా రాజకుమారు లచట ఏనుంగు గమికాండ్రవలె విలసిల్లిరి. ఆరాజకుమారులు ఆమహా రణ్యమున ఒండొరులతోఁ గలయుటఁ జూచి అడవియం దుండుఋషులుగూడ అంద ఱును సొంపు మాలి కుందుచు కన్నీళ్లు కార్చిరి. ఇది తొంబదితొమ్మిదవ సర్గము.

## రాముఁడు భరతునిఁ గుశలప్రశ్నము సేయుట. తన్మూలమున రాముఁడు రాజనీతి నుపదేశించుట.

* జడలు దాల్చి నారచీరలు గట్టుకొని చేమోడ్చు గీలించి నేలంబడి యుగాంతసూర్యునివలెఁ జూడ రానివాఁడై యున్న భరతుని రాముఁడు చూచెను. అంత, రాముఁడు, మొగంబువన్నె మాఱి చిక్కియుండుటం బట్టి భరతుని తోడనే తెలిసికొనఁజాలక కొంతవడి కెట్టో గురుతుపట్టి బాహువులచే గ్రుచ్చి లేవనెత్తెను. రఘువంశ్యుఁ డా రాముఁడు భరతునిశిరము మూర్కొని, కవుఁగిలించుకొని తొడయందుఁ గూర్చుండఁబెట్టి యెచ్చరికతో నతనిఁ జూచి 'నాయనా! నీవడవికి వచ్చితివే! నీతండ్రి యెచ్చటికిఁ బోయెను? అతండు బ్రతికియుండఁగా నీవు విడిచి యడ



* ఇందులకు మూలము. 'జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి। దదర్శ రామో దుర్దర్శం యుగాన్తే భాస్కరం యథా' ఇందులకు విశేషార్థము—(జటిలం) మంచివూపెండ కనఁబడెనేని దశరథుఁడు ఇది భరతునికిగరు బాగుగనుండునే యనును. అట్టిభరతుఁడా! జడలు గట్టుకొని యున్నాఁడని రాముఁడు విస్మయపడుచున్నాఁడు (చీరవసనం) మేలైన చీనాంబరములు చూచెనేని తండ్రి ఇవి 'బాలుఁడ ంభరతునకిఁ దగును' అని చెప్పును. అట్టిభరతుఁడే వల్కలములు ధరించి యున్నాఁడు. (ప్రాంజలిం) తండ్రి యేదైనను ప్రార్థించి యియ్యఁగా తీసికొనువాఁడు ఇప్పుడు తనయభిమతమునకు తానే ప్రార్థించువాఁడైనాఁడు, (పతితం భువి) 'అంకేభరత మారోప్య' అని మీఁద రాముఁడు తనతొడయందుఁ గూర్చుండఁబెట్టుకొనుస్థితి యిప్పుడే గలుగదయ్యె. పువ్వుల సెజ్జకూడ గడుసుగానుండునని తలఁచి తండ్రితొడయందేపరుండఁబెట్టుకొనువాఁడు. ఇప్పుడు నేలఁబడినాఁడు. (దదర్శ రామో దుర్దర్శం) చూడరాని వానిని రాముఁడు చూచెను. నిగిడ్చిన చూపును మరల్పక యున్న రామునికి కన్నారచూపందగక యున్నవానిని (దదర్శ) జడలు మొదలయినవి దాల్చియున్న వేషముబట్టి స్నేహితజనులకు చూడరానివానిని, (దుర్దర్శం) దుఃఖముతో చూడఁదగినవానిని—కష్టపడియుఁ గుఱుతుపట్టఁగూడనివాని ననుట (యుగాన్తేభాస్కరం యథా) రామునికే కాదు, యుగాంత సూర్యునివలె ఎల్లవారికిని జూడరానివానిని, లేక యుగాంతమున భూమింబడిన సూర్యునివలెనున్నవానిని—దీనిచే మునుపున్న మిక్కుటపు తేజస్సు అప్పుడు లేకుండుటయు అట్టి తేజస్సు గలిగియుండినవానికి అటువంటిదశ తగదనియు వ్యంజితములగుచున్నవి. ఇచట నొకసంశయము-భరతుఁడు గంగాతీరమున 'అద్యప్రభృతి భూమౌతు శయిష్యేహం తృణేషువా। ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్॥' అని జటావల్కలముల ధరించుచున్నట్లు ప్రతిజ్ఞచేసికొన్నాఁడు. మరల తొంబదియవ సర్గమున భరద్వాజుని దర్శించునపుడు 'వసానో వాససీ క్షౌమే' అని పట్టువస్త్రములు ధరించియున్నట్లు చెప్పఁబడియున్నది. ఈసర్గమున (జటిలంచీరవసనమ్) అని యింతకుమునుపే జటావల్కలములు ధరించినట్లున్నది. ఈసంగతి పొసఁగుట యెట్లు? అనఁగా జటావల్కలములను ధరించుప్రతిజ్ఞ గుహునిపురమున రాత్రియందు చేయుటచే మఱునాఁడు భరద్వాజుని దర్శించినపిదప జటావల్కలములను ధరించు నభిప్రాయముతో అమ్మునియాశ్రమమునకు వచ్చినాఁడు. అచట భరద్వాజుఁడు ఆతిథ్యమునకై నిమంత్రించుటచే జటావల్కలములను దాల్చుటకు అవకాశము లేక ఆయాశ్రమము విడిచినవెనుక వానిని ధరించినాఁడని గ్రహించునది. అప్పుడన్నియు పొసఁగుచున్నవి.

వికి రాఁగూడదే! చిరకాలమునకుఁగా ఈయరణ్యమున, బహుదూరమం దున్న కేకయ నగరమునుండి, భరతుఁడు వచ్చుటను జూడఁగంటిని. సంతోషము! దేహము మిక్కిలి వన్నెమాఱియుండుటచే గుఱుతుపట్టఁ గూడకున్నది. నాయనా! నీవిచ్చటికి వచ్చితివే! రాజు బ్రతికియుండు నేని నీవిట వచ్చుటకు తాళఁడే. *ఇప్పు డతఁడు జీవించి యున్నాఁడేకదా? రాజు దుఃఖమున లోకాంతరమును బొందకున్నాఁడు గదా? సౌమ్యా! నీవు బాలుఁడవుగాన శక్తిచాలమిచే శాశ్వత మైననీరాజ్యమును దారపోసికొంటివా యేమి? నాయనా! సత్యపరాక్రముఁ డగుతండ్రి శుశ్రూషసేయుచున్నావేకదా! దశరథమహారాజు ఆడితప్పనివాఁడు, రాజసూయమును అశ్వమేధమును గావించినవాఁడు, ధర్మమునందు దృఢమైనపూనిక గలవాఁడు. అట్టిరాజు క్షేమమా? అతఁడు వ్యాధిగ్రస్తుఁ డగుటను నాకుఁ జెప్పవచ్చితివో, నాయనా! బ్రహ్మవేత్తయు, విద్వాంసుఁడును, నిరంతరధర్మాత్ముఁడును, బ్రహ్మవర్చసుండును, ఇక్ష్వాకువంశ్యుల కెల్ల కులగురుఁడును నైన వసిష్ఠమహామునిని మునుపటివలెఁ బూజించుచున్నావేకదా! నాయనా! మునువు దుఃఖము పాలై యుండినయాకౌసల్య కుశలమా? సుపుత్త్రునిఁ గన్నసుమిత్త్రయు సుఖమా! పూజ్యురా లగుకైకేయీదేవియు రాజ్యసుఖమున సంతోషముగా నున్నదే కదా? †వినయసంపన్నుఁడును సత్కులప్రసూతుఁడును, బహుశ్రుతుఁడును, అసూయారహితుఁడును, వసిష్ఠు డుపదేశించునర్థములను లెస్సగాఁ దెలుపంగలవాఁడునగు నీపురోహితుని (లేక సుయజ్ఞుని) పూజించుచున్నావేకదా! శాస్త్రజ్ఞుఁడై మతిమంతుఁడునై, కపటంబు తెలియకుండువాఁడును, అగ్నిహోత్రకార్యమున నియుక్తుఁడునగునీపురోహితుఁడు అయ్యైకాలములందుఁ గావించినహోమములను గావింపవలసినహోమములను నీకుఁ దెలుపుచున్నాఁడా యేమి? నాయనా! నీవు దేవతలను తండ్రులను తల్లులను గురువులను తండ్రితోసాటి యగుజ్ఞాతులను ముదుసలివారలను పండితులను బ్రాహ్మణులను పూజించుచున్నావేకదా? నాయనా! ఉత్తమములగు సమంత్రకబాణములును దివ్యాస్త్రములును గలిగి నీతిశాస్త్రమునం దారితేఱియుండు సుధన్వుఁ డనుధనుర్వేదగురుని బహుమానింతువా యేమి? నీకు సమానులై శూరులును విద్యావంతులును జితేంద్రియులును సత్కులప్రసూతులునై మొగము చూడఁగానే లోపలియభిప్రాయముల కనుఁగొనఁజాలినట్టివారిని

---

* దశరథుఁడు బ్రతికియుండఁగా నతనికి శుశ్రూషసేయవలయుటంబట్టి కాని లేక యతఁడు నిన్నెడఁబాయుట కోర్వఁజాలకుండుటనుబట్టి కాని అతనిని విడిచి రాఁదగ దని రామునియభిప్రాయము. మఱియు 'మీతండ్రి యెక్కడికి పోయినాఁడు' అని యడుగుటవలననే 'అతఁడు లోకాంతరగతుఁడయ్యెనా యేమి?' యని యడుగుటయు సిద్ధించుచున్నది. రాముఁడు మఱియొక ప్రశ్నము నెత్తుటచే భరతుఁడు దానికప్పు డుత్తరము చెప్పలేదనియు నూహ్యము.

† దీనిచే పురోహితుని ఎప్పుడు బూజింపవలయు ననుట శిక్షితము.

మంత్రులుగాఁ జేసికొంటివా యేమి? రఘువంశ్యా! నీతిశాస్త్రంబునఁ బండితు లును మంత్రించినవిషయములను దాఁపఁగలవారు నగుమంత్రులతో మంతన ముండి చేయఁబడినయాలోచనము రాజులకు జయమూలము సుమా! నిద్రకు లోఁబడవుగదా! [1]యుక్తకాలమున మేలుకొందువేకదా? మఱియు నర్ధరాత్రము లందు ఏకాంతమున అర్థముసమర్థించు నుపాయము నాలోచించుచున్నావా యేమి? [2] నీ వొక్కఁడవై మంత్రాలోచనము సేయవుగదా. పెక్కండ్రతోఁ గూడియు నాలోచింపవుగదా? నీ వాలోచించినమంత్రము రాజ్యమునందెల్ల పసు గిడి యెల్లవారికి బయలుపడ్డదిగాదుగదా? [3]రఘువంశ్యా! స్వల్పసాధనముచే సిద్ధించు నట్టిదై మహాఫలమును గలిగించునట్టి యొకకార్యమును జేయనిశ్చయించి శీఘ్రముగా దానిని జేయఁ దొడఁగుదువుగదా? జాగుసేయవుకదా? [4] సామంత రాజులకు నీవాలోచించిన సర్వకార్యములు, అవి చక్కఁగా పరిపక్వమైనపిదపఁ గాని యించుమించుగా తీరి ఫలోన్ముఖములుగా నున్నపుడుగాని మాత్రమేకదా తెలియును. నీ వాలోచించి చేయవలసినవిగా నిశ్చయించుకొన్న కార్యములు, చేయఁబడుటకు మునుపే యెంతమాత్రమును తెలియఁవుగదా? [5]నాయనా! నీవు గాని నీమంత్రులుగాని యాలోచించినట్టి మంత్రమును, పరులు, ఊహలచేఁగాని యుక్తిచేఁగాని మఱియితరము లైనయింగితాదులచేఁగాని యెంతమాత్రమును తెలిసికొనరేకదా? [6]నీవు మూర్ఖులు వేవురను విడిచియైనను విమర్శించి చేయుపండి తుని ఒక్కనినే కోరికొందువుగదా? అర్థసంకటము గలిగినపుడు పండితుఁడు మిక్కిలియైశ్వర్యము గలుగునట్లు ఫల మెంతయుఁ దప్పనియుపాయమును నుపదే

---

1. దీనిచే రాజు నిద్రాపరవశుఁడై యుండరాదనియు, అర్ధరాత్రములందు రహస్యముగా కార్యముల బలాబలములను ఆలోచింపవలయుననియు సూచితము.

2. దీనిచే 'ఒకఁడుగా కార్యాలోచనము చెసినయెడల వానికి ఎవరియందైన పక్షపాతము గలిగి యుండుటచే వారిగుణాగుణములను సరిగా గ్రహింపకపోవుట గలిగి కార్యము చెడును గావున, ఒంటిగా ఆలోచింపరాదనియు; పెక్కండ్రతో ఆలోచించినయెడల, ఐకమత్యము కలుగకపోవు టయే కాక మంత్రమును బయలుపడును గావున పెక్కండ్రతోడను ఆలోచింపరాదనియు, ఆలో చించినమంత్రము రాజన్యుఁడు తానై మెల్లగాఁ బర్వునట్లు వెలిపుచ్చరాదనియు సూచింపఁబడినది.

3. అల్పసాధనములచే మహాఫలములను గూర్చు కార్యములను చేయవలయుననియు వానికి త్వరితముగా పూనవలయుననియు, ఆలస్యము చేసినచో ఫలము తప్పిపోవుననియు సూచితము.

4. దీనిచే ఆలోచించిన కార్యములను చేయకమునుపు సామంతులకు తెలియకుండునట్లు దాఁపవలయును. చేసినను అదిపూర్ణముగాఁగాని యించుమించుగాఁ గాని సమాప్తి నొందినపిదపనే వెలిపుచ్చఁదగునని సూచితము.

5. దీనిచే మంత్రించినకార్యము ఇతరుల కేవిధమునఁగాని యెంతమాత్రమును తెలియకుండు నట్లు మిక్కిలి పదిలముగా దాఁచియుంపవలయుననుట సూచితము.

6. దీనిచే మూర్ఖుల వేవురనైనను వదలి పండితు నొక్కనినే వరింపవలయుననుట సూచితము.

శించును? [1]రాజు మూర్ఖులను వేలకొలఁదిగా నైనను పదివేలుపదివేలుగా నైనను ఆశ్రయించినప్పటికిని వారివలన మంత్రోపాయమునందు సహాయమేమియుఁ గలుగదు. [2]పరులు చెప్పినయర్థమును తోడనే గ్రహించుకొను బుద్ధిపాటవము గలిగి స్థిరబుద్ధియై విచారసమర్థుఁడై నీతిశాస్త్రములం దారితేఱినమంత్రి యొక్కఁడైనను రాజునకుఁగాని రాజుసంతతివానికిఁగాని మిక్కిలి యైశ్వర్యమును పొందించును. [3]ఉత్తములైనభృత్యులను ఉత్తములైనవచనాదికార్యములందును, మధ్యములైనభృత్యులను పడుకపఱచుట ఆసనముదెచ్చుట మొదలయినమధ్యమకార్యములందును, అధమములయినభృత్యులను పాదములు కడుగుట పావలు దెచ్చుట కాలు పిసుకుట మొదలైన యధమకార్యములందును క్రమముగా నియోగింతువే కదా? [4]నీవు, చక్కఁగా పరీక్షింపఁబడినవారై, పరిశుద్ధులును, ఉత్తములును, తండ్రితాతలనుండి క్రమముగా కొలువుసేయుచువచ్చుచున్నవారు నగు మంత్రులనే గొప్పగొప్ప కార్యములందు నియోగింతువా? [5]భరతా! నీవు ప్రజలకు ఉగ్రమైనశిక్షలు సేయుచు రాజ్యమును పీడించుచుండఁగా నీమంత్రులు దానికి సమ్మతింపక నిన్ను వారింతురుగదా? [6]దుర్దానములచే ద్రవ్యము సంపాదించి యాగముసేయఁ గోరుపతితుని ఋత్విజులు నిందించునట్లును, బలాత్కారముగా పట్టుకొనునట్టికాముకుని స్త్రీలు దూషించునట్లును, తీక్ష్ణము లగుపన్ను

1. దీనిచే మూర్ఖులు ఎందఱుండినను రాజున కొక్కసహాయమును గలుగదనియు కావున వారిని ఆశ్రయింపరాదనియు సూచితము.

2. దీనిచే మంత్రి బుద్ధిమంతుఁడును శూరుఁడును సమర్థుఁడును నీతిశాస్త్రజ్ఞుఁడునై యుండవలయుననుట సూచితము.

3. దీనిచే ఉత్తమభృత్యుని మధ్యమకార్యమునను అధమకార్యమునను నియోగించినయెడల అవమానమునొంది కార్యహాని కలిగించుననియు, మధ్యముని ఉత్తమకార్యమున నియోగించినయెడల అశక్తిచేతను, అధమకార్యమున నియోగించినయెడల అవమానముచేతను, కార్యహాని కలిగించుననియు; అధముని ఉత్తమమధ్యమకార్యములందు నియోగించినచో అశక్తిచే కార్యము చెఱుచుననియు; కావున ఆయాభృత్యునికి పరువునకుఁదగిన ఆయ్యాకార్యములందు నియోగింపవలయుననియు సూచితము.

4. దీనిచే, రాజులు పురుషునిమూలముగా మేలయిన వస్త్రాభరణాదులను పంపి, ఇతరరాజులు లంచముగా పంపినట్లును, అంతఃపురస్త్రీలు మోహమునఁ బంపినట్లును, జెప్పించి మంత్రులను పరీక్షింతురని తెలియునది. మఱియు నిట్లు పరీక్షించి తండ్రితాతలనుండి కొలువుసేయుచువచ్చునట్టి త్రికరణశుద్ధు లగునుత్తమపురుషులనే మంత్రులుగా నేర్పఱచికొనవలయుననియు, గొప్పవారిని గొప్పకార్యములకు, అల్పులను అల్పకార్యములకు నియోగింపవలయుననియు తెలియునది.

5. దీనిచే రాజు తీక్ష్ణమైన దండనములు సేయరాదనియు, చేసినయెడల మంత్రులు అతనిని నివారించువారుగా నుండవలయుననియు సూచితము.

6. దీనిచే రాజు కటువైనపన్నులు విధించి ధనము సంపాదింపరాదనియు, దుర్దానముచే సంపాదించి యాగముచేయరాదనియు, బలాత్కారమున స్త్రీలను పైకొనరాదనియు గ్రాహ్యము.

ను విధించి ధనము సంపాదించునట్టినిన్నుఁ బ్రజలు అవమానింపరుకదా? [1]సామాద్యుపాయములందు నిపుణుఁడును, కుటిలనీతిని చక్కఁగా నెఱిఁగినవాఁడును, అంతరంగభృత్యులపై లేనిదోషములు సెప్పి వారిని దొలఁగించుచుండువాఁడును, రాజహింసకు భయపడనిదిట్టఁడు నగుచు, రాజు ప్రభుత్వమునే యపహరింపఁ గోరువాఁడును నగుపురుషుని రాజు వధింపకుండునేని, వాఁడు రాజును తప్పక వధించును. అట్టివాఁడు నీయొద్ద లేఁడు గదా? [2]రాజుసేయుసత్కార్యములకు సంతుష్టుఁడై వ్యవహారములందు దిట్టయై శూరుండై ఆయాసమయములకుఁ దగునట్లు తనసైన్యమును పన్నను పరసైన్యమును భేదింపను జాలినంతబుద్ధి గలిగి, ఆపదలందు ధైర్యము మిగుల, బాహ్యాభ్యంతరముల శుచియై, తనస్వామియందు నమ్మిక గలిగి, సత్కులప్రసూతుఁడై, తనయందును మిక్కిలిప్రీతి గలిగి, కార్యసమర్థుండైన వానిని సేనాపతిగాఁ జేసికొంటివా? అట్టిసేనాపతియుండఁగా వానిని విడిచి మఱియొకనిని అట్టివానిని కైకొనవుగదా? [3]మిక్కిలిబలశాలురై యుద్ధములం దారితేఱి పెక్కుమాఱులు రణరంగమున పౌరుషమును ప్రకటించి ప్రసిద్ధినిగాంచి శూరులైనగణప్రధానులను పారితోషికాదులచే సత్కరించి గౌరవించుచున్నావుగదా? [4]సైనికులకు అయ్యాకాలముల నియ్యఁదగిన బత్తెమును సంబళమును కాలముదప్పక వారివారికిఁ దగునట్లుగా నిత్తువుగదా? అందులకు జాగుసేయవుగదా? [5]భటులు బత్తెముచే జీవించువారుగావున దానిని ఇయ్యవలసినకాలము నతిక్రమించినయెడల ప్రభువుపైని గోపమెత్తి చెఱుపు గావింపఁబూనుదురు. అది మిక్కిలియు గొప్పయనర్థమందురు. [6]ప్రధానులయినక్షత్రియకుల ప్రసూతులందఱును నీయందు మిక్కిలియనురాగము గలిగియున్నారుగదా? వారు మనఃపూర్వ

1. దీనిచె మిక్కిలి సమర్థుఁడై కుటిలోపాయములందు నిపుణుఁడై అంతరంగభృత్యులందు భేదముగలిగించుచు, రాజ్యకాముఁడై యుండుపురుషుని అవశ్యము వధింపవలయుననియు లేకున్న రాజునకే కీడు గలుగుననియు సూచితము.

2. దీనిచే స్వామియెడలసంతుష్టియు శౌర్యమును మఱియు ధైర్యమును విశ్వాసమును సత్కులమును ప్రీతియు సామర్థ్యమును గలవానినే సేనాపతిగా నేర్పరించుకొనవలయుననుట సూచితము.

3. రాజు బలవంతులును యుద్ధనిపుణులును పౌరుషమున ప్రఖ్యాతిగనియున్న వారలును శూరులునైన ప్రధానసైనికులను నానావిధముల సత్కరించిబహుమానింపవలయుననుటసూచితము.

4. సైనికులకు వారివారిపనులకుఁ దగినట్లు కాలముదప్పక బత్తెమును జీతమును రాజు ఇచ్చుచుండవలయునని సూచితము.

5. దీనిచే సైనికులకు సంబళము కాలముతప్పక యియ్యనియెడల వారలు కుపితులై కీడు చేయుదురనుట తెలియునది.

6. దీనిచే క్షత్రియకులప్రసూతులైనసైనికాగ్రణులను, నానావిధముల తనకు మిక్కిలి యనురక్తులుగాఁ గావించుకొని తనకుఁ గా ప్రాణములైనను విడుచునంతవశులనుగా రాజు చేసికొనవలయుననుట సూచితము.

కముగా నీకొఱకై తమప్రాణములనేని విడుచునంతవా రగుదురా? [1] భరతా! నీదేశమునందే పుట్టినవాఁడై, పరాభిప్రాయములను దెలిసికొనఁజాలి, సమర్థుఁడై అప్పటప్పటికి పైపైక్రొత్తగా నతిశయించుచుండుబుద్ధి గలిగి, తనకుం జెప్పినంతవట్టును కొంచెమయినను తప్పక చెప్పి నిర్వహింపఁగలవాఁడై యుక్తాయుక్తముల నివేదింప నేర్చినపురుషుని దూతఁగాఁ జేసికొంటివి గదా. [2] నీవు నీశత్రుపక్షమునఁ గలమంత్రి మొదలగుపదునెనిమిది తీర్థములను ఒక్కొక్కరికి ముగ్గురేసి చారులను, ఒండొరులకు తెలియనట్టివారిని నుంచి వారిరహస్యములను తెలియుచున్నావా యేమి? అట్లే నీపక్షమునందు ఎప్పుడును నీసమక్షముననే యుండునట్టి

1. దీనిచే రాజు, పరదేశమున పుట్టినవాఁడైనయెడల పక్షపాతము సేయును గాన తనదేశమునందె పుట్టినవాఁడును పరాభిప్రాయజ్ఞుఁడును సమర్థుఁడును ప్రతిభ గలవాఁడును కార్యార్థముగా బహువిధముల మాటలాడుచున్నను స్వామి తనకు చెప్పినదిమాత్రము విడువకయే వ్యవహరించి నిర్వహించునట్టి వాఁడును వివేకియు నైనపురుషుని దూతగా ఏర్పఱచుకొనవలయుననుట సూచితము.

2. పదునెనిమిదితీర్థము లెవ్వరనఁగా—మంత్రి, పురోహితుఁడు, యువరాజు, సేనాపతిఁ దౌవారికుఁడు-అనగా అంతఃపురాదిద్వార రక్షకులకు నిర్వాహకుఁడు, అంతర్వంశికుఁడు-అనఁగా అంతఃపురకార్యములను నిర్వహించువాఁడు. కారాగారాధికృతుఁడు-అనగా చెఱసాలకధిపతి, అర్థసంచయకారుఁడు-అనఁగా ధనాధ్యక్షుఁడు, కార్యనియోజకుఁడు-అనఁగా రాజునాజ్ఞను బయట వెలయించువాఁడు, ప్రాడ్వివాకుఁడు-అనఁగా వ్యవహారములను అడుగువాఁడు-తల్లక్షణము 'వివాదే పృచ్ఛతి ప్రశ్నం ప్రతి ప్రశ్నం తథైవ చ। ప్రియపూర్వం ప్రాగ్వదతి ప్రాడ్వివాక స్తతః స్మృతః' ఏవాదమేనికలుగఁగా నందు ప్రశ్నోత్తరము లడుగుచు ప్రియపూర్వకముగా నేతానేమందుపడిమాటాడువాఁడు ప్రాడ్వివాకుఁడనఁబడును, సేనానాయకుఁడు సేనకు బత్తెముజీతము మొదలయినవి యిచ్చునధ్యక్షుఁడు, నగరాధ్యక్షుఁడు-రాత్రులు నగరశోధనము సేయుచు నగరద్వారములను ప్రాకారాదులను రక్షించుకార్యములను విధించువాఁడు, కర్మాంతికుఁడు-సైనికులు కాక పనిచేసి తీరఁగానే సంబళము పుచ్చుకొను తక్కిన భృత్యులకెల్ల సంబళము రాజునొద్దనుండి తా నొక్క మొత్తముగా పుచ్చుకొని వారికి వేఱువేఱ యిచ్చునట్టియధికారి, సభ్యుఁడు-ప్రతిదినమును సభ నలంకరించుట, రాజు మంత్రి మొదలైనవారికి తగినయాసనము లేర్పఱచుట, సభ్యులైనవారిని తోడ్కొనివచ్చుట, అసభ్యులను రానీక యాఁపుట, వారివారికి తగిననివేశము లుంచుట, సభయందు సద్దులేకుండ జేయుట, సభనురక్షించుట మొదలైనపనులు సేయువారికి నిర్వాహకుఁడు, ధర్మాధ్యక్షుఁడు-దాయభాగాదివివాదములందు వివాదవిషయములను చక్కఁగా శోధించి ధర్మశాస్త్రముచొప్పున తగవు తీర్చువాఁడు, దండపాలుఁడు-పరధనాపహరణము మొదలైనయపరాధములు సేసినవారికి రాజాజ్ఞచొప్పున కరశిరశ్ఛేదాదులు సేయుజనులకు నిర్వాహకుఁడు, రాష్ట్రాంతపాలుఁడు-తనరాజ్యముపొలిమేరలందు అన్నిదిక్కుల పరరాజు లాక్రమించుట మొదలైనవి కలుగకుండునట్లు రక్షించుజనులకు నిర్వాహకుఁడు. ఈపదునెనమండ్రును తీర్థములనఁబడుదురు. శత్రుపక్షమునం గలయీపదునెనమండ్రను చారులమూలమున పరీక్షించుచుండవలయును. స్వపక్షమునందు మంత్రిపురోహితయువరాజులు ముగ్గురను తనసమక్షముననే యుండుటచే వారివర్తనములను తానే పరిశీలించుచుండుటవలన వారిని విడిచి తక్కినపదునేవురకు మాత్రము చారులనుంచి వారివర్తనములు తెలిసికొనుచుండవలయును.

మంత్రిపురోహితుఁడు యువరాజు అనుమువ్వురు తిప్పతెక్కినపదునైదుతీర్థములను అక్లేముగ్గురేసిచారులను ఒండొరులకు తెలియఁనట్టివారినిగా నుంచి రహస్యముల తెలియుచున్నావేకదా. శత్రుసూదనా! నీచే తఱుమఁగొట్టఁబడిన శత్రువులు కొంత కాలమునకు మరలివచ్చినపుడు దుర్బలులని వారలనులక్ష్యపెట్టక యెప్పుడును వారల యెడ నెచ్చరిక గలిగియుందువుగదా? నాయనా! నాస్తికులైనబ్రాహ్మణులను సేవింపవుగదా? వీరు బాలిశులు, మఱి తమకేమియు తెలియకున్నను పండితులని ఎన్నుకొనుచుండువారు. కనుక దుర్బోధనలు సేసి ధర్మలోపము అధర్మాచరణము మొదలైన పెక్కనర్థములను గూర్చుటయందు నిపుణులుగానుందురు. దుర్బుద్ధులైనయా నాస్తికులు సాత్త్వికులైన మహర్షులచే ప్రణీతములై సజ్జనాదరణీయము లగుటచే ప్రధానములై యొప్పెడుధర్మశాస్త్రము లుండఁగా వానిని విడిచి కేవలశుష్కతర్కము నూఁదినబుద్ధితో నిరర్థకములైన మాటలు చెప్పుదురు. నాయనా! [1]అయోధ్య పరాక్రమశాలులైనమనపూర్వికు లధిష్ఠించియుండినది. కావున సార్థకమైననామమై శత్రువుల కెదిరింపరాకుండునది, దానిబహిర్ద్వారములు మిగులదృఢములుగా నుండును. అది రథగజతురగములు నెఱసి మెఱయుచుండునది, తమతమకర్మములందు నిరతులై జితేంద్రియులును ఉత్సాహవంతులును పూజ్యులును నగుబ్రాహ్మణక్షత్రవైశ్యులు పెక్కండ్రు వేలకొలఁదిని నిండియుండునది, నానావిధరూపములైనయుప్పరిగలచే నావరింపఁబడియుండునది, విద్వజ్జనులు మెండుకొనియుండునది. సొంపుపెం పారుజనులు గలిగి సకలసంపత్సమృద్ధులచే వెలుఁగుచున్న ఆయయోధ్యాపురమును పదిలముగా పాలించుచున్నావుగదా! భరతా! మనదేశము అశ్వమేధాది మహాయాగములను గావించినపలుప్రదేశములతోఁ గూడి మంచిరాచతికము సువృష్టి ఆరోగ్యము మొదలైనగుణములంబట్టి సుప్రతిష్ఠితు లగుజనులుగలిగి, దేవాలయములు చలిపందిరులు చెఱువులు మొదలగువానిచే నలంకృతమై, సంతుష్టిగలస్త్రీలును పురుషులును గలిగి, సంతలు ఉత్సవములు మొదలైనవానిచే వన్నెగులుకుచు, చక్కఁగా దున్నఁబడినభూమియు నొప్పు, పశుసంపత్తియుఁబఱి హింసాదులు మాలి నిటివాఱుదలచేఁ బండెడుచేలు గలిగి, తోఁటలు మొదలగువానిచే నీటుగులుకుచు, వ్యాఘ్రాదిక్రూరజంతువులు లేక చుట్టునుగూడ చోరాదిసకలభయములును మాలి, బంగారు రత్నములు మొదలయినవానిగనులచే వెలయుచు, పాపజనరహితమై మనపూర్వికులచే సంరక్షితమై యొప్పుచుండును. అట్టిదేశమంతయు సంపత్సమృద్ధి గలిగి సుఖముగా నున్నదికదా? నాయనా! కృషిగోరక్షణాదులచే జీవించునట్టివారగు వైశ్యులందఱును అర్థముల నొడఁగూర్చుచు అభిమతముగా నడచుకొనుచున్నారుగదా? వారి

1. దీనిచే పలాయితులైనశత్రువులు దురభిప్రాయము లేక మరల రారు గనుక వారు మరలివచ్చిరేని దుర్బలులని యుండక వారియెడల జాగ్రత్త గలిగియుండవలయునని తెలియునది.

వలన వర్తకము జరుగుచుండునేని నిన్నాశ్రయించినజనులకు సుఖము వర్ధిలును జుమీ. నీవు ఆప్తవైశ్యులకు అభీష్టములను పొందించి కాచుచు అనిష్టముల నివారించుచు పోషించుచున్నావుగదా? రాజు ధర్మమున తనదేశప్రజనులనందఱిని తప్పక రక్షింపవలయునుగదా? అందును వర్తకులను విశేషించి రక్షింపవలయును. [1] నీయంతఃపురస్త్రీలను బుజ్జగించుచు వారికనుకూలముగా వర్తింతువా? వారికిని పరపురుషసంభాషణాదులు సంభవింపకుండునట్లు మిక్కిలిపదిలముగా రక్షింతువు గదా? వారిమాటను నిజమని నమ్మవుగదా? వారలకు రహస్యములను జెప్పవు గదా? [2] గజముల యుత్పత్తిస్థానమైన వనమును చక్కఁగా రక్షించుకొనుచున్నావుగదా? అడవియేనుఁగులను వశము గావించి తెచ్చు ఆఁడుగజములు నీయొద్ద నున్నవిగదా? మఱియు నాఁడుగజములను గజములను గుఱ్ఱములను సంగ్రహించుటయందు తృప్తినొందవుగదా? [3]రాజపుత్త్రా! నీవు నిత్యమును ప్రాతఃకాలమున లేచి యలంకృతుఁడవై సభయందు జనులకు దర్శనమొసఁగుదువు గదా? [4]పనివాండ్రందఱును నిర్భయముగా నీయెదుటికి రారుగదా? మఱి దర్శనమియ్యక వారికి దిగవిడువవుగదా? మిక్కిలియు దర్శనమియ్యక, దర్శనమియ్యకయునుండక, రెంటికి మధ్యముగా పనివడినప్పుడు అరుదుగానేని వారలకు దర్శనమిచ్చుటయే కార్యసిద్ధికి మూలము. [5] దుర్గములన్నియు ధనధాన్యములచేతను జలముచేతను నానావిధాయుధములచేతను యంత్రములచేతను సంపూర్ణములై శిల్పులు విలు

1. దీనిచె రాజు ఎల్లప్పుడును తన స్త్రీలను లాలనముతో మెలపుచుండవలయుననియు, వారలకు పరపురుషసంభాషణాదులు కలుగకుండునట్లు చూచుకొనవలయుననియు,వారలమాట నమ్ముట గాని వారికిరహస్యము చెప్పుటగాని తగదనియు, సూచితము.

2. దీనిచేరాజు ఎప్పుడును ఏనుఁగులను వానిని వశపఱిచి తెచ్చు ఆఁడుగజములను గుఱ్ఱములను సంగ్రహించుచునే యుండవలయుననియు, చాలునని తృప్తినొందినయెడల పట్టక మిగిలినవానిని పరులు సంగ్రహించుకొనుట గలుగుననియు సూచితము.

3. దీనిచే రాజు ప్రతిదినమును ప్రాతఃకాలమున లేచి జనులకు దర్శనమిచ్చుచుండ వలయుననియు లేకున్నవారికి తనయారోగ్యమువిషయమై సంశయము గలుగుననియు సూచితము.

4. దీనిచే రాజు పనివాండ్రకు పలుమాఱు దర్శనమిచ్చుటచే వారికి అనాదరమును తనసన్నిధియందు జంకులేమియును గలుగును గావునను, అట్లుమాటికి దర్శన మియ్యరాదనియు, దర్శనమొకప్పుడు నియ్యకుండుటచే వారికి మనవిచేసుకొనుటకు వీలులేక గోపముగలుగుటవలన రాజకార్యహాని కలుగును గాన దర్శనమియ్యకయే యుండుటయుఁ దగదనియు, పనివడినపుడు అరుదుగా ఆ దర్శనమిచ్చుటయే కార్యసిద్ధికరమనియు సూచితము.

5. దీనిచే రాజు జలపర్వతాదిదుర్గములయందు ధనము ధాన్యము జలము ఆయుధములు యంత్రములును సమకూర్చి యుంపవలయుననియు, శిల్పులను విలుకాండ్రను మిక్కిలియు నలవఱచి యుంచవలయు నని సూచితము.

కాండ్రను నిండియున్నవిగదా? [1] రఘువంశ్యా! నీకు వచ్చుబడి మిక్కిలి వచ్చుచున్నదిగదా? సెలవు మిక్కిలియు గొంచెముగాఁ జేయుచునవుగదా? నటవిటగాయకాదులైన యపాత్రములకు కూర్చినధనమును వినియోగింపవుగదా? [2]నీసెలవు దేవతలు పితృదేవతలు బ్రాహ్మణులు అతిథులు యోధులు మిత్రవర్గములు వీరికొఱకు వినియుక్తమగుచున్నదిగదా? [3]పరిశుద్ధహృదయుండును త్రికరణశుద్ధుండును పూజ్యుండు నయినపురుషుఁడు దైవికముగా దొంగతనముచే దూషితుఁడై యెదుటికి తేఁబడినయెడల అతనిని నీతిశాస్త్రవిదు లయినవారిచే నడిగించి పరిశీలింపక లంచముపేరాసచే వధింపవుగదా? [4] పురుషతిలకా! దొంగిలించుకొని పాఱిపోయినవ్వాడును దగినకాలమునను చూడంబడి దొంగిలింపపడిన వస్తువుతో పట్టుకొనంబడి పండితులచే శోధింపఁబడి దొంగయని నిశ్చయింపఁబడినవానిని లంచమునకాసపడి విడిచిపుచ్చవుగదా? [5]రఘువంశ్యా! మిక్కిలివిద్యావంతు లైననీమంత్రులు ధనికునకును దరిద్రునకును వివాదసంకటము వచ్చినపుడు ధనాశవిడిచి వారివ్యవహారమును నిష్పక్షపాతముగా పరీక్షింతురుగదా? [6] రఘువంశ్యా! లేనినేరము ఒకరియందు మోపఁబడెనేని వారింగూర్చి న్యాయాన్యాయవిచారముసేయక కేవల భోగార్థము రాజ్యముసేయునట్టి రాజుకొడుకులనును పశువులనును, వారికంట నుండి కాఱుకన్నీళ్లునశింపఁజేయుచున్నది. [7]రఘుకులీనా! వృద్ధులను బాలురనుబండితశిఖామణులను ధనాదులొసఁగియు స్నేహముచూపియు మంచిమాట లాడియు

1. దీనిచే రాజు, వచ్చుబడి యధికముగా నుండునట్లును సెలవుతక్కువగా నుండునట్లును చూచుకొన వలయుననియు, నటవిటగాయకొగులకు ధనము అపరిమితముగా నియ్యరాదనియు సూచితము.

2. దీనిచె రాజు దేవతాపితృబ్రాహ్మణాదులకుఁ దక్క తక్కినవిషయములందు సెలవు వ్యర్థముగాఁ జేయరాదని తెలియునది.

3. దీనిచే రాజు పూజ్యుఁడైనపురుషునిమీఁద దైవికముగా నేరము మోపబడినప్పుడు జాగ్రత్తతో విచారించి నిజము తెలిసికొనక దండింపరాదనుట సూచితము.

4. దీనిచే ఒకఁడు దండింపఁదగినవాఁడుగా నిశ్చయింపఁబడినపెనుక వానిని దండింపక విడుచుట రాజునకు మహాదోషమని తెలియునది.

5. దీనిచే మంత్రులు ధనికునకును దరిద్రునకును వివాదము వచ్చినపుడు ధనికునియొద్దలంచము పుచ్చుకొని వ్యవహారము తప్పుగా తీర్పరాదనియు అట్లు తీర్చుట మహాదోషమనియు గ్రాహ్యము.

6. దీనిచే రాజు అదండ్యులను దండించినచో ఆతనివంశమును సంపదలును నశించునని సూచితము.

7. దీనిచే రాజు వృద్ధులను బాలురను పండితులను దానాదులచే వశముచేసికొనవలయుననుట సూచితము.

ఈ మూఁడుపాయములచేత స్వైవసముచేసి కొందువారేమి? [1] గురువులకును వృద్ధులకును తాపసులకును దేవతలకును అతిథులకును చతుష్పథములందు దేవతావాసములైన మహావృక్షములకును యోగాదికర్మముచే కృతార్థులైన బ్రాహ్మణులకును అందఱికిని నమస్కరింతువుగదా? [2] అర్థమునే యార్జించుచు ధర్మమును విడువవుగదా. అట్లుధర్మమునే యార్జించుచు అర్థమును విడువవుగదా. సుఖాభిలాషచేఁగాని కామవశమునఁగాని ధర్మమును అర్థమును రెంటిని విడువవుగదా? [3] జయశీలతిలకా! నీవాయాకాలములను దెలిసినవాఁడవు. ధర్మార్థకామములను మూఁటిని విభజించి వానివాని యుచితకాలమున సేవింతువుగదా? [4] మహాప్రాజ్ఞా! సకలశాస్త్రవిదులగుబ్రాహ్మణులును పురజనులును పల్లెపట్లజనులును నీ సుఖమును గోరుచుందురుగదా? నాస్తికత్వము, అబద్ధమాడుట, మిక్కిలికోపము, పరాకుపడుట, ఆలస్యముగా పనిసేయుట, జ్ఞానవంతుల దర్శింపకుండుట, మత్తత, ఇంద్రియపరవశత్వము, మంత్రులక్కఱలేదని తానొక్కఁడే కార్యము నాలోచించుట ఆలోచింప నిశ్చయించినవానిని ఆరంభింపకుండుట, ఆలోచించిన విషయమును బయలు పుచ్చుట, ప్రాతఃకాలమున నద్దముచూచుకొనుట మొదలైన యమంగళప్రయోగములను జేయకుండుట, ఏకకాలమున సకలశత్రువులతోను యుద్ధముసేయుట అనుపదునాల్గు రాజదోషములు విడుతువేకదా. మహాప్రాజ్ఞా! నీవు*దశవర్గమును పంచవర్గమును చతుర్వర్గమును సప్తవర్గమును అష్టవర్గమును త్రివర్గమును

---

1. దీనిచే రాజు గురువులను వృద్ధులను తపస్వులను దేవతలను అతిథులను చతుష్పథవృక్షములను బ్రాహ్మణోత్తములను జూచునపుడు నమస్కరింపవలయుననుట తెలియునది.

2. దీనిచే రాజు ధర్మమును అర్థమును రెంటిని విడువక సుఖమును బట్టికొని కామమును బట్టికొని దానిని చెఱుపుకొనక సంగ్రహించుకొని యుండవలయుననుట సూచితము.

3. దీనిచే రాజు పూర్వాహ్ణమున ధర్మమును అపరాహ్ణమున అర్థమును సాయంకాలమున కామమును విభజించి ఆయాకాలముల దానిదానిని సేవింపవలయునుగాని ఒకదాని కాలమున మఱొకటిచేయుటయు ఒకటిని విడిచి మఱొకటినే సంగ్రహించుటయుఁ గూడదని తెలియునది.

4. దీనిచే రాజునకు నాస్తికత్వము అబద్ధము కోపము ప్రాలుమాలిక సజ్జనాదర్శనము మొదలైన దుర్గుణము లుండరాదని సూచితము.

*ఇందులకు 'దశపంచచతుర్వర్గాన్ సప్తవర్గంచతత్త్వతః। అష్టవర్గం త్రివర్గంచ విద్యాస్తిస్రశ్చ రాఘవ॥ ఇంద్రియాణాం జయం బుద్ధ్వా షాడ్గుణ్యం దైవమానుషం। కృత్యం వింశతివర్గంచ తథా ప్రకృతి మణ్డలం॥ యాత్రా దణ్డవిధానంచ ద్వియోనీ సన్ధివిగ్రహౌ। కచ్చిదేతాన్ మహాప్రాజ్ఞ యథావదనుమన్యసే' అని మూలము-దశవర్గము '—'మృగయాఽక్షో దివాస్వాపః పరివాదః స్త్రియో మదః। తౌర్యత్రికం వృథాట్యాచ కామజో దశకోగుణః'-వేఁట, జూదము, పగలు నిద్రించుట, నిందించుట, స్త్రీలు, మదము, నృత్తము, గీతము, వాద్యము, వ్యర్థముగా త్రిమ్మరుట అనెడి యీపదియు కామమువలనఁ బుట్టుగుణములు. లేక.—'లుబ్ధః క్రూరోఽలసోఽసత్యః ప్రమాదీ భీరురస్థిరః। మూఢోఽవయోఽవమన్తాచ సుఖచ్ఛేద్యోరిపుర్మతః''-కామందకుఁడు. 'లోభము, క్రౌర్యము, ఆలస్యము,

మూఁడువిద్యలను ఇంద్రియవశీకరణమును షడ్గుణములను దైవమును మానుషమును భేదకృత్యమును వింశతివర్గమును ప్రకృతిమండలమును దండయాత్రయును సైన్య

ఆసత్యము చెప్పుట, పరాకుపడుట, పిఱికితనమును, స్థైర్యములేమి, మూఢత, నీతిలేమి, పరుల నవమానించుట, అనునివి పదియు దశవర్గమనబడును. పంచవర్గము —'ఔదకం పార్వతం వార్క్షమైరిణం ధాన్వనం తథా' అన్నట్లు జలమయమును, పర్వతమయమును, వృక్షమయమును, పాడుడవులమయమును విలుకాండ్రమయమునుగా నుండెడి అయిదు దుర్గములు' అని కామందకుఁడు. లేక —'సాపత్న్యం వస్తుజం స్త్రీజం వాగ్జాత మపరాధజమ్। వైరప్రభేదనిపుణై ర్వైరం పంచవిధం స్మృతమ్' కామంద-'సవతితల్లి, బిడ్డలచే, (శత్రువులచే) జేయఁబడినదియు, ద్రవ్యమువలనఁ బుట్టినదియు, స్త్రీవలనఁబుట్టినదియు, మాటవలనఁగలిగినదియు, అపరాధమువలన సంభవించినదియునని పంచవిధవైరములగును. చతుర్వర్గమనఁగా -'సామం దానంచ భేదశ్చ దణ్డశ్చేతిచతుర్విధమ్' సామము, దానము, భేదము, దండము అని నాలుగు ఉపాయములు. లేక —'ఔరసం తత్సంబంధం తథా వంశక్రమాగతం। రక్షితం వ్యసనేభ్యశ్చ మిత్రంజ్ఞేయం చతుర్విధమ్' కామందకుఁడు-స్వభార్యయందుఁబుట్టినవాఁడును, తంతుసంబంధముగలవాఁడును, వంశక్రమముగా వచ్చినవాఁడును, ఆపదలనుండి రక్షింపఁబడినవాఁడును అని నాలుగువిధము లైనమిత్రులును; లేక;-''యేనార్జన మర్థస్య రక్షణం వర్ధనం తథా। సత్పాత్రే ప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్'' కామందకుఁడు-ధనమును న్యాయముతో నార్జించుట, దానిని రక్షించుట, దానినివృద్ధిఁబొందించుట, సత్పాత్రమునందు వినియోగించుట, అనురాజవృత్తముయొక్క నాలుగువిధములు, [సప్తవర్గ]మేదనఁగా'-'స్వామ్యమాత్యాశ్చ రాష్ట్రంచ దుర్గం కోశో బలంసుహృత్। పరస్పరోపకారీదం రాజ్యం సప్తాంగ ముచ్యతే'-'రాజును, మంత్రులును, రాష్ట్రమును, దుర్గమును, బొక్కసమును, సేనయును, మిత్రులును, అనురాజ్యాంగము లేడు. లేక —ఏడువిధము లైనస్వపక్షమువారు —'నిజోఽర్థమైత్రశ్చ సమాశ్రితశ్చ సుబన్ధుజః కార్యసముద్భవశ్చ। భృత్యో గృహీతో వివిధోపచారైః పక్షం బుధాః సప్తవిధం వదన్తి' అన్నట్లు 'తనవాఁడును, మిత్రునకు సంబంధించినవాఁడును, ఆశ్రితుఁడును, బంధుసంబంధము గలవాఁడును, కార్యసంబంధముచె వచ్చిన వాఁడును, వివిధోపచారములచే వశీకరింపఁబడినవాఁడును, భృత్యుఁడును, అనెడి యీయేడ్గురు స్వపక్షపువారు; లేక 'శ్యేనః సూచీచ వజ్రశ్చ శకటో మకర స్తథా।దండాఖ్యః పద్మనామాచవ్యూహాఃసప్తప్రధానతః' 'శ్యేనము, సూచి, వజ్రము, శకటము, మకరము దండము, పద్మము' అనెడి ప్రధానవ్యూహము లేడు. (అష్టవర్గమ్) —కృషివాణిజ్యదుర్గాణి సేతుః కుఞ్జరబన్ధనమ్। ఖన్యాకరఃకరాదానం శూన్యావాసనివేశనం। అష్టవర్గ మిదం సాధు స్వవృద్ధ్యై నలోపయేత్' కామందకుఁడు-కృషి, వాణిజ్యము, దుర్గము, వంతెన, ఏనుఁగులను బట్టుట, గనులను సంగ్రహించుట, పన్నుతీయుట, రిత్త బయళ్ళలో వాసస్థలము లేర్పరచుట, అనునవి యెనిమిది; లేక '-పైశున్యం సాహసంద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణం। వాగ్దణ్డయోశ్చపారుష్యం క్రోధజోఽపిగుణోఽష్టకః-పిసినితనము, సాహసము, ద్రోహము, ఈర్ష్య, అనఁగా అపరాధముల నోర్వకొనమి, అసూయ, అనఁగా గుణములందుదోషములను ఆరోపించుట, అర్థదూషణము = అనఁగా అర్థమును దుర్వినియోగము సేయుట, వాక్పారుష్యము, కఠినముగా దండించుట, అనిక్రోధమువలనఁ బుట్టు నెనిమిదిగుణములు. (త్రివర్గమ్) —ధర్మము, అర్థము, కామము అను మూఁడుపురుషార్థములు లేక —ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి అనుశక్తులుమూఁడు, లేక, —'క్షయం స్థానఞ్చ వృద్ధిశ్చ త్రివర్గోనీతి వేదినామ్' అన్నట్లు శత్రువుల క్షీణత్వము, తమరు

ములయొడ్డనములును రెండుకారణములను సంధివిగ్రహములను అనుపీనిని శాస్త్రము చెప్పిన విధమువలసినవానిని విడిచి కైకొనవలసిన వానినిగయిగొనుచు అనుష్ఠించు

పాటు, అభివృద్ధి' అను మూఁడు, లేక - వస్తుష్వశక్యేషు సముద్యమశ్చ । శక్యేషు మోహాద సముద్యమశ్చ । శక్యేష్వకాలేషు సముద్యమశ్చ । త్రిధైవ కార్యవ్యసనంవదన్తి' 'అశక్యము లైన వస్తువులకై పూనుట, శక్యములైన వస్తువులకు అజ్ఞానముచే పూనకుండుట, శక్యము లైనవానికి అకాలమునందుపూనుట, అనుమూఁడు కార్యవ్యసనములు. (విద్యాస్త్రిస్రః) 'త్రయీ వార్తా దణ్డనీతిరితి విద్యా హిమానవాః' కామందకుఁడు - త్రయి = వేదము, వార్త = కృషి గోరక్షణ వాణిజ్యములు, దండనీతి = నీతిశాస్త్రము అనుమూఁడవిద్యలు. [ఇంద్రియాణాం జయం] ఇంద్రియము లనుజయించు నుపాయము. షాడ్గుణ్యమ్-అనఁగా షడ్గుణములు —సంధి, విగ్రహము, యానము = గెలుచుటకై శత్రువుంగూర్చి పోవుట-దండయాత్ర, ఆసనము = ఆయిరువురు తమశక్తులు ఒండొరులచే కట్టుపడఁగా యుక్తకాలమును ఎదురుసూచుచు ఊరకుండుట, ద్వైధీభావము = ప్రబలులైన యిద్దఱు శత్రువులును ఒకరినొకరు ద్వేషించుచుండఁగా దుర్బలుఁడైనవాఁడు తన్నువారిలో ఒక్కొక్కనికిని వానిపాలివానిగా మాటమాత్రము నిచ్చుచు కలియకుండుట, ఆశ్రయము = తనపగవానిచే పీడితుఁడై మఱొకబలవంతుని ఆశ్రయించుట, అనెడియీయేడుగుణములు. (దైవమానుషౌ) దేవతల వలనను మనుష్యులవలనను గలుగు వ్యసనములు - అందు దైవవ్యసనములు 'హుతాశనోజలంవ్యాధి ర్దుర్భిక్షం మరణంతథా' 'అగ్ని, జలము, వ్యాధి, కఱవు, మరణము' అనునవి, మానుషవ్యసనములు - 'ఆయుక్తకేభ్యశ్చోరేభ్యః పరేభ్యో రాజవల్లభాత్। పృథివీపతిలోభాచ్చ వ్యసనం పంచధాభవేత్'॥ అధికారులవలనను,దొంగలవలనను,శత్రువులవలనను, రాజులకు ప్రియులైనవారివలనను,రాజుయొక్క పేరాసవలనను గలుగువ్యసనములు. (కృత్యమ్)అనఁగా భేదకార్యము. 'అలబ్ధవేతనోలుబ్ధోమానీచాప్యవమానితః। క్రుద్ధశ్చ కోపితోఽకస్మాత్తథాభీతశ్చభీషితః। యథాభిలషితైః కామైర్భిద్యాదేతాంశ్చతుర్విధాన్''సంబళమునుపొందనిలుబ్ధుఁడును,అవమానింపఁబడిన మానవంతుడును,కోపమునొందింపబడినకోపస్వభావుఁడును,భయపెట్టఁబడినపిఱికివాఁడును, అనెడినలువురిని శత్రుపక్షములోనివారిని అభిమతములనిచ్చి భేదింపవలయును'అని చెప్పఁబడినభేదకార్యము. (వింశతివర్గమ్)ఇరువదింటిసమూహము·—'బాలోవృద్ధో దీర్ఘరోగీ తథాజ్ఞాతి బహిష్కృతః।భీరుకోభీరుజనకో లుబ్ధోలుబ్ధజనస్తథా। విరక్తప్రకృతిశ్చైవ విషయేష్వతిసక్తిమాన్। అనేకచిత్తమంత్రశ్చ దేవబ్రాహ్మణనిన్దకః। దైవోపహతకశ్చైవ దైవచిన్తక ఏవచ। దుర్భిక్షవ్యసనోపేతో బలవ్యసనసఙ్కులః। అదేశస్థోబహురిపుర్యుక్తోఽకాలేన యశ్చ సః। సత్యధర్మవ్యపేతశ్చ వింశతిః పురుషా అమీ। ఏతైః సన్ధిం న కుర్వీత నిగృహ్ణీయాత్తు కేవలమ్'-బాలుఁడును, వృద్ధుఁడును, దీర్ఘరోగియు, బంధుజనులచే బహిష్కరింపఁబడిన వాఁడును, పిఱికివాఁడును, పిఱికివాండ్రయినమంత్రి మొదలగు జనులుగలవాఁడును, వైరాగ్య ప్రకృతిగలవాఁడును, విషయలోలుఁడును, ఒక్క నిలుకడయైన మనస్సుతో ఆలోచనము సేయనివాఁడును, దేవబ్రాహ్మణులను నిందించువాఁడును-దైవముచేకొట్టుపడినవాఁడును-అనఁగా మహర్షి శాపాదులచేఁగొట్టువడినవాఁడును, దైవము నేనమ్మి పురుషప్రయత్నమును చేయనివాఁడును, దుర్భిక్ష దుఃఖముచే పీడితుఁడైనవాఁడును, సైన్యవిలయముచే కలఁగినవాఁడును, దేశాంతరముననున్నవాఁడును పెక్కుశత్రువులుగలవాఁడును, అకాలముతో-అనఁగా క్రూరగ్రహాదులతో-గూడినవాఁడును, సత్యమును ధర్మమునులేనివాఁడును, అనెడి యీయిరువదిమంది పురుషులతో సంధి సేయరాదు. వీరితో యుద్ధమే చేయవలయును'అనఁబడిన యిరువదిమందిదుర్బలశత్రువులు. లేక,-రాజ్యశ్రీస్థానదేశానాం

జ్ఞాతీనాంచ ధనస్యచ । అపహారో మదోమానః పీడా వైషయికీ తథా ॥ జ్ఞానార్థశక్తిధర్మాణాం విఘాతో దైవమేవచ । మిత్రార్థయోశ్చావమానస్తథా బన్ధువినాశనం । భూతానుగ్రహవిచ్ఛేద స్తథా మణ్డలదూషణం । ఏకార్థాభినివేశిత్వ మితివిగ్రహయోనయః'-'రాజ్యము నపహరించుట, స్త్రీ నపహరించుట, స్థానము నపహరించుట, దేశము నపహరించుట, జ్ఞాతుల నపహరించుట, ధనము నపహరించుట, మదము, విషయపారవశ్యము, జ్ఞానములేమి, ధనములేమి, శక్తిలేమి, ధర్మములేమి, ఇంద్రాది దేవతలకు విరోధియగుట, మిత్రు నవమానించుట, మిత్రుని సంబంధించినవాని నవమానించుట (లేక మిత్రధనము నపహరించుట), లోకానుగ్రహము లేకుండుట, తనమంత్రులు సేనాపతులు స్నేహితులు మొదలైనవారిని భేదించుట, తనకు అభిమతమైన దానినే పట్టుగాఁగోరుట, అనెడి యీ యిరువది యుద్ధకారణములు. ప్రకృతిమండలం=ప్రకృతులను మండలమును అందు ప్రకృతులు 'అమాత్యరాష్ట్రదుర్గాణి కోశో దణ్డస్తుపఞ్చమః । ఏతాః ప్రకృతయస్తద్ జ్ఞైర్విజిగీషోరుదాహృతాః' 'మంత్రులు, రాష్ట్రము, దుర్గములు, భాండారము, సేన' అనెడి ప్రకృతు లయిదు. మండలమనఁగా గెలువఁగోరు రాజునకు (విజిగీషువునకు) ముందు వెనుక ప్రక్క మొదలగు భాగములందు పండ్రెండురాజులు. అందు అందఱికి నడుమనుండు విజిగీషు వొకఁడు అతనికి ముందఱిభాగముననున్నవాఁడు శత్రువు. శత్రువునకు ముందఱిభాగముననున్నవాఁడు మిత్రుఁడు. అతనికి ముందఱివాఁడు శత్రుమిత్రుఁడు. అతనికి ముందఱివాఁడు మిత్రమిత్రుఁడు. అతనికి ముందఱివాఁడు శత్రుమిత్రమిత్రుఁడు, ఇట శత్రుఁడనఁగా పగవాఁడు కాఁడు; ముందఱిభాగమున నుండు రాజు. మిత్రుఁడనఁగా స్నేహితుఁడు గాఁడు; ముందఱి రాజునకవ్వలిరాజు. ఇట్లు విజిగీషువునకు ముందఱిభాగముననుండు రాజు లయిదుగురు. విజిగీషువునకు వెనుకటిభాగమున నుండు శత్రువు, పార్ష్ణిగ్రాహుఁడు. అతని వెనుక నుండు మిత్రుఁడు, ఆక్రందుఁడు. ఇతనికి వెనుకనుండువాఁడు, పార్ష్ణిగ్రాహునకు మిత్రుఁడుగాన పార్ష్ణిగ్రాహాసారుఁడనఁబడును. ఆసారుఁడనఁగా మిత్రుఁడు. ఈపార్ష్ణిగ్రాహాసారునకు వెనుకఁటివాఁడు ఆక్రందునకు మిత్రుఁడుగావున ఆక్రందాసారుఁ డనఁబడును. ఇట్లు విజిగీషువునకు వెనుకభాగమున పార్ష్ణిగ్రాహుఁడు ఆక్రందుఁడు పార్ష్ణిగ్రాహాసారుఁడు ఆక్రందాసారుఁడని నలుగురు. విజిగీషువునకు పార్శ్వభాగమం దుండుమధ్యముఁడు ఒకఁడు. ఇతఁడు, విజిగీషువు శత్రుఁడును కలిసియున్నయెడల అనుగ్రహించుటకును వేఱుపడినయెడల నిగ్రహించుటకును సమర్థుఁడుగానుండును. వీరికందఱికిని వెలుపలయై వీరందఱిని కలసియున్నయెడల అనుగ్రహించుటకును భేదించియున్నయెడల నిగ్రహించుటకును చాలినంతబలాధికుఁడై దూరదేశమునందుండు నొకరాజు ఉదాసీనుఁడనఁబడును. ఇతఁడొకఁడు. ఇట్లు విజిగీషువుతోడ పండ్రెండురాజులు, మండల మనఁబడుదురు. విజిగీషువు ఏదిక్కునుగూర్చి యుద్ధమునకుఁ బోవునో అదియే ముందఱిభాగమని యెఱుఁగునది. ఈవిషయమే కామందకుఁడు 'సంపన్నస్తు ప్రకృతిభిః మహోత్సాహః కృతశ్రమః । జేతుమేషణశీలశ్చ విజిగీషురితిస్మృతః । అరిర్మిత్ర మరేర్మిత్రం మిత్రమిత్ర మతఃపరం । తథారిమిత్రమిత్రంచ విజిగీషోః పురస్సరాః ॥ పార్ష్ణిగ్రాహ స్తతః పశ్చాదాక్రన్దస్తదనన్తరమ్ । ఆసారావనయోశ్చైవ విజిగీషోస్తు పృష్ఠతః । అరేశ్చ విజిగీషోశ్చ మధ్యమోభూమ్య

చున్నావుగదా. [1]నీవు శాస్త్రోక్త లక్షణలక్షితు లగుమంత్రుల నలువురినిగాని ముగ్గురినిగాని యుంచుకొని రహస్యముగా వారలందఱిని గూర్చికొనికాని, లేక యొక్కొక్కరితో వేఱువేఱుగాని యాలోచించి వారి యభిప్రాయములను తెలిసికొందువా యేమి? [2]నీవు అధ్యయనము చేసిన వేదములు అగ్నిహోత్రాద్యనుష్ఠానములచే సఫలములేకదా? నీవార్జించిన ధనములు దానభోగములచే సఫలములుగదా! నీ భార్యలు రతి సంతానములచే సఫలలుగదా? నీవు విన్న శాస్త్రములు, శీలవృత్తములచే సఫలీకృతము లేకదా? [3]భరతా! దీర్ఘాయుః ప్రదమును కీర్తికరమును,

నన్తరః। అనుగ్రహే సంహతయో ర్వ్యస్తయోర్నిగ్రహేప్రభుః। మండలాద్బహిరే తేషా ముదాసీనో బలాధికః॥ అనుగ్రహే సంహతానాం వ్యస్తానాంచవధే ప్రభుః' అని చెప్పియున్నాఁడు. (యాత్రాదణ్డవిధానంచ)-యాత్రా=శత్రువునుగూర్చిదండెత్తిపోవుట, దండవిధానము-సైన్యవిధానము-సైన్యముల నానావిధవ్యూహములనుట. లేక దండమనఁగా శత్రునిరసనముగనుక దండవిధానమనఁగా శత్రువులనిరసించు ప్రకారము ననుట. అందుయానము 'విగృహ్య సంధాయతథా సంభూయాథ ప్రసంగతః। ఉపేక్ష్యచేతి నిపుణై ర్యానం పంచవిధం స్మృతమ్' అని యైదువిధములు- బలాతిశయమున పార్ష్ణిగ్రాహాదులతో విగ్రహించి శత్రువుపైకిపోవుట| విగృహ్యయానము, పార్ష్ణిగ్రాహాదులతో సంధిగలిగి శత్రువుపైపోవుట సంధాయయానము. సామంతరాజులతోఁ గలసిపోవుట సంభూయయానము. మఱియొకని నుద్దేశించి దండెత్తునట్లుతోఁపించి మఱియొకనిపైఁబోవుట ప్రసంగతోయానము. ఒకనిపైఁబోవ నుద్దేశించి వాఁడు బలవంతుఁడగుటచే ఉపేక్షించి వానిమిత్రునిపైఁబోవుట ఉపేక్ష్యయానము. (ద్వయోశ్చసన్ధివిగ్రహౌ)=రెండేసికి కారణములైనసంధివిగ్రహములను రెంటిని-అనగా సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయములను షడ్గుణములలో సంధియందు యానము ఆసనము అను రెండును, విగ్రహమునందు ద్వైధీభావము, సమాశ్రయము, అను రెండును అంతర్భూతములగుటచే ఆసంధివిగ్రహములను, (ద్వయోశ్చ) రెండేసికి కారణములైనవిగాఁ జెప్పినాఁడు. ఒక్కొకదానియందు రెండేసి అంతర్భూతములనిభావము, (ఏతాః) వీనిని, (యథావత్) శాస్త్రముచెప్పిన (అనుమన్య సేకచ్చిత్) అనుమతించుచున్నావుగదా. ఇందు విడువవలసిన వానిని విడిచి కయికొనవలసినవానిని కయికొని యనుష్ఠించుచున్నావుగదా యని భావము.

1. దీనిచే రాజు ముగ్గురితో నల్వురితో మంత్రులను బెట్టుకొని యాలోచింపవలయుననియు పిమ్మట ఒక్కొక్కరితో వేఱువేఱ ఆలోచించి అభిప్రాయము తెలిసికొనవలయుననియుసూచితము.

2. దీనిచే వేదము అధ్యయనముచేయుటకు ఫలము యాగాద్యనుష్ఠానమనియు, ధనమార్జించుటకు ఫలము దానభోగములనియు, వివాహమాడుటకు ఫలము రతిసంతానములనియు, శాస్త్రశ్రవణమునకు ఫలము శీలవృత్తములనియు-సూచితము. ఇదియే మహాభారతమునందు 'అగ్నిహోత్రఫలా వేదా దత్తభుక్తఫలంధనం। రతిపుత్రఫలా దారా శ్శీలవృత్తఫలంశ్రుతమ్' అని చెప్పంబడియున్నది.

3. దీనిచే నింతవఱకుఁ జెప్పఁబడినధర్మముల నాచరించుటవలన దీర్ఘాయువును, మిక్కిలి కీర్తియు ధర్మార్థకామములును సిద్ధించుననుట సూచితము.

కామప్రదము నయినబుద్ధిని నీకిప్పుడు చెప్పితిని. అది నాకుండునట్లు నీకును నున్నది గదా? [1]మనతండ్రి దశరథుఁడు దేవవృత్తి నవలంబించి యున్నాఁడో మఱియును మన తాత ముత్తాత లేవృత్తి నవలంబించియుండిరో ఏది సన్మార్గయుతమును నిందా రహితమునై యుండునో ఆట్టివృత్తి నీవు నవలంబించియున్నావుగదా! రఘు వంశ్యా! [2]మధురముగా వొండంగూడినయన్నమును నీవొక్కఁడవే భుజింపవుగదా. స్నేహితులు ప్రార్థించి యడుగఁగా అభిమతధనములను ఇచ్చుచుందువుగదా? [3]రాజు ఈచెప్పఁబడిన నీతి ధర్మములందు మిక్కిలియు బుద్ధి గలిగి దగినదండమును దాల్చి ధర్మముచొప్పున ప్రజలను పాలించువాఁడేని అతఁడీలోకమునందు సమస్త భూమండలాధిపత్యము వహించి శరీరాత్యజ్ఞానమును బడసి అంతమున నీలోకమును వీడి పూర్వరాజులవలె స్వర్గమును బొందును. ఇది నూఱవసర్గము.

---

భరతుఁడు రామునకు దశరథునిమరణమును జెప్పుట.

భరతుఁడు రాముఁడు చెప్పినవచనమును విని, యతనితో నిన్ను సేవసేయుట పరమధర్మమును దిగవిడిచిన నాకు రాజ్యపరిపాలనధర్మము ఏమిసేయం గలదు? పురుషతిలకా! రాజా! పెద్దకుమారుఁడుండఁగా చిన్నకొడుకు రాజుగా నుండుటలేదు అనాదిగాఁ గలిగియున్న యీధర్మము మనవారియందు ఎల్లప్పుడు నెలకొనియేయున్నది. రఘుకులతిలకా! నీవు పెద్దవాఁడవుగావున నాతోఁగూడ సకలసంపత్సమృద్ధమైన అయోధ్యాపురమునకు వచ్చి మనవంశమునకు అభ్యుదయముగా నీవు అభిషేకము గావించుకొనుము. రాజగుట కేవలము కాదునుమూ, *రాజును మనుష్యునిగా ప్రాకృతులైనవారు చెప్పుదురుగాని, ధర్మార్థసంపాదక

---

1. దీనిచె తండ్రితాత లవలంబించినవృత్తిని విడువఁగూడ దనియు, వారలనుష్ఠింపకున్నను, యుక్తమునైనవానిని అనుష్ఠింపవలయుననియు సూచితము.

2. దీనిచె మధురాన్నమును ఒక్కఁడే భుజింపరాదనియును, స్నేహితులు కోరినది శక్తి కొలఁదిని తప్పక యీయఁదగుననియు సూచితము.

3. దీనిచె రాజు న్యాయముచొప్పున యుక్తదండముతో బుద్ధిగలిగి ప్రజలను బాలించునేని ఐహికాముష్మిక సుఖములు రెండును బ్రాపించుననియు 'రాజ్యాన్తే నరకం ధ్రువమ్' అనుట దుష్ట రాజులవిషయమనియు సూచితము.

* దేవత్వమును గలిగించు తపశ్చర్యనువిడిచి రాజ్యాభిషేకము ఏలయని రాముఁ డనఁగా భరతుఁడు చెప్పువాక్యమిది-'జనులు రాజును మనుష్యునిగాఁ జెప్పినను, నాకు దేవుఁడనియే యభిమతము, ఏలన ఆరాజుయొక్కవృత్తము ధర్మార్థయుక్తమైనదిగావున అనుమానుషమైనది. అనఁగా దేవత్వసంపాదకమైనది; కాన రాజు దేవుఁడే' యనియర్థము. అనఁగా తపస్సుచే క్లేశమూలముగా దేవత్వము కలుగుచున్నది. రాజ్యపాలనము చెభోగమూలముగా దేవత్వముకలుగుచున్నదియనిభావము.-మహేశ్వరతీర్థులు.

మైనరాజవృత్తి అతిమానుషముగా నుండునదని పెద్దలు చెప్పుటంబట్టి నాకు రాజు దేవుఁ డనుటయే సమ్మతముగానున్నది. ఇంక తండ్రివిషయము! నేను కేకయరాజు పట్టణమున నుండఁగా, నీవు నడవికిఁ బోవఁగా, యాగకరణశీలుఁడును సజ్జనాగ్రగణ్యుఁడును పూజ్యుఁడునగుమహారాజు స్వర్గము నొందెను. నీవు వచ్చినపిదప చాల కాల ముండలేదు. నీవు సీతను లక్ష్మణునిఁ గూడి, బయలుదేఱఁగానే మహారాజు దుఃఖమునను శోకమునను గొట్టునడి స్వర్గమును బొందెను. పురుషసింహామా! లెమ్ము శీఘ్రముగా తండ్రికి జలతర్పణాదిక్రియలు గావింపుము. నేనును ఈ శత్రుఘ్నుఁడును మునుపే జలక్రియలు చేసితిమైనది.' మీరు చేసియుండఁగా నిఁక నేను జేయ నేల' యనకుఁడు. రఘువంశ్యా! తండ్రికి ప్రియుఁడైనపుత్రుఁడిచ్చిన జలతర్పణాదులే పితృలోకమున నెన్నటికి చెడక మిక్కిలి ఫలప్రదముగా నుండునని పెద్దలు చెప్పుదురు గదా. నీవే మనతండ్రికి మిక్కిలిప్రియపుత్రుండవు. కావున నీవును రాజునకు అపరక్రియలు చేయవలయును. నీతండ్రిమహారాజు నిన్ను బాసి నీదుఃఖమునవే మునిఁగి నిన్నే చూడఁగోరుచు, నిన్నుగుఱించియే వగలం బొగులుచు నీయందు మనస్సు తగులువడి మరల్చికొన నేరక పరమదుఃఖితుఁడై, నిన్నే తలంచుకొనుచు, నస్తమించినవాఁడయ్యెను. ఇది నూటయొకఁడవసర్గము.



(రాముఁడు దశరథమరణమువిని విలపించుట. మందాకినియందు జలతర్పణము. మరల నాశ్రమమునకువచ్చి వలవించుట. అయోధ్యజనులకు రామునితోడి సమాగమము.)

రాముఁడు భరతుఁడు చెప్పినపితృమరణవృత్తాంతమును విని మిక్కిలియు దుఃఖకరం బగుదానికి నెంతయు సైఁపలేక మూర్ఛితుఁ డయ్యెను. అపరంతపుఁడు యుద్ధమున నింద్రుఁడు ప్రయోగించినవజ్రాయుధమువలె, అతిమనస్తాపముగా భరతుఁడు చెప్పినకఠినవాక్యమును విని చేతులను పిసికికొనుచు పైకెత్తి అడవిలోపూచిన వృక్షమును గొడ్డలిచే నఱుకఁగాఁ ద్రెళ్లునట్లు పరవశుఁడై నేలపడిం బడెను. అంత నాతీరున నిసుకదిబ్బనంతయు క్రమ్మికొరాడి యలసి నిదురించు చున్న యేనుఁగువలె మూర్ఛాపరవశుండై భూమిపైఁబడియున్న భూమీశ్వరుఁడును మహాధనుర్ధరుఁడు నగురామునిం జూచి భరతలక్ష్మణశత్రుఘ్నులును, సీతయును, రోదనము సేయుచు, శోకమున స్రుక్కినయతనికి మూర్ఛదేఱుటకై అవయవముల నన్నిటను చల్లనినీళ్లు చల్లిరి. రాముఁడు కొంతవడికి మూర్ఛ దేఱి, గన్నులనిండ కన్నీళ్లుదొరుఁగుచు, మిక్కిలిదీనము లగువాక్యములు పెక్కులు చెప్పఁదొడఁగినవాఁడయ్యె.ధర్మాత్ముఁడగు రాముఁడు, మహారాజగు తండ్రి మృతిఁబొందుటవిని, ధర్మయుక్తముగా భరతునితో 'అయ్యో! నాయన కాలగతి పొందినాఁడే! ఏమి సేయుదును, ఇఁక అయోధ్యలో నాకేమిపని? ఇఁక నట్టిరాజశ్రేష్ఠుని బాసి పోయిన అయోధ్యను బాలింప నేర్చిన

వాఁడెవఁడు? మహాత్ముఁడు నాదుఃఖముచేతనే మృతినొందెను. నేనును అతనికి సంస్కారము సేయనైతిని. అట్టిమహాత్మునకు ఇట్టిదుర్జాతుఁడగునాచే చేయఁదగిన దేమి? ఏమియుఁ గలుగదు. భరతా! నీవు కాలమున దండ్రికి సంస్కారము సేసినట్టి పాపదూరుఁడవు. నీవును శత్రుఘ్నుఁడును యుక్తకాలమున రాజునకు ప్రేతకార్యములు సేయ దటస్థించినపుడు. అన్నియుఁ జక్కఁగాఁ గావించి కృతార్థులైతిరి. మహారాజు మృతిఁబొందుటచే, ప్రధానుండు లేనిదై కలగుండుపడి రాజకలిమిసొంపు దూలియున్న అయోధ్యకు నావనవాసము తీరినప్పటికిని నేను బోవనొల్లను. పరంతపా! ఆయన మృతిఁబొందెనే! ఇఁక నేనడవిలో పదునాలుగేండ్లును గడపి అయోధ్యకుపోయిన పిదప నచట నన్ను పనులయందు మెలపి శిక్షించువాఁడెవఁడు? మునుపు నాయన, నేనతని యాజ్ఞ చొప్పున తప్పక నడచుకొనునడతకు సంతోషించి మెచ్చి నన్ను బుజ్జగించుటకై, చెవులకింపుగా తీపుపలుకులు పలుకుచుండెను. ఇఁక నట్టిపలుకులు నాకెవ్వరు చెప్పఁగలరు?' అనెను. రాముఁడట్లు భరతునితోఁ జెప్పి యటపై పున్నమచందురునివంటి మొగము గలసీతను జూచి శోకమున పురపురఁ బొక్కుచు 'సీతా! నీమామ మృతుఁడయ్యెనే! లక్ష్మణా! నీవు తండ్రిలేని బిడ్డవైతివి? భరతుఁడు మా తండ్రి చనిపోయెనని యీదుఃఖవార్తను చెప్పినాఁడు' అనెను. రాముఁ డట్లు చెప్పఁగానె మిక్కిలి పొగడ్త గన్నయారాకుమారుల కందఱికిని కన్నులయందు పెక్కుమడుఁగులు ఎక్కువగా కన్నీరు దొరఁగినది. అంత నా యన్నదమ్ములందఱును రాముని మిక్కిలియు నూఱడించి లోకనాథుఁడగు తండ్రికి నుదకక్రియలు చేయునట్లు చెప్పిరి. ఆసీతయు, మామ యగుమహారాజు స్వర్గలోకమును బొందుట విని కన్నుల నీళ్లు మిక్కిలి గ్రమ్ముకొనుటచే తన పెనిమిటిని జూడనేరక పోయెను. రాముఁడట్లు ఏడ్చుచున్న యాజనకరాజసుతను సీతను ఓదార్చి దుఃఖితుఁడగుచు లక్ష్మణునిం జూచి దుఃఖయుక్తముగా 'తపస్విజనులకు భోజ్యమైన గారపిండిని (ఇంగుదీపిణ్యాకమును) దెమ్ము స్నానముకొఱకు నఱుగువస్త్రమును పయివస్త్రమును దెచ్చియిమ్ము. మహాత్ముఁడైననాయనకు ఉదకదానము సేయుటకై పోవుచున్నాను. సీత ముందుగా పోవుఁగాక. దాని వెనుక నీవు పొమ్ము, నేను మీకు వెనుక వచ్చుచున్నాను , మిక్కిలియు సహింపరానట్టిదుఃఖమునిమిత్తమై పోవునప్పుడు స్త్రీలును బాలురును ఈతీరుననే ముందు పోవలయునుగదా' యనియెను. అంత వారలను గులక్రమముగా ననుసరించుచు, ఆత్మస్వరూపజ్ఞానము గలిగి, మహాబుద్ధిమంతుండును, మృదుస్వభావుఁడును, అంతరింద్రియనిగ్రహుఁడును, బహిరింద్రియనిగ్రహుఁడును, రామునియందు దృఢభక్తి గల వాఁడు నగుసుమంత్రుఁడు, రామునిని తక్కినయారాజకుమారులను నోదార్చి, వారలను బట్టికొని మెల్లగా శుభం బగుమందాకినీ నదిరేవునకుఁ దీసికొని పోయెను. మహాయశస్కులైనయాసీతారామలక్ష్మణులు సుందరములైన రేవులు గలదై రమ

ణీయముగాఁ గనుపట్టుచు తీరములం దెపుడును పుష్పించిన యడవులు వెడఁగుహూప, శీఘ్రప్రవాహము గలిగి వెలుఁగుచుండు మందాకినీనదిని కష్టమునఁజేరి స్నానము గావించి యందు అచ్చెపి లేనియొక మంచిరేవునందు. 'నాయనా! ఈజలము నీకగుఁగాక' అని యుచ్చరించుచు మహారాజునకు నుదకమిచ్చిరి రాముఁడు దోసిటి నిండ జలము పట్టుకొని దక్షిణపుదిక్కు మొగమై, రోదనము సేయుచు 'రాజసిం హామా! పితృలోకమును బొందినసీకు నే నిప్పు డొసఁగెడియీనాన్ని ర్మలోదకము అక్ష యమై యుండుఁగాక' అని చెప్పి జలమువిడిచెను. అంత తేజస్వి యగురాముఁడు మందాకినీ తీరమునుండి యవ్వలికి పోయి యచట తండ్రికి పిండప్రదానమును గావిం చెను. రాముఁడు గారపిండిని రేఁగుబండ్లతోఁ గలిపి, ముద్దలుసేసి, దర్భలుపఱచి వానిపై నునిచి దుఃఖముచఁ బొక్కుచు రోదనముసేయుచు 'మహారాజా! మా కిచ్చట నీగారపిండియే యాహారముకాఁబట్టి, దీనినే నీకిపుడు సమర్పించితిమి. కాన ప్రీతితో నారగింపుము. పురుషుఁడు తానుదేనిని ఆహారముగాఁ గొనునో దానినే తనదేవతలకును సమర్పింపవలసినది' అని చెప్పెను అంత నా పురుషతిల కుండు, ఆదారినే యేటిగట్టునుండి పోయి సొగసైన నెత్తములు గలచిత్రకూట పర్వతముపైకి నెక్కెను. అంత నాభూపతి రాముఁడు, పర్ణశాలద్వారమును జేరఁ గానే భరతలక్ష్మణులను ఇద్దఱిని బాఱసాచి కవుంగిలించుకొనెను. ఆయన్నదమ్ములును సీతయును రోదనము సేయుచున్న ధ్వనివలన సింహముల బొబ్బరింతల వలనంబోలె ఆపర్వతమునందు ప్రతిధ్వని గలిగినది. మహాబలవంతులైన రామాదులు తండ్రికి ఉదకక్రియలు సేయుచు, రోదనముగావింపఁగా, ఆతుములధ్వనిని విని, భరత సైనికులు భయమును జెందిరి. వారు 'భరతుఁడు రామునితోఁ గలిసి కొన్నాఁడు. ఇది నిజము. వారందఱును జేరి మృతుండయినతండ్రిని గూర్చి దుఃఖించుచున్నారు. కావుననే యీవినవచ్చుచున్న గొప్పధ్వని వారిదే యగును' అనియు ననుకొనిరి. అంత వారు తమవాసస్థానములను వదలి, అందఱు నొక్కమనస్సుతో ఆ ధ్వని పుట్టినదిక్కుగా, అతివేగమునఁ బఱుగెత్తి వచ్చిరి. రామునియొద్దకు నడిచియేపోవఁ దగునుగాని సుకుమారులైనవారికి నడచుట కష్టముగా నుండినందున వారిలోఁ గొందఱు గుఱ్ఱముల నెక్కియు, మఱికొందఱు గజములనెక్కియు, ఇఁకఁ గొందఱు చక్కగా నలంకృతములైన రథముల నెక్కియుఁ బోయిరి. మఱికొందఱు కాలి నడకనే పోయిరి. ఆజనులందఱును, రాముఁడు అడవికిఁ బోయి కొంత కాలమేమై యుండినను, బహుకాలము తమ్ము నెడఁబాసి పోయి యున్నవానివలె, అతనిని జూచుటకు నువ్విళ్లూరుచు అతివేగమున నా యాశ్రమమునకుఁ బోయిరి. వార లచ్చట అన్నదమ్ముల సమాగమమును జూడఁగోరి నానావిధములైన వాహనముల నారోహించి ఖురనేమిస్వనములు పర్వ త్వరితముగాఁ బోయిరి. అట్లు పోవుచున్న గజతురగాదుల గొరిజలయు, రథాదులనేమి పరంపరలయు ఘాతములవలన నచటి

భూతలము, వర్షాకాలమున మేఘములచే ఆకాశము గావించునట్లు తుములధ్వని గావించినది. అందలిగజములు ఆ ధ్వనికి మిక్కిలి బెదరి, యాఁడుగజములుగూడ రాఁగా ఆవనమునుండి మఱియొక వనమునకుఁబోయినవి. అప్పుడు అవి పోయినను వానిమద జలవాసనవలన ఆవనమంతయు గుబాళించుచుండెను. పందులు, తోఁడేళ్లు, దున్న పోతులు, సర్పములు, కోఁతులు, గురుపోతులు, పులులు, జింకలు, దుప్పులును, భయపడిపాఱినవి. చక్రవాకములును, నీరుకోళ్లును, హంసలును, కారండవములును, కొంగలును, మగకోవెలలును, క్రౌంచలును, మొదలైనపక్షులు, బెదరుచే సొమ్మసిల్లి నలుదిక్కులకుం బఱచినవి. ఆధ్వనికి బెదరి చెదరినపక్షులచే ఆకాశము వ్యాప్తమయ్యె, భరతుని జనులచే భూమియు వ్యాప్తమైయుండెను, గావున రెండును ఎంతయు నప్పుడు ప్రకాశించినవయ్యెను. అంత వారట్లుపోయి పర్ణశాలయందు, పగవారినడఁగఁద్రొక్కి కీర్తికెక్కిన పురుషలలాముఁడు రాముఁడు నేలపైఁ గూర్చుండి యుండఁగాఁ జూచిరి. వారందఱు నొక్కటిగాఁ జేరి, కైకను మంధరను దూఱుచు, రామునియొద్దకుఁబోయి. మొగంబుల కన్నీరు చిప్పిల్ల నతని మ్రోల నిలుచుండిరి. అంత నాధర్మాత్ముఁడు మిక్కిలియు దుఃఖితుఁడై కన్నుల నీరొలికించుచున్న యాజనులనుజూచి, మగవారిని దండ్రులవలెను, ఆఁడువారిని తల్లులవలెను, సగౌరవముగాఁ గౌఁగిలించుకొనెను. అపుడు రాముఁడు గొందఱిని గౌఁగిలించుకొనెను, మఱికొందఱు రామునకు నమస్కారముసేసిరి. ఆ రాజకుమారుఁడు చెలికాండ్రను బంధువులను అందఱిని వారివారి యంతరువులకుఁ దగినట్లు సమ్మానము గావించెను అచ్చట మహాత్ములగు నారామాదులరోదనధ్వని, భూమియందును ఆకాశమందును పర్వత గుహలయందును, దిక్కులయందును, ప్రతిధ్వను లెసఁగించుచు మృదంగఘోషము వలె గంభీరముగా వినఁబడుచుండెను. ఇది నూటరెండవ సర్గము.



రాముఁడు మాతృజనులతోఁ గలసికొనుట. వసిష్ఠుఁడు మంత్రులు మొదలైనవారికి రామునితోడి సమాగమము.

వసిష్ఠుఁడు దశరథుని భార్యలను మున్నిడుకొని, రాముని దర్శింప నువ్విళ్లూరుచు, రామాదులున్న యాప్రదేశమునుగూర్చి వచ్చుచుండెను. కౌసల్య మొదలైన రాజభార్యలు మందగమనమున మందాకినీ నదికింబోవుచు, రామలక్ష్మణులు సేవించిన యందలి రేవునుజూచిరి. కౌసల్య మొగంబునిండఁ గన్నీళ్లుగాఱ నోరెండ మిక్కిలి దుఃఖితయై, సుమిత్రను తక్కిన రాజభార్యలనుజూచి, 'ఎవరు ఇతరులకు దుఃఖకరములగు కార్యములు చేయనివారయ్యును దేశమునుండి మును వెడలఁగొట్టఁబడిరో యాదిక్కులేని యనాథులయిన సీతారామలక్ష్మణులు స్నానముసేయు రేవిది. నిశ్చయము. సుమిత్రా! నీకొడుకు లక్ష్మణుఁడు, నాకొడుకునిమిత్తమై, ప్రాలుమాలిక లేక యెల్లప్పుడును ఈస్థలమునుండి తానే జలమును తీసికొనిపోవును. నీకొడుకు ఇట్టి

తక్కువకార్యము చేసినను, ఎంతమాత్రమును నిందితుఁడుగాడు పెద్దన్న తండ్రిని బోలునుగాన యతనికి ప్రయోజనకరముగా నెట్టిపని చేసినను, అదియంతయు గుణమే యగును ఇఁక భరతుని ప్రార్థన కియ్యకొని రాముఁడు రాజ్యమును బడసిన పిదప ఇట్టి కష్టములకుఁ దగని నిన్నేలుకొని, కొఱగాలిన యిట్టి దుఃఖకృత్యములను ఇంతకుఁ జేసినవిపోఁగా ఇకమీఁదఁ జేయఁగలుగుట లేక సుఖమునొందుఁగాక, అనెను. అంతనా విశాలాక్షి కౌసల్య అచ్చట భూమిపయి దక్షిణాగ్రములైన దర్భలయందుంచు, పితృప్రీతికొఱకు, రాముఁడు భక్తితోనుంచిన గారపిండిని గాంచెను. రాముఁడార్తుఁడై తండ్రికొఱకు భూమియందుంచిన యాపిండముఁగని కౌసల్య దశరథ భార్యలనందఱినిజూచి "ఇదిగో యిక్ష్వాకుప్రభుఁడును మహాత్ముఁడునగు తనతండ్రి దశరథునకు రాముఁడు శాస్త్రోక్త ప్రకారమున నొసంగినపిండము చూడుఁడు దేవేంద్రునకుసాటియై సమస్తభోగముల ననుభవించిన యీ మహాత్మునకు మహారాజునకు ఈగారపిండి యెంతమాత్రమును ఆహారముగానేరదు. నాలుగు సముద్రముల నడుమనుండు సకలభూమండలమునంతయుఁ బాలించి యనుభవించుచు దేవేంద్రునికి సాటియైన ప్రభుండై యెంతయు నొప్పుచుండిన భూనాథుఁడు గారగానుఁగు పిండిని ఎట్లు భుజించును? మహైశ్వర్యసమేతుఁడగు రాముఁడు తండ్రికి శ్రాద్ధమున గారపిండి నొసంగవలసి వచ్చినదే! ఇంతకన్న లోకమున దుఃఖము మఱేదియు నాకుఁ గానిపింపదు రాముఁడు తండ్రికి శ్రాద్ధమున గారపిండి నిచ్చుటను జూచియు నామనస్సు దుఃఖమున వేయిపఱియలుగాఁ బగులకున్నదేల? 'పురుషుఁడు దేని నాహారముగాఁ గొనునో అతని దేవతలకును అదియే ఆహారము' అని సత్యార్థ ప్రతిపాదకమై లోకప్రసిద్ధిగాంచిన యీ శ్రుతిమాత్రము నాబుద్ధికి స్ఫురించుచున్నది" అనియె. ఆదశరథుని భార్యలందఱు అట్లు దుఃఖితలై రోదనము సేయుచున్న కౌసల్యను మంచిమాటలఁ దేర్చి యామెను దీసికొనిపోయి యాశ్రమమున స్వర్గమునుండి వచ్చిన దేవతయుంబలె నున్నరామునింజూచిరి కౌసల్యమొదలైన తల్లులు రాముఁడు సమస్తభోగములను విడిచి యరణ్యముననుండుటఁ జూచి పరమ దుఃఖితలై మహాధ్వని గలుగునట్లు రోదనము సేయుచుఁ గన్నీళ్లువిడిచిరి. సత్యప్రతిజ్ఞుఁడైన యాపురుషతిలకుఁడు రాముఁడు లేచి తల్లులందఱిశుభచరణంబులను బట్టుకొని నమస్కారము లొనరించెను. విశాలనేత్రలయిన యాకౌశల్యాదులును, తమకు సాష్టాంగముగ మ్రొక్కినరాముని వీఁపుపయినుండు దుమ్మును, మృదువులయిన వ్రేళ్లను సుఖమైన స్పర్శమును గలతమసొగసుం జేతులతోఁ దుడిచిరి. లక్ష్మణుఁడును ఆతల్లుల నందఱినింజూచి దుఃఖితుఁడై, రాముఁడు మ్రొక్కినపిదప తానును వరుసగా వారికెల్ల నమస్కారముగావించెను. ఆరాజస్త్రీలందఱును శుభలక్షణుఁడగు నా దశరథకుమారుఁడు లక్ష్మణునియెడల, రామునియెడ నెట్లోయట్లే ప్రేమంబున నడచుకొనిరి. సీతయును కన్నులనిండ నీరు గ్రమ్మ, నత్తల చరణములు పట్టుకొని

నమస్కరించి వారల ముందట నిలువంబడియుండెను. కౌసల్య, వనవాసంబునం జిక్కి స్రుక్కుచున్న యా సీతను, తల్లి తనకూఁతుం గౌఁగిలించుకొనునట్లు, కవుంగిలించుకొని 'జనక మహారాజు కడుపునఁ బుట్టి, దశరథచక్రవర్తికిఁ గోడలై రాముని కిల్లాలయిన చెలువ నిర్జనమైన వనమున దుఃఖమును బొందినదెట్లు? సీతా! ఎండసోఁకునఁ గందిన తామరవలెను, మిక్కిలి నలంగిన కలువవలెను, దుమ్ము బ్రుంగిన బంగారమువలెను, మబ్బులు గ్రమ్మిన చంద్రునివలెను కాంతి గుందియున్న నీనెమ్మొగంబును జూడగా, అగ్ని తన కాశ్రయమైన కట్టెలను దహించునట్లు, వ్యసన మనెడియరణివలనఁ బుట్టినశోకాగ్ని మనస్సున నన్ను మిక్కిలియు దహించుచున్నది' యనెను. ఇట్లు తల్లి యగు కౌసల్య దుఃఖమునం బొక్కుచుఁ జెప్పుచుండగా భరతాగ్రజుం డగురాముఁడు ఆయమయొద్దకుఁబోయి ఆమె యడుగులను వసిష్ఠుని యడుగులను బట్టుకొని నమస్కరించెను. అప్పుడు రాముఁడు, దేవేంద్రుఁడు బృహస్పతికి నమస్కరించునట్లు, అగ్నింబోలి యత్యంత తేజమున రాజిలుచున్న పురోహితునకు వసిష్ఠునకును నమస్కరించి, యాతనితోఁ గూడనే కూర్చుండెను. అంత వారిద్దఱును గూర్చుండినపిదప, ధార్మికుం డగుభరతుఁడు, మంత్రులను, పురమునందలి ప్రముఖులను, సైనికులను, అత్యంత ధార్మికులైనతక్కిన జనులనుం గూడి, రామునికి దాపునఁ గూర్చుండెను. అప్పు డావీర్యవంతుం డగుభరతుండు రాముని సమీపంబునం గూర్చుండి, తపస్వివేషమున మిక్కిలి కాంతిం దేజరిల్లుచున్న రామునింగాంచి, ప్రయతుండై బ్రహ్మదేవునియెదుట మహేంద్రునివలె నతని యెగుట చేమోడ్పుగీలించియుండెను. అప్పు డచ్చట నున్నపూజ్యులగుజనుల కందఱికిని 'ఇప్పు డీ భరతుఁడు రామునకు నమస్కరించి సత్కారముసేసి చక్కఁగా నేమాటచెప్పును' అని మిక్కిలియు కౌతూహలము వాస్తవముగాఁ గలిగినదయ్యె. అమోఘధైర్యుఁ డగు రాముఁడును, మహానుభావుఁ డగులక్ష్మణుఁడును ధార్మికుఁడైన భరతుఁడును, మువ్వురును, స్నేహితులచేఁ బరివేష్టితులై, యాగమున సదస్యులచేఁ బరివేష్టితములైన మూఁడుత్రేతాగ్నులవలె మిక్కిలియుఁ బ్రకాశించిరి.
ఇది నూటమూఁడవసర్గము



భరతుఁడు రామునిని రాజ్యముఁ గైకొనవేఁడుట. రాముఁడు పితృనియోగ ముల్లంఘింపరాదని సమాధానము చెప్పుట.

రాముఁడు, భరతుఁడు తనకు ప్రాప్తమైనరాజ్యమును విడిచి జటావల్కలములు దాల్చి వచ్చుటచే, తనయందు భక్తిగలవాఁ డనియెఱిఁగి తమ్ముం డగులక్ష్మణుఁడును తానును అతని నడుగం దొడఁగి 'నీవు జడలుదాల్చి నారచీరలుగట్టి, కృష్ణాజినము ధరించి యీయరణ్యప్రదేశమునకు వచ్చితివే! ఇందులకు కారణమేమి? నీవే దానిని చెప్పఁగా వినగోరుచున్నాను, చెప్పుము' అనియడిగి యతఁడు శోక

ముచే మిన్నకుండఁగా మరల మహాత్ముఁ డగు రాముఁడు భరతుని బలాత్కారముగఁ గ్రుచ్చి కవుఁగిలించుకొని 'నీవు రాజ్యమును విడిచి కృష్ణాజినమును జటలను ధరించి యిట్టిప్రదేశము నేల చొచ్చివచ్చితివి? అది యంతయు సవిస్తరముగాఁ జెప్పఁదగును' అని మరల నడుగఁగా భరతుఁడు అంజలిఁగీలించి 'మహాబాహుండగు నాయన పెద్దవానికిఁ దగిన రాజ్యమును పిన్నవాని కిచ్చి చేయరాని కార్యమును జేసి నిన్ను నడవికి దిగవిడిచి యంత పుత్రశోకమున మిక్కిలియుఁ బీడితుఁడై, స్వర్గమునొందెను. పరంతపా! కేవల మూఁడుది యగునాతల్లి కైక ప్రేరించిన మాత్రముననే మహారాజు తనకీర్తినంతయు దూలించునట్టి యీ మహాఘోర పాపమును గావించినాఁడు. ఇట్టి మహాపాపకృత్యమునకుఁ బూన్చిన యాస్త్రీ, తాను గోరిన రాజ్యమును బొందకయే విధవయై, శోకంబునఁ గృశించి మహాఘోరమైన నరకంబునందుఁ బడఁగలదు. అట్టిదాని కడుపునఁబుట్టి వట్టియపవాదమును గట్టుకొన్ననాయందు నీదాసభూతునియందు అనుగ్రహము నుంచఁదగును. ఇప్పుడే నీవు దేవేంద్రునివలె రాజ్యమునం దభిషిక్తుండవగుము. ఈప్రజలును, విధవ లగు తల్లులును, అందఱును, నీయొద్దకు వచ్చియున్నవారు. కావున, అనుగ్రహింపఁ దగును. రామా! నీవు మనవంశమానమును కాపాడు వాఁడవు. కావున జ్యేష్ఠక్రమముగా వచ్చుటఁ బట్టియు, నీకును అర్హమై యుండుటంబట్టియు నీరాజ్యమును ధర్మంబునఁ గయికొనుము. కయికొని సుహృదుల కెల్లకోర్కెల నీడేర్పుము. నిర్మలుఁడైన చంద్రునిచేత శారదరాత్రియుంబోలె పతి వగునీచేత భూమియంతయు వైధవ్యము మాలియుండుఁ గాక. * ఈమంత్రులందఱితోఁ గూడ నేను శిరసు

* ఇందులకు మూలము, 'ఏభిశ్చసచివైస్సార్ధం శిరసా యాచితో మయా। భ్రాతుశ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తుమర్హసి' విశేషార్థము —(ఏభిశ్చ సచివైః) ఈమంత్రులతోఁగూడ- నేనొకఁడు కన్నీళ్లు విడుచుటకుఁ దాళనివాఁడవు-ఇంతటియొక్క కన్నీళ్లకెట్లు తాళఁజాలుదువని తలఁచి ఈయందఱితోఁగూడి వచ్చితిని, (సచివైః) నేను యాచించినచో నుపేక్షించిన నుపేక్షింపవచ్చును, కాని మనరాజ్యమును నిర్వహించెడి యీపూజ్యులైనమంత్రులు యాచించినది ఏమ త్రోసి పుచ్చరాదు సుమీ, (యాచితః) యాచింపఁబడినవాఁడవు- నేను ముందట నిలిచినంతనే నాకోరినపనిని సమకూర్తువు. అట్టి నేను యాచింపను గూడా యాచింపఁగా ఇఁక చెప్ప నేల. (శిరసాయాచితః) తల నేల సోఁక యాచించితిని- నేనిట్లు యాచింపఁగా భరతునిమాటను జేయకపోతినే యని నీహృదయము అనుతాపపడును సుమా. (మయా) నాచేత యాచింపఁబడినవాఁడవు. ఇంతవఱకు నీవే నన్ను యాచించి నామనోరథములను తెలిసికొని యొసఁగూర్చితివి. ఇప్పుడే నేనై యాచించుచున్నాను. (భ్రాతుః) తమ్ముఁడను-నీకుతమ్ముఁడనుగా నాకు నెంతకు బ్రతిమాలుకొనవలెను, (శిష్యస్య) తమ్ముఁడనై నీతోఁ పాల్గుపంచుకొనుటకున్నానా? కాదు, నీవలన మంత్రోపదేశమునొంది శిష్యుఁడనుగూడ నగుదునుగా. (దాసస్య) శిష్యుఁడుమాత్రమేయై క్రయవిక్రయములకు అర్హుఁడను గాకున్నాఁడనా? గాదు క్రయవిక్రయార్హుఁడ నగు దాసుఁడనుగూడనై యున్నాను. కాఁబట్టి, (ప్రసాదంకర్తుమర్హసి) ఇట్టియమోఘకారణములనుబట్టి నాయందనుగ్రహము నుంపఁదగును,

నేలసోఁక నిన్ను యాచించెదను. తమ్ముఁడును శిష్యుఁడును దాసుఁడును అగు నన్ను అనుగ్రహింపఁదగును. పురుషతిలకా! మానవపురమునందు పరంపరాగతులై తండ్రితాతలను సంబంధించినవారై పూజార్హులై యిదె వచ్చియున్న యీ మంత్రులు మొదలైనవారందఱును ఒక్కటిగాఁ జెప్పుమాట నతిక్రమింపరాదు' అనెను. కైకకొడుకగు నాభరతుఁడు ఇట్లుచెప్పి నిడుదబాహువులు సాఁచి కన్నీరొలుక రామునిపాదములు శిరసు సోఁక విధ్యుక్తముగాఁ బట్టుకొని మ్రొక్కినవాఁడయ్యె. మత్తిల్లినయేనుఁగువలె మాటిమాటికి నిట్టూర్పులు విడుచుచున్న యాతమ్ముని భరతుని రాముఁడు గవుంగిలించుకొని 'మంచికులమునఁ బుట్టి మిక్కిలి సత్త్వగుణసంపన్నుఁడై తేజంబున రాజిలుచు, మహావ్రతము లాచరించి యుండు నినుబోఁటివాఁడు తుచ్ఛమైన రాజ్యముకొఱకై యిట్టి పాపకార్య మెట్లుచేయును? శత్రునిషూదనా! నీయందుదోషము అవంతయు నాకుఁదోపలేదు. నీవు పసితనమువలనఁ బూజ్యురాలగుతల్లిని దూషించుచున్నావు. ఇది నీకుఁదగదు. పాపదూరా! * పెద్దలు ఎప్పుడును తమ్ముఁజేరిన శిష్యదాసాదులందును భార్యలయందును పుత్రులయందును నిచ్చవచ్చినట్లు సేయవచ్చునని విహితమైయున్నది. సౌమ్యా! లోకమందు సాధువులు, భార్యాపుత్రులను శిష్యులను నియమించినట్లు నడుచుకొనవలసినవారినిగా నెన్నుదురు. మనమును అట్లే యీదశరథునకు నియమమునకు లోఁబడినవారమే యగుదుమని నీవెఱుంగవలయును. సౌమ్యా! మహారాజు నన్ను నారచీర క్రిందిబట్టగాను కృష్ణాజినమును పైవలువగాను గట్టికొని యడవియందు కాఁపుండునట్లు గాని లేక రాజ్యమునందు గాఁపుండునట్లుగాని చేయుటకు సమర్థుఁడు. నీవు ధర్మజ్ఞులకెల్ల మేటివి. ధర్మజ్ఞుఁడైన తండ్రియందు లోకపూజితంబైనగౌరవ మెంతటిదో తల్లియందును అంతటి గౌరవము నుంపవలయును. రఘువంశ్యా! ధర్మశీలురైనయీ మనతలిదండ్రులు 'నన్ను అరణ్యమునకుఁబొమ్ము' అని నియమింపఁగా నేనట్లుసేయక మఱియొకవిధము నెట్లాచరింపవచ్చును? నీవు అయోధ్యయందుండి లోకపూజ్యంబగు రాజ్యంబును గయికొని పాలించుచుండవలయును. నేను నారచీరలుగట్టుకొని దండకారణ్యమున వాసము చేయుచుండవలయును. మహాతేజస్కుఁడైనదశరథమహారాజు ప్రజలసమక్షమునం దిట్లు విభాగము నేర్పఱచి యాజ్ఞనొసంగి స్వర్గమునొందెను. ధర్మాత్ముఁడును లోకగురుఁడు నగుమహారాజే నీకుఁ బ్రమాణము. కావున నీకు తండ్రియిచ్చినభాగమును యథావిధిగా ననుభవింపఁదగును. సౌమ్యా! నేను దండకారణ్యమున పదునాలుగు సంవత్సరము లుండి మహాత్ముఁడైనతండ్రి యొసంగిన భాగము ననుభవింపఁ గలవాఁడను. నరసమూహ మునకెల్లఁ బూజితుండై మహాత్ముఁడై దేవేంద్రునితో సాటియగుతండ్రి నాకేమి యానతిచ్చెనో యదియెనాకు

* 'పెద్దలయినవారును తమకు అభిమతులైనదారపుత్రాదులందు ఇచ్చవచ్చినట్లు స్నేహము సేయుదురు' అని మహేశ్వరతీర్థులు.

పరమహితముగాఁ దలంచెనుగాని తండ్రి యానతీయని సర్వలోకేశ్వరత్వము గలిగినను అది నాకు హితము గానేర దని తలంతును" అనెను. ఇది నూటనాల్గవ సర్గము.

---

భరతుఁడు రాముని మరల రాజ్యమును గయికొనఁ బ్రార్థించుట. రాముఁడు తత్త్వార్థములను విమర్శించుచు సమాధానము చెప్పుట.

పురుషసింహు లగురామాదులు సుహృత్సమూహపరివృతులై దుఃఖించుచుండఁగానే యారాత్రి అతికష్టమునఁ గడచినది. అంత తెలతెలవాఱఁగానే ఆయన్నదమ్ములును, వారి సుహృదులు చుట్టిరా, మందాకినీనదియందు ప్రాతఃకాలజపహోమంబులు గావించుకొని రాముని సమీపముం జేరిరి. అప్పుడు వారందఱును ఊరక కూర్చుండియుండిరి కాని యెవ్వఁడైన నొకపలుకైనను పలుకఁడయ్యె. అంత భరతుఁడుమాత్రము సుహృదులనడుమ రామునిఁజూచి "నీవు 'ఒకరిరాజ్యము నెట్లు మఱొకరు గయికొనవచ్చు' ననకు. నేను నాతల్లిని ఊఱడించియున్నాఁడను. నీవే నాకీరాజ్యము నొసంగితివి. ఇంక నా రాజ్యమును నేను మరల నీకే యిచ్చెదను. అంగీకరించి యకంటకమైన యీరాజ్యమునంతయు యథేచ్ఛముగా ననుభవింపుమా! వర్షాకాలమున మహాజలప్రవాహవేగముచేఁ దెగినట్టి నీటికట్టను గట్టుటకు నెవరికి నలవికాదుగదా. అట్లే యీ గొప్పరాజ్యమును వహించుట మిక్కిలియుఁ గష్టము. అందులకు నీవు దప్ప మఱెవ్వఁడును సమర్థుఁడును గాఁడు. భూపతీ! గుఱ్ఱమువలె గాడిద నడువఁజాలదు. గరుత్మంతునివలె కేవలమయిన యొకపిట్ట యాకాశమున నెగురఁజాలదు. అట్లే నీగమనిక చొప్పున నడచుటకు నాకు శక్తిలేదు. రామా! ఎవ్వనిచే పెక్కుజనులు జీవించుచున్నారో యతని బ్రతుకు మంచిది. ఇతరులనాశ్రయించి జీవించువానిబ్రతుకు మాత్రము మిక్కిలియు నీచమయినది. మహాబాహూ! * ఒకానొక పురుషుఁడు విత్తనమునాటి నీళ్లు పోసి పెంచి కష్టపడఁగా ఆవృక్షము కొంతకాలమునకు, పొట్టివారికి నెక్కుట కశక్యమగునట్లు మహాస్కంధాదులతోఁ గూడిన పెద్దవృక్షమై, కాలమునందు పుష్పించియు ఫలములు పండకపోవునేని యందులకై నాటినవాఁడు ఆఫలమువలని ప్రీతియనుభవింపక పోవునుగదా. ఇదియె యుపమానము. నీవుమేటివై మాకెల్ల

* నాటినవానికి దశరథుఁడును, పెంపఁబడినవృక్షమునకు రాముఁడును, పుష్పదర్శనమునకు అభిషేకోద్యోగమును, ఫలమనుభవింపమికి రాజ్యమును పరిపాలింపమియు, నాటినవానికి ఫలమువలన గల్గు ప్రీతిలేకపోవుటకు దశరథునకు రాముఁడు రాజ్యము సేయుటవలని ప్రీతిలేకపోవుటయు, ననియుపమేయములు తెలియునది. నీవుమమ్ముపాలింపవేని, నిన్ను దశరథుఁడు కష్టపడి పెంచిపట్టాభిషిక్తునిఁజేసి రాజ్యపరిపాలనము సేయఁగా చూచి యానందింపఁగోరిన కోరికయంతయు వ్యర్థమేయగునని భావము.

భర్తవై యుండియు పట్టముగట్టుకొని భృత్యు లగుమమ్ము పాలింపవేని, ఆయుపమాన మునకు ఉపమేయ మైన యర్థమంతయు సంభవించునని నీవెఱుంగ నేర్తువు. మహారాజా! శత్రువుల నడఁగఁద్రొక్కి నీవు రాజ్యమునందు పట్టాభిషిక్తుండవై సూర్యునివలె వెలుఁగుచుండఁగా ప్రముఖులైనపౌరజను లెల్ల బంతులుగొనినిన్నుఁజూచియానందింతురు. కాకుత్థ్సా! మత్తిల్లినయేనుంగులు నీవెంటవచ్చుచు నుబ్బిగర్జిల్లునుగాక. మఱియు నంతగిపురమునందలి స్త్రీలందఱును మనస్సు కలఁక యంతయువిడిచి సంతసిల్లుదురుగాక' అనెను పెక్కువిధములైన పౌరజనులందఱును రాముని నట్లుప్రార్థించుచు భరతుఁడు చెప్పినమాటలువిని 'బాగుబాగు' అని కొనియాడిరి ఇట్లు తనప్రార్థన మంగీకరింపలేదని దుఃఖితుఁడై 'నావలన అన్న యడవిపాలై తండ్రియు మృతుఁడయ్యెనే' యని విలపించుచున్నకీర్తిమంతుని భరతునింజూచి రాముఁడు సుశిక్షితబుద్ధియు ధీరుండును గావున నాశ్వాసించువాఁడై "పురుషుఁడు స్వతంత్రుఁడుగాఁడు. కావున తనయిచ్చ చొప్పునఁ జేయుటగలుగదు. ఇచ్చటనుండి మఱియొక చోటికిని మఱొకచోట నుండి యుచటికిని పురుషునిదైవమే యాకర్షించుచున్నది. కావున కైకనుబట్టి నేనిచ్చటికిఁ బంపఁబడితినని తలఁపరాదు' మఱి తండ్రి మరణించుటకు దుఃఖము తగదు. ధనసంచయములు పలువిధముల నార్జించినను తుదకు నాశము బొందిపోవుటయును. ఎంతటిపొడవైన పదవిని బొందినను కడపట క్రిందుపడిపోవుటయును. కూడికయంతయు నెడఁబాయుటందే పర్యవసించును. ఎంతగొప్ప బ్రతుకైనను మరణమునందే యంతరింపక మానదు. వస్తుస్వభావ మిట్టిది గావున తండ్రియు మృతుఁడైనాఁడు. చక్కఁగా పండిన ఫలమునకు చెట్టునుండి తునిసి పడుట తప్ప వేఱుభయము లేనట్లు, పుట్టినవానికి మరణము నొందుటకన్న మఱియొక భయము గలుగదు. గట్టికంబములుగల గృహమును జీర్ణమయి నశించునట్లు, మనుష్యులును, జరామృత్యువులకు లోనయి నాశము నొందుదురు. జరగిపోయిన రాత్రి మరలిరానేరదు, ఏటివెల్లువ జలసంకులమైన సముద్రమును బోయిచేరు నింతేకాని మరలివచ్చుట లేదు. వేసవికాలమున సూర్యకిరణములు జలమును బీల్చునట్లు, జరగిపోవుచున్న రేయుంబవళ్లు సమస్తప్రాణుల యాయుష్యములను నశింపఁజేయుచున్నవి. నీవు నిలుచున్నను పోవుచున్నను, నీయాయువు క్షీణించుచున్నదే! కనుక నిన్నుఁజూచియే నీవుశోకించుకొనుము. నీగతి యిట్లుండ మఱియొకరిని జూచి శోకింపనేల? మనుష్యుఁడు పోవునపుడు, మృత్యువును గూడనే పోవుచున్నది. కూర్చుండునపుడును కూడనే కూర్చుండుచున్నది. బహుదూరము పయనమై పోయివచ్చినను, మృత్యువునుగూడనేపోయివచ్చుచున్నది. కానమృత్యువునుదప్పించుకొన నెట్లునలవిగాదు. 'మఱియొకకాలమున నీవు చెప్పినట్లు చేయుదు' నందువా? దేహమంతయు ముడతలుపడినవి. వెండ్రుకలన్నియుఁ దెల్లగా నెరసినవి. ముదిమి క్రమ్మి తానును జీర్ణించినాఁడు. ఇఁక పురుషుఁ డేమియుపాయము నేసి యీ నెబ్బరలను దొలఁగించు

కొను సమర్థుఁడుగాఁగలఁడు? కానేరఁడు. కనుక జీవితకాలమందే ఆత్మవిచారము వలయును. మనుష్యులు సూర్యుఁ డుదయింపఁగానే అర్థము నార్జించు కాలమువచ్చినదని యుబ్బుదురు. సూర్యుఁడ స్తమించినప్పుడు కామోపభోగకాలము వచ్చినదని యుబ్బుదురు. కాని యెవ్వరును ఆ యుదయా స్తమయములచేత తమయాయుస్సు క్షీణించుచున్నదని తెలియరు. ఆయాయాఋతువును క్రొత్త క్రొత్తగా తలసూపఁగానే యందు మనుష్యు లాయాభోగములకు కాలము వచ్చెనని సంతోషింతురుకాని ఋతువులుచుట్టి చుట్టివచ్చుటచే ప్రాణులకు ఆయువుక్షీణించుచున్నదే! ఇది మాత్రము తెలియరు. మహాసముద్రమున ఒకకొయ్య మఱియొకకొయ్యతో నొకటిగా నెట్లు గూడుకొనునో, యట్లుచేరి యవి కొంతకాలమునకు ఎట్లు వేఱుపడునో, యట్లే భార్యలును పుత్త్రులును బంధువులును ధనములును కొంతకాలము ఒకరితోనొకరు చేరియుండి కాలముఱాఁగా ఒకరినుండి యొకరు వేఱుపడి పోవుదురు. తుదకు వియోగము కలుగుట నిజముకాని సంబంధమెంత మాత్రమును సతముగాదు. ఈ లోకమున ఏప్రాణిగాని దనయభిలాష చొప్పున బంధువులతోఁ గలసి యుండనేరదు. కాఁబట్టి మృతినొందిన వానిని గుఱించి యెంతశోకించినను వానిని మఱల బ్రతికింప శక్యముగాదు. దారినిబోవు చున్నబిడారును జూచి దారిపయనము సేయుచున్న మఱి యొకఁడు, 'నేను మీ వెంట వచ్చెదను' అని చెప్పి వెంబడించునట్లు, ఇంతకుమున్ను పూర్వికు లవలంబించి తమ తండ్రితాతలును అనుష్ఠించి యున్న (మృతి) మార్గమునే పుత్త్రాదులుగూడ ననుసరింప వలయుననుట నిశ్చితము. దాని నెంతమాత్రము విడువరాదు. ఆ మార్గమునకు తిరుగుఁబాటు లేదు. అట్టి దానినిబొంది మఱియెట్లు దుఃఖింపవచ్చును? ప్రవాహమువలె వయస్సు తిరుగుఁబాటులేక పరుగిడుచుండఁగా పరలోకసుఖహేతువైన ధర్మమునందే తన్ను నియోగించు కొనవలయును. సుఖహేతువైనయట్టి ధర్మమును బడయువారే ప్రజలనంబడుదురు. తక్కినవారు మృగములు. ధర్మాత్ముఁ డగుమనతండ్రి దశరథమహారాజు మంగళకరము లైనసమస్త క్రతువులను ఉచితదక్షిణలతో గావించి యా పుణ్యాతిశయమువలన స్వర్గమును బొందినాఁడు. మనతండ్రి భృత్యులను జక్కఁగాఁ బోషించుటవలనను, ప్రజలను పాలించుటవలనను, ధర్మమునఁ బన్నులు పుచ్చుకొనుట వలనను పుణ్యాత్ముఁ డై స్వర్గమునొందెను. మనతండ్రి దశరథమహారాజు, ప్రజలకును తనకును అభిమతము లైన తటాకనిర్మాణాదిశుభకర్మములచేతను, ఉచితదక్షిణలతో యాగములు సేయుటచేతను, కృతార్థుఁడై స్వర్గమునొందెను. ఆమహారాజు, నానావిధము లైన యాగములుగావించి, పుష్కలముగా సకలభోగములను అనుభవించి, పెద్దకాలము బ్రతికి స్వర్గమునుబొందెను. నాయనా! రఘువంశ్యా! పూర్వికులకంటె పెద్దయుం గాలము బ్రతికియుండి, పలువిధము లైనభోగములను అనుభవించి సజ్జనులచే పూజితుండై స్వర్గమునొందినట్టి మనతండ్రినిగూర్చి యెంతమాత్రమును దుఃఖింప

రాదు. మనతండ్రి జీర్ణమైన మనుష్యదేహమును విడిచి, దివ్యదేహసంప్రాప్తిని బొంది బ్రహ్మలోకమున విహరించుచున్నాఁడుగదా. అట్టి యతనికి దుఃఖింపనేల? అట్టి పదవినిం బొందిన తండ్రినిగూర్చి యిటువంటి ప్రాజ్ఞుఁడైనవాఁడు, మిక్కిలి బుద్ధిమంతుఁడును బహుశాస్త్రజ్ఞుఁడు నైననినుబోఁటివాఁడు, ఎంతమాత్రము దుఃఖింపఁదగదు. తండ్రిమృతుఁడయ్యెననియు నే నడవికి బోయితిననియు నిట్లు పలువిధములుగాశోకించుటయు పలవించుటయు కన్నీళ్లు విడుచుటయు సమస్తావస్థల యందును ధీరుఁడైనబుద్ధిమంతుఁడు విడువవలయును నీవుమాటనేర్పరులలో మేటివి నీవు నెమ్మదినుండుము. దుఃఖింపవలదు. పోయి మనపట్టణమును బాలించుచుండుము. అట్లని జితేంద్రియుం డగుతండ్రి నిన్ను నియోగించియున్నాఁడు. పుణ్యకర్ముఁ డగునతండే యెచ్చట నన్నుండ నియోగించినాఁడో యచ్చటనేయుండి పూజ్యుం డగునాతండ్రి యాజ్ఞను బూని కావించెదను. అరిందమా! ఆతండ్రియాజ్ఞ నుల్లంఘించుట నాకు న్యాయ్యముగాదు. నీవుకూడ నాయాజ్ఞను ఎప్పుడును గౌరవించుచుండ వలయును. అతఁడే మనకుబంధువు, మఱి మనకుతండ్రియు. కాఁబట్టి రఘువంశ్యా! నేను బదునాలుగేండ్లు వనవాసముండి దానివలన ధర్మాచరణుండగు తండ్రి చేసినపూజ్యమైనయాజ్ఞను పరిపాలించెదను. పురుషతిలకా! పరలోకమును బొందఁగోరువాఁడు ధార్మికుఁడై క్రూరత్వముమాని, గురువునాజ్ఞ చొప్పున నడుచుకొనువాఁడునుగా నుండవలయును. పురుషసింహా! మనతండ్రి దశరథమహారాజు శుభాచారము నంతయు మనస్సున నుంచుకొని, సహజసిద్ధమైనరాజభావమును బూన్చుకొనుము” అనెను. మహాత్ముఁడును సమర్థుండు నగురాముఁ డిట్లు తన తమ్మునింజూచి తండ్రియాజ్ఞ నవశ్యము పాలింప వలయునను సర్థము వచ్చునట్లుమాటాడి, యంత నూరకుండెను. ఇది నూటయైదవ సర్గము.



భరతుఁడు రాముని మరలఁ బ్రార్థించుట. వసిష్ఠుఁడును గౌసల్యాదులును మంత్రులు మొదలైనవారును రామునిఁ బ్రార్థించుట.

ఇట్లు రాముఁడు అర్థయుక్తముగాఁజెప్పి విరమింపఁగా నంత ధార్మికుఁ డైన భరతుఁడు మందాకినీతీరమున సహజవాత్సల్యశీలుఁ డైనరామునిం జూచి ధర్మ యుక్తమై మఱియొక ముఖముగాఁ బచరించుటచే మిగుల చిత్రమై యొప్పుపలుకులతో “అరిందమా! నినుబోఁటివాఁడు లోకమున నెవ్వఁడుగలఁడు? దుఃఖము నిన్ను దుఃఖపెట్టదు. సంతోషము నిన్ను సంతోషపెట్టదు. సర్వజ్ఞుఁడవు గావున పెద్దలుగూడ నిన్నుఁ బూజించెదరు. అయినను నీవు వారలను గౌరవించుటకై వారల నడిగి సందేహములను దీర్చుకొనుచున్నావు. చచ్చినవానియం దెట్లు ద్వేషము గలుగదో యట్లే బ్రదికియున్న వానియందును ద్వేషములేకుంఁడుట, లేనట్టి వస్తువు

నందు రాగముంపనట్లే యున్నవస్తువునందును రాగముంపకుండుట, యనెడి యిట్టిబుద్ధి యెవనికిఁగలుగునో యతఁడు దేనికిని ఎంతమాత్రమును పరితపింపఁడు. కాఁబట్టి నీవు చెప్పినట్లు నాకు దుఃఖలేశమును లేదు. 'అట్లని శోకపుమాటలేల చెప్పెదవు' అందువా? మనుజాధీశ్వరా! ఆత్మానాత్మజ్ఞుఁడైనవాఁ డిట్టివ్యసనముల పాల్పడియైనను వ్యధపడరాదు అట్లె నీవును ఆత్మానాత్మజ్ఞుఁడవు గావున యిట్టివ్యసనమునకు దుఃఖముఁబొందవు. నీవు దుఃఖింపకున్నను నీ వ్యసనమునకు నే నెట్లు సైఁతును. దేవతాసన్నిభా! నీవు సత్త్వగుణసంపన్నుండవు, మహాధీరుండవు, సత్యప్రతిజ్ఞుఁడవు, సర్వజ్ఞుఁడవు, సర్వదర్శివి, మిక్కిలియు బుద్ధిమంతుండవు, ఇట్టి సద్గుణంబులతో నొప్పువాఁడవు, మఱిభూతముల యుత్పత్తి వినాశములు తెలిసినవాఁడవు. ఇట్టి నిన్ను, మనుజులకును మిక్కిలియు సహింపరానియిట్టి దుఃఖమైనను గలిగి గాఱియపెట్టుట తగదు నేను దేశాంతరమునకుఁ బోయియుండఁగా నీచురాలగు నాతల్లి నా నిమిత్తమై కావించిన పాపకార్యము నాకు సమ్మతము గాదు. కావున నీవు కోపములేక నాకుఁ బ్రసన్నుండవగుము. నేను ధర్మపాశమునకు కట్టువడియున్నాను. కావున పాపములాచరించునాతల్లి దండింపఁదగియుండియు నిపుడు, తీక్ష్ణదండమున వధింపకున్నాను. పవిత్రకులమునఁబుట్టి పావనకార్యములాచరించుదశరధునకుఁ బుట్టి ధర్మమునుదెలిసి అధర్మిష్ఠమును లోకనిందితమునైన కార్యమునెట్లు గావింతును? 'గురువు, యాగాదిక్రియ లాచరించినవాఁడు, వృద్ధుఁడు, రాజు, మృతిఁబొందినవాఁడు, తండ్రి, దైవమువంటివాఁడు' అనియే యాతనిని సభయందు నిందింపకున్నాను. ధర్మజ్ఞా! ధర్మముదెలిసినవాఁ డెవ్వఁడు, ఒకయాఁడుదానికి ప్రియముసేయఁగోరినవాఁడై, ధర్మమును అర్ధమును రెంటిని మాలిన యిట్టి పాపిష్ఠకార్యమును జేయును? ప్రాణులకు అంత్యకాలమున బుద్ధి తబ్బిబ్బుపడునని పురాతనశ్రుతిగలదు. మహారాజు ఇట్లు అకార్యము గావించి, ఆ శ్రుతిని లోకమున నందఱికిని ప్రత్యక్షము గావించెను. కైకవిషము ద్రావునని చూపిన కోపమునుబట్టియు, ఆకైకయందలి మోహమునుబట్టియు, మఱిసాహసము వలనను, నాయన గావించిన ధర్మాతిక్రమణమును నీవు సమీచీనమైనయర్ధమును స్మరించి దానిని నివర్తింపఁజేయుము. ఏపుత్త్రుఁడు తండ్రిగావించిన ధర్మాతిక్రమమును సరిగావింపఁగోరునో వాఁడే కొడుకని లోకులెన్నుదురు. అట్లుగానివాఁడు కొడుకే కాఁడు. నీవు అట్టిపుత్త్రుండ వగుము. తండ్రి లోకమున పండితులు నిందించునట్లు చేసినపాపకార్యమును నీవు పొందఁదగదు. నీవు కైకేయిని, నన్నును, నాయనను, మనచెలికాండ్రను, బంధువులను, పురజనులను, ఈరాజ్యము నంతటిని రక్షింప వలయును. అరణ్యావాస మెక్కడ? క్షత్రియ ధర్మ మెక్కడ? జటలెక్కడ? రాజ్యపాలన మెక్కడ? ఇట్టి విరుద్ధకార్యమును నీవెంత మాత్రమును జేయఁదగదు. మహాప్రాజ్ఞా! ప్రజాపరిపాలనము పట్టాభిషేకమువలననే చేయశక్య

మగుచున్నది. కనుక క్షత్రియునకు పట్టాభిషేకమె ప్రధమ ధర్మముగదా! కోఱి మాలిన క్షత్రియుఁడెవ్వఁడు త్యాగభోగ యుక్తమగుటచే ప్రత్యక్షఫలమైన ప్రజా పాలన ధర్మమునువిడిచి, అప్రత్యక్షమై, అంగలోపాదులు కలుగఁ గూడుటచే సంశ యింపఁదగిన ఫలముగలదై, లక్షణము లేమిచే నిరూపింప నలవిగానిదై, కాలాంతర ఫలప్రదమై, క్షత్రియున కిది మొదట యాచరింపఁదగిన దని యేప్రమాణముచేతను నిశ్చయింపఁ బడకుండు తాపస ధర్మము నాచరించును? ఇఁక మిక్కిలి క్లేశము గలి గించు ధర్మమునే యాచరింపవలయునని నీవు గోరుదువేని ధర్మంబున బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రు లను నాలుగు వర్ణములను స్వధర్మముల నతిక్రమింపకుండు నట్లు పరిపాలింపుము. ఇదియుఁ గ్లేశకరమైన ధర్మమేయగును. ధర్మజ్ఞా! ధర్మ విదులు నాలుగు ఆశ్రమములలోను గృహస్థాశ్రమమే శ్రేష్ఠమని చెప్పుదురు గదా! అట్టి గృహస్థాశ్రమమును ఎట్లు నీవు విడిచిపెట్టవచ్చును? నేను విద్యచేతను రాజ్యమునకు వచ్చుక్రమమునను స్థానమునను వయస్సునను, నీకన్నను జిన్నవాఁ డను. అట్టినేను, అన్నిటను బెద్దవాఁడ వగునీ వుండఁగా, నెట్లు భూమిని పాలింపఁ గలను? 'నీవలె నేనును బాలుఁడనేకదా!' యందువా? నేను బాలుఁడనుమాత్రమే కాను, మంచిగుణములును బుద్ధియును లేనివాఁడను. నాస్థితియు హీనమైనది. నిన్నువిడిచినచో ఊరకయు నుండజాలను? ఇఁక నీవు లేక రాజ్యము నెట్లు సేయఁ గలను? ధర్మజ్ఞా! నీవు నిజధర్మము నవలంబించి బంధువులం గూడి, అకంటకమైన నీతండ్రిరాజ్యమునంతయు ఏమఱక చక్కఁగా పరిపాలింపుము. ప్రజలందఱును, వసిష్ఠుఁడు మున్నగు మంత్రవిదులైనఋత్విజులును, ఇచ్చటనే నీకు సమంత్రక ముగా పట్టాభిషేకము గావింతురుగాక! లోకముల నంతయు గెలిచిన పిదప దేవ తలచే నభిషిక్తుఁడైనయింద్రునివలె, నీవు మాచే నభిషిక్తుఁడవై ప్రజలను పరి పాలించు నిమిత్తమై అయోధ్యాపురికి రమ్ము. దేవర్షిపితృఋణములను మూఁడింటిని దీర్చుకొని, శత్రువులను జక్కఁగా దహించివైచుచు, స్నేహితులకు సకలకామిత ములచేఁ దృప్తినొందించుచు, నిట్లు రాజ్యమును నన్నును నీవే పరిపాలింపుము. ఆర్యా! ఇప్పుడు ని పట్టాభిషేకము కాఁగా, నీస్నేహితులందఱును, సంతోషింతురు గాక! ఇప్పుడే నీపగవారందఱును, భయమున దశదిశలకుఁ బాఱిపోవుదురుగాక. పురుషతిలకా! నాతల్లిపొందినలోకనిందను దుడిచివైచి, పూజ్యుండగుతండ్రిని బాపము కలుగకుండునట్లు, గావుము. నేను శిరముసోఁక మ్రొక్కి బతిమాలు చున్నాను, మహేశ్వరుఁడు ప్రాణులయందుం బోలె నీవు నాయందును బంధువుల యందును. అందఱియందును అనుగ్రహముంపవలయును. ఇఁక నీవు నా యీప్రా ర్థనను వెనుకకుఁ ద్రోసి యింతకును వనమునకే పోవుదువేని, నేనుగూడ నీవెంటనే వనమునకు వచ్చెదను." అనెను. రాముఁడు ధైర్యవంతుఁడుగావున భరతుఁడాఱట పడుచు శిరసుసోఁక మ్రొక్కి, తన్నుప్రసన్నుఁడుగా నెంతప్రార్థించుచున్నను

తండ్రియిడిన యాజ్ఞయందే స్థిరముగా నెలకొని యయోధ్యకుబోవ నిచ్చగింపఁడయ్యె. జనులందఱును మిక్కిలి యద్భుతమైనరాముని స్థైర్యమును జూచి యేకకాలమున సంతోషమును దుఃఖమును బొందిరి. అయోధ్యకు రాఁడని దుఃఖమును, ప్రతిజ్ఞ తప్పడని సంతోషమును వారికిఁ గలిగెను. అప్పుడు అట్లు రామునకు యుక్తియుక్తముగాఁజెప్పుచున్నభరతునిఁ జూచి, ఋత్విజులును, పురజనప్రముఖులును, తబ్బిబ్బువడుచు కన్నీళ్లు వెల్లిగొనుచున్నతల్లులును, మిక్కిలియుఁ బ్రస్తుతించిరి. అంత వారందఱును రామునకు నమస్కరించి సవినయముగాఁ బ్రార్థించిరి. ఇది నూటయాఱవ సర్గము.



భరతుఁడు తండ్రికామమోహమును నిందింపఁగా రాముఁడు దానిని నిరసించి యతఁడు ధర్మమే యాచరించినాఁడని యుక్త్యంతరము చెప్పుట.

శ్రీమంతుం డగులక్ష్మణాగ్రజుఁడు రాముఁడు భరతునిస్తోత్రాదులం బూజితుఁడై, బంధుమధ్యమున నట్లు చెప్పుచున్నభరతుంజూచి మరల, 'ఇపుడు నీవు చెప్పినమాట రాజశ్రేష్ఠుఁ డగుదశరథమహారాజునకు కైకేయియందు జన్మించినట్టి సుపుత్రుఁడ వగునీకు యుక్తముగానే యున్నది. మున్ను మనతండ్రి దశరథమహారాజు, నీతల్లిని కైకేయిని వివాహమాడునపుడు, నీతాత యగుకేకయమహారాజునకు, కైకకుఁబుట్టినవానికే రాజ్యము నొసంగెదనని * యీశుల్కమును బ్రతిజ్ఞ చేసినాఁడు.మఱియు ప్రభుండైన యా మహారాజు, దేవాసురయుద్ధమునందు, నీతల్లి గావించినసేవకు మిక్కిలిసంతసిల్లి, యాబిడకు రెండువరము లొసఁగెను. పురుష

* కైక, తనవివాహకాలమున నిచ్చినకన్యాశుల్కమునుబట్టి భరతునకురాజ్యము ప్రాప్తమైయుండఁగా దానిని వరముగా నెట్లువేఁడినదని యడుగవచ్చును. ఇది ఆబిడబాల్యమందు జరిగినవృత్తాంతమగుటచేతను,ఇదిజరిగి చాలఁగాలమై యుండుటచేతను విడిచి, సన్నిహితముగా లభించినవరద్వయమునే యాచించినదనుకొన్నచో దోషములేదు. ఇటీవల వరములు నడుమ ప్రాప్తించినవేయయ్యును అట్టివానినిగూడ మఱచి మంథరచే తలపింపఁబడినదై యడిగినట్టికైక,చిరకాలవృత్తాంతమును మఱచియుండుట ఉపపన్నముగానే యున్నది అయితే దశరథుఁడు వివాహకాలమున కైకకొడుకున కిచ్చెదనన్న రాజ్యమును రామునకిచ్చుటకెట్లు పూనినాఁడన్నచో 'ఉద్వాహకాలే రతిసంప్రయోగ ప్రాణాత్యయే సర్వధనాపహారే। విప్రస్యచార్థే ప్యనృతంవదేయుః పంచానృతాన్యాహు రపాతకాని' అని వివాహకాలమున అబద్ధమాడుట దోషముకాదనుటను మనస్సుననుంచుకొనియే యట్లు చేసినాఁడుగావున దోషము లేదు. కేకయుఁడును రామగుణపరవశుండై రాజ్యమును దనమనుమనికి నడుగఁడయ్యెను. రాముఁడును మంత్ర్యాదులవలన నీరహస్యమును వినియున్నాఁడు. వారును దీనిని వినియున్నవా రగుటచేత దశరథునికార్యమునకు అనుమతించి యూరకుండిరి గాని, ఆక్షేపింపరైరని తెలియుచున్నది.

తిలకా! అంతయశస్వినియు నుత్తమస్త్రీరత్నము నైననీతల్లి పురుషశ్రేష్ఠుఁ డగు మహారాజుచే శపథముచేయుంచుకొని నీకు రాజ్యముగట్టునట్లును నన్నడవికిఁ బంపునట్లును రెండువరము లడిగెను అప్పుడు మహారాజు ఆబిడ నియమించినట్లే ఆరెండు వరముల నొసఁగెను. పురుషతిలకా! అట్లు తండ్రి కైకకు రాజ్యము నొసంగుటచే నన్ను వరదానముచొప్పున పదునాలుగు సంవత్సరము లడవియందుండుమని యాజ్ఞాపించెను. అట్లాజ్ఞాపింపఁబడిన నేనును, తండ్రిమాటను గయికొని, ఆయనమాటను సత్యము గావించుటయందు నిలిచి, ఎవ్వరు చెప్పిననువినక, ఎదురులేక, లక్ష్మణునిని సీతనుంగూడి నిర్జన మైనయీవనమునకు వచ్చితిని. రాజతిలకా! నీవుగూడ తండ్రియాజ్ఞ చొప్పుననే శీఘ్రముగా అభిషేకముసేసికొని, తండ్రిమాటను సత్యము గావింపవలెను. భరతా! నీవు నన్నుఁబట్టి, నా మాటనైనవిని, ప్రభుం డగుమహారాజును తండ్రిని, కైక కాయన పడినఋణమునుండి విముక్తునిగావించి, ధర్మజ్ఞుఁ డైన యా తండ్రికిని, నీ తల్లికిని సంతోషము గూర్పుము. నాయనా! మున్ను గయ యనుక్షేత్రమునఁ బిత్రృయాగము గావించుచు మహాత్ముఁ డైనగయుఁడు నుడివినగాథ వినఁబడుచున్నది గదా! తండ్రిని 'పుత్' అను పేరుగల నరకమునం బడనీక రక్షించుటవలనను, తండ్రిపేర నిష్టాపూర్తాదులు గావించి పరలోకమునఁ దండ్రికి సుఖముగలిగించి రక్షించుటవలనను, కొడుకునకు పుత్త్రుఁ డనుపేరు గలిగినది. గుణవంతులును విద్యావంతులును నగుపుత్త్రు లనేకులు గలుగవలయు నని కోరవలయును. పెక్కుపుత్త్రు లున్నయెడల. వారలలో నొక్కండైన నా గయాక్షేత్రమునకుఁ బోవును.' అని గయుఁడుచెప్పినగాథ వినియున్నారము గదా. రాజకుమారా! ప్రభూ! పురుషవరేణ్యా! ఇట్లు రాజర్షులందఱును అనుష్ఠించుచున్నారు. కాఁబట్టి మనతండ్రి యగుమహారాజునకు నరకము గలుగకుండునట్లు గావింపుము. నరాగ్రణీ! భరతా! నీ వయోధ్యకుఁ బొమ్ము, పోయి శత్రుఘ్నుని వసిష్ఠుఁడు మొదలైన బ్రాహ్మణోత్తములనుగూడి జనులను బాలింపుము. రాజా! ఇఁక నేనును జాగుసేయక, యీ సీతాలక్ష్మణుల నిరువురంగూడి దండకారణ్యమునకుఁ బోయెద. భరతా! నీవు మనుష్యుల కందఱకును రాజవగుము. నేను వనమున నుండు మృగములకెల్ల రాజుగా నుండెదను. నీవు శీఘ్రమున నయోధ్యకుఁ బొమ్ము, నేనును ఇప్పుడె దండకారణ్యమునకుఁ బోయెదను. భరతా! శ్వేతచ్ఛత్రము నీశిరమున సూర్యకిరణంబులఁబాఱదోలునట్టిచల్లనినీడ గావించుఁగాక. నేనును సర్వోత్తమమైన ఈ యడవివృక్షములనీడ నాశ్రయించి సుఖంబున నుండెదను. నీకు సహాయుఁడు మిక్కిలియు బుద్ధిమంతుఁ డైనశత్రుఘ్నుఁడున్నాఁడు. నాకు ముఖ్యస్నేహితుఁడు లక్ష్మణుఁ డున్నాఁడు. మనము నలువురము పరస్పరసాహాయ్యమున మనతండ్రి యగుమహారాజుమాటను సత్యము గావింతము. దుఃఖము నొందకుము' అని చెప్పెను. ఇది నూటయేడవ సర్గము.



రాముఁడు భరతుని నిరుత్తరునిగాఁ జేయఁగా జాబాలి చార్వాకమతము నవలంబించి రాముని రాజ్యమును గయికొనఁ బ్రార్థించుట.

బ్రాహ్మణశ్రేష్ఠుం డగుజాబాలి, యట్లు భరతుని నాశ్వాసించుచున్నసకల ధర్మవిదుని రామునిం జూచి అధర్మయుక్తముగా చార్వాకమతము నాశ్రయించినవాఁడై వైదికధర్మమునకు దూర మగుమాటల ధర్మజ్ఞుఁ డైనరామునిఁ జూచి 'రాఘవా! నీవు పొగడ్తకెక్కినబుద్ధిగలవాఁడవు మహాధైర్యవంతుఁడవు. ఇట్టి నీకు సామాన్యుఁ డైనమనుజునికింబోలె, ఇట్టినిష్ప్రయోజన మైనబుద్ధి బొత్తిగాఁ గలుగకుండుఁగాక. దానినుండి బొత్తిగా తొలఁగుము. ఎవ్వని కెవ్వఁడు బంధువు? ఎవ్వనికి దేనిచేత నేమి కలుగఁగలదు? ఏమియులేదు. ప్రాణిపుట్టినపుడు ఒంటిగా పుట్టును. కనుక చచ్చునపుడును ఒక్కఁడేచచ్చును. కాని ఎవరును గూడపుట్టుటయు లేదు, కూడఁ జచ్చుటయులేదు. రామా! విషయ మిట్లుండుటవలన నెవఁడు తల్లియని తండ్రియని మిక్కిలి యాసక్తిపొందునో, వాఁడు వెఱ్ఱివాఁ డని తెలియుము. ఒకరికి మఱొకఁ డేమియుఁగాఁడు. ఒకరికొకరికి నెంతమాత్రము సంబంధము లేదు. * ఒకానొకఁడు మఱియొక గ్రామమునకుఁ బోవుచు నడుమ విశ్రాంతికొఱకు ఒకానొకచోట వసించి మఱునాఁ డావాసస్థానమును విడిచి ప్రయాణమై పోవునట్లే మనుష్యులును సంసారయాత్ర సేయుచు నడుమ వాసస్థానమువలె తల్లినిఁ దండ్రిని గృహమును-ధనమును బొందుచున్నారు. కనుక తల్లిదండ్రులు మొదలయినవారు కేవలము వాసస్థానములవంటి వారే కాని మఱేమికాదు. కనుక సత్పురుషులు వారియందు తగులమునొందరు. పురుషతిలకా! అట్టి మహాబుద్ధిశాలి వగు నీవు పిత్ర్యం బగురాజ్యమును విడిచి, దుఃఖకరమును యౌవనమునకు అనుచితమును పెక్కుఉపద్రవములు గలదియునగు నీకుత్సితమార్గము (వానప్రస్థవృత్తిని) నవలంబించుట యెంతమాత్రము తగదు. సకల సంపదలపెంపు సొంపారుచున్న యయోధ్యాపురమునకుఁ బోయి యభిషేకము గావించుకొనుము. పతివ్రత నియమమున ఒంటిజడదాల్చి తనపతి నెదురుచూచునట్లు, అయోధ్యానగరాధిదేవత నియమంబున నిన్నెదురుచూచుచున్నది. రాజకుమారా! నీవు మిక్కిలి యుత్తమము లైనరాజభోగముల ననుభవించుచు స్వర్గమున దేవేంద్రుఁడుంబోలె, అయోధ్యయందు విహరింపుము. నీకు దశరథునితోడ నేపాటి సంబంధమును లేదు. దశరథున

* ఆ పురుషుఁడు ఆవాసస్థాన మందుండునంతసేపే దానిని వాసస్థలముగా వినియోగించుకొనుచున్నాఁడుగాని దానినివిడిచిపోయినపిదప దానిని తలంపనుగూడఁ దలంపఁడు. అట్లే తల్లిదండ్రులతోఁ గూడియుండునంతవఱకే వారినిఁదల్లిదండ్రులుగా అనువర్తింపవలయునుగాని వారిని బాసినపిదప తలఁచుకొనుటయు నిరర్థకమే. ఇఁక వారిప్రీతికొఱకు ఏ కార్యమైనను జేయుట ' క్కిలియు నిరర్థకమని చెప్పనేల యని భావము.

కును నీతోడ నెట్టిసంబంధమును గలుగదు. ఆ రాజు వేఱు, నీవు వేఱు. కావున నేను జెప్పునదిసేయుము. జంతువునకు తండ్రి ముఖ్యకారణము గాఁడు, స్వల్పకారణమే. ఋతుకాలమునందు తల్లి దాల్చిన శుక్లశోణితములే ప్రధానకారణము. దాని వలననే యీలోకమునఁ బురుషుఁడు జన్మించుచున్నాఁడు. మహారాజు ఎచ్చటికిఁ బోవలయునో యచ్చటకే పోయినాఁడు, భూతములందు లయించినాఁడు. ఇంతే కాని విశేష మేమియు లేదు. ఇది మరణశీలుర కందఱికిని స్వభావము. నీవు మాత్రము లేనిసంబంధము నొకటి తెచ్చిపెట్టుకొని బాధపడుచున్నావు. ప్రత్యక్షసౌఖ్యమును విడిచిపెట్టి యెవరు కేవలము అర్థసంపాదనమందుఁగాని కేవలము ధర్మాచరణమందుఁగాని యాసక్తు లగుదురో వారినిజూచియే నేను దుఃఖపడుచున్నాను. ప్రత్యక్షసుఖములను అనుభవించు నితరులంజూచి నాకు దుఃఖములేదు. ఏలనఁగా ఆయర్థధర్మపరాయణులు ఇచ్చట దుఃఖమునొంది చెడుటయేకాక చచ్చియునుగూడ దుఃఖమునే పొంది చెడెదరు. ఇందుల కుదాహరణమువినుము. అష్టకాశ్రాద్ధమనియు ప్రత్యాబ్దికమనియు నీలోకమున జనులు శ్రాద్ధకర్మములు సేయుచున్నారు. ఆ కర్మములందెల్ల, సుఖముగా దాము భుజింపవలసిన తమయన్నమునకు ఒకరికి పెట్టుటచే తెచ్చుకొన్న నాశమును ఆలోచించిచూడుము. చచ్చినవాఁ డేమితినగలఁడు? వానికిఁగాను ఇతరులకు పెట్టినయన్న మంతయు వ్యర్థమేకదా. ఈ లోకమునందు ఒకఁడు భుజించినయన్నము మఱియొకని దేహమును బొందునేని యపుడు దేశాంతరమును గూర్చిపోవుచున్న వానిఁగూర్చి వానిపుత్రాదులు శ్రాద్ధభోజనములుసేయింపవచ్చునే! అట్లు ఒకరికిఁ బెట్టిన యాయన్నము ఆ దేశాంతరగతునికి దారిబత్తెము కావచ్చునే! అయినను అట్లగుటలేదు. అట్లే చచ్చినవానికిని అది యన్న మగుటెంత మాత్రమును గలుగదు. కనుక 'దేవతల నారాధింపుము. దానములు సేయుము. యాగదీక్షవహింపుము. అ[†]న్వేషణము లన్నియువిడువుము.' అని ద్రవ్యార్జనమునందు మిక్కిలి కుశలబుద్ధిగలవారు, దానములను చేయునట్లు వశీకరించుటకై యుపాయములుగా ఈ గ్రంథములను రచించిరి. మఱేమియుఁ గాదు. రామా! నీవు మహామతివి. పితృవచనము పరిపాలింపఁ దగునని తలఁచు చున్న నీవు పరలోకమే లేదని నిశ్చయించు కొనుము. ప్రత్యక్షసిద్ధ మయినరాజ్యభోగాదుల పరిగ్రహింపుము. పరోక్షసుఖమును గూర్చు నన్నపితృవచనపరిపాలనాదులను వెనుకకుఁ ద్రోసివుచ్చుము. నీవు ప్రత్యక్షమునకన్న నధికమేది లేదనెడి యీసర్వజనసమ్మతమయినబుద్ధిని మున్నిడుకొని భరతునిప్రార్థనకుఁ గలంకదేఱి రాజ్యమును బరిగ్రహింపుము' అనెను. ఇది నూటయెనిమిదవ సర్గము.



† 'నీవొకరాజవు. అతఁడొకరాజు' అని యర్థాంతరము.

## రాముఁడు జాబాలిమతమును నిరాకరించి వైదికమతము స్థాపించుట.

సత్యమునందు బుద్ధి నూనినవారలలో రాముండు మేటి. కనుక నతఁడు జాబాలి చెప్పినమాట వినియు, వైదికకర్మములందు మిక్కిలియుం దనకుఁగల శ్రద్ధను విడువక, బుద్ధిచలనమును బొందక, యతనితో "నీవు, నాకుఁ బ్రియములైన రాజ్యాభిషేకాదులందుఁ గోర్కికలుగుటకై చెప్పినమాట చేయఁదగినదిగా నగపడుచున్నది. కాని, చేయరానిది, హితమువలెనే తోఁచుచున్నది గాని, యహితమైనది, దానిచే పిదప దుఃఖమేకలుగును. ఇట్టి మతము గలిగి, దీనివలన పాపాచారములతోఁగూడి, మర్యాద తప్పినట్టిపురుషుని సత్పురుషు లెంతమాత్రమును బహుమానింపరు. 'మంచివాఁ డనియు, చెడ్డవాఁడనియు, నెట్లు తెలిసికొనవచ్చు' నందువా? మంచికుల మునఁ బుట్టిన వాఁడనికాని చెడుకులమువాఁడనికాని, వీరుఁడగుటగాని, మగటిమిగల వానినిగాఁ దన్ను నెన్నుకొనుటగాని, పరిశుద్ధుఁడగుటగాని, అపరిశుద్ధుఁ డగుటగాని వానివాని యాచారమే తెలుపును. నేను దూష్యుఁడనే యయ్యుఁ బూజ్యునివలె నగపడుచు, శుచిహీనుఁడనై యై పరిశుద్ధునివలెనుండి, శిష్టలక్షణములతోఁగూడినవాఁడ నయ్యు అట్టి లక్షణములు లేని వానివలెను, శీలవంతునివలె నుండియు దుశ్శీలుఁడనై, శుభప్రదమైన వైదికధర్మమును విడిచినవాఁడ నగుచు, వైదికక్రియలును వేదవిధులను మాలినదై లోకసంకరకారణమై యొప్పు నీ చెప్పిన యీ యధర్మమును ధర్మమని యవలంబింతునేని, యిట్టి దురాచారుఁడును లోకదూషకుఁడు నగు నన్ను లోకంబునందు, కార్యాకార్యములఁ దెలిసిన తెలివిగలవాఁ డెవఁడు గొప్పగా తలఁచును? ఎవ్వఁడు నట్లు తలఁపఁడు. గొప్పగా తలఁపకపోవుటయే కాదు. నేను నావనవాసప్రతిజ్ఞనువిడిచి, నీవు 'అపరోక్షమును విడువు' మని చెప్పిన యాదుష్టవృత్తిచొప్పన నడచుకొనుచుందునేని, యిఁక 'నేనుచెప్పినదానిని నీవాచరింపు' మని యొవరికుపదేశింతును? ప్రతిజ్ఞతప్పిననామాట నెవరువిందురు? మఱి స్వర్గముగాని యే యుపాయమున నాకుఁ గలుగును? నీవు చెప్పునట్లు చేయుదునేని నన్నుఁ జూచి యీ లోకులందఱును విచ్చలవిడిగా నడచుకొనువారై పోవుదురు. ఏలనఁగా రాజు ఏయాచారము లవలంబించునో ఆయాచారములనేగదా ప్రజలుగూడ నవలంబింతురు. కావున నాకే కాక లోకులకెల్లను పరలోకహాని కలుగును. భూతదయయే ప్రధానముగాఁగలదై శాశ్వతముగానుండు రాజవృత్తము సత్యరూపమే, సత్యమే, యగును. ఇట్లు సత్యమే రాజవృత్తముగా నుండుటంబట్టి రాజ్యమందలి జనసమూహమును సత్యమే రూపముగాఁ గలిగి, సత్యమే ప్రధానముగాఁ బడసియుండును. ఆ సత్యమందే లోకమంతయు నెలకొనియున్నది. అట్టి సత్యము నెట్లు విడువవచ్చును? ఋషులును దేవతలును సత్యమునే మిక్కిలి యుత్కృష్టమైనదిగా తలంచిరిగదా. ఈ లోకమున సత్యవాదియగువాఁడు పరమపదమును బొందును. లోకులు,

సర్పమును జూచినట్లు, అబద్ధము లాడువానిని జూచి భయపడుదురు. లోకమునందు సత్యమే పరమధర్మము. అదియే స్వర్గమునకు కారణమనియుఁ జెప్పఁబడును. సత్యమే లోకమునందు నియంత. లక్ష్మియు సత్యమునే యెప్పుడు నాశ్రయించి యుండును. సత్యమే సమస్తమునకును ఆధారము. సత్యమునకన్నను పరమగతి యేదియులేదు. దానములకును యాగములకును హోమములకును తపస్సులకును అన్నిటికి సత్యమే యాధారము. వేదములకును సత్యమేయాధారము. కాఁబట్టి యెప్పుడును సత్యమునువిడువరాదు ఒకఁడు లోకమునుబాలించును. ఒకఁడు కులమునుబాలించును. ఒకఁడు నరకమునంబడును. ఒకఁడు స్వర్గమునఁ బూజితుఁడగును. ఇట్లు సత్యవంతునికి ఐహికాముష్మికఫలములు గలుగును. సత్యహీనునికి నరకమే సిద్ధించుచున్నది. నేను నాయంత సత్యసంధుఁడను, మఱియు 'నీవు చెప్పినట్లచేయుదు' నని కైకతో సత్యముమీఁద శపథముచేసినవాఁడను. ఇట్టి నేను సత్యం బగుతండ్రి యాజ్ఞ నేల పరిపాలింపకుందును? సత్యప్రతిజ్ఞుఁడ నగునేను, రాజ్యమువలని లోభమునంగాని, యిట్టి మోసపుమాటలచే మనస్సు తబ్బిబ్బునొందిగాని, అజ్ఞానమునఁగాని, తమోగుణమునొందిగాని, ఏది యెట్లయినఁగాని, 'నీకు ప్రియమైనదానిని సత్యముతోడు చేసెద'నని నాతండ్రి కైకకు చెప్పిన సత్యవాక్యంపుమేరను భేదింపను. అసత్యములాడువాఁడును, చపలస్వభావుఁడును, మనస్సు నిలుకడ లేనివాఁడు నగునరుఁడు హవ్యకవ్యములొసఁగినను, దేవతలుగాని పితరులుగాని పరిగ్రహింపరని మనము వినియున్నాము. సత్యరూపమైనయీధర్మము, ఆత్మనుగూర్చి యెడతెగక ప్రవర్తించునదిగా నాకుఁ దోఁచుచున్నది. సత్పురుషు లాచరించి సమకట్టిన యీ జటావల్కలాదిభారమును సత్యరూపమైన యీధర్మమునకుఁగానే యంగీకరింపఁబడుచున్నదిగాని వేఱుకాదు. క్షత్రియధర్మమునందు అధర్మము మిక్కిలి, ధర్మము కొంచెమే యుండును. దానిని క్షుద్రులును క్రూరులును లుబ్ధులును పాపకర్ములును సేవింతురు. కాన దానిని నేను విడుతునుగాని దానిచొప్పున రాజ్యము గయికొనను. మనుష్యుఁడు మొదలు పాపమునుజేయ మనసున నిశ్చయించుకొనును. పిదప దేహముచేఁజేయును. మఱి నాలుకచే నబద్ధమాడును. ఇట్లు మానసిక కాయిక వాచికములని పాపము మూఁడువిధములుగలవు. భూమియు, దానముచేఁ గలిగినకీర్తియు, పౌరుషముచేఁ గన్నవన్నెయు, లక్ష్మియు, త్రికరణశుద్ధిగా సత్యమందే నెలకొన్న పురుషునే పొందఁగోరుచుండును. అట్టి పురుషుఁడు స్వర్గస్థుఁడైనను వెంట నంటిపోవును. కావున సత్యమునే యవలంబింపవలయును. నీవు మిగులమేలయినదని నిశ్చయించి 'ఇది మంగళకరము. దీనిం జేయుము' అని యుక్తియుక్తము లగువాక్యములంజెప్పితివే! అది యెంతమాత్రమును పూజ్యముకానేరదు, అపూజ్యమేయగును. కనుక 'పరోక్షమును వెనుకకుఁద్రోచి, ప్రత్యక్షమును గయికొనుమనుట' చెల్లదు. మఱి భరతుఁడు వేఁడినట్లు రాజ్యమును గయికొనుమంటివి. నేను తండ్రియొద్ద నిట్లు

వనవాసముసేయఁ బ్రతిజ్ఞ సేసి, యిప్పుడు తండ్రిమాటను దిగవిడిచి భరతునిమాట నెట్లు చేయుదును? నేను నాతండ్రి సమక్షమున స్థిరమయిన ప్రతిజ్ఞను చేసి యున్నాను. అప్పుడు కైకేయీదేవియు నందులకు మిక్కిలి సంతసిల్లినది. అట్టి ప్రతిజ్ఞను ఇప్పుడు విడుచుటదగదు. నాకుఁ గార్యాకార్యంబులు చక్కఁగాఁ దెలియును; గనుక శ్రద్ధగలిగి, కృత్రిమబుద్ధిలేక, పరిశుద్ధుఁడనై, వనవాసము సలుపుచునే వన్యాహారములే నియమముతోఁగొనుచు, దానిచే పంచేంద్రియములకుఁ దృప్తిగావించి, పవిత్రము లగుపుష్పఫలమూలములచేఁ బితృదేవతలకును దేవతలకునుదృప్తిసేయుచు నిట్లు పితృవచనపరిపాలనరూప మగులోకవర్తనము నడపుచుఁ గాలముపుచ్చెదను. అష్టకాదుల నుదాహరించి కర్మములు నిష్ఫలములంటివి. *జనులు ఈ కర్మభూమిని బొందియుండువఱకు శుభంబు లగుకర్మములను అవశ్యముసేయవలయును. అట్లు అగ్నియును వాయువును చంద్రుఁడును, ఈ కర్మభూమియం దుండునపుడు గావించిన కర్మములకు ఫలములుగా అగ్నిత్వ వాయుత్వ చంద్రత్వములను బొందినవారైరి. కావున కర్మములు నిష్ఫలములుగావు. దేవేంద్రుఁడు నూఱుయాగములుసేసి దేవలోకమునకు ఆధిపత్యమునొందెను. మహర్షులును ఉగ్రము లైనతపములను గావించి స్వర్గమునొందిరి' అనెను. ఇట్లు భయంకరతేజుఁ డగునారాజకుమారుఁడు రాముఁడు నాస్తికవాక్యములం దర్కించుటను జాబాలి విని, సహింపఁజాలక యతనివచనములను మనస్సున మిక్కిలి యేవగించుకొను చున్నంత, నతనితో 'సత్యము, ధర్మము, పరాక్రమము, భూతదయ, ప్రియభాషణము, బ్రాహ్మణపూజ, దేవతార్చనము, అతిథిసత్కారము ఇవన్నియు స్వర్గమునకు మార్గమని సత్పురుషులు చెప్పుదురు. కావుననే, విప్రులు, ఈ యర్థమును కలరూపున నిట్లు తెలిసికొని యందఱు నైకమత్యంబున, పరాకులేక, శాస్త్రముచొప్పున స్వస్వవర్ణాశ్రమములకుఁ దగిన ధర్మముల నన్నిటిని ఆచరించుచు స్వర్గాదిలోకప్రాప్తినిఁ బడయఁగోరెదరు. వేదవిరుద్ధమైన మార్గమందు నీబుద్ధి నెలకొనియున్నది. మఱి నీవు వైదికవేషముదాల్చి యంతరంగమున మహానాస్తికుఁడవై చార్వాకమతానుసారి యైనయీనాస్తికబుద్ధిని పరులకు నుపదేశించుచు తిరుగువాఁడవు, ధర్మమార్గమునకుఁ దొలఁగినవాఁడవు. ఇట్టి నిన్ను, నాతండ్రి తనదగ్గఱకుఁ దీసిన కార్యమును నేను అవైదికకార్యమని నిందించుచున్నాను. వేదబాహ్యుఁ డగుబుద్ధుఁడు దొంగవలెనే నిరాకరింపఁ దగినవాఁడు గదా. ఈ లోకమున నాస్తికునిని ఆబుద్ధునితో సమముగానే తెలియును. కాఁబట్టి ప్రజలు నాస్తికుని అవైదికుఁడుగా శంకింపవలయును, పండితుఁ డగువాఁడు వాని

* దీనిచే శాస్త్రవిహితము లైనకర్మములకు ఫలము తప్పక కలుగుచున్నదనియు, దేశాంతరగతునికి శ్రాద్ధముసేయుట శాస్త్రవిహితముగాదు గావున దానికి ఫలము కలుగదనియు భావము సూచితము.

మొగమున వ్రాలరాదు. * నీకు మునుపటివారలును నీకంటెను శ్రేష్ఠులైనవారును అనేకులు శుభకర్మములను అనేకములను గావించి యిహపరలోకములను రెంటిని జయించి, యెప్పుడును ఆకాశమునందు గ్రహనక్షత్రాదిరూపముల వెలుఁగుచున్నారు. కాఁబట్టియె ద్విజులు శుభాత్మకములైనకర్మములను యజ్ఞాదిహోమకార్యములను తపోదానాదికృత్యములను జేయుచురు. ధర్మపరాయణులై, సత్పురుషసహవాసము సేయువారై, మిక్కిలి తేజము దీపించుచు దానగుణము ముఖ్యముగాఁగలిగి, అహింసకులును నిర్మలులునైన మునిశ్రేష్ఠులు లోకమునకంతయుఁ బూజనీయులు' అనెను. ఇట్లు రోషంబునఁ బలుకుమహాత్ముని మహాబలుని రామునిం జూచి యాబ్రాహ్మణుఁడు సవినయముగా ననునయించుచు, యథార్థమును ఆస్తికమతప్రతిపాదకమును సత్పురుషహితము నగువాక్యమున 'నేను నాస్తికులమాటలు చెప్పలేదు. నేను నాస్తికుఁడనుగాను. పరలోకము మొదలైనది లేదనుటయు లేదు. నాస్తికవాదు లెవ్వరైనను ప్రసక్తించినకాలమున వానినన్నిటిని నీవలెనే ఆస్తికుఁడనై ఖండించుచుందును. మఱి ధర్మసంకటకాలము వచ్చినపుడుమాత్రము కార్యసిద్ధికిఁ గాను, నాస్తికవాది నగుదును గాని నిజమున కట్టివాఁడను గాను. రామా! ఇప్పుడు మెల్లగా అట్టి సంకటకాలమిదిగో వచ్చినదిగావున నేను నాస్తికవాక్యము లాడునట్లయినది. నిన్ను అయోధ్యకు మరల్పవలయుననియు, నిన్నుఁ బ్రసన్నునిఁ జేయఁగోరియు నిట్లు చెప్పితినిగాని మఱి వేఱుగాదు.' అనెను. ఇది నూటతొమ్మిదవ సర్గము.



వసిష్ఠుఁడు జాబాలివచనాభిప్రాయమును జెప్పి రాముని
కోపముదీర్చి మనువు మొదలుగా దశరథునివఱకుఁ గల
రాజులపూర్వాచారమును జెప్పి జ్యేష్ఠుఁడే రాజ్యార్హుఁడని బోధించుమూలమున రాముని
మరల్పం జూచుట.

రాముఁడు జాబాలినాస్తికవచనములకు కోపము నొందుటను దెలిసికొని, వసిష్ఠుఁడు అతనింజూచి 'జాబాలియు, ఈజనులు పరలోకమునకుఁ బోవుదురనియుఁ బుణ్యముతీఱఁగా నచటనుండి యీ లోకమునకు వత్తురనియు నెఱుంగును, గాన నాస్తికుఁడుగాఁడు. అతండు నిన్ను ఎట్లయినను అయోధ్యకు మరల్పవలయు నని

* దీనిచేఁ బ్రత్యక్షమమాత్రమే ప్రమాణముగాదనియు,! వేదములును ఎడతెగని సంప్రదాయము లయ్యును వానికర్తను స్మరింపరాకుండుటచే అపౌరుషేయములై, కావుననే మహాజనపరిగ్రహీతములై దానంజేసి తాము ను బ్రమాణములగుచున్నవనియు, అగ్ని రవి చంద్ర నక్షత్రేంద్రాదుల ఫలభోగము ప్రత్యక్షసిద్ధముగానుండుటంబట్టి చూడఁగా, వైదికకర్మములు ఫలవంతములే యనియుఁ, దెరువరికి శ్రాద్ధము అవిహితమగుటచే అఫలమనియుఁ దెలియునది.

కోరి యీమాటఁ జెప్పినాఁడు. లోకనాథా! నేను లోకోత్పత్తిప్రకారమునం తయు నిదె చెప్పెద వినుము. ముందు అంతయు జలములు నిండియుండెను. అందు భూమి సృజింపఁబడినది. అందు స్వయంభువుఁ డైనబ్రహ్మయు దేవతలును జన్మించిరి అంత ప్రసిద్ధుఁ డగునారాయణుఁడు వరాహరూపం బెత్తి యాజలములనుండి భూమి నుద్ధరించెను. ఆబ్రహ్మయు చరితాత్ము లగుతనపుత్త్రులు మరీచ్యాదులం గూడి జగమానంతయు సృజించెను. పరబ్రహ్మమువలన బ్రహ్మపుట్టెను. ఆబ్రహ్మ ప్రవాహ రూపమున నిత్యుఁడు, ఇతరులకన్న చిరకాలస్థితుఁడు, తనస్థానమునుండియే మోక్షమును బొందుటచే నాశరహితుఁడు. ఆదేవునివలన మరీచి పుట్టెను. మరీచికిఁ గశ్యపుఁడు పుట్టెను. కశ్యపునకు సూర్యుఁడు పుట్టెను. సూర్యునకు వైవస్వత మనువు గలిగెను. ఆవైవస్వతుఁడే తొల్లి జనపతిగానుండెను. అతనికి ఇక్ష్వాకువు పుట్టెను. వైవస్వతమనువు మొట్టమొదట ఇక్ష్వాకువునకు సర్వసమృద్ధ మైన యీ భూమి నొసఁగెను ఆ యిక్ష్వాకువే అయోధ్యయందు మొదటి రాజని యెఱుంగుము. ఇక్ష్వాకువునకు శ్రీమంతుఁ డగుకుక్షియె కుమారుండని ప్రసిద్ధిగాంచెను. అంత కుక్షికి వీరుం డగువికుక్షి గలిగెను. వికుక్షికి మహాతేజుఁడును బ్రతాప శాలియు నగుబాణుఁడు పుట్టెను. బాణునకు మహాబాహుఁడును మహాకీర్తిమంతుఁడు నగుఅనరణ్యుఁడు పుట్టెను సత్పురుషతిలకుఁ డైన యీయనరణ్యుఁడు మహారాజై రాజ్యమును పాలించునపుడు, అనావృష్టి లేక వర్షములు చక్కఁగాఁ గురియుచుండెను దుర్భిక్షమును గలుగదయ్యె. ఒకదొంగయు లేఁడయ్యె. అనరణ్యునకు మహాబాహుఁడైన పృథువుగలిగెను. ఆపృథువునకు మహారాజైన త్రిశంకుఁడు జన్మించెను. వీరుఁడైన యాత్రిశంకుఁడు సత్యసంధుఁ డగుటవలన శరీరముతో స్వర్గము నొందెను త్రిశంకునికి మహాయశుఁడైన యువనాశ్వుఁడు పుట్టెను. అతఁడు మహాతేజుఁ డై దుందు వనురాక్షసుని జంపుటచే దుందుమారుఁ డనఁబడెను. యువనాశ్వునకు శ్రీమంతుఁ డగుమాంధాత పుట్టెను. మాంధాతకు మహాతేజుఁడైన సుసంధి జన్మించెను. సుసంధికి ధ్రువసంధి ప్రసేనజిత్తు అని యిద్దఱు గొడుకులు పుట్టిరి. అందు ధ్రువసంధికి శత్త్రుసూదనుఁ డైనభరతుఁడు పుట్టెను. మహాబాహుఁ డైనభరతునకు అసితుఁడనువాఁడు పుట్టెను ఆయసితునకు సామంతు లైన హైహయులును, తాలజంఘులును, శూరు లగుశశిబిందువులును, శత్త్రువులయిరి. ఆయసితుఁడు వారినెల్ల మాఱొడ్డి యుద్ధముసేసి పరాజయము నొందుటచే యరణ్యమునకుఁ బాఱఁగొట్టఁబడెను అతఁడు రమణీయ మైనహిమవత్పర్వతమునకుఁ బోయి, యచటనుండియుఁ దఱుముదు రనితలఁచి మునివృత్తి నవలంబించి విరక్తుఁ డయ్యె. అతనిభార్య లిరువురును గర్భిణులుగా నుండి రని వినికి. అందొక్కతి సవతి గర్భము నశించుటకై యాబిడకు విషముగలసిన భక్ష్యమును దిన నిచ్చెను. భృగువంశ్యుఁ డైనచ్యవనుఁడనుమహర్షి యాహిమవంతమునఁ గాపుండెను. విషము

దిన్న కాళింది యనునసితునిభార్య యామునియొద్దకుఁ బోయి నమస్కరించెను. ఆబ్రాహ్మణుఁడు కొడుకు పుట్టవలయునని వరముగోరుచున్న యాకాళిందిని జూచి 'దేవీ! నీకు మహామతియు సకలలోకప్రసిద్ధుఁడును ధార్మికుఁడు సదాచారసంపన్నుఁడును వంశకర్తయు శత్రుసంహారకుఁడు నగుపుత్త్రుఁడు గలుగు' నని చెప్పెను. అంతనారాజు దేవియు, మిక్కిలి సంతసిల్లి యామునికి ప్రదక్షిణముసేసి పూజించి, వీడ్కొని యింటికివచ్చి, తామర రేకులవంటి కన్నులుగలవాఁడై బ్రహ్మదేవునింబోలుచున్న కొమారునింగనెను. ఆబిడకు గర్భమును దూలింపఁగోరి, సవతి విషము పెట్టినదిగదా! ఆకుమారుఁడు ఆవిషముతోఁగూడనే పుట్టుటం జేసి సగరుఁడనఁబడెను. సగరుం డనునారాజు యజ్ఞదీక్షగయికొని యగపడకున్నతనయజ్ఞాశ్వమును వెదకుటకై, పర్వకాలమున జలవేగమున పెల్లురేఁగి చూపఱ యగు ప్రజల కెల్లభయమును బుట్టించునట్టిసముద్రమును గొడుకులచేతఁ ద్రవ్వించెను. సగరునకు అసమంజుఁ డనుపుత్త్రుఁ డుండినట్లు మనము వినియున్నారము. అతఁడు పాపకర్మములను జేయుటవలనఁ దండ్రి వానిని ప్రాణములతోనే యడవికి సాగనంపఁగొట్టెను. అసమంజునకుఁ బరాక్రమవంతుఁ డగునంశుమంతుఁడు పుట్టెను అంశుమంతుని పుత్త్రుఁడు దిలీపుఁడు. దిలీపునకు భగీరథుఁడు పుట్టెను. భగీరథునకుఁ గకుత్స్థుఁడు పుట్టె. అతనివలననే కాకుత్స్థులని మీరు ప్రసిద్ధులైతిరి. కకుత్స్థుని కొడుకు రఘువు. అతనిచేతనే మీవారు రాఘవు లనఁబడిరి రఘువునకుఁ దేజోవంతుఁడయినపుత్త్రుఁడొకఁడు గలిగెను. అతండు ప్రవృద్ధుఁడనియు, పురుషాదకుండనియు, కల్మాషపాదకుఁడనియు, సౌదాసుఁడనియు లోకంబునఁ బ్రసిద్ధివడసెను. కల్మాషపాదునకు శంఖణుఁడు పుత్త్రుఁడని ప్రసిద్ధుఁడయ్యెను. ఆశంఖణుఁడు కల్మాషపాదుని పరాక్రమమును మార్కొని తండ్రిచేత ససైన్యముగా నాశము సేయఁబడెను. శంఖణునికి శూరుఁడును శ్రీమంతుఁడు నగుసుదర్శనుఁడు పుట్టెను. సుదర్శనునికి అగ్నివర్ణుఁడు గలిగెను. అగ్నివర్ణునికి శీఘ్రగుఁడు పుట్టెను. శీఘ్రగునికి మరుఁడు పుట్టెను. మరునికిఁ బ్రశుశ్రుకుఁడు కలిగెను. ప్రశుశ్రుకునికి మిక్కిలి కాంతిమంతుఁ డైనయంబరీషుఁడు గలిగెను. అంబరీషునికి అమోఘపరాక్రముఁ డైన నహుషుఁడు జన్మించెను. నహుషునికిఁ బరమధార్మికుఁ డైననాభాగుఁడు పుట్టెను. నాభాగునికి అజుఁడు సువ్రతుఁడు అని యిరువురు కొడుకులు గలిగిరి. అజునికే ధర్మాత్ముఁ డైనదశరథమహారాజు గలిగెను. ఆదశరథునికి రాముండని నలుగడలఁ బ్రసిద్ధిగన్న నీవు జ్యేష్ఠకుమారుఁడ వగుదువు. రాజా! నీ విట్లు జ్యేష్ఠకుమారుఁడ వగుటంజేసి రాజవు నీవేయగుదువుకాన, నిదయినరాజ్యమును గయికొని ప్రజలను బాలించుకొనుము. ఇక్ష్వాకురాజులందఱియందును నే నిపుడు రూపించినట్లు జ్యేష్ఠకుమారుఁడే రాజగును. జేష్ఠుఁ డుండఁగా కనిష్ఠునికిఁ బట్టాభిషేకము సేయుట లేదు. జ్యేష్ఠునికే పట్టాభిషేకము జరుగును. మహాకీర్తీ! జ్యేష్ఠకుమారుఁడవగు

నట్టి నీకును, నిన్ను సంబంధించిన రఘువంశపువారికెల్లను బరంపరాగత మైె జ్యేష్ఠాభిషేచనరూపమయి యున్నకులధర్మమును ఇప్పుడు నీవుమొదలుగాఁ జెఱుపుట నీకుఁ దగదు. మహాయశా! నీతండ్రియుంబోలె నీవు బహుశ్రేష్ఠవస్తువిస్తారితంబై బహువిధజనపదయుక్తమైయొప్పుభూవలయమును బరిపాలింపుము ’ అని చెప్పెను. ఇది నూటపదియవ సర్గము.



వసిష్ఠుఁడాచార్యుఁడగుతనవచనమును ద్రోచిపుచ్చరాదనుట. రాముఁడు తండ్రిమాట యంతకంటెను శ్రేష్ఠమనుట. భరతుని స్థండిలశయనము. రాముని సమాధానము.

రాజపురోహితుఁ డగువసిష్ఠుఁడుఅపుడు రామునకుఁగులధర్మమునుజెప్పినను, అతఁడు తండ్రియాజ్ఞకు ఆకులధర్మము విరుద్ధమైనదనితలఁచి యూరకున్నాఁడని తెలిసికొని మరల ధర్మయుక్తముగా నతనితో “ కాకుత్స్థా! పుట్టిన యొక్కొక్కపురుషునికిని,ఆచార్యుఁడు తండ్రి తల్లి యనుముగ్గురును గురువు లగుచున్నారు. పురుషతిలకా! తండ్రియును దల్లియును,ఈపురుషుని దేహమాత్రమునుబుట్టించువారు. ఆచార్యుఁడు వీనికి జ్ఞానమునొసఁగును గావున గురుఁడు, అనఁగా ఆ తల్లిదండ్రులకంటె గొప్పవాఁడు, అనఁబడును. పరంతపా! నేను నీతండ్రికిని నీకును ఆచార్యుఁడను గావున, నీవు నామాట చొప్పున నడచుచుండవలయు. అట్లునడతు వేని సజ్జనమార్గమును అతిక్రమింపకుందువు. నాయనా! ఈబ్రాహ్మణులును పౌరజనులును క్షత్రియులును వైశ్యులును నీవారలు. వీరలను బాలించుట నీకుధర్మమును.ఆధర్మమును అనుష్ఠించుచుందువేని నీవు సత్పురుషమార్గమును అతిక్రమింపనివాఁడవగుదువు. వృద్ధురాలును బరమధార్మికురాలు నగుతల్లికి శుశ్రూష సేయకుండుట యెంతమాత్రమును యుక్తముగాదు. కనుక ఆయమ మాటచొప్పున నడచుకొనుచుందువేని సన్మార్గమును అతిక్రమించినవాఁడవు కాకుందువు. రాఘవా! నీవు సత్యమును ధర్మమును, అనుష్ఠించుటయందు శూరుండవు. అట్టి నీవు ‘నాతల్లిని సమాధానపెట్టితిని. పట్టముగట్టుకొనుము’ అని నిన్ను బతిమాలుచున్నభరతునిమాటను గావింతువేని ఆత్మభూతుఁడగు నీ తమ్ముని నతిక్రమింపకుందువు. సత్యధర్మపరాయణ మైనసీస్వభావమును నుల్లంఘింపకుందువు. సత్యధర్మములవలెనే నీయాశ్రితపారతంత్ర్యస్వభావమును అతిక్రమింపకుందువు.” అనెను. ఇట్లు ఆచార్యుఁడు మధురముగాచెప్పఁగా పురుషవృషభుఁ డగు రాముఁడు ఆసీనుండై యున్న యవ్వసిష్ఠునిఁజూచి * ‘తల్లి దండ్రులు మొదలఁ గొడుకు పుట్టవలయునని గావించిన వ్రతోపవాస దేవతారాధనాదుల

*సమస్తధర్మములకు సాధనభూతమైన శరీరమును గలిగించువారగుటంబట్టియు, అజ్ఞానదశలగు శైశవబాల్యములయందు సర్వప్రకారముల రక్షించువారగుటంబట్టియుఁ దలిదండ్రులు బహువిధ

కును, కొడుకు పుట్టిన వెనుక తమశక్తికొలఁది వానికిఁ జన్నిచ్చి యన్నవస్త్రాదు లొసఁగి, నలుఁగులుపెట్టి జలకమార్చుచు, ఎప్పుడు నింపయినమాటలాడుచుఁ బెంచి పెద్దసేయు నుపకారములకును, బదులుసేయ నలవికాదు. సర్వధర్మములకును సాధనమైనయిట్టి దేహమునకును గారణభూతులు. కాఁబట్టి తలిదండ్రులె గురువు కంటె నధికులు. ఆ దశరథమహారాజు నన్నుగన్నట్టితండ్రి. కాఁబట్టి యతనికి నేనుజేసినప్రతిజ్ఞ యెంతమాత్రమును మిథ్యగారాదు. అతనికే మొదటఁ బ్రతిజ్ఞ చేసియుండుటచే దానినితప్పి తల్లిమాటనుగాని తమ్మునిమాటనుగాని నాకుఁ జేయుట యుక్తముగాదు' అనిచెప్పెను. ఇట్లు రాముఁడు చెప్పఁగా మిక్కిలి యుదారుఁ డగుభరతుఁడు ఉల్లము మిక్కిలియుఁ బల్లటిల్లఁగా, తన దాపున నున్నసుమంత్రునిఁ జూచి 'సారథీ! నాకిచట నేలపయిని శీఘ్రముగా దర్భలను పఱువుము. రాముఁడు నాకుఁ బ్రసన్నుఁ డగునంతవఱకును, అతనికడ్డముగాఁ బరుండియుండెదను. వడ్డికిఁ గాను తనయొద్ది ధనమంతయు నప్పిచ్చిన బ్రాహ్మణుఁడు, అప్పు పుచ్చుకొన్నవాఁ డియ్యకపోవుటచే వానివాకిలి కడ్డముగా ఆహారముమాలి మొగముగప్పుకొని పరుండువిధమున నేనును, రాముఁ డయోధ్యకు రాకుండునంతవఱకును, ఆహారము మాని మొగముపై గుడ్డకప్పుకొని పర్ణశాలవాకిటఁ బరుండెదను.' అని చెప్పి, యా సుమంత్రుఁడు దర్భలనుపఱువక రామునియనుజ్ఞ నెదురుచూచుచుండుటంజూచి మనస్సు కందికుంది, తానే దర్భలుతెచ్చి పఱచుకొని పరుండెను. మహాతేజుండును రాజర్షిలలాముఁడు నగురాముఁడు భరతునిఁజూచి 'నాయనా! నీకు నేను ఏమి యపకారము నేయుచున్నానని నీవు నాకడ్డముగాఁ బరుండెదవు? బ్రాహ్మణుఁడు మాత్రమే తనయొద్ద నప్పుతీసికొని యేమఱింపఁజూచువారివాకిట నడ్డముగా నొడలి యొకప్రక్కను బరుండుటకుఁ దగునుగాని, యభిషిక్తులయినక్షత్రియుల కిట్లు అడ్డముగాఁబరుండి పీడించుట విహితముగాదే! పురుషసింహా! రఘువంశ్యా! లెమ్ము ఈ బెడిదంపువ్రతమును విడిచి యిచటనుండి కదలి శీఘ్రముగాఁ బురవరం బగునయోధ్యకుం బొమ్ము.' అనెను. భరతుఁడు అట్లే యాదర్భలపయిని గూర్చుండియే యుండి, పురజనులను బల్లెపట్లజనులను అందఱినిం జూచి 'మీరైనను అన్నగారిని దిద్దుపాటుసేయరా యేమి?' అనెను. ఆ పౌరజానపదజనులు అమ్మహాత్మునితో 'రాముఁడు సత్యసంధుఁడని మేము చక్కఁగా నెఱుంగుదుము. అతఁడు చెప్పునది బాగుగనే యున్నది. ఈమహాభాగుఁడు తండ్రిమాటయందే తప్పక నిలిచియున్నాఁడుసుమా. కావుననే యితనిని దోడనే మరల్చుటకు మాకు శక్యము గాక యున్నది.' అనిరి. రాముఁడును వారుచెప్పినమాట తెలిసికొని, భరతునిం జూచి, ధర్మదృష్టి గలనీసుహృదు లిట్లుచెప్పుచున్నారు, వినుము. మహాబాహూ!

---

ముల ఉపకారకు లగుదురు గావున ఆచార్యునిమాటకన్న వారిమాటయే యతిశయించినదని యిందు తెలియునది.

రఘువంశ్యా! నామాటను పౌరజానపదులమాటను రెంటిని విని యిఁక జేయవల సిన దిదియని చక్కఁగా రూపించుకొనుము. [*క్షత్రియులకుఁ దగని ప్రత్యుపవేశ మును జేసితివి గావున అందులకు ప్రాయశ్చిత్తముగా] నన్నును జలములను స్పృశిం పుము. [ఇకమీఁద నిట్లుచేయననుటకు శపథముగా] జలమును స్పృశించి నన్ను స్పృశింపుము.' అనెను. అంత భరతుఁడులేచి జలమును స్పృశించి పిదప నచటి వారితో 'బ్రాహ్మణులును, మంత్రులును, పౌరజనసమూహములును, నేను జెప్పు మాట నెచ్చరికతో విందురుగాక. నాకు రాజ్యము కావలయునని నేను దండ్రిని యాచింపలేదు, నాకు రాజ్యము వచ్చుటకై యిట్లు చేయుమని నాతల్లినిఁ బురి కొలుపలేదు. పరమధార్మికుఁడై నయన్నను రాముని నడవికిఁ బంపుటకు నెంత మాత్రము ననుమతింపనులేదు. కాఁబట్టి తండ్రిమాట నాకుఁ గావింపవలసినది లేదు, అడవికిఁ బోవలసినదియు లేదు. అయినను పితృవచనము అవశ్యముచేయవల సినదేని దానిచొప్పున అడవియందు అవశ్యము ఉండవలసినదేని, యిప్పుడు రామునకు బదులుగా నేనే వనమునఁ బదునాలుగేండ్లుండెదను. రాముఁడు నాకు బదులుగా రాజ్యమును బాలించుఁగాక. అప్పు డుభయులును దండ్రి వచనము చొప్పున నడచుకొన్నవార మగుదుము' అనెను. ధర్మాత్ముఁ డగురాముఁడు తమ్ముని యథార్థవచనమునకు నచ్చెరుపడి పౌరజానపదులంజూచి 'నాతండ్రి బ్రతికియుండు నపుడు దేనిని విక్రయించెనో దేనిఁ గుదువఁబెట్టెనో దేనిని గొనెనో దానిని మార్చు టకు నాకుఁగాని భరతునికిఁగాని యెంతమాత్రము నలవిగాదు. నాకు వనవాస మును గుదువఁబెట్టి దానికి ధనముగా నారాజ్యమును దీసికొని నీకిప్పించినాఁడు. దానిని మాఱుపుచ్చుట శక్యముగాదు. నేను వనవాసముచేయుటకు శక్తుఁడను. శక్తుఁడనయ్యు నాకు బదులుగా మఱొకని వనవాసము సేయఁబూనుచుట నాకుఁ దగదు. అది మిక్కిలియు హీనపక్షముగాన నిందితమగును. అశక్తులుగదా యట్లు చేయవలయును. కైకేయి యుక్తముగానే చెప్పినది. తండ్రియు మంచిధర్మకార్య మునే చేసినాఁడు. మే మిరువురు నట్లుచేయకపోయితిమేని, హీనపక్షము నవలం బింతుమేని, తండ్రికి అసత్యము కలుగును. భరతుఁడు క్షమగలవాఁడనియు గురు వులను బూజించినవాఁడనియు నెఱుంగుదును. సత్యసంధుఁ డగునా మహాత్మునికి భరతునికి సమస్తమును మంగళమే కాఁగలదు. నేను గడువు తీఱినపిదప వనము నుండివచ్చి ధర్మశీలుఁ డయినయీతమ్ముని భరతునింగూడి భూమికి పతినై చక్కఁగా

---

* ఇందులకు 'మాంచ స్పృశ తథోదకమ్' అని మూలము. క్షత్రియులకు ప్రత్యుపవేశము - అనఁగా దారికడ్డముగాఁబరుండి నిరోధించుట-తగదు గావున అందులకుఁ బ్రాయశ్చిత్తముగా 'నన్నును అట్లే జలమును స్పృశింపు' మని రాముఁడు చెప్పెను. పెద్దలగు వసిష్ఠాదులుండఁగా తన్ను స్పృశింపు మనుటంబట్టి, ఇఁకమీఁద నిట్లుచేయనని శపథమునకుఁ గాను 'జలమును స్పృశించి నన్ను స్పృశింపు' మని చెప్పినట్లును నర్థాంతరము గ్రాహ్యము.

బాలించెదను' అనిచెప్పి భరతునింజూచి 'కైకేయి రాజును వరమడిగినది. ఆయమ మాటచొప్పున నేనును నడచుకొంటిని. నీవును నామాటచొప్పున నడచుకొని పట్టముగట్టుకొని తండ్రిని అసత్యదోషమునుండి తప్పింపుము.' అనెను. ఇది నూట పదునొకండవ సర్గము.



## రాముఁడు భరతుని సమాధానపెట్టి యయోధ్యకుఁ బయనము సేయించుట.

అసమానతేజమున రాజిలుచున్న యాయన్నదమ్ముల రామభరతుల సమాగమము గగురుపుట్టించునంత యద్భుతముగానుండెను. కావున వచటికి వచ్చియుండిన మహర్షు లాసమాగమమునుజూచి మిక్కిలి యాశ్చర్యమునొందిరి. ఇంతికుమునుపే యంతర్ధానమునొంది యచట నుండినరాజర్షి గణములును సిద్ధులును దేవర్షులును, మహాత్ములైన యా యన్నదమ్ములను కాకుత్స్థకులతిలకులను రామభరతులనుజూచి 'మాకు నీ యిరువురిసంభాషణము వినఁగా నీ యిద్దఱియందు మక్కువ గలుగుచున్నది. కాన యిట్టిధర్మజ్ఞులును ధర్మానుష్ఠానమందు శూరులు నైన యీ యిద్దఱుఁగొడుకులను గన్నవాఁడే ధన్యుఁడు' అని ప్రశంసించిరి. అంత నాఋషిగణములు రావణవధమునుగోరి యందఱు నేకకంఠముగ రాజశార్దూలుండగు భరతునిఁజూచి 'భరతా! నీవు గొప్పకులమునఁ బుట్టినవాఁడవు, మిక్కిలి ప్రాజ్ఞుఁడవు, గొప్పయాచారసంపత్తి గలవాఁడవు, మిక్కిలియుఁ గీర్తిమంతుఁడవు, నీతండ్రి సుఖముగానుండఁగోరుదువేని రాముఁడు చెప్పినట్లు గావింపవలయును. రాముఁడు ఎల్లప్పుడును దండ్రికి ఋణపడకుండవలయు నని మాకోర్కి. అట్లు దశరథుఁడు కైకఋణము దీర్చుకొనుటవలన స్వర్గము నొందినవాఁ డయ్యె మీరు ఆరాజు కైక కిచ్చినవరమును అబద్ధము గావింతు రేని, యతఁడు స్వర్గము నొందఁజాలఁడు.' అనిరి. ఇట్లు మహర్షులును గంధర్వులును రాజర్షులును, భరతున కింత పట్టుచెప్పి యప్పు డందఱును తమతమ నెలవులకుం బోయిరి. శుభదర్శనుఁడగు రాముఁడు వారలశుభవచనము విని మిక్కిలి యింపు నొంది మొగమున సంతోషము మిగులదళుకొత్త వారల నందఱిని బూజించెను. అంత మాత్రము తనకోర్కి కొంచెమైనను ఈడేరకుండుటఁజూచి, అవయవములు విరవిరఁబోవఁ బలుకులు తొట్రుపడ చేమోడ్చుగీలించి మరల రామునితో, 'రాజులకు రాజ్యమును బాలించుటయే ధర్మము జ్యేష్ఠుఁడు పట్టాభిషేకము సేసికొనుట మనకులమునం దెడతెగకవచ్చుచున్నధర్మము. ఈరెండుధర్మములను ఆలోచించి, మాతల్లి బతిమాలుకొనుటయుఁ జూచి, యట్లు గావింపుము. అదియ నీకు అర్హము. మిక్కిలి గొప్పదైన యీరాజ్యమును రక్షించుటకుఁగాని, మనయందనురాగము గలయా పౌరజానపదులను రంజిల్లఁ జేయుటకుఁ గాని నే నొక్కఁడను పూననేరను. మన

బంధువులును సేనాధిపతులును, జెలికాండ్రును, మనయందు మంచిమనసుగల వారును, దున్నిబ్రదుకు కాఁపులు మబ్బును ఎదురుచూచునట్లు, నిన్నే రాజుగా నెదురుచూచుచున్నారు. నీవు మిక్కిలిప్రాజ్ఞుఁడవు. ఈరాజ్యమును గయికొని నిలుకడగాఁ బాలింపుము. ఈ కోసలరాజ్యమే కాదు. కాకుత్థ్సా! నీ వీలోకమునంతయుఁ బరిపాలింప సమర్థుఁడవు.' అని చెప్పి, తాను పన్నినయుపాయము లన్నియు విఫలముకాఁగా గత్యంతరము లేమిచే నా ప్రియంవదుఁడు అపుడు రామునిపాదములంబడి పలువిధములఁ బ్రార్థించెను. చామనిచాయమేనుగలిగి, తామరరేకుల వంటికన్నులు వన్నెగులుక, మత్తిల్లిన రాయంచవంటి కంఠస్వరమున నొప్పుచున్న యా భరతుని రాముఁడు తొడపైఁ దానే యిడికొని "నీకు సహజ మగుబుద్ధియు గురుశిక్షవలనఁ గలుగుబుద్ధియు నింతకు మునుపే నీకు సిద్ధించియున్నవి. కావున నీ వీభూమండలమునంతయుఁ బాలించుటకు మిక్కిలి శక్తుఁడ వగుదువు. నీవు ప్రధానమంత్రులతోను స్నేహితులతోను బుద్ధిమంతు లయినయుపమంత్రులతోను గూడి సర్వకార్యములను జక్కఁగా నాలోచించి యెట్టి గొప్ప కార్యములనయినను గావింపుము. కాంతిసొంపు చందురుని విడిచినను విడుచును. హిమవంతము మంచును దొరఁగినను దొరఁగును. సముద్రము చెలియలికట్టను మీఱినను మీఱును. కాని, నేనుమాత్రము తండ్రికిఁ గావించిన ప్రతిజ్ఞనతిక్రమింపను. నాయనా! 'ఒకస్త్రీపేరాసవలనఁ గలిగినప్రతిజ్ఞను విడువఁదగు' నందువా? విషయము లందలి కామమువలననో లేక రాజ్యము సేయవలయునను పేరాసవలననో, నీతల్లి నీకొఱకు ఈ కార్యముసేసినది. దానిని నీవు మనసునం దుంపఁదగదు. నీ వామెను దల్లి వలెనే చూచి నడచుకొనవలయును.' అనిచెప్పెను. సూర్యునివలె నెదురు లేని తేజంబున రాజిలుచుఁ, బ్రథమనాఁటి చందురునివలె పయిపయి వర్ధిల్లువాఁడును బూజనీయుఁడు నయినరాముఁడు ఇట్లు పలుకుచుండుటఁ జూచి భరతుఁడతనితో 'అన్నగారూ! బంగారుచే రంగారెడి యీపాదుకలపై నీపాదములిడి యెక్కుము. ఇవియే సమస్తలోకమునకు *యోగక్షేమములు గావింపఁగల' వనెను. మహాతేజుఁడగు నాపురుషులలాముఁడు ఆపాదుకలం దొడుగుకొని మరల విడిచి మహాత్ముఁడయినభరతున కొసఁగెను. అంత భరతుఁడు ఆపాదుకలకుఁ బ్రణమిల్లి రామునింజూచి 'వీరోత్తమా! రఘుకులనందనా! నేను పదునాలుగేండ్లు, జడలుదాల్చి నారచీరలం గట్టుకొని, ఫలమూలాహారుఁడనై, పరంతపుఁడ వయిననీపాదుకలపయిని రాజ్యతంత్రములనిడి నగరము వెలుపల నివసించుచు నీరాక నెదురు సూచుచుండెద. రఘూత్తమా! పదునాలుగు సంవత్సరములు నిండఁగా పదియేనవయేఁటి మొదటి

* భరతుఁడు మరలిపోవునప్పుడు భరద్వాజునితో వసిష్ఠుఁడు రామునింజూచి స్వర్ణభూషితము లయినయీపాదుకలను సంతుష్టుఁడవై (భరతునకు) ఇమ్ము' అని చెప్పినాఁడని తాను జెప్పుటచే నిచట వసిష్ఠుఁడు రామునికిఁ బాదుక లియ్యనియోగించినపిదప నే భరతుఁడు అట్లు ప్రార్థించినాఁడని తెలియునది.

దినమున నిన్నుఁ జూడనైతినేని, తప్పక యగ్నిహోత్రమును జొత్తును' అనెను. రాముఁడు 'అట్లే కాని' మ్మని యొప్పుకొని యాభరతుని సాదరమునఁ గవుంగిలించుకొని శత్రుఘ్నునిని ఆలింగనముసేసికొని భరతునిం జూచి 'రఘూత్తమా! తల్లి యగుకైకేయిని రక్షింపుము. ఆమెపయిఁ గోపంబుసేయకుము. ఇట్లని నామీఁదను సీతమీఁదను ఒట్టు పెట్టుచున్నాను.' అని యిట్లు చెప్పి కన్నులనిండ నీళ్లు గ్రమ్మ తమ్ముని వీడుకొలిపెను. ప్రతాపవంతుఁడును ధర్మవిదుఁడు నైన యాభరతుఁడు చక్కఁగా నలంకృతములై యున్న యాపాదుకలను లెస్సగాఁ బూజించి రామునకుఁ బ్రదక్షిణము గావించి, వానిని రాజయోగ్యం బగునుత్తమగజమైన శత్రుంజయముశిరస్సున నుంచెను. అంత రాముఁడు, హిమవత్పర్వతమువలె స్వధర్మమునందు చలింపక స్థిరముగానుండు వాఁడు, రఘువంశవర్ధనుఁడును. కావుననే యెవరిప్రేరణకును చలింపక గురువులను మంత్రులను జనులను తమ్ము లగు భరతశత్రుఘ్నులను వారివారికిం దగువిధంబులం బూజించియు, మన్నించియు నందఱను వీడుకొలిపెను. తల్లులు కన్నీళ్లచే డగ్గుత్తికపడి దుఃఖమున రాముని వీడుకొనం జాలరైరి. ఆరాముఁడే తల్లులకెల్ల నమస్కరించి యేడ్చుచునే తన పర్ణశాలను బ్రవేశించెను. ఇది నూటపండ్రెండవ సర్గము.



## భరతుఁ డయోధ్యను బ్రవేశించుట.

అంత నపుడు భరతుఁడు శత్రుంజయశిరమున నున్నరామపాదుకలను శిరమున నిడుకొని పరమసంతోషమున శత్రుఘ్నునితోడ రథము నెక్కెను. వసిష్ఠుఁడును, వామదేవుఁడును, దృఢవ్రతుఁ డగుజాబాలియు, మంత్రకార్యనిపుణులగుమంత్రు లందఱును ముందఱఁ బోయిరి. వారు రామనివాస మగుటచే మహాపర్వతం బయిన చిత్రకూటమునకుఁ బ్రదక్షిణముగా తూర్పుదిక్కుఁబట్టి సీతారాముల జలక్రీడలచే రమణీయం బయినమందాకినీనదిని బొందిరి. అప్పుడు భరతుఁడు సైన్యములంగూడి, రమణీయములై నానావిధములం గనుపట్టువేలకొలఁది ధాతువులం జూచుచు నాపర్వతము ప్రక్కమార్గముగాఁ బోయెను. భరతుఁడపుడు చిత్రకూటపర్వతమునకు సమీపమున భరద్వాజుండు వసతి గావించుకొని యున్న * య శ్రమపదమును గాంచెను. ఆభరతుఁడు బుద్ధిమంతుఁడు గావున

*భరద్వాజాశ్రమము చిత్రకూటమునకు దూరమైయుండగా ఇచటసమీపమని చెప్పుటయెట్లనిన'— ఈసర్గమునందే భరద్వాజాశ్రమమునువిడిచినపిదప యమునానదిని దాఁటినట్లు చెప్పఁబడుటచే యమునాతీరమందునైతముభరద్వాజాశ్రమ మొకటియున్నదని తెలియుచున్నది. ఈయాశ్రమమే చిత్రకూటమునకు సమీపమైనదిగా నిట చెప్పఁబడినది. భరద్వాజుఁడు రామభరతుల సమాగమమును శిష్యులమూలమున తోడనే వినుటకై యప్పుడీయాశ్రమమునకు వచ్చియుండెననియు నూహ్యము.—మహే

ఆభరద్వాజాశ్రమమునకుఁ బోయి రథము డిగ్గి, యామునిపాదముల కపుడు వందనముగావించెను. అంత భరద్వాజుఁ డతనిరాకకు మిక్కిలి సంతసిల్లి, యతని జూచి 'నాయనా! రామునిఁ జూచితివా? నీవు పోయినకార్య మయినదా?' యని యడిగెను. ధీమంతుఁ డగుభరద్వాజుఁ డిట్లడుగఁగా నంత భ్రాతృవత్సలుఁ డగు భరతుఁ డతనిని జూచి "రాముఁడు దృఢపరాక్రముఁడుగదా. కావున నేనును గురుఁ డైనవసిష్ఠుఁడును రాజ్యమును గయికొనఁ రమ్మని బతిమాలఁగా నతఁడు మిక్కిలి సంతసిల్లి వసిష్ఠునిఁ జూచి 'తండ్రి కైకకుఁగాను పదునాలుగేండ్లు నన్నడవిఁగో ను డుమన్నప్రతిజ్ఞను యథార్థముగా పరిపాలింతును గాని, విడువనే విడువను.' అనెను. అతఁ డిట్లు చెప్పఁగా మహాప్రాజ్ఞుఁడును వాక్యజ్ఞుఁడు నగువసిష్ఠుఁడు మాటనీఁటుకాఁడగురామునితో మిక్కిలి యర్థయుక్తముగా 'రామా, నీవు మిక్కిలి ప్రాజ్ఞుఁడవు కావున బంగారముచే సింగారింపఁబడి నీకై తేఁబడియున్న యీపాదుకల నిమ్ము. ఇవే అయోధ్యయందు యోగక్షేమములు సేయఁగలవు' అనెను. వసిష్ఠుఁ డిట్లు చెప్పఁగా రాముఁడు తూర్పుమొగమై నిలిచి యాపాదుకలపై యడుగు లుంచి నాకు రాజ్యరక్షణశక్తి గలుగుకొఱకు వాని నొసంగెను. మిక్కిలిమహాత్ముఁ డైన రామునియనుజ్ఞఁ గయికొని మంగళకరంబు లగుపాదుకలం దీసికొని మరలినవాఁ డనై యయోధ్యకే పోవుచున్నాను' అనెను. మహాత్ముఁ డగుభరతుఁడు చెప్పిన యీశుభవాక్యమును విని, భరద్వాజమహర్షియు మఱింతశుభం బగుమాటల నతనిని జూచి 'పురుషసింహమా! మంచియాచారమును మంచినడవడియుఁ గల వారిలో నీవు గన్నాకవు కనుక, పల్లమునందు నీళ్లు నిలుచునట్లు, నినుబోఁటివాని యందు జ్యేష్ఠానువర్తన మనెడి యీశ్రేయమున్నది, కాన యిది యొక వింత కాదు మహాభుజుం డగునీతండ్రి దశరథునకు ధర్మవేత్తయును ధర్మపరాయణుఁడు నగు నిట్టిసుపుత్త్రుఁడవు నీవున్నావుగావున అతండు మృతుఁడు గాఁడు, ఇంకను బ్రతికియేయున్నాఁడు.' అనెను భరతుఁ డంత మహాత్ముం డగురాముని చెప్పిన మాటకు చేమోడ్పు గీలించి, పాదములు పట్టుకొని వినయమున వీడ్కొన నుద్యుక్తుఁడైనట్లు నిలుచుండెను. అంత శ్రీమంతుఁ డైనయాభరతుఁడు భరద్వాజ మహర్షికి మరల మరలఁ బ్రదక్షిణముగావించి మంత్రులను గూడి యయోధ్యకుంబోయెను మిక్కిలి విరివి గలయాభరతునిసైన్యము శిబికలతోను శకటములతోను గుఱ్ఱములతోను ఏనుగులతోను ఆభరతునివెంటఁ బోయినది. అంతకరుళ్ల వరుసల సరసఁ జూపునట్టి దివ్యనదిని యమునను వారలందఱును దాఁటి శుభజలంబులఁ దులకించుగంగానదిని జూచిరి ఆభరతుఁడు బంధువులతోడం గూడి ససైన్యముగా రమణీయజలపూరితం బైనయాగంగానదిని దాఁటి రమ్యంబగుశృంగిబేరపుర

శ్వరతీర్థులు. చిత్రకూటమునందలివింతలు చూచుచుఁ బోవువేడుకచే దూరముగానున్న భరద్వాజాశ్రమము సమీపమైనదిగా కనుపట్టినదేకాని నిజమునకు సమీపమైనదిగాదు;-అనిగోవిందరాజులు.

మునకుఁ బోయెను. అకెండు శృంగిబేరమునుండి వెడలి యయోధ్యాపురమును గాంచెను. భరతుఁడు తండ్రిని అన్నను ఇరువురిని మాలి యున్నయయోధ్యను జూడఁగానే దుఃఖమున మిక్కిలియుం బొక్కుచు, సారథింజూచి 'సారథీ! అయోధ్య, రామవియోగదుఃఖమునఁ బీడితయై కలఁగి నలంగి యాకారంపుసొంపు గ్రుంగి, నిరానందయై, దీనయై యెలుంగు గొఱవడి ప్రకాశింపకున్నది చూడుమీ' అనెను.
ఇది నూటపదుమూఁడవ సర్గము.



భరతుఁ డయోధ్య నిరానందముగా నుండుటఁజూచి శోకించుట.

మహాకీర్తిమంతుఁడును సమర్థుండు నగుభరతుఁడు శ్రావ్యగంభీర ధ్వని గలరథమునం బోవుచు శీఘ్రముగా నయోధ్యాపురిని బ్రవేశించెను. అప్పు డాపురి పిల్లులును. గుడ్లగూబలును దిరుగాడుచుండఁగా, మనుష్యసంచారమును లేక, గజములు తిరుగాడుటయుఁగానక, కాంతి గ్రుంగి చీఁకటి గ్రమ్మినకృష్ణపక్షరాత్రివలె నుండెను. మఱియు నది, మిక్కిలి కాంతిపెల్లున మిక్కిలియు మెఱయుచున్నదై యంగారక గ్రహముచేఁ బీడితయై యొంటిగా పరితపించు చున్నచంద్రునిపత్ని యగురోహిణివలెను, జలమంతయు నెండకుఁ గ్రాఁగి వేఁడి గొంది కలఁగి పక్షులు మిక్కిలితపింప మొసళ్లు మొదలగు జలజంతువులు సురిఁగి మఱుంగ స్రుక్కి చిక్కి యున్నసెలయేటివలెను, మొదలుపొగలేక బంగారమువలె వెలుఁగుచుండి పిమ్మట దధ్యాదికమైన హవిస్సునుబ్రోక్షింపఁగా మఱుఁగుపడి యున్నయాగాగ్నియందలి జ్వాలవలెను, మహాయుద్ధమందు మేటివీరులు మడిసియు, కవచములు తుమురయ్యు, యేనుంగులును గుఱ్ఱములును గూలియు, రథములును ధ్వజములును పఱియ లయ్యు, నిడుమంబడి నవయు చున్నసేనవలెను, మొదట నురుఁగులు గట్టుచు చప్పుళ్లు బోరుకొన సముద్రమునుండి లేచి, యంత గాలి యడఁగుటవలనఁ జప్పుడు మాలి తూలుచున్నసముద్రపు తరంగమువలెను, యాగసమాప్తి దినము గడచిపోఁగా, ఉత్తము లగుఋత్విజులు యాగమునకువలయు పనిముట్ల నన్నింటిని దీసికొని తాము పోవఁగా నలుకుడులేక రిత్తయైయుండు యాగవేదికవలెను; ఆఁబోతు తమ్ము దిగవిడువఁగా ఆలగొట్టమున దానినే తలఁచుకొనుచు లేఁత పచ్చికనయినను దినక దుఃఖితమై యుండుగోసమూహమువలెను, మిక్కిలి నిద్దపు నునుఁగాంతులచే నిగనిగమెఱయు చున్నమేలిజాతిమణు లగు పద్మరాగాదులు మాలి నట్టిముత్తెపుసరివలెను, పుణ్యమంతయు నశింపఁగా, పిమ్మట తటాలున నాకాశమునుండి నేలంబడి, కాంతి జొంపము సొంపుమాలియున్న నక్షత్రము వలెను, వసంతము ముగియఁగా పూవులచే నివ్వటిల్లుచు, గండుతుమ్మెదలు జుమ్మని మ్రోయఁ జెలువారుచుండి, దావాగ్నియురవడిచేఁ గొంత కాలి కమలియున్నయడవి తీఁగవలెను, జూపట్టుచున్నది. మఱియు నాపురము మార్గమునందు జనసంచా

రములేక యంగళ్లు మూయఁబడి క్రయవిక్రయాదులు మాలియుండుటచే, మబ్బు
లచేఁ గ్రమ్మంబడినచంద్రుఁడును నక్షత్రములును గలయాకాశమువలెఁ జూపట్టు
చున్నది. మఱియుఁ, బయికప్పులేని ప్రదేశమున, మేలయినమధు వంతయు చెడి,
పాత్రములు పగిలి పడియుండి, మత్తుగొన్న జనులు చంపఁబడి యుండఁగా సొంపు
మాలియున్న పానభూమివలెను, నేల బీటికలువాఱి పాత్రములుపగిలి, జలమం
తయు సెలవై, విరిసి నేలఁగూలిన చలిపందిరివలెను, వింటియందుమోపెట్టంబడి,
వింటిరెండుకొమ్ములతోడఁ గట్టఁబడుటకై రెండుచివరలను ద్రాళ్లు గలిగి, యుద్ధ
కాలమున ప్రతివీరులబాణములు తగులఁగా తునిసి వింటనుండి నేలంద్రెళ్లిన వాలిక
యల్లెత్రాటివలెను, యుద్ధసమర్థుఁడై నగుఱ్ఱపురౌతు పయినెక్కి తోలఁగా
వాహనమునకుఁదగినది కానిదై యలసి సొమ్ములన్నియు దూలి దుర్బలమైన లేఁత
యాఁడుగుఱ్ఱమువలెను, మునుపు జలసమృద్ధిచే పెక్కుచేఁపలును మొసళ్లును
నెఱసియుండి, పిదప జలము ఎండిపోయి, కలువలను అపహరింపఁబడి, గట్లు విరి
యుటచే విఱివిగా నేర్పడిన నడబావివలెను, మైపూఁతవిడనాడి శోకముచేఁ
బొక్కుచు, సొమ్ములుమాలి కొయ్యవలెకృశించి బిరుసువాఱిన దుఃఖితునిదేహము
వలెను, మంచి వర్షాకాలమున, సూర్యుఁడు మేఘపటలముం జొచ్చినపుడు, నల్లని
మబ్బులచే గప్పఁబడిన యతనికాంతివలెను, సొంపుగుందియున్న యయోధ్యను
భరతుఁడు ప్రవేశించెను. శ్రీమంతుఁడైనదశరథకుమారుఁడా భరతుఁడు, రథము
ననే యుండి యామేటిరథమును దోలుచున్నసారథిని జూచి 'మునుపు అయోధ్య
యందు గీతవాద్యములధ్వని గంభీరమై నలుగడల వ్యాపించి వినఁబడుచుండును.
ఇపుడేలకో యట్లే యాధ్వని వినఁబడకున్నది. మత్తు గొలిపెడిమద్యములతావు
లును, పూదండలవాసనయును, అగరుధూపగంధమును మునుపటివలెనే పట్టణ
మంతయు వ్యాపించి గుబాళింపకున్నది. రాముఁడు అడవికిఁ బోఁగా, ఇపు డయో
ధ్యాపురమునందు, శిబికలు మొదలయిన యుత్తమవాహనముల ధ్వనియును
గుఱ్ఱముల దట్టంపు సకిలింతలును, మదపుటేనుఁగుల గర్జితములును, రథముల
గొప్పచప్పుడును, వినరాకున్నవి. రాముఁ డడవికిఁ బోగా, వయసుకాండ్రందఱును
దుఃఖమునఁ బరితపించుచు, చందనాగరుగంధమును, మిక్కిలి మేలైనక్రొత్త
పుష్పమాలికలును, ధరింపకున్నారు. పట్టణమందు మనుష్యులందఱును, రామశోక
మునఁగుంది పలువింత లగుపూలసరులను దాల్చి విహారార్థము బయట వయాళి
వెడలకున్నారు. ఉత్సవములును జరుగకున్నవి. నాయన్న రామునితోఁ గూడనే
యీయయోధ్యాపురికాంతి పోయినట్లున్నది ఇది వాస్తవము. ఉరవడి గలజడి
వానతోఁ గూడిన శుక్లపక్షరాత్రివలె నాయయోధ్య యెంతమాత్రమును బ్రకా
శింపకున్నది. నాయన్న రాముఁడు పెనుపండువువోలె వచ్చి గ్రీష్మర్తువునందలి
మేఘముక్రైవడి నీయయోధ్యయందలి జనులకెప్పుడు సంతోషము గలిగింపఁ

గలఁడు! సొగసుగా నలంకరించుకొని గరువంపునడక నడచువయసుకాండ్రు సంచరింపకుండుటచే నయోధ్యయందలి రాజమార్గములు ప్రకాశింపకున్నవి.' అని చెప్పెను. అట్లా భరతుఁడు నానావిధముల సారథికిం జెప్పుచు మహారాజు లేకుండుటచే సింహము లేకున్నగుహవలెఁ జూపట్టుచున్నతండ్రి గృహమునం బ్రవేశించెను. అపుడు మహాత్ముఁడును ధీరుఁడు నగుభరతుఁడు దేవాసురయుద్ధమున దేవతలు పరాజితులై, సూర్యుండును రాహువుచేఁ గొట్టువడఁగా రేయిపగలు అను విభాగములేక యుండినదినమువలె కాంతిహీనమై జనరహితమైయున్న యాయంతఃపురమునంతయుఁ జూచి, పరమదుఃఖితుఁడై కన్నీరువిడిచెను. ఇది నూటపదునాలుగవసర్గము.



(భరతుఁ డయోధ్యనువిడిచి నందిగ్రామమున రామపాదుకలను బురస్కరించుకొని రాజ్యపాలనము సేయుట.)

అంత దృఢవ్రతుఁ డగునాభరతుఁడు అయోధ్యయందు తల్లులను విడిచి దుఃఖితుఁడై వసిష్ఠాదిగురువులం జూచి 'నే నిపుడు నందిగ్రామమునకుఁ బోయెదను. ఇప్పుడే మిమ్ము నందఱిని వీడుకొనుచున్నాను. అచ్చట రామవియోగమునఁ గలిగిన యీదుఃఖమునంతయు సహింపఁగలను, కాని యిచట నెంతమాత్రము సహింపఁజాలను. నాతండ్రి స్వర్గము నొందినాఁడు గదా! నాయన్నయు నడవికిఁబోయినాఁడు. మహాయశుఁడైనయారాముఁడే కదా రాజు కావలసినవాఁడు. కనుక రాజ్యమున కతఁడువచ్చువఱకును గాచియుండెదను.' అనెను. మహాత్ముఁడైనభరతుఁడు చెప్పిన యీశుభవాక్యమును విని, మంత్రులందఱును బురోహితుఁ డగువసిష్ఠుఁడును, నతనిం జూచి, భరతా! భ్రాతృవాత్సల్యమున నీ విపుడు చెప్పిన మాట మిక్కిలియు శ్లాఘనీయమై యున్నది, నీకులమునకును దగియున్నది. ఇట్టి మాట నీకే తగును. నీ వెప్పుడును బంధువులయందు మిక్కిలియుఁ బ్రీతి గలిగి యుందువు. మఱి యన్నదమ్ములయందు నెయ్యము నొలయుచుందువు. ఇట్లు పూజ్యమార్గమును బూనియున్న నీవు చెప్పుమాట నెవఁడు సమ్మతింపఁడు?'' అనిరి. అతఁడును తాను గోరినచొప్పున నింపుగా మంత్రులు చెప్పినమాట విని సారథితో రథమునాయత్తముసేయ నాజ్ఞాపించెను. ఆశ్రీమంతుఁడు మొగమున సంతసము వెల్లివిరియఁగా తల్లులకందఱికిని మ్రొక్కి శత్రుఘ్నసహితముగా రథము నారోహించెను. ఇట్లు భరతశత్రుఘ్ను లిరువురును మిక్కిలియుఁ బ్రీతులై రథము నారోహించి మంత్రులు పురోహితుఁడును పరివేష్టించిరా శీఘ్రముగాఁ బోయిరి. అందు గురువులైనవసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణు లందఱును ముందఱ తూర్పుమొగముగా నడచి నందిగ్రామ మున్నస్థలమునకుఁ బోయిరి. భరతుఁడు పోఁగానే యతఁడు రమ్మని పిలువకున్నను రథగజతురగసంకులముగా సైన్యమంతయు నతని

వెంటనంటి పోయినది. అయోధ్యయందలిజను లందఱును అతని వెంబడించిరి. భ్రాతృవత్సలుం డగునాధర్మాత్ముఁడు భరతుఁడు రథంబుననుండి, రామపాదుకల శిరమున నుంచుకొని శీఘ్రముగా నందిగ్రామమునకుఁ బోయెను. అంత భరతుఁడు శీఘ్రముగా నందిగ్రామముఁ బ్రవేశించి రథమును వేగదిగి, గురువును జూచి 'నాయన్నయీ రాజ్యమును నాయొద్ద అచ్చుమిల్లడఁగానే తాను బెట్టియున్నాఁడు, కాన దీనిని పూర్ణముగా నతనికి మరల నర్పింపవలసినదే. ఇల్లడఁగా నిడినదానిని రక్షించుట మొదలయినస్వాతంత్ర్యమును నాకు లేదు. బంగారుచే రంగానునీపాదుకలే దీనియోగక్షేమములు చూచుకొనును.' అని చెప్పెను. అంత రాముఁడు తనకుఁ బ్రతినిధిగా నిల్లడ యిడినపాదుకలను భరతుఁడు శిరసావహించి దుఃఖమున మిగులఁదపించుచు, ప్రకృతి సమూహమునంతయుఁజూచి, 'ఈ పాదుకలకు శ్వేతచ్ఛత్రమును చామరాదులును బట్టుఁడు. ఇవే యార్యుని రాముని పాదములునుఁడీ. ఈనాయన్న పాదుకలచేతనే రాజ్యమున ధర్మము కుదురైయుండును. నాయన్న నెయ్యము వలన నాయొద్ద దీనిని నిక్షేపముగా నుంచినాఁడు. కావున నేను ఆరాఘవుఁడు వచ్చువఱకును దీనిని పాలించుచుందును. రాముండు రాఁగా శీఘ్రముగా నీపాదుకలను అతనిపాదములకు నేనే తొడిగి పాదుకాసహితములైన యతనిపాదములను గన్నారం జూచెదను. ఈ రాజ్యభారము నాయందు నిక్షేపముగా బెట్టఁబడియున్నది గావున రాముఁడు రాఁగానే యతనితోఁ గలసి యీభారము పెద్దవాఁ డగునతనికి మరలనప్పగించి, తండ్రికిఁజేయునట్లు అతనికి శుశ్రూష సేయుచుండెదను. అట్లు రామునికిఁ బ్రతినిధులయిన యీమేలిపాదుకలను రాజ్యమును అయోధ్యాపురిని రామున కప్పగించి నాతల్లి కైకవలనఁ గలిగిన యపకీర్తిని పోఁగొట్టుకొనెదను. రాముఁడు పట్టాభిషిక్తుఁడై, దానిని జూచి జనులు పులకితగాత్రులై యుల్లమున సంతసిల్లినపిదప నాకు రాజ్యమునకంటె నాలుగింత లెక్కుడయిన కీర్తియును సంతోషమును గలుగును. కాన యివియే కావలయునుఁగాని రాజ్య మేల?' అని చెప్పెను. మహాయశుండైన యా భరతుఁ డిట్లు విలపించుచు విన్నడై దుఃఖంచుచు మంత్రులను గూడి నందిగ్రామమున రాజ్యముగావించెను. వీరుం డగునాప్రభుండు భరతుఁడు జటావల్కలములు దాల్చి మునివేషంబు గయికొని యప్పుడు సైన్యసమేతముగా నందిగ్రామమున వసించియుండెను. భ్రాతృవత్సలుఁ డగుభరతుఁడు, రామునిరాక కెదురుసూచుచు, అతనియాజ్ఞ చొప్పున నడచుకొనుచును, దనప్రతిజ్ఞను దదముట్టఁ జెల్లించువాఁడై రామపాదుకల కభిషేకము గావించి యపుడు నందిగ్రామమున వసించి రాజశాసనముల నన్నియు నాపాదుకలకు విన్నవించుచుండెను. అట్లపుడు ఆశ్రీమంతుఁడు అన్నగారిపాదుకలకు నభిషేకము గావించి యెల్లప్పుడు వానికి లోనై రాజ్యము సేయుచుండెను. రాజ్యపరిపాలన కార్యమే మైనఁ గలిగినపుడుగాని, ఎవ్వరైన వస్త్రపుష్పాదులైన గొప్పకానుకలం

దెచ్చినపుడుగాని, భరతుఁడు, వానిని మొదట పాదుకలకు నివేదించి, యటుపిమ్మట తాను స్వీకరించి నలయురీతిని కార్యము నడపును. ఇది నూటపదియేనవసర్గము.

—{ రాముఁడు చిత్రకూటమును విడిచి మఱియొక యాశ్రమమునకుఁ బోవుట. }—

భరతుఁడు తరలి పోయినపిదప రాముఁ డాతపోవనముననే వాసము సేయుచుండి, యందలిఋషులు భయము నొంది మఱియొక యాశ్రమమునకుఁ బోవ తమకపడు చుండుటను వారియింగితాదులవలనఁ గనుఁగొనెను. మున్ను చిత్రకూటమునందలి ఋష్యాశ్రమమున రాముని మిక్కిలియు నాశ్రయించి యున్న ఋషు లందఱును ఆ యాశ్రమమునువిడువ తహతహపడుచుండుటను రాముఁడు జాడలచే నూహించి తెలిసికొనెను. వారు జంకుపడి, కన్నులచేతను కనుబొమ్మలచేతను రామునిఁజూపుచు ఒండొరులతో మెల్లగా గొణుగుకొనుచు, రామునిం గూర్చి రహస్యముగా ముచ్చటలాడుకొనిరి రాముఁడు వారట్లు ఆశ్రమము విడిచి పోవ తమకించుచుండుటను గాంచి, తనవలన నేమయిన నపరాధము కలిగెనోయని శంకించి, యంత కులపతి యగుఋషిం జూచి చేతులు మోడ్చి 'మహాత్మా! ఋషులకు వికారము గలిగించునట్టి వికృతపునడవడి యింతకుమునుపు నే నేదైన నడచుకొనఁగా మీరుచూడ లేకదా! మఱీవీరందఱువికారపడియున్నారే! ఇది యేమి? నాతమ్ముఁడు లక్ష్మణుఁడు తనకుఁ దగనట్టికార్యము నేదేనియుఁ బ్రమాదవశమున ఋషులకుఁ గావింపగాఁ గనుపట్టదుగదా? మీకును శుశ్రూష సేయుచు నాకును శుశ్రూషలు గావించు చుండునాకాంత యీసీత మీయెడ నడచుకొన దగిన రీతిని ఒప్పిదముగా నడచుకొన కున్నదా యేమి?' అని యడిగెను. అంత మిక్కిలియు వయస్సున ముదిసి మహాదీర్ఘ తపస్సునను ముదిసి యున్న యాకులపతి, ముదిమిచే వడఁకుచు భూతదయాపరుఁడైన రామునిఁ జూచి 'నాయనా! విదేహరాజుకడుపునఁ బుట్టినసీత మంగళస్వభావురాలు, మంగళానుష్ఠానపరాయణురాలు. అట్టిబిడ ధర్మముతప్పుట ఎక్కడిది? అందును విశేషించి ఋషులవిషయమున నట్లు తప్పుట యెట్లు గలుగును? నిన్నుఁబట్టి రాక్షసులవలన మునులకు ఉపద్రవములు గలుగుచున్నవి. వానికి భయపడి ఋషులు ఒండొరులతో ముచ్చటలు గుజగుజలు వోవుచున్నారు. ఆయుపద్రవములు వినుము. నాయనా! రావణుని తమ్ముఁడు ఖరుఁడనురాక్షసుఁ డొకఁడుగలఁడు. వాఁడు మిక్కిలిదిట్టఁడు, యుద్ధముల గెలుపుకొన్నవాఁడు, క్రూరుఁడు, నరమాంసభక్షకుఁడు. గర్విష్ఠుఁడును పాపాత్ముఁడు నగువాఁడు. జనస్థానమునుఁజేరి యచటఁ గాపున్నమునులనెల్ల వెడలఁగొట్టినాఁడు. ఇచట నీవుండుటయు నోర్వఁజాలకున్నాఁడు. నాయనా! నీ వీయాశ్రమమునకు వచ్చి మెలఁగుచుండినది మొదలుగా రాక్షసులు మునులను పలువిధములఁ గీడు

సేయుచున్నారు. ఆరాక్షసులు వెగటు పుట్టించుకొనుటకు, భయంకరములును వికారూపములునై వికారదృష్టులు గలిగి నానావిధముల నుండుతమరూపములను జూపి భయపెట్టుచున్నారు. ఆరాక్షసులు మునులయెదుట పొడకట్టి వారిలోఁ గొందఱిని అమంగళములును అపరిశుద్ధములైన ద్రవ్యములందుఁ బడవైతురు, మఱికొందఱిని బట్టి చంపుదురు. అల్పబుద్ధు లయినరాక్షసులు కొందఱు ఆయాయాశ్రమములందు తెలియకుండునట్లు దాఁగియుండి యచటి మునులను జంపుచుఁ గ్రీడించుచున్నారు. హోమకర్మము సేయునపుడు వచ్చి స్రుక్కులు మొద లయినయజ్ఞోపకరణవస్తువులను బాఱవైచి, యగ్నిహోత్రములను జలములం జల్లార్చి, సమిధల తునియలను తుత్తుమురు గావించెదరు. కాఁబట్టి ఋషులందఱును ఆదురాత్ములు మెలఁగునట్టి యాశ్రమములను విడిచి యితరప్రదేశములకుఁ బోవలయునని యన్నిపుడు పురికొలుపుచున్నారు. రామా! ఇట్లగుటంజేసి యాదుష్టులు ఇఁకముందు నిచట మునులకు శరీరహింస గావింపఁగలరు. కాఁబట్టి యీయాశ్రమము విడిచెదము. ఇక్కడికి బహుదూరమున, ఫలమూలములు సమృద్ధముగాఁ గల యొక విచిత్రమయినవనముగలదు. అందు మామునుపటియాశ్రమ మున్నది. నేనును ఈఋషిగణమును మరల నచటికిఁబోయెదము. ఇచట నుంటివేని ఖరుఁడు నీకును ఇఁకముందు సెబ్బర గావించును. మనస్సు గలదేని నీవును మాతోఁగూడ నిచట నుండి గదలిరమ్ము. నీవు కాపుదలయందు సన్నద్ధుఁడుగానే యున్నావుగాని సమర్థుఁడవై యున్నను ఇపు డిచ్చట భార్యతోఁ గూడి వాసముసేయుటవలన నీకు నిత్యమును ఏమి గలుగునోయని సందేహము గలుగుచునే యుండును. కాన యది దుఃఖమునకు హేతువుగానుండును.' అనిచెప్పెను. రాజకుమారుఁడారాముఁడు పయనమున కుద్యుక్తుఁడయినయాకులపతికి 'నేనుండగా మీకు భయమేమి? నేనే చుట్టుకాపై మిమ్ము రక్షించెదను.' అనిబహులెన్నిమాటలు చెప్పియు నిలుపఁజాలఁడయ్యె. ఆకులపతి రాముని నభినందించి సమాధానములు చెప్పి యొప్పించి సెలవు పుచ్చుకొని తనఋషిసమూహముతో నయ్యాశ్రమమును విడిచి పోయెను. రాముఁడు ఋషిసమూహముతోఁ గొంతమార మచటనుండి వెంబడించిపోయి దారి సాగనంపి కులపతికి నమస్కరించి యాఋషులు మిక్కిలి ప్రీతులై యుపదేశించిన విషయములను గొని, వీడుకొని పవిత్రం బగుతనపర్ణశాలకు వసింపఁబోయెను రాముఁడు ఋషులు లేనందున ఆయాశ్రమమును తోడనే విడువఁదగియుండియు, ఆమునులయందలిప్రేమనుఁ బట్టి వారు వసించియుండిన దని దానిని క్షణమాత్రము విడువకుండెను. రాముండు ఋషివలె నడచుకొన్న నడవళ్లం జూచి యాఋషులకును గుణములు పట్టువడి యతనిని అనువర్తించుచునే యుండిరి, కాఁబట్టి యతనియందలి ప్రేమంబట్టి దానిని క్షణకాలము విడువరైరి. ఇది నూట పదియాఱవ సర్గము.



—ఃః రాముఁ డత్రియాశ్రమమును బ్రవేశించుట. ఃః—

ఆఋషు లందఱును బోయినపిమ్మట రాముఁ డాలోచనసేసి పెక్కుకారణములంబట్టి యపు డాయాశ్రమమున నుండుటకు నొల్లఁడయ్యెను. అవి యేవన 'నేనీయాశ్రమమునందే భరతునిఁ బురజనులను నాతల్లులనుజూచితిని. వారలనుగూర్చినిత్యమును దుఃఖించుచునే యుండువాఁడ. మఱి వారు వచ్చి యుండినయీప్రదేశమో వారలను నాతలంపునకు మఱిమఱి తెచ్చి బాధించు చుండును. మహాత్ముఁడైన యాభరతునిసైన్యము ఇచట శిబిరము గావించుటవలన వారిగజతురగముల లద్దులచే నాశ్రమమంతయుఁ జెడియున్నది. కాఁబట్టి దీనిని విడిచి మఱియొక చోటికిఁ బోయెదను' అని యాలోచించి రాముఁడు సీతాలక్ష్మణులను గూడి పయనమై పోయెను. ఆ మహాయశుఁడు అత్రిమహామునియాశ్రమమునకుఁ బోయి, అమ్మహాత్మునికి నమస్కారమొనరించెను. అమ్మునియు రామునిఁ గుమారునివలె గయికొనెను. ఆముని రామునకుఁ దానే యతిథిసత్కారమంతయు మిక్కిలి చక్కఁగాఁ గావించి లక్ష్మణుని, మహాభాగురాలైనసీతను బ్రియవచనముల నాదరించెను. ధర్మవిదుఁడును సమస్తభూతహితరతుఁడు నగునాముని, సర్వజనపూజితయు వృద్ధురాలు నగు తన పత్ని దాపున నుండఁగా, నామెను బిలిచి, (తామిరువురును, వారలను బ్రియవచనముల నాదరించిరి. ఆఋషితిలకుఁడు సీతం జూచి 'అనసూయ మహాభాగురాలు, తపస్విని, ధర్మానుష్ఠానపరురాలు, కాన యామెకు నమస్కారము గావింపు' మని చెప్పెను. మఱియు నమ్ముని ధర్మచారిణి యగునాతాపసినిగూర్చి రామునితో 'అనఘా! ఈయనసూయ, మున్ను పదిసంవత్సరములు వర్షములేక మహాక్షామము గలిగి లోకమంతయు నెడతెగక దగ్ధమగుచునుండఁగా, ఋషులకు ఫలమూలములను సృజించి గంగానదిని గూడ బ్రవహించునట్లు చేసినది, ఈమె పదివేలసంవత్సరములు మహాతపము గావించినట్టిది. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు పెక్కులాచరించి ఋషులకుఁ గలుగుతపోవిఘ్నములన్నియు నివారించినది. మఱియు ముందొకప్పుడు దేవకార్యమునకుఁగాను త్వరపడవలసినదై పదిరాత్రులను ఒక్కరాత్రియంత గాఁ జేసినది, మిక్కిలియుగ్రతపము గలది. నియమములే ఈబిడ కలంకారములు. ఇమ్మహాదేవిని దల్లియుంబోలెఁ బూజింపుము. నీకు శ్రేయస్సుగలుగును. పరానుగ్రహార్థమైన కర్మములనుబట్టి అసూయ లేనిదగుటం జేసియు, ఇతర స్త్రీల కశక్యములైన పాతివ్రత్యకర్మములంబట్టి వారి కసూయపడరానిది యగుటఁబట్టియు 'అనసూయ' యని ప్రఖ్యాతి గాంచినది. సమస్తప్రాణులకును నమస్కరింపఁ దగినది, మహాకీర్తిమతి, వృద్ధురాలు, కోపరహితురాలు. ఇట్టియనసూయాదేవికి సీత నమస్కరించుఁ గాక' అనెను. ఆముని యట్లు చెప్పుచుండఁగా రాముఁడు విని వల్లె యని ధర్మజ్ఞురాలగుసీతను జూచి, యుత్తమవాక్యంబుల 'రాజపుత్రీ! ఈముని సెలవిచ్చినమాట వింటివిగదా! కనుక నీశ్రేయస్సుకొఱకు శీఘ్రముగా నీతపశ్శాలినిని అనసూయను

సేవింపుము ' అనెను. సీతయుఁ దన మేలు గోరురాముఁడు చెప్పినయప్పలుకువిని ధర్మజ్ఞురాలై నయాయత్రిముని భార్యకుఁ బ్రదక్షిణము గావించెను. ఆసీత, అవయవ సంధులబిగి సడలి ముడతలుపడి ముదిమి గ్రమ్మి దానిచే వెండ్రుకలన్నియుఁ దెల్లగా నరసినదై మిక్కిలిగాలిసోఁకున నరటిచెట్టు వడఁకునట్లు వడవడ వడంకు చున్న మహాభాగురాలును బతివ్రతయు నగునాయనసూయకు, సీత తననామ ముదాహరించుచు నమస్కరించెను. సీత యనిందిత యగునాతాపసికి నట్లు నమస్కారము చేసి మిక్కిలి యుబ్బునఁ జేమోడ్పుగీలించి 'మీ కారోగ్యమా?' యని యడిగెను. అంత అనసూయ మహాభాగురాలును ధార్మికురాలు నైనసీతను జూచి పరమ సంతుష్టయై మృదుప్రియవాక్యముల బుజ్జగించుచు 'నీవు చేసికొన్న భాగ్యమునఁ బాతివ్రత్యధర్మము నెచ్చరికతోఁ గనుంగొని నడపుచున్నావు ! సీతా ! నీవు బంధుజనులను అహంకారమును ఐశ్వర్యమును అన్నిటిని విడిచి అడవియం దడఁపఁబడిన రాముని వెంట వచ్చియున్నావే ! ఇది నీ భాగ్యమే. ఏ స్త్రీలు పెనిమిటి నగరమందున్నను అడవిలోనున్నను దరిద్రుఁడైనను బాపాత్ముఁడైనను విడువక వానియందుఁ బ్రీతిగలిగియుందురో వారికి ఉత్తమలోకములు కలుగును. దుష్టస్వభావుఁ డైనను విచ్చలవిడిగా నడచుకొనువాఁ డైనను ధనహీనుఁ డైనను, బూజ్యస్వభావము గల స్త్రీలకుఁ బెనిమిటియే పరమ దైవతము. వైదేహీ ! నే నెంత యాలోచించినను పెనిమిటికన్నను మహాతపస్సువలె నక్షయముగా సర్వావస్థలయందును రక్షించునట్టి బంధు వెవ్వఁడును నాకుఁ గనుపట్టలేదు. మన్మథపరాధీన హృదయలై మగల నడంచి యేలుచు పరపురుషులం గోరుచుఁ దిమ్మరు చుండుదుష్టస్త్రీలకు ఈగుణదోషము దెలియదు. అట్లు కామపరాధీనలయి దుష్కార్యములకు లోనుగాఁ బ్రవర్తించు వారలవంటిస్త్రీలు ఇహలోకమున నపకీర్తిని బొంది పరలోకంబునకు భ్రష్టులై నరకంబునం గూలుదురు. లోకమందు మంచిసెబ్బరను దెలిసిననినుబోఁటి గుణయుక్త లగునుత్తమస్త్రీలు స్వర్గమున విహరించు చుందురు. కాఁబట్టి నీవిప్పటి వలెనే పెనిమిటి ననువర్తించుచుండు నియమము గలిగి పతివ్రతల సమయము ననుసరించి పెనిమిటితోఁగూడ ధర్మము నాచరించుచుండుము. దానంజేసి నీకుఁ గీర్తియు ధర్మమును గలుగును' అని చెప్పెను. ఇది నూటపదునేడవ సర్గము.



**సీత యనసూయ యుపదేశించినపాతివ్రత్యధర్మము ననుమోదించి తనస్వయంవరకథను నామెకుఁ జెప్పుట.**

అనసూయ యిట్లు చెప్పినదివిని సీత యీసు మాలినదిగావున, దాని నెల్లగుణముగాఁ గయికొని యామెను బూజించి, మెల్లనిమాటల నాయమతో 'పూజ్యురాలగు నీవు నాకిట్లు చెప్పుట ఒకయాశ్చర్యము గాదు. స్త్రీకి పతియె అధికుఁడగుట నాకును దెలిసియే యున్నవిషయము. ఆర్యా ! ఒకవేళ నా పెనిమిటి మంచినడత

మాలినవాఁడై యున్నను, నేను మంచివాఁడు చెడ్డవాఁ డని భేదమును పాటింపక నతనికి నుపచరింపవలసిన దాననే యగుదును. అట్లుండఁగా గుణంబులఁ బొగడ్త కెక్కి దయాళువై జితేంద్రియుండై నాయందు బద్ధానురాగుఁడై ధర్మాత్ముఁడును, తల్లియుంబోలె ప్రియకరుఁడును, దండ్రివలె నత్యంత హితపరాయణుండు నైన ప్రియుం డగు పెనిమిటిని సేవించుటకుఁ జెప్పవలయునా? మహాబలుఁ డగురాముఁడు కౌసల్యయం దెట్లు వర్తించునో యట్లె మహారాజుగారితక్కిన స్త్రీలయందును వర్తించును పితృవత్సలుం డగునాథర్మజ్ఞుఁడు, ఆవీరుఁడు, తనతండ్రి యగు మహారాజు ఒక్కమాఱు కంటం జూచినట్టి స్త్రీలకుఁగూడ తల్లికింబోలె శుశ్రూష సేయుచుండును. నేను భయంకరమై విజనం బగువనంబునకు వచ్చునప్పుడు నాకు మాయత్త కౌసల్యయుఁ బాతివ్రత్యమును గుఱించి యుపదేశించెను. అది మనస్సులోనే పాయక యుంచుకొని యున్నాను. మున్ను నాపాణిగ్రహణ కాలమున నగ్నిహోత్రసన్నిధియందు, నాతల్లి పాతివ్రత్యోపదేశమున నన్ను దిద్దియున్నది. దానిని గూడ మఱవక మనసులో నుంచుకొనియున్నాను. ధర్మచారిణీ! నీవు చెప్పిన వాక్యములవలన నాకిప్పు డదియంతయు క్రొత్తగా నాతలంపున మెఱుఁగు పెట్టినట్లయినది. స్త్రీకి పతిశుశ్రూషకన్నను తపస్సు మఱేదియు లేదు. సావిత్రీదేవి, పతిశుశ్రూష సేసి స్వర్గలోకమున మిక్కిలి యెన్నికబడసియున్నది. నీవును ఆప్రకారముననే పతిశుశ్రూషగావించుటవలన స్వర్గము నీయఱచేతి లోనిదైనది. సమస్తస్త్రీలలో నుత్తమ యైనరోహిణీదేవి యాకాశంబునఁ జంద్రుని కొంచెమునే పయినను ఎడఁబాసి కనఁబడదు మఱియు పెక్కుపుణ్యస్త్రీలు అట్లు దృఢం బగుపాతివ్రత్యమును ఎట్టిసంకటము వచ్చినను తప్పక యనుష్ఠించి తమ పుణ్యకర్మబలమున స్వర్గలోకమునఁ బూజ్యులగుచున్నారు' అనెను. అంత అనసూయ సీతచెప్పినమాట విని పరమసంతుష్టయై సీత గగురుపాటు నొంద శిరము మూర్కొని 'తెలిచిఱునవ్వులదానా! నానావిధము లైననియమములచే గడించినతపస్సు మిక్కిలియు నాకుఁ గలదు. ఆతపోబలమునుబట్టి నీవు గోరినది యియ్యనేర్తును. నిన్నే దేని వరము గోరునట్లు వేఁడుచున్నాను. మైథిలీ! నీమాట పొసఁగిన దై మిక్కిలి మనోజ్ఞముగా నున్నది. నాకు మిక్కిలియు సంతోషము గలిగినది. నీకుఁ దగినదేమి? నే నేమి చేయవలయును చెప్పు' మని యడిగెను. సీతాదేవియు యనసూయమాట విని యాశ్చర్యము నొంది చిఱునగవు మొగమున నంకురింప నామెతో 'ఈ మాటయే చాలును! నేను గోరినదంతయుఁ జేసినట్లె' యని చెప్పెను. ధర్మజ్ఞురా లైనయా యనసూయ సీత యట్లు చెప్పఁగా మీఁదుమిక్కిలి సంతసిల్లినదై, సంతోషము, నీయందునాకుఁగలిగినసంతోషమును సఫలముగావింపవలయును. 'సీతా! ఇదిగో దివ్యం బగుపుష్పమాలికయును, వస్త్రమును, ఆభరణమును, కుంకుమ చందనాదులయంగరాగమును, గర్పూరకస్తూరికాది పరిమళిత మైనయనులేపమును నున్నవి. సీతా!

నేనొసంగినట్టి యీదివ్యమాలాదులు నీదేహమునకు మిక్కిలియు వన్నె గూర్చుచుండును. ఇవి నీకు ననురూపమైనవి. మఱి యెన్నఁటికిని వన్నె నశింపక వెలుఁగుచుండును. జానకీ! నీవు దివ్యంబైన యీయంగరాగమును బూసికొని లక్ష్మీదేవి యవ్యయుఁడైనవిష్ణువునకు చెలువు గూర్చునట్లు నిభర్తకు మిక్కిలియుసొంపు గూర్పఁగలవు.' అని చెప్పెను. సీత యట్లనసూయచేత ప్రీతిపూర్వకముగా నొసంగఁబడిన యుత్తమంబు లగువస్త్రమును, అంగరాగమును, భూషణములను, పుష్పమాలికలను బ్రతిగ్రహించెను. అంతమహాయశస్విని యగుసీతయు, అనసూయప్రీతిపూర్వకముగా నొసంగినవస్త్రాదులను గ్రహించి యచటనే యంజలి గీలించి యామెను గొలుచుచుండెను. ధృఢవ్రత యగుననసూయ యట్లు తన్నుఁ గొలుచుచున్న సీతం జూచి ప్రియకథలను ముచ్చటలాడ నెంచి యిట్లనుగ నారంభించెను. 'సీతా! మహాకీర్తిమంతుఁడైనరాముఁడు నిన్ను స్వయంవరమునఁ బొందెను గదా. ఈ సంగతి నాకు వినికి గలదు. మైథిలీ! ఆకథనంతయు సవిస్తరముగా వినఁగోరుచున్నాను. కావున జరిగినది జరిగినట్లుగా నాకు దానినంతయుఁ జెప్పవలయు' ననియడిగెను. సీత యంత అనసూయ యిట్లు చెప్పఁగా యాధర్మచారిణిని జూచి 'విను' మని చెప్పి యామెతో 'వీరుండును ధర్మవిదుండు నగుమిథిలాపతి జనకమహారాజు జనునతఁడు క్షత్రియధర్మము నవలంబించి యథాన్యాయముగ భూమిని బాలించుచుండెను. ఆ రాజు, నాఁగలి చేఁబూని, యాగోపయుక్తమైన చయనక్షేత్రమండలమును దున్నుచుండఁగా భూమిని పెకలించుకొని నేను బుట్టి యారాజునకుఁ గూఁతుర నయితిని. అప్పుడు * ఓషధులపిడికిళ్లను జల్లుచున్నయారాజు, దేహమంతయు దుమ్మున బ్రుంగగా నుదయించునన్నుం జూచి, మిక్కిలి యాశ్చర్యము నొందెను. అంత నారాజు బిడ్డలు లేనివాఁడగుటచేతను, స్నేహముచేతను నన్ను తొడపై నిడికొని తన కూఁతురని చెప్పుచు నాయందు మిక్కిలియుస్నేహము నెలకొల్పెను. అప్పుడు అంతరిక్షమునను మెన లేనియమానుషవాక్కు 'రాజా! ఇది వాస్తవము. ఈ చిన్నది ధర్మమున నీకొమార్తెయె యగుచున్నది' యని వినఁబడినది. అంత ధర్మాత్ముండగు నాతండ్రి మహారాజు ఆకాశవాణిని విని సంతసించి, నన్నుం దీసికొని పరమాభ్యుదయమును బొందెను. ఆపుణ్యకర్ముఁడు తన జ్యేష్ఠభార్య బిడ్డలు గావలయునని యువ్విళ్లూరుచుండునది గావున నన్నుఁ గొనిపోయి యాబిడకొసంగెను. ఆమెయుఁ దల్లివలెనే స్నేహంబున నన్నుఁ బోషించుచు వచ్చినది. అంత నాతండ్రి పతిని వరింపకుండ రానివయస్సు నాకు వచ్చుటను జూచి దీనుఁడై ధనమును బోఁగొట్టుకొన్నదరిద్రుని వలె దుఃఖము నొందెను. లోకంబునఁ గూఁతు గన్నతండ్రి దేవేంద్రుని వంటివాఁడయినను సరివారిలోను దక్కువవారిలోను దిరస్కారము నొందును. రాజు అట్టి తిర

* 'యాజాతా ఓషధయో దేవేభ్యః' ఇత్యాదిమంత్రోక్తప్రకారమున పదునాలుగు పిడికిళ్లు ఓషధులను యజ్ఞకర్త విత్తుట తెలియునది.

స్కారము తన కిఁక శీఘ్రముగానే గలుగనున్నదని తెలిసికొని దుఃఖసముద్రమునం బడి, తెప్పలేనివాఁడు సముద్రపుగట్టును చేరఁజాలనట్లు దానిపారము నొందఁడయ్యె. ఆరాజు నేను అయోనిజనగుటఁ దలపోసి తలపోసి యెంత యాలోచించినను, నాకుఁ దగినపెనిమిటిని గనుఁగొనఁ జాలఁడయ్యె ఇట్లు నిరంతరము ఆలోచించుచుండఁగా బుద్ధిమంతుఁడగు నతనికి 'కొమార్తకు స్వయంవరము గావించెదను' అని బుద్ధి పుట్టినది. మున్ను మహాయజ్ఞమున దేవతలు సంతసించి పురికొలుపఁగా మహాత్ముండగు వరుణుఁడు జనకునకు ఉత్తమం బగు ధనువును, తఱుఁగనిబాణములు గలయమ్ములపొదులను, నొసంగియుండెను. ఆవిలు మిక్కిలి బరువును ఉరువు నగుటవలన మనుష్యమాత్రులకు ఎంత కష్టపడినను దానిని గదలింపను గూడ శక్యము గాదు. కాఁబట్టి రాజులు స్వప్నమునం దైనను దానిని వంచి మోపెట్టుటకు శక్తులు గా నేరరు అంత సత్యవాది యగు నాతండ్రి రాజుల నందఱిని బిలిపించి వారలకూటమి నడుమ నావింటిని జూపి 'ఎవ్వఁడు ఈధనువును బయికెత్తి నారి గూర్చునో యతనికి నాకొమార్త భార్య యగును. ఇందులకు సందేహము లేదు' అనెను. రాజులెల్లనురువున పర్వతాకారముగ నున్న యాధనువును జూచి దాని నెత్త నైనం జాలక నమస్కారముగావించి పోయిరి. అంత పెద్దకాలమునకు, మహాకాంతిం దళుకొత్తుచున్న యీసత్యపరాక్రముఁడు, రాముఁడు, తనతమ్ముఁ డగులక్ష్మణునితో, విశ్వామిత్రునిం గూడి యజ్ఞమును జూడవచ్చినవాఁ డయ్యె. ధర్మాత్ముఁ డగువిశ్వామిత్రుఁడును నాతండ్రిచేతఁ బూజితుఁ డై, యతనిని జూచి 'అన్నదమ్ము లగుసీరామలక్ష్మణు లిరువురును దశరథుని కొమారులు, నీయొద్ద నున్నధనుస్సును జూడఁ గోరుచున్నారు. రాజకొమారునికి రామునికి నీకు దేవత లొసంగినధనువును జూపుము' అని చెప్పెను. జనకుఁడు నావిప్రునిమాట విని యా ధనువును దెప్పించి చూపెను. రాముఁడు వీర్యవంతుఁడుగావున నిమేషాంతర మాత్రముననే సారవంతమయిన యాధనువును వంచి యల్లెత్రాటిని మోపెట్టి తోడనే పూరించెను రాముఁడు పూరించుచుండఁగా, ఆయురవడికి ధనువు నడుమ రెండుగా విఱిగినది. ఆశబ్దము పిడుగు పడినట్లు భయంకరముగా నుండెను. అంత సత్యప్రతిజ్ఞుఁ డగునాతండ్రి నన్ను రామున కొసఁగ నిశ్చయించి జలకలశము నెత్తికొనెను. అప్పుడు జనకుఁడు నన్ను రామున కియ్యఁబోవఁగా నతండు 'అయోధ్యాధిపతియు తనకు ప్రభుండు నైనతన తండ్రి దశరథునియభిప్రాయమును దెలిసికొనక ప్రతిగ్రహింప' నని చెప్పెను. అంత నాతండ్రి వృద్ధుం డగు నామామగారిని దశరథమహారాజును రప్పించి యాత్మవిదుడగు రామునకు నన్నొసంగెను. ఇంతేకాక నాతండ్రి పతివ్రత యై కనులపండువుగా జూపట్టునాచెల్లెలిని ఊర్మిళను లక్ష్మణునకు భార్యగా నొసంగెను. అప్పు డా స్వయంవరమున నీ విధమున నేను రామున కొసంగఁబడితిని. నేను పరాక్రమవంతు

లలో మేటి యైననాపెనిమిటియందు ధర్మముచొప్పున ననురాగము గలిగి యున్నాను" అనెను. ఇది నూటపదునెనిమిదవ సర్గము.

రాముఁడు రాత్రి మునియాశ్రమమునుండి వేకువను గాల్యకరణీయములు దీర్చుకొని దండ కారణ్యమునకుఁ బయనమగుట.

ధర్మజ్ఞురాలైనయనసూయ ఆగొప్పకథ నంతయు విని సీతాదేవిని శిరంబు మూర్కొని బారసాఁచి కవుఁగిలించుకొని యాబిడతో 'అక్షరములును పద ములును స్పష్టముగా వింతగొలుపుచు తీపారుపలుకులు చెప్పితివి. స్వయంవర మును జరిగినరీతిగా నంతయు వింటిని. మధురభాషిణీ! నీకథవలన నాకు మిక్కుటముగా సొంపు గానుపించుచున్నది. సూర్యుండు కాంతిందేజరిల్లుచు రాత్రిని సమీపింపఁజేసి యస్తమించెను. ఎరకొఱకు పక్షులు పగలంతయుఁ దిరిగి సంధ్యా కాలమున నిదురించుకొఱకు వృక్షంబుల లీనములై కలకలమని సేయుచప్పుడు వినంబడుచున్నది. ఇదిగో! ఈమునులు సాయంకాలస్నానమునఁ దోఁగి జలకల శంబుల నెత్తుకొని నీటం దడిసిన నారచీరలతో గుంపులుగుంపులుఁగా వచ్చుచున్నారు. పురుషులు అగ్నిహోత్రములను యథావిధిగా వేల్వఁగా పావురము మెడవలె నించుకంత యెఱ్ఱనగు ధూమముగాలిచే పుటమెగసి చూపట్టుచున్నది. దిక్కులు స్పష్టముగాఁ దెలియకున్నవి. కాఁబట్టి మిక్కిలియాకులు లేనివృక్షములు గూడ ఈసమీపపుఁ బ్రదేశమునందు సయితము ఆకులనడిమి తెఱపులు గానరామిచే నంతయు చుట్టు నొక్కదండు దట్టముగా నుండునట్లు గనుపట్టుచున్నవి. రాక్షసులును బిశాచములును గ్రుమ్మరుచున్నవి. తపోవనములందలి మృగములును వేదులు గలరేవులందుఁ బరుండియున్నవి చూడుము. సీతా! నక్షత్రములతోఁ గూడ రాత్రియు వచ్చినది. చంద్రికాపరివృతుఁ డగుచంద్రుఁడును ఆకాశమున పండువుగా చూపట్టుచున్నాఁడు. నీ వింకఁ బోయి రామునితోఁ గూడ నుండుము. నేననుజ్ఞ యిచ్చెద. నీవు తీపారునట్లు కథను చెప్పఁగా నాకు మిక్కిలియు సంతోషము గలిగినది. సీతా! నీవు నాకన్నులయెదుటనే అలంకరించుకొనుము. దివ్యాలంకారమున వన్నె గులుకుచున్నదానవై నాకు సంతోషము గలిగింపుము.' అని చెప్పెను. దేవతాకన్యం బోలుసీతయు నట్లె చక్కఁగా నలంకరించుకొని యాయనసూయకు సాష్టాంగముగామ్రొక్కి రామునియొద్దకుఁ బోయెను. మాటకారులలో మేటి యైనరాముఁడు అట్లు అలంకరించుకొని వచ్చినసీతనుఁ జూచి యా తపస్విని గావించిన ప్రీతిదానమునకు మిక్కిలియు హర్షించెను అంత సీతాదేవి తపస్విని యైనయనసూయ తనకు ప్రీతిపూర్వకముగా వస్త్రాభరణమాల్యముల నొసంగుట మొదలైన వృత్తాంతమంతయు రామునకుఁ దెలిపెను. మనుష్యుల

కెవ్వరికిని బొందనలవిగానట్టి సత్కారము సీతాదేవికిఁ గలుగుటను జూచి రాముఁడును, మహారథుఁ డగులక్ష్మణుఁడును, మిక్కిలియు సంతసిల్లిరి. అంత చంద్రునివంటి ముఖముగల రాముఁడు తపస్సిద్ధి సంపన్ను లగుఋషులు పూజించుచుండఁగాఁ బరమప్రీతుండై పవిత్రం బగునారాత్రియంతయు నచటనుండెను. ఆరాత్రి గడచినపిమ్మట ప్రాతఃకాలమున ఋషులందఱును స్నానముగావించి హోమాదులు నిర్వర్తించుకొన్నతరువాత పురుషలలాము లగు రామలక్ష్మణులు వారి యొద్దకుఁబోయి 'పోయి వచ్చెద' మనిచెప్పిరి. ధర్మానుష్ఠానపరులైన యావనచారు లగుమునులు ఆరామలక్ష్మణులఁ జూచి, యావనంబునఁ గలుగురాక్షసబాధను జెప్పఁబూని 'రామా! ఇమ్మహారణ్యమునఁ బురుషభక్షకులై నానావిధరూపు లగు రాక్షసులున్నారు. రక్తమే యాహారముగాఁ గలక్రూరమృగము లనేకములున్నవి. రామా! ఈమహారణ్యమున రాక్షసులుచేరి మునులను ఉచ్ఛిష్టులుగా నుండు నప్పుడుగాని పరాకుపడి యుండునపుడుగాని పట్టి భక్షించుచుందురు. రామా! మహర్షులు అడవిపండ్లు మున్నగునవి దెచ్చుకొనుటకుఁ బోయి వచ్చుమార్గమిది. నీ వీమార్గముననే దుర్గమం బగువనంబు ప్రవేశించుట యుక్తము' అనిరి. పరంతపుఁ డగునారాముఁడు ఇట్లామునులు సవినయముగాఁ బ్రార్థించి కావించుమంగళాచరణములఁ గయికొని సీతాలక్ష్మణులం గూడి సూర్యుండు మేఘమండలమును బ్రవేశించుచందమున దండకారణ్యముం బ్రవేశించెను. ఇది నూటపందొమ్మిదవ సర్గము.

అయోధ్యాకాండము సమాప్తము.

శ్రీరామచంద్రార్పణ మస్తు.

